శేషేంద్ర

# సాహిత్యదర్శిని

(లేఖలు, ఇంటర్వ్యూలు, వ్యాసాలు)

జ్యోత్స్న ప్రచురణ
హైదరాబాద్

# SAHITYA DARSINI
(Letters, Interviews & Essays)

**SESHENDRA**

First Edition :
October 20th 1995
(Author's Birth day)



For Copies :
1 Visalandhra Book House,
(All Branches)
2. Navodaya Book House
(All Branches)
3. Navodaya Book House,
Hyderabad.

Price : Rs. 40/-

Printed at :
**Padmavthi Art Printers,**
1-1-517/B/1 New Bakaram, Gandhinagar,
Hyderabad - 500 380.
Phone : 7611413.

**Jyotsna Publications,**
Hyderabad - A.P.

# కృతజ్ఞతలు

ఈ లేఖలను, ఇంటర్వ్యూలను, వ్యాసాలను ప్రకటించిన ఆయా దిన, వార, పత్రికలవారికి, సాహితీ మిత్రులకు—

నాకు 50,000 రూపాయల నగదు సాహితీ పురస్కారం ఇచ్చిన బాల్య స్నేహితుడు, ప్రముఖ కవి డా॥ వుందేల మాలకొండారెడ్డికి (ఉందేల విజ్ఞాన కళాపీఠం 1995 అగస్టు 23 న) కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని మీకు అందిస్తున్న నా రెండవ కుమారుడు సాత్యకికి ఆశీస్సులు—

రచయిత

# అందరమూ ఎదురుచూస్తున్నాం

ఈ రోజు ఇరవయ్యో శతాబ్దం అద్యంతం మన ముందు ఉంది. ఈ శతాబ్దంలో ప్రజా సమూహాలు, ఉద్యమాలు, యుద్ధాలు, భూకంపాల్లాంటి సమస్యలు, సమాధానాలు, భారీ పరిణామాలు, మానవీయ కష్టసుఖాల పరంపరలు - ఈ భూగోళం మీద వీచిన అనంత కల్లోలమంతా మన ముందు ఉంది.

ఎన్ని సిద్ధాంతాలు లేచాయో, ఎన్ని సిద్ధాంతాలు పడిపోయాయో, ఆ సిద్ధాంతాలు ప్రజల్ని శాసిస్తున్న కాలంలో ఎంత రక్తపాతం జరిగిందో, పరిణామం కూడా పరిణామగ్రస్తమనే సత్యం తెలీని మూర్ఖుల చేతుల్లో ప్రజలు ఎన్ని విధాల హింసలకు గురయ్యారో, ఎలా శాశ్వతంగా ప్రజలు అజ్ఞానులుగా, భీరువులుగా, నాయకుల చేత వాళ్ళ రొట్టెకోసం వాళ్ళచేత పిసకబడి ఇష్టానుసార రూపాలివ్వబడే రొట్టె పిండిలాంటి మానవీయ పదార్థంగా మాత్రమే ఉండి పోయారో ఇదంతా చూచాము. భూగోళం మీద నిర్నిరోధంగా అవిచ్ఛిన్నంగా విజృంభిస్తూనే వచ్చిన హింస, శోషణ, కుటిలత్వం. కామక్రోధలోభ మోహమద మాత్సర్యాల నిరంకుశ పరిపాలన, భూగోళం మీద ప్రవహించే నిరంతర అశ్రుధారా ప్రవాహం మానవజీవితాన్ని విషాద నాటకంగానే చూపించాయి. కతిపయ క్రూరవర్గాల అధికార శాసనం ఒక అనివార్య సృష్టి లక్షణంగా చూపించి, మనిషి పోరాటాన్ని నిరంతర కర్తవ్యంగా రుజువు చేసింది.

మనిషి అదిమకాలం నుంచీ ఒకవైపు భౌతిక సుఖము కోసం మరొక వైపు ఆధ్యాత్మిక సుఖం కోసమూ సమానంగా కృషిచేస్తూ రావడం మనకు చరిత్రలో కనిపిస్తుంది. ఇది సహజం కూడా అయితే ఆధ్యాత్మిక సుఖప్రాప్తి కోసం చేసిన కృషి అవిచ్ఛిన్నంగా పురోగమిస్తూ వచ్చింది. కానీ భౌతికసుఖం కోసం చేసిన కృషిగానీ చింతనగానీ నిరంతరం కుంఠితం అవుతూ వచ్చింది. వేదాంతాది తాత్త్వికచింతనా రూపకమైన ఆధ్యాత్మిక సుఖవివేచన తత్తత్కాలీన ప్రభుత్వాలకు ఏ విధమైన ప్రమాదాన్నీ కలిగించలేకపోయింది. కనీసం ఆనాటి రాజులు యోగుల్ని వేదాంతుల్ని తమకు ప్రమాదం కలిగించే వాళ్ళుగా భావించే

అవకాశాలు ఆ యోగులు కలిగించలేదు కలిగించి ఉంటే తత్త్వ విచారం కూడా భౌతిక సుఖప్రాప్తి విచారంలాగే కుంఠితం అయి ఉండేది. వాస్తవంగా, యోగులూ తత్త్వచింతకులూ ప్రభుత్వానికి ప్రమాదం తెస్తున్నారని తోచినప్పుడల్లా ప్రభుత్వం వాళ్ళని అణచివేసింది. జీసస్ క్రైస్తు శిలువ, భక్త రామదాసు, పోతన మహాకవి, బసవేశ్వరుడు ఇత్యాది మహాపురుషుల జీవితాలు - ప్రభుత్వాలు ప్రజాపీడకుల సంఘటితరూప శక్తులనీ, ఆ పీడనకు ఏ రూపంలోనైనా విఘ్నం కలిగించేవాడు తలయెత్తితే వాడ్ని ఆ ప్రభుత్వాలు నిర్మూలించడానికి వెనకాడలేదని మనకు విశదం చేస్తాయి. అన్యయోగులు తత్త్వచింతకులు ప్రమాదం కాదని రాజులు భావించినప్పుడు వాళ్ళని రాజులు పూజించారు కూడా. భౌతిక సుఖప్రాప్తి వివేచన మాత్రం పీడక వర్గాల ప్రభుత్వాలకు ఎప్పుడూ నిర్ద్వంద్వంగా ప్రమాదం కలిగించేదే కనక దాని పురోగమనం అతి ఆలస్యంగా దృశ్యాదృశ్య మాత్రంగా అస్తినాస్తిగా నడుస్తూ వచ్చింది.

కానీ భౌతిక జీవనానికి సంబంధించిన పరిష్కారమేమిటి అన్న ప్రశ్న మీద అలా అవిచ్ఛిన్న ధారావాహిక చర్చ జరగలేదు. కనకనే ఈ శతాబ్దిలోనే మొదటిసారిగా మార్క్సిజం దానికి అంతిమ సమాధానంగా రూపొందింది. పైగా, ఆ సిద్ధాంతం అందుచేత అపూర్వము నూతనము - అది యుగయుగాల భౌతిక జీవన చింతనా పరిణామ ఫలితమే కావచ్చు. కానీ అది సైద్ధాంతికంగా అంతిమ వాక్యం. ఆచరణకు సంబంధించిన స్వల్ప మార్పులు కూర్పులు రాగలవేగానీ మూలతః సిద్ధాంతం మాత్రం శాశ్వతం.

భౌతిక జీవన దుఃఖం మూడువంతులకు పైగా లోకపు అస్తవ్యస్త ఆర్థిక వ్యవస్థ చేత లోకానికి జన్మతః కలిగిన ఒక వ్యాధి. దాన్ని నివారించడానికి చికిత్సావిధానం యుగయుగాల నుంచీ చినుకుగా ప్రారంభించి మార్క్సిజం అనే కుంభవృష్టిగా మారింది ఈ శతాబ్దంలోనే. కారుణ్యబోధ వున్నవాడే అధర్మ శాత్రవుడౌతాడు, ధర్మ పక్ష ప్రతిబద్ధుడౌతాడు. దరిద్రాన్ని పారద్రోలడానికి దరిద్ర స్రష్టల్ని సంహరించాలని ప్రతిపాదించిన మార్క్స్ రాక్షసుడు కాడు! సుమకోమల స్వభావం లోంచి ఉద్భవించిన శీతల చంద్రబింబం - కారుణ్యం లోంచే కమ్యూనిజం పుట్టింది. ఇది శాశ్వత యుగధర్మం. ప్రజావళి, హింస ఇక భరించలేనప్పుడే ధరిత్రి ఏడ్చింది. అప్పుడే "వినాశాయచదుష్కృతాం", దుష్టుల్ని సంహరించడమే ధర్మం. ఈ ప్రామిసరీ నోటును అమలుజరిపే రోజు కోసమే అందరమూ ఎదురుచూస్తున్నాం. *

October 20, 95

—శేషేంద్ర

# అసలు కవిత్వం రాయాలి

బాధపడకుండా ఉంటే చెపుతాను - కాదు బాధపడ్డా చెప్పాలి - ఈనాటి కవులు-బిరుదులు సంపాదించినవాళ్ళతో సహితంగా, రాసే కవిత్వానికి దినపత్రికల్లో కనిపించే రిపోర్ట్లకూ అట్టే తేడా కనిపించదు. రెండూ సామాన్య ప్రజల బాధలూ గాథలూ సమానంగా ప్రతిబింబిస్తున్నాయి. రెండూ స్పష్టమైన అకృత్రిమమైన భాషలో రాయబడుతున్నాయి. రెంటికీ ప్రజాదరణ మెండుగా ఉంది; కనుక రెంటికీ ప్రజాకవిత్వమనో అభ్యుదయ కవిత్వమనో అనడానికి తగిన యోగ్యత ఉంది. అయితే నా దురదృష్టమేమిటంటే నా దృష్టిలో ఆ రెంటికీ తేడా కనపడక పోవడం. కనపడే అదృష్టవంతులు అదృష్టవంతులు. అదృష్టం సాహిత్యానికి పర్యాయపదమయింది నేటి తెలుగు సీమలో—

మనం రాసింది కవిత్వం అవుతుందా అవదా అనే ఆలోచన లేకుండానే రాసిందంతా కవిత్వమనే దృఢవిశ్వాసంతో, దాన్ని ఏదో ఇచ్చే ఒక నిచ్చెనగా చేసుకుందామన్న దృఢసంకల్పంతో కవిత్వం రాసేవాళ్ళు పుంఖాను పుంఖాలుగా పుట్టుకొస్తున్నారు. ఈ వర్తమాన భయంకర సాహిత్యాన్నంతా చూచి సాహిత్యసమరాంగణ సార్వభౌముడు గోపాల చక్రవర్తి ఏమన్నాడంటే - ఆంధ్ర సాహిత్యాన్ని పురాణయుగము ప్రబంధయుగము దక్షిణాంధ్రయుగము అంటూ చేసే విభజనకంటే, మంచినీళ్ళ గ్లాసుమీద మూతపెట్టుకోను ఉపయోగించే గ్రంథాలు, కిటికీతలుపులు కొట్టుకోకుండా అడ్డు పెట్టుకోడానికి ఉపయోగించే గ్రంథాలు, తలగడగా పెట్టుకోను ఉపయోగించే గ్రంథాలు-ఇల్లా విభజిస్తే మరింత సహేతుకంగా ఉంటుందంటాడు ఈ హేతువాదయుగంలో. ఈ తెలుగు దేశపు సాహిత్య గ్రీష్మంలో శాస్త్రి ఒక గొప్ప చలివేంద్ర. అందుకే అక్కడుంటాడు శేషేంద్ర.

అసలు మనిషికి నిగ్గే భూషణ మనే నాగరకతా సిద్ధాంతం నాశనమయిపోయింది. కనకనే రాసింది బాగుందా, లేదా బాగుండకపోతే ఎవరన్నా వింటే

ఎట్లాగా మొహాన ఉమ్మేస్తారే అన్న భయం లేకుండానే రేడియోల్లో సభల్లో చదివేస్తున్నారు, పత్రికల్లో వేసేస్తున్నారు.

ఇక వినేవాళ్ళసంగతి చెప్పక్కర్లేదు - వాళ్ళు చాలా గొప్పవాళ్ళు. కవిత్వం అంటే ఏమిటో తెలుసుకోడానికి ప్రైవేస్టు చేయలేని మహానుభావులు, సాహిత్యంమీద అభిరుచి ఉంటే ఎందుకయినా మంచిదనుకునే ప్రజానాయకులు, మరే పనీ లేకపోతే సరదాగా కాలక్షేపం చెయ్యవచ్చు అని వచ్చే వినోదప్రియులు. వీళ్ళే మనకు తరచుగా కవిసమ్మేళనాల్లో తారసిల్లే ప్రజలు. అసలు నిజమైన కవిత్వాన్ని వీళ్ళు గుర్తు పట్టలేరు. ఎందుచేతనంటే కవిత్వం అషామాషీగా వచ్చేది కాదుకనక, ఒక తదేకదీక్షతో చేసే ఉపాసన చేతనే సిద్ధించే విద్యకనక - అంచేత ఈ కాలపు అయోమయ కవిత్వంలో అచ్చు తప్పుల్లాగా ఈ సభల్లో వీళ్ళు ఉంటారు. ఉన్నందుచేత ఆక్షేపణాలేదు. లేనందుచేత ఆదాయమూ లేదు. కనకనే ఎక్కడయినా ఒక బజారు మార్కు వాక్యం రాగానే చప్పట్లు కొడతారు. ఒక కుకవో అకవో ఒక చౌకబారు జోకు వేస్తే హర్షధ్వానాలు చేస్తారు. దీనికి కవిత్వమెందుకు? ఏ గారడీవిద్యో లేక కామిక్కో మేజిక్కో ఏదో చేస్తే సరిపోదా? కవిత్వం పేరెందుకు పాపం? కానీ ఇవే కవి సమ్మేళనాల్లో కనిపించే దృశ్యాలు. నిజమైన కవిత్వం చదివితే నీరు కారిపోయినట్లు కూర్చుంటారు నిర్వికారంగా, ఇక చదివేవాడు ఒక నిమిషం చదువుతాడు రెండు నిమిషాలు చదువుతాడు మూడో నిమిషం వచ్చేసరికి, ముదనష్టపు కవిత్వం ఎందుకు రాస్తున్నట్లు ఇక్కడ ఏడుస్తున్నట్టు అని ముడుచుకుపోయి కూలబడతాడు.

అసలు వీళ్ళు ఎట్లా ఉన్నారంటే - వచ్చలు వజ్రాలు పొదిగిన ఒక అందమైన అంగుళీయకాన్ని ఆఫ్రికా అడవుల్లో పడేశామనుకోండి; ఆ జనులు దాన్ని చస్తే ముట్టుకోరు; తొక్కుతూ నడిచి పోతారేగానీ ఏమిటిది ఎక్కడిదిది అనుకోరు. వాళ్ళ అన్నకోశ పరిమిత జీవన విధానంలో దానికి ఏ స్థానమూ లేదు కనక అది వాళ్ళని ఏవిధంగానూ ఆకర్షించలేదు. దాన్ని అంగుళీయకమన్నా అలుగడ్డ అన్నా ఒకటే వాళ్ళకి - బహుశా అలుగడ్డ అంటే హాయిగా ఉంటుంది వాళ్ళ ప్రాణానికి. ఈనాడు తెలుగుదేశంలో కవిత్వం ఆఫ్రికా అడవుల్లో ఆ అంగుళీయకంలా ఉంది మరి. కవిత్వం అంటే ఇదయ్యాబాబో అదికాదు అని ఒక పొలికేకవేసే మహోద్యమం ఉవ్వెత్తుగా లేవవలసిన అవసరం వచ్చిపడింది దేశంలో. లేకపోతే కవిత్వం గతిలేనిదయిపోతుంది.

ఆకలి కవిత్వం రాయి, ఆవకాయ కవిత్వం రాయి, పద్యంలో రాయి గద్యంలో రాయి, నీకు చేతనయిన మార్గంలో నీకు చేతనయింది ఏడువ్ మాకు తగాదాలేదు కానీ నీవు అసలు కవిత్వం రాయాలి - ఇది ఈనాడు తల యెత్తే ప్రశ్న. ఈ ప్రశ్న గురించి స్ఫృహ ప్రజల్లో రెచ్చగొట్టబడాలి నిజమైన కవితాభిమానుల కర్తవ్యం ఇదీ ఈనాడు. కవిత్వం రాసే విధివిధానాల మీద పట్టుదలలు వదలిపోయిన ఈ రోజు కవిత్వం రాసేవాళ్ళకి మరింత ప్రమాదం ఏర్పడిందేగానీ మరింత సౌలభ్యం దొరికిందనుకోడం పొరపాటు.

కవిత్వమంటే పద్యం కాదోయ్ అని వచనకవిత్వంవాళ్ళు పద్య కవిత్వం వాళ్ళని ఆక్షేపించారు ఒకప్పుడు. ఇప్పుడు అదే వాళ్ళకూ వర్తింపబడుతుంది. కవిత్వం అంటే వచనం రాసినంత మాత్రాన్నే చాలదోయ్ అంటున్నారు. కవిత్వంలో కేవలం నినాదాలమీద ఆధారపడే వాళ్ళకు ఇది భస్మాసుర హస్తమయిందన్నమాట. ఈ వెధవ ఛందస్సు మూలానగానీ లేకపోతే మావాడు బ్రహ్మాండంగా కవిత్వం రాసి పారేసేవాడు అనే అవకాశం పోయింది ఈనాడు పద్యమే అడ్డువస్తోంది మనవాడి ప్రతిభకు అనే దొంగవేషాలు వేయడానికి వీల్లేని రోజులు వచ్చాయి వచనంలోనే రాయి ఏం ఫరవాలేదు. కానీ కవిత్వం రాయరా అని బెదిరించేసరికి ముసుగు వీరుల నిజస్వరూపాలు పయటపడే ప్రమాదం వచ్చిపడింది. ఇది ఒక చారిత్రిక సన్నివేశం తెలుగు కవితారంగంలో. దీన్ని గుర్తించాలి మనం.

మొన్న ఒకాయన నాతో "ప్రజలమీద వచన కవిత్వం ఎంత ఇంపాక్టు తెచ్చిందో ఈనాటి సభ సూచిస్తుంది" అన్నాడు. ఆయన వచనకవి. పైగా వీర శైవుడిలా వీర వచనకవి.

వచనకవి అనగానే గోపాలశాస్త్రి కథ ఒకటి జ్ఞాపకంవస్తుంది. ప్రభుత్వపు సాయుధ పోలీసులు చెదరగొట్టలేని జనసమూహం అప్పుడే ప్రభుత్వం తెప్పించిన వచనకవి హెలికాప్టరు దిగి జేబులోనించి బుక్కు తీయగానే బెదిరి, పిట్ట కనపడకుండా పారిపోతారు. (బ్రతుకు జీవుడా అని పారిపోయినట్లు) గోపాల చక్రవర్తి హాస్యరసరాజ్య చక్రవర్తి.

ఈనాడు కవిత్వం కానిది కవిత్వంగా చలామణీ అవడానికి లభించిన సదవకాశాల్లో ఒకటి వచన కవిత్వం. రెండోది అయోమయత్వం మూడోది

అకాడమీ ఆధిపత్యం ఎంత అయోమయంగా రాస్తే అంత వచనకవిత్వం అవుతుందని చాలామంది మహాకౌస్ కాగితాల పరిశ్రమకు చాలా శ్రమ కలిగిస్తున్నారు.

కానీ ఈ అయోమయ కవిత్వానికి ఆదిపురుషులుగా అవతరించిన ఆంధ్ర మహాకవుల వంశవృక్షానికి మూలపురుషులు ముఖ్యంగా టి. యస్. ఇలియట్, డైలాన్ థామస్‌లు. సరే ఎవర్ని ప్రమాణంగా పెట్టుకున్నా అసలు కావలసిందేమిటి - ఏదో ఒక విద్యలో ప్రావీణ్యం గడించడం. కవిత్వం అంటే ఏమిటో తెలుసుకోకుండా, ఇక్కడి వాళ్ళవిగానీ, అక్కడివాళ్ళవిగానీ మహాకవుల రచనా శిల్ప మర్మాలు పరిశీలించకుండా, గ్రహించకుండా ఒకడు కవితా విద్య పొందగలడా? అనేదే ప్రశ్న. ఏ శిక్షణా లేకుండా, ఏ చదువూ లేకుండా కవిత్వం చెప్పడానికి అందులో పితామహుడూ, పిత పితామహుడూ అవడానికి వీడంత అసాధారణ ప్రతిభాసంపన్నుడా? వాడు రాసింది చదివితే బుద్ధిమంతులకు అముదం తాగిన ఎఫెక్టు వస్తోందేమిటి! ఏమీలేదు. వట్టి ప్రతిభ చాలదు; అంత ప్రతిభ వీరందరికి లేనూలేదు. పోనీ ఆ ఇలియట్‌నయినా క్షుణ్ణంగా చదివిరా అంటే దానికేసాక్ష్యమూ లేదు. ఆ ఇలియట్ గొప్ప పండితుడు. ఇరవయ్యో శతాబ్దానికి తిలకాయమానమైన జార్జి శ్యాంటాయనాకు శిష్యుడు. ఇలియట్ కవిత్వంకంటే, ఇలియట్ పాండిత్యం చెప్పుకోదగింది. ఆత్మ సంయమనం కవిత్వం అంటాడు. పూర్వ మహాకవుల్ని విశేషంగా చదవాలంటాడు. బతికివున్న కవి శక్తిని చచ్చిన కవులతో పోల్చి చూడాలి అంటాడు. (Poetry is the extinction but not expression of personality ....The living poet is to be placed among the dead poets to assess his poetic content....)

"కావ్యస్యాత్మా ధ్వనిరితిబుధైర్యః సమామ్నాత పూర్వః"

అని ధ్వన్యాలోక కర్త చెపితే పాత చింతకాయపచ్చడి అన్నాడు మన గడ్డం మహాకవి. కానీ డైలాన్ థామస్‌ని కవిత్వం అంటే ఏమిట్రా నాయనా నీ అభిప్రాయం అని అడిగితే వాడిలా అన్నాడు— "కవితా నిర్మాణ శిల్పం అంటే నీవు రాసే వాక్యంలో కొన్ని ఖాళీలు, కొన్ని రంధ్రాలు ఉండాలి. ఆ ఖాళీల్లో ఆ రంధ్రాల్లో చెప్పబడని అర్థాల ప్రతిధ్వనులు నిండాలి. వాక్యంలో

ఈ చాకచక్యం ఉండాలి" అంటాడు. ("The best craftsmanship always leaves holes and gaps in the works of the Poem so that something that is not in the Poem cau creep, crawl, flash, or thunder in") మరి దీనికేమంటారు? ఒరే నాయనా! కవిత్వం అనే ఆత్మవస్తువు అడుగడుక్కీ మారేదికాదు. స్వరూపం మారుతుందేమో కానీ స్వభావం మారదు. పాతకొత్తల బేదాలంతా దుస్తుల్లో ముస్తాబుల్లోనే కానీ గుండెకాయలో కాదు. గుండెకాయ గుండెకాయగానే ఉంటుంది. అన్ని దేశాల్లో అన్ని కాలాల్లో పర్వతాలు పుట్టినప్పటినించీ పోల్ వేలరీ కలం పట్టుకున్నప్పటివరకూ. ఆనాడు నన్నయ్య ''నిండు మనంబు నవ్యనవనీత సమానము పల్కుదారుణాఖండల శస్త్రతుల్యము'' అంటే ఈనాటి గున్నయ్య "హృదయంలో వెన్నెలచేలు కన్నుల్లో నిప్పుల వాన" అంటాడు. అది కాకపోతే మరొకటి ఏడుస్తాడు. కానీ ఎటుతిప్పినా మొత్తంమీద తాత్పర్యం అంతేగా?

డైలా థామస్ కానీ, టి. యస్. ఇలియట్ కానీ, - ఎందులో వారి ప్రతిభ పండిందో దాన్ని తీసుకోడు మనవాడు, ఏది తీసుకోగూడదో అదే తీసుకుంటాడు. వీడి గొప్పతనం అందులోనే ఉంది. టి. యస్. ఇలియట్ గొప్ప కవికాదు; గొప్ప పండితుడు. ఇలియట్ కంటే గొప్పకవులు యూరప్ దేశాల్లో చాలామంది ఉన్నారు. ఫ్రెంచి కవుల్లో చాలామంది ఆయన కంటే గొప్పవాళ్లే. అసలు నా కనిపిస్తుంది - ఇలియట్ బ్రిటిష్ ఇంపీరియలిజం తయారుచేసిన ఒక వస్తువు. ఇండియాలో బ్రిటిష్ వాళ్ళ మూలంగా ప్రపంచాన్ని ఇంగ్లీషు ద్వారా చూడడం ఇంగ్లీషు ద్వారా కొలవడం అలవాటయింది. ఇంగ్లీషు ద్వారంనుంచి చూస్తే ఇలియట్ ఆకాశం అంటే మహాపర్వతంలా కనిపిస్తాడు. అట్లాగే ఫ్రెంచి కాలనీల్లో ఆ వలసదేశాల ప్రజలకి ఎవడో ఫ్రెంచివాడు మహాకవిగా కనిపిస్తాడు. అట్లాగే డచ్చివగైరా. కానీ ఈనాడు ఇండియాలో మనం ప్రపంచంలో ఎక్కడా లేని గొప్ప సాహిత్యశాస్త్రానికి వారసులం అనే స్పృహతో ఇతర సాహిత్యాల్ని అవగతం చేసుకోవాలి. సాహిత్యశాస్త్రం మొదటినించీ ఉన్న ఈ దేశంలో కవుల మీద రచనా విషయంలో మరింత బాధ్యత ఉంది.

పాశ్చాత్య సాహిత్య సంపర్కం మరింత ప్రమాదాన్ని తెచ్చిందే కానీ కుకవులకు అకవులకు ఆదాయమేమీ చేయలేదు. నిజమైన కవిత్వం చిత్తశుద్ధితో

రాసే ఆ పాశ్చాత్యులతో వీళ్ళని పోల్చడం వీళ్ళకు దేంజరేగానీ మరేమీకాదు. అసలు ప్రజల్లో వాడుకేమిటంటే వాళ్ళని పీక్లు కాపీ కొడుతున్నారని. దేశంలో కూడా కేంద్ర అకాడమీ, జ్ఞానపీఠ అవార్డు మొదలైన నూతన చారిత్రిక కారణాలు ముమ్మరంగా ముసురుకోవడంచేత భారతీయ భాషలు పరస్పర సాన్నిహిత్యం పొందుతున్నాయి. కనక వీళ్ళని ఆ భాషల్లో వచ్చే కవిత్వంతో కూడా పోలు స్తాము ఫలితం-ఈనాడు తెలుగువాడు ప్రపంచ కవితతోనూ తదితర భారతీయ కవితలతోనూ పోల్చి విలువ కట్టబడే ప్రమాదం వచ్చింది. పోటీ ఎక్కువయింది. ఈ జాతీయ అంతర్జాతీయ కొలతల్లో వీడు గజమవుతాడో దిగ్గజమవుతాడో అడుగవుతాడో అంగుళమవుతాడో అదే వాడికీ తెలుగుజాతికీ ప్రతిష్ఠ గానీ అప్రతిష్ఠ గానీ తెస్తుంది

విశిష్టమైన భావం, విశిష్టమైన భాష తన రక్తంలో ప్రవహించే ఒక ఆసాధారణ వాక్యం మాత్రమే కవిత కాగలదు.

(శ్రీ సుభాష్ చంద్ర, ప్రియపాలిక కావ్యానికి రాసిన ముందు మాట నుంచి - 27-8-73.)

# అభిప్రాయం

తెలుగు దేశంలో గత 20, 25 ఏళ్ళనుంచీ వస్తున్న కవిత్వానికి తత్పూర్వం వచ్చిన కవిత్వానికీ చాలా భేదం ఉంది. తత్పూర్వ కవిత్వాన్ని కవిత్వం అనడం కష్టం. కవిత్వం ఉంటే అది శ్రోతని వెంటనే ఆకర్షిస్తుంది. ఒక ప్రసిద్ధ విమర్శకుడో కవో ఇలా అన్నాడు: "కవిత్వం, అర్థం అవకముందే ఆకర్షిస్తుంద్" అని. ఇది వాస్తవంగా కవిత్వపు కీలకలక్షణము. ఉదా॥ "పానశాల నషాలు। బాటసారి కేమి తెలుసు॥ తెరుస్తుంటే తలుపు। విడుస్తుంది నిట్టూర్పు." బాటసారిలా దారివెంట వెళ్ళేవాడికి పానశాల గర్భిత మర్మాలు ఎలా తెలుస్తాయి. అందులో ప్రవేశించినవాడికే తెలుస్తాయి. జీవితంలో ప్రవేశించినట్లు - వాడికే తెలుస్తుంది పానశాల తలుపు తెరుస్తుంటే నిట్టూర్పు విడుస్తుందని. తలుపు నిట్టూర్పు విడవడమేమిటి. మనిషి నిట్టూర్పు విడుస్తాడు. కానీ మనిషి చేసే పనిని ఒక అమనిషి, ఇక్కడ తలుపుమీద ఆరోపించి చెప్పడంచేత, శ్రోత చెవిలో అది పడగానే ఆ మాట చప్పున అతడి హృదయాన్ని తాకుతుంది. అతడు చకితుడవుతాడు. ఏదో చమత్కారరూప అవ్యక్త ఆహ్లాదానుభూతిని పొందుతాడు. ఆక్షణంలో అతనికి ఆ పంక్తుల్లో ఉన్న అర్థమంతా స్ఫురించి ఉండదు తర్వాత ఆ పంక్తిని రెండు మూడుసార్లు ఆహ్లాదవశుడై చర్వణం చేస్తాడు. ఓహో ఇదా విషయం అని తెలుసుకొని "దాన్ని ఎంత గొప్పగా చెప్పాడు ఈ కవి'' అని ఆశ్చర్యపడుతాడు. ఇందులో తేలిందేమిటంటే కవిత్వం మనం వ్యవహారంలో వాడే భాషకంటే భిన్నమయింది అని - కవిత్వభాష ఆకర్షణ కలిగిస్తుంది; వ్యవహార భాష కేవలం అర్థం అయి ఊరుకుంటుంది. వెనక ఉదాహరణలో చెప్పిన ఒక వస్తువు పనిని మరొక వస్తువుమీద ఆరోపించడం అనే ప్రక్రియని అరిస్టాటిల్ మెటఫర్ అన్నాడు. మనదేశంలో దాన్ని దండి సమాధి అన్నాడు: "అన్యధర్మ స్తతోన్యత్ర లోకసీమానురోధినా సమ్యగాధీయతేయత్రస సమాధిః స్మృతోయథా"- "నిష్ఠ్యూత దీర్ణవాంతాదీ గౌణవృత్తివ్యపాశ్రయం అతి సుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహ్యతే" - ఉమ్మివేయుట, వాంతి, ఇత్యాది మాటలు గౌణార్థంలో ప్రయోగిస్తే అవి వాస్తవంగా ఎంత తుచ్ఛములైనా, అతి సుందరంగా ఉంటాయి. అన్యథా అవి గ్రామ్యస్థాయిలో ఉంటాయి. ''వలమాన తాటంక వజ్రాంకురచ్ఛాయ! లేత వెన్నెల పుక్కిలించి ఉమియ" (శ్రీనాథుడు) పుక్కిలించి ఉమియ అనేవి

ఆత్మావ్యాలోక్మక శబ్దాలు. కానీ ఇక్కడ కర్ణాభరణంలో ఉన్న వజ్రాలు లేత వెన్నెల పుక్కిలించి ఉమ్మేస్తున్నాయి అన్నప్పుడు రమణీయంగా ఉంది. ఈ ప్రక్రియనే కవిత్వపు జీవలక్షణంగా చెపుతూ అరిస్టోటిల్ ఇలా అన్నాడు. "The greatest distinction is to be metaphorical; For, it is the only one that demands originality and is a sign of genius "

ఈ నేపథ్యంలో చూస్తే ఈనాడు వస్తున్న, ముఖ్యంగా యువతరం కవిత్వం అంతా metaphorical గా ఉంది. ఎందరో కవులు నేటి తెలుగు కవిత్వాన్ని ఒక ఉజ్జ్వల సంపదగా ఇస్తున్నారు. అదృష్టం ఆంధ్రదేశపు కొత్త పేజీ తిప్పింది. కనుక ఈ తరం కవులమార్గం గౌణమార్గం, మెటఫర్ మార్గం. అయితే కవితను సంక్షిప్తరూపంలో బంధించడం వీళ్ళు ఇంకా నేర్చుకోవలసిన విద్య.

ఇలాంటి కావ్య భాష సాధారణంగా అందర్నీ ఆకర్షించి ప్రభావితుల్ని చేస్తుంది. కానీ కొందరు అల్పసంఖ్యాకులకు కావ్య భాష అర్థంకాదు. కవిత్వ సంస్కారం ఎక్కువమంది ప్రజల్లో స్వభావగతంగా ఉంటుంది. కనుకనే కళలకు సమాజంలో బహుళవ్యాప్తి ఉంది. కవిత్వం అందరికీ సంబంధించిన కళ.

కంప్యూటరుకూ కవిత్వానికి ముడిపెట్టడానికి ప్రయత్నించడం అకృతిమంగా లేదు. కంప్యూటరు ఈనాడు పది దీర్ఘబాహులు జాపిన అక్టోపస్ అయిపోయింది. అందుచేత సందర్భం లేకపోయినా దాన్ని ప్రసంగంలోకి తీసుకురావడం ఆధునికతా భ్రాంతికి లాంఛనం. అన్యథా కవితకూ కంప్యూటరుకు ఏలాటి సంబంధమూ కనిపించదు. అస్పష్టత, సంక్లిష్టత అనే లక్షణాల్ని కంప్యూటరు సృష్టించలేదు. అవి కవికున్న రచనా సంస్కారాన్ని అనుసరించి తలయెత్తే సమస్యలు. అందులోనూ అస్పష్టత, సంక్లిష్టతలను నిష్కర్షగా వాస్తవ రచనా స్థితులు అనడానికి వీలులేదు. ఒకడికి సంక్లిష్టత తోచినచోట, మరొకడికి అలా తోచదు. కనక ఈ రెండూ సాపేక్షక అనుభూతులే గానీ అనివార్య అనుభూతులు కావు. శ్రోతల కుసంస్కార, సుసంస్కారాల్ని కూడా మనం దృష్టిలోకి తీసుకోవాలి. కవి శ్రోతలమధ్య సంబంధం రేడియో స్టేషను రేడియో సెట్టు లాంటిది. ట్యూనింగు బాగా కుదిరితేగానీ పాట బాగా వినిపించదు.

కవిత్వంలో అనుభూతే సర్వధా ముఖ్యము. అనుభూతిలో నుంచే కవిత్వం అంటే అలంకారాలు బింబాలు ప్రతీకలు పుడతాయి. అనుభూతి తత్కాల

జనిత భావాత్మక ఉద్వేజనచేత వ్యక్తి పొందేది. ఈ ఉద్వేజనకు జీవితమే మూలము. భావాత్మక ఉద్వేజిత క్షణంలోనుంచి అలంకార బింబ ప్రతీకలు చిలుక దానిమ్మవండు కొరికినప్పుడు దానిలోని గింజలు కెంపులు కెంపులుగా రాలినట్లు రాలుతాయి. అవి ప్రయత్నఫలితాలు కావు. ఆలోచిస్తే రావు. జీవన గమనంలో ఎప్పుడు వ్యక్తి ఉద్వేజిత క్షణానికి లోనవుతాడో సాధారణంగా తెలీదు. వాల్మీకి క్రౌంచవధ సందర్భంలా- ఆలోచన కవిత్వ మూలమైన భావో ద్వేగానికి విరుద్ధ ప్రక్రియ. అది కార్యకారణ సంబంధ రూపశృంఖల ఉన్న ఒక మంచి వ్యాసం రాయడానికి ఉపయోగిస్తుంది. కథ, నవల, నాటకము అనే మూడు ప్రక్రియల్లోనూ కావలసిన చతురకళా రచనావ్యూహ నిర్మాణానికి మాత్రమే అవసరంగానీ, అసలు ప్రక్రియ జననము, దాని అవయవాల రూపు రేఖలు కేవలం భావోద్వేగాత్మకంగానే ఉంటాయి. కారణం. కళాత్మక ప్రక్రియ లన్నీ సృజనాత్మక క్రియలు; సృజన భావోద్వేగ పర్యవసానము. యూరోప్ సాహిత్యంలో ఆలోచనమీద తిరుగుబాటు చేసి Tyranny of Reason అని నినాదం లేవదీసిన కాలం ఒకటి ఉంది. సింబలిజం, స్రరియలిజం, ఇత్యాది ఆధునిక సాహిత్య ఉద్యమాలన్నీ ఈ నినాదానికి పుట్టినవే. Reason ని తోసేసి Emotion ఆధిపత్యం వహించింది. కథని తోసేసి Metophor ఆధిపత్యం వహించింది. ఆధునిక యుగ సారాంశం ఇదే.

కవిత్వానికి తక్షణ ప్రయోజనం, కవిత్వం విని శ్రోత ఒక ఆత్మిక తృప్తినిపొంది వ్వాహ్ అనడమే, మృష్టాన్నం తిని గుర్రున త్రేన్చినట్లు. అయితే తిన్న అన్నం జీర్ణమై శరీరాన్ని, మెదడును నడిపే ఇంధనమై రక్త ప్రవాహాల్లోకి ప్రవేశించి, నఖశిఖ పర్యంతం వేలాది రక్తనాళాల్లో ప్రవహిస్తూ క్రమంగా మనిషిని శారీరకంగా మానసికంగా బలిష్ఠుడ్ని ఎలా చేస్తుందో ఎలా సజీవుడ్నిగా నిలబెడుతుందో అలాగే కవిత్వ శ్రవణంచేత మనిషి ప్రభావితు డవుతాడు. అలంకార బింబ ప్రతీకలు శ్రవణేంద్రియంద్వారా మనిషిలో ఉన్న రక్తంలోకి ప్రవేశించి ఆ నదుల్లో కరిగిపోయి సమస్త శరీరవ్యాప్తమువుతాయి. రక్త నిష్ఠమవుతాయి. అలా ఒక తరం మానవుల్లో రక్తనిష్ఠమైన అలంకార బింబ ప్రతీకలు తదనంతర తరానికి జన్యుకణాలద్వారా సంక్రమింపజేయ బడతాయి. అలా తరతరాలు రక్తనిష్ఠంగా సంక్రమింపజేయబడి, అవి మనిషి ఆలోచనల్ని అలవాట్లని చర్యల్ని స్వభావాన్నీ రూపాయితం చేస్తాయి. ఒక దేశపు పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు ఆ దేశపు ప్రజలకు ఇదే చేశాయి.

ఈ పార్యంతిక ఫలాన్నే ఆ దేశపు సంస్కృతి అనీ నాగరకత అనీ అంటారు. ఈ రెంటికీ కవులే జనకులు. ఇదే కవిత్వం కలిగించే శాశ్వత ప్రయోజనం.

కవిత్వానికి ఆదర్శమూ ముఖ్యము ఆకర్షణా ముఖ్యము. కవిత్వం అంటేనే ఆకర్షణీయవాక్కు. అట్టి ఆకర్షణ అలంకార బింబ ప్రతీకలచేత "మాత్రమే" కలుగుతుంది. కానీ ఈ మహాశక్తిని ఒక ఉత్కృష్ట ప్రయోజనం కోసం వినియోగిస్తే అది మానవాళికి చేసిన ఒక బృహత్కార్యం అవుతుంది. ఆదర్శ రహితంగా ఆకర్షణ ఉండగలదు గానీ అట్టి ఆకర్షణ నిష్ప్రయోజనమై నిష్ఫలమవుతుంది. అది ఆదర్శయుక్తమైన ఆకర్షణముందు అల్పజీవిగా కనిపిస్తుంది.

కవిత్వం ఆదునిక యుగంలో అస్తిత్వం కోల్పోవడంలేదు. కానీ కవిత్వానికే గాక సృష్టిలో అన్నిటికీ నిమ్నోన్నత కాలాలు ఉంటాయి. మహాభారత యుద్ధంలో గాండీవానికి ఎదురులేదు. కానీ అదే అయుధం ద్వాపరాంతన దొంగల్ని కొట్టడానికి అర్జునుడిచేత వెదురుబద్దలా వాడబడింది. ఈనాడు దుష్టుల ప్రాబల్యం అత్యధికమైపోయి కవిత్వసాధనం యొక్క పరాక్రమం కృశించింది. కనుకనే దుష్టసంహారంకోసం కవిత్వంకంటే ఏదో ఒక భౌతిక శాస్త్రమే అనివార్యమయింది. కానీ కవిత్వబలం క్రిందయి దుష్టులబలం మీదయిన నాడుకూడా, కవిత్వం నదీ ప్రవాహం చప్పుడు చేయకుండా ఒడ్లను నిరంతరం కోస్తూ ఉన్నట్లు సమాజాన్ని ఆదర్శంగా ప్రభావితం చేస్తూనే ఉంటుంది.

టెక్నిక్ కవిత్వాన్ని మింగేయదు - టెక్నిక్ అంటూ ఒకటి ఉంటే. టెక్నిక్ అనే మాటని బహుశః కళాత్మకతకు పర్యాయవాచిగా వాడుతున్నారు. కానీ దాన్ని వాడేవారిలో బహు సంఖ్యాకులు ఏ అర్థంలో వాడుతున్నారో వారికే తెలీదేమో! టెక్నిక్ అంటేనే కళాత్మకత అనుకున్నట్లయితే కవిత్వమే అసలు కళాత్మకత. ఇక ఏది దేన్ని మింగుతుందో ఎలా చెప్పాలి? కవిత్వ తత్త్వం తెలియనివాళ్ళు కవిత్వం వేరు టెక్నిక్ వేరు అనుకుంటారు కాబోలు!

జర్నలిజం కవిత్వాన్ని శాసించదు. కానీ ప్రపంచాన్ని ముందుపెట్టి సంవేదనశీలుడైన వ్యక్తిని కుదిపివేస్తుంది. అలా కుదుపబడిన క్షణంలో ఆ వ్యక్తిలోనుంచి కొన్ని కవిత్వ పంక్తులు రాలవచ్చు.

(నేటి కవిత్వం- వివిధ దృక్పథాలు. లిటరరీ సర్కిల్ ప్రచురణ, ఆగస్టు 1994)

# శేషేంద్రశర్మతో పరస్పరం

—డా॥ ముదిగొండ వీరభద్రయ్య

27-12-79 నాడు శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారిని కలుసుకోవడం జరిగింది. వారు రాసిన 'కవిసేన మేనిఫెస్టో'పై వారితో వివరంగా చర్చించాను. 'కవిసేన మేనిఫెస్టో' అనే 'ఆధునిక కావ్యశాస్త్రమ్' లో శేషేంద్ర కవిత్వానికి సంబంధించిన అనేక విషయాలపై చాలా లోతైన పరిశీలన చేశారు. ఈ రచనలో ఆయన 62 ప్రామాణిక గ్రంథాల్ని వాడాడు. అందులో 26 సంస్కృత గ్రంథాలు. భరతుడు మొదలు ప్రాచీన అలంకారికుల నుంచి, షెర్బినా, అవ్‌నెర్ జిస్ మొదలైన ఆధునిక అలంకారికుల వరకు - ఉన్న ఏక సూత్రమును గ్రహిస్తూ శేషేంద్ర ఆధునిక మౌఢ్యాలనూ, జ్ఞానం పేరుమీద చెలామణీ అవుతున్న అజ్ఞానాన్నీ కవిత్వం పేరుమీద చెలామణీ అవుతున్న అవకతనూ ఎదుర్కొన్నాడు. ఈ గ్రంథంపైన మా ఇరువురి నడుమ నడిచిన చర్చలోని ఒక ప్రధానాంశం మాత్రమే ఈ క్రింద - సాహిత్య క్షేత్రంలో కృషిచేస్తున్న మిత్రుల పరిశీలనార్థం ఇవ్వబడింది.

*   *   *

ప్రశ్న - శేషేంద్రగారూ! మీ మేనిఫెస్టోలో అరిస్టాటిల్, భరతుడు, మయకోవస్కీ అందరూ ఒక్కటే విషయాన్ని చెప్పినట్లుగా తేల్చారు. 244 వ పుటలో డేవిడ్ క్రెయిగ్ చెప్పింది రాస్తూ, మీరు అభినవ గుప్తుడు కూడా అదే చెప్పారన్నారు. ఇంకా మీరు - "మానవజాతి అంతా ఒక్కటే అనీ, ఒక విషయం మీద మనిషి ఆలోచన, అన్వేషణ, తత్పర్యవసాన రూప ఉపలబ్ధ సిద్ధాంతం అన్నీ ఒకటిగానే ఉంటాయనీ, ఈ సత్యం దేశకాలాతీతమనీ'' అన్నారు. ఇలాంటి

నిర్ణయం చేయడం శాస్త్రీయ విధానానికి వ్యతిరేకమని కొందరి ఉద్దేశ్యం. భరతుడి కాలం ఏమిటి? ఆ కాలానికి ఉన్న సామాజిక పరిస్థితులేమిటి? ఆ పరిస్థితులకు తగ్గట్లుగా, తత్కాల ఆర్థిక వ్యవస్థకు సమన్వయిస్తూనే కళలూ, వాటి శాస్త్రాలు, సిద్ధాంతాలూ ఏర్పడ్డాయి తప్ప 20 వ శతాబ్దానికి సరిపోయేటట్లుగా, అంటే ఈనాటి ఆర్థిక పరిస్థితులవల్ల పుట్టగల్గే సిద్ధాంతాలూ, నిర్ణయాలూ అనాడు చేయబడ్డాయనడం చారిత్రక దృష్టి (Historicity) కి విరుద్ధం - అని వారి తాత్పర్యం. దీనికి మీ సమాధానం ఏమిటి?

శేషేంద్ర - కవిసేన మేనిఫెస్టోలో నేను కవిత్వం అంటే ఏమిటి? అన్న విషయం ఆదిగా కవిత్వానికి సంబంధించిన తక్కిన విషయాలను విశదీకరించడానికి ప్రయత్నించాను కవిత్వం వేరు - కవిత్వం అంటే ఏమిటి? అన్నది వేరు. కవిత్వం అన్నది కళ (Art) కవిత్వం అంటే ఏమిటో చెప్పేది శాస్త్రం (Science). ఈ రెండూ సత్యాన్నే అన్వేషిస్తున్నాయి. కాని కళ ఏమో Subjective Truth ని (విషయి సత్యాన్ని), శాస్త్రమేమో Objective Truth ని (వైషయిక సత్యాన్ని), అన్వేషిస్తాయి. Objective Truth మనుష్యులందరికీ, అన్ని కాలాలకీ సమానంగా వర్తించేది. అది భోజనం, ఇల్లు వగైరాల్లాగా Universal. శాస్త్రజ్ఞులలాంటి విషయాల్ని పట్టుకొంటాడు. కవేమో దాన్నే విషయిపరంగా అవగతం చేసికొంటాడు.

ప్రశ్న - అంటే మనుష్యులందరికీ సమానంగా అవగాహ్యమయ్యేది కాదిది?

శేషేంద్ర - అవును. Objective truth ని వ్యక్తిగత పద్ధతిలో చెప్పడమే Subjective Objective truth is the objective mode of existence of subjective truth and vice versa - i.e. subjective mode of existence of objective truth.

ప్రశ్న - అయితే కళలో మనం అనుభవిస్తోంది దేన్ని అన్నమాట?

శేషేంద్ర - కళలో మనం enjoy చేస్తున్నది truth ని కాదు. Subjective element ని. అదే కళ. మార్క్స్ అన్న మాటల్ని గమనించండి. "Truth is general. it does not belong to me alone, it owns me I do not own it. My property is the form which is my spiritual individuality" (మేనిఫెస్టోలో చూడండి ఈ మాటలు).

ప్రశ్న - ఇంతకూ మొదటి ప్రశ్నకు - విభిన్న సామాజిక వ్యవస్థల్లోంచి విభిన్న భావాలూ, సిద్ధాంతాలూ పుట్టాయి కాబట్టి భరతుణ్ని మయకోవస్కీని ఒకే సత్యం చెప్పారనడం ఏం సమంజసం - అన్న దానికి సమాధానం ఏమిటి?

శేషేంద్ర - అక్కడికి మిమ్మల్ని తేవడానికే పై మాటలన్నీ. రష్యాలో సోషలిస్ట్ వ్యవస్థ, అమెరికాలో కాపిటలిస్ట్ వ్యవస్థ కదా ఉన్నాయి? కాని ఆ రెండు వ్యవస్థలోనూ న్యూక్లియర్ సైన్సు ఒక్కటే. అది ఈ రెండు వ్యవస్థల్లోనూ భిన్నంగా వుండదు. అది Science. అయితే ఈ సైన్సు ఆధారంగా స్పుత్నిక్కులో చంద్రమండలం మీదికి దిగినవాడి అనుభూతి కేవలం వైయక్తికం (Subjective) దాని అభివ్యక్తి కళ ఈ వైయక్తిక అనుభూతికి సంబంధించిన విషయం. అది మన వ్యవస్థలకు సంబంధించి మారుతూ ఉంటుంది. కనుక గ్రీకుల కాలపు బానిస వ్యవస్థలో కానీ ఇటీవలి భూస్వామ్య, పెట్టుబడిదారీ సోషలిస్ట్ వ్యవస్థలో కానీ objective truth ఒక్కటిగానే వుంటుంది. దానికి వ్యవస్థా భేదాన్ని బట్టి విభిన్నత రాదు.

నేను - కాబట్టి కవిత్వం అంటే ఏమిటో కనుక్కొనే శాస్త్రజ్ఞుల్లో అన్వేషణలో దొరికే సత్యం భరతుడికైనా, మయకోవస్కీకైనా ఒక్కటే అని మీరు తేలుస్తున్నారు?

శేషేంద్ర - సరిగ్గా అంతే!

నేను - అంటే పరిస్థితుల ప్రభావానికి లొంగకుండానే objective truth కోసం అన్వేషణ జరుగుతుందని అర్థం.

శేషేంద్ర - ఏ పరిస్థితిలో, ఏ వ్యవస్థలో ఏ కాలంలో విశ్లేషించినా నీటిలో ఉండేవి ఉదజని, అమ్లజనులే. ఆపిల్ పండు చెట్టు మీదినుంచి కిందికే వస్తుందని న్యూటన్ చెప్పకపోయినా జరిగేది అదే - ఆ సత్యం అక్కడ ఉన్నదే. దాన్ని కనుక్కోవడమే శాస్త్రజ్ఞుడు చేసేపని. అట్లాగే "కవిత్వం అంటే ఏమిటో'' అని కనుక్కొనే శాస్త్రజ్ఞుడు విషయం కూడా. అందుకని ఆ శాస్త్రజ్ఞుడు ఏ వ్యవస్థలో ఉండి కనుక్కొన్నా అది ఒక్కటిగానే ఉంటుంది. అందువల్ల భరతుడు - మయకోవస్కీ ఒక్కటే విషయం చెప్పారని నేను రాయడంలో హిస్టారిసిటీ లేదనడం Subjective, Objective truth ల విషయంలో సరియైన అవగాహన లేకపోవడమేనని నా ఉద్దేశం.

(సాధన, వరంగల్లు, మాసపత్రిక - ఫిబ్రవరి, 1980.)

# ఆధునిక కవిత-అభిప్రాయ వేదిక

సంపాదకత్వం

ఆచార్య తిరుమల

సేకరణ

మద్దాళి రఘురామ్

ప్రచురణ :

కిన్నెర పబ్లికేషన్స్

హైదరాబాదు - 500 013.

1981

ప్ర. తెలుగులో ఆధునిక కవిత్వం ఎప్పటి నుండి మొదలయ్యిందని మీరనుకొంటున్నారు?

జ. కాల చిహ్నాలను బట్టి ఆధునికతను గుర్తించేటట్లయితే, తెలుగులో గురజాడ అప్పారావు గారికి పూర్వం ఆధునిక లక్షణాలున్న సాహిత్య రచన చేయబడినట్లు ఏ సాక్ష్యము లేదు.

ప్ర. 'ఆధునిక కవిత్వం' అంటే మీదృష్టిలో ఏమిటి?

జ. ఈ ప్రశ్న ప్రకారం కవిత్వాన్ని విశ్లేషించి పరిశీలించాలి. కవిత్వానికి మూడు శరీరాలున్నట్లు భావించవచ్చు. పైకి కనిపించే బహిశ్శరీరం సర్వసామాన్య జన అవగాహనకు అందే నాగరికతా సంబంధమైన లక్షణాలు. ఆహార విహారాదులు, వస్త్రాద్రి అలంకరణలు, గృహ గ్రామ పట్టణాది నిర్మాణాలు-ఇత్యాది నిత్య జీవన విశేషాలు. కవిత్వం యొక్క రెండవ శరీరం కించిదంతర్గతంగా ఉండేది. ఇది మనుష్య సంస్కార సంబంధి లక్షణ జన్యమైనది. తండ్రిని కొడుకు గౌరవించటం, అగ్రజుణ్ని గౌరవించటం, ఒకే భార్యకు బద్ధుడై వుండటం, స్నేహధర్మం, ప్రభుత్వ ప్రజల సంబంధం, స్వామి, సేవక సంబంధం - ఇత్యాది అంతస్సారజన్యమైన విలువల సముదాయం.

నన్నయగారి కవిత్వం తీసుకుంటే అందులో కిరీటాలు, ఖడ్గాలు, సింహాసనాలు, గజాశ్వాది వాహనాలు, కేశజాలంలో పుష్పాలంకరణలు ఇత్యాదులు ఆయన కవిత్వపు బహిశ్శరీరంలో కనిపిస్తాయి. అట్లాగే దాని అంతశ్శరీరంలో పితృవాక్య పాలన, ఏకపత్నీ వ్రతం. సేవక భక్తి, ప్రభు భక్తి, సొంత ఆస్తి ఇత్యాది రాజకీయ, సామాజిక, ఆర్థికవిలువలు కనిపిస్తాయి. ఈ బహిశ్శరీరంలో అంతశ్శరీరంలో కనిపించిన లక్షణాలేవీ యీనాడు రాసే కవుల్లో కనిపించవు. ఈనాడు టెర్లిన్‌షర్టు, క్రాఫింగ్, నవీన పర్నిచరు, ఇళ్ళు, రస్తాలులాంటివి కనిపిస్తాయి. అలాగే పితృవాక్య పరిపాలన కూడా ఆనాటి దృఢవ్రతంకాదు యీనాడు ప్రభుభక్తి యీనాటి రాజకీయ విలువకాదు. ఈనాడు దాని స్థానంలో ప్రజా

స్వామ్యం వచ్చింది. అనాటి స్వామి - సేవక సంబంధం స్థానంలో యీనాడు సర్వమానవ సమానత్వం వచ్చింది. అనాటి వ్యక్తిగత ఆస్తికి బదులు సామాజిక ఆస్తి యీనాటి ఆర్థిక విలువ. ఇప్పటికే లోకం ఈ విలువను భూగోళం మూడు వంతులు భాగంలో అమలు జరిపింది కూడా. ఈ విలువను నన్నయగారి కాలంలో ఉద్ఘోషిస్తే నిండు కఠిన శిక్షకు పాత్రుడవటంలో సందేహం లేదు. ఈ శారీరక లక్షణాలూ కేవలం దేశ, కాల జన్యమైనవి అనేది సామాన్య విజ్ఞానం. కనుక కవిత్వం ఈ లక్షణాలచేత ఆధునిక లేక ప్రాచీన లక్షణమని విభజించి, గుర్తించబడవచ్చు.

కానీ, ఈ రెండు శరీరకోశాలను దాటి యింకా లోతుకు వెళ్ళినప్పుడు వుండే మూడవ ప్రదేశం-అది శరీరమా? ఆత్మా? అని నిర్ణయించటానికి వీలు కానిది. పై రెండు దేశ కాల జన్య సందర్భ, సన్నివేశాల్లో మనిషిపొందే గాఢాను భూతినుంచి ఉత్పన్నమయ్యే విచిత్రమైన మాటో, లేక దృశ్యమో, ఏదైతే ఉక్తమై పాఠకుణ్ని ఆశ్చర్యామాతానికి గురి చేస్తుందో - ఆ ప్రాణతుల్యమైన వైచిత్రి. ఆశ్చర్యాహ్లాదజనకమైన భంగిమ - అది ఎప్పుడూ దేశ కాలాతీతంగానే వుంటుంది. ఈ మూడవ వస్తువు కవిత్వపు మూడవ శరీరం అనగలమా? లేక కవిత్వపు ఆత్మ అందామా? పై రెండు శారీరక లక్షణ సముదాయాలూ దేశ కాలానుగుణంగా మారుతూ వుంటే- యీ అంతరంగిక విచిత్ర అనిర్వచనీయ పదార్థం, ఏదైతే కవియొక్క ఆత్మిక పదార్థమో, అది మాత్రం దేశ కాలా బాధ్యంగా, శాశ్వతంగా వుంటుంది. కనుకనే ఎంతో ప్రాచీనుడైన వాల్మీకిని చదివి, యీనాడు కూడా 20వ శతాబ్దంలో మనము అహ్లాదపరవశుల మౌతున్నాం. వైదిక కవితలు కూడా మనల్ని ఆశ్చర్యబంధంతో కట్టిపడవేస్తున్నాయి.

దీనివల్ల తేలేమిదంటే, దేశ కాల సంబంధమైన కవిత్వపు బహిరంతర శరీర ద్వైలక్షణాలు, ఆ భాష, మనకు సంబంధించినవి కాకపోయినప్పటికి, వాటి కావ్య ధర్మంచేత అవి మనల్ని స్వపాశ వశం చేసుకుంటున్నాయి. కనుక కవిత్వపు ఆధునికత, ప్రాచీనత, రాజకీయ, సామాజిక, ఆర్థిక విలువల చేతనే నిర్ణయించబడగలదు కానీ కవిత్వపు అంతస్సత్త్వమైన కావ్య ధర్మంచేత - కవిత్వానికి కాల విభజన కుదరదు.

ప్ర 1981లో ఛందోబద్ధ కవిత్వం రాసేవాళ్ళు ఏ తెగకు చెందిన కవులవుతారు?

జ. శిలా శాసనాల భాషలో రాస్తూ, ఈనాటి జీవిత సన్నివేశ అనుభూతి మూలక ఆదేశంతో ఒకడు కవిత్వం ఛందస్సులో చెప్పాడు. అందులో రాజకీయ, సామాజిక, ఆర్థిక విలువలు సమకాలీనములే అవుతాయి దీన్ని ఛందస్సు, శిలాశాసన భాషల కారణంగా ఆధునిక కవిత కాదు అంటే అంత నిష్కర్షగా కుదరదు. ఛందస్సు కవిత్వంలో ఆధునికతకు భంజకం అనటం అంత శాస్త్ర వివేచనా సమ్మతమైన మతంకాదు.

సినిమా పాటల్లో ఛందస్సు వుందా? లేదా? ఛందస్సుకు ప్రాణం లయ. కనుక లయాత్మకరచనలన్నీ ఛందోబద్ధ రచనలే. అన్నమాచార్యులు, త్యాగరాజు రామదాసు మొదలైన కవులు రాసిన కీర్తనల్ని ఛందో రహితమైన వచన కవితలు అనలేము కదా?

ప్రపంచంలో ఆధునిక కవితకు మూల పురుషులైన బోదిలేర్ ఆది ఫ్రెంచ్ సింబలిస్టులు, తత్పూర్వం ఇంగ్లాండులో కానీ యూరపులో గానీ వచ్చిన రొమాంటిక్ కవులు, ఛందోబద్ధ రచనలే చేశారు. ఇలాంటి వాస్తవాలచేత కూడా ఛందస్సు కవిత్వంలో ఆధునికతకు భంజకం అనుకోవటం అశాస్త్రీయం. కొందరు ఛందస్సులో విప్లవ కవిత్వం చెప్పకూడదనుకోవటం కూడా మూర్ఖ లక్షణం. అక్టోబరు రివల్యూషన్‌లో పాల్గొన్న రష్యన్ మహాకవి మయాకోవిస్కీ ఛందోబద్ధమైన కవిత్వమే చెప్పాడు. ఆయన కవిత్వం ఎలా రాయాలనే వ్యాసం రాసి, దానికి పేరు "How to make Verses?" అని పెట్టారు ఆయన కవిత్వాన్ని ఛందోరహితంగా వూహించనే లేదు.

దీనిఅర్థం, ఒకరచన కవిత్వం అనటానికి ఛందస్సు అనివార్యం అనిమాత్రం కాదు. ఛందస్సు వల్ల కవిత్వానికి కలిగే లాభాలు—ఒకటి దీర్ఘాయుష్షు; రెండవది-కవిత్వం చెబుతున్న విషయం పాఠకుడిలో మరింత అవగాహనా లోతులకు పోవటం. దానికి సంగీతాన్ని కూడా జోడిస్తే, కవిత్వం దేన్ని సమాజం అవలంబించాలని, దేనిమీద సమాజానికి నమ్మకం కుదరాలని ఆశిస్తుందో, ఆ ఆశ సమగ్రంగా సఫలమవుతుంది. ఉర్దూ మహాకవి గాలిబ్‌ను వింటూ ఉర్దూ సమాజం ఎందుకు ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తుందో, ఈ మర్మం చేతనే గ్రహించవచ్చు. ఈ మర్మంచేతనే ఉర్దూ సమాజ నాగరికత, కవిత్వ నాగరికతేకానీ, ధార్మిక రాజకీయ నాగరికత కాదనే సూక్ష్మం కూడా గ్రహించవచ్చు.

కనుక, ఈనాడు ఛందస్సులో రాసినప్పటికి అందులో ప్రతిపాదింపబడిన విలువలు ఆధునిక కాలానికి చెందినవైతే ఆ కవిని ఆధునిక కవి అనే అనాలి.

ప్ర. సంప్రదాయానికి విరుద్ధంగా రాసిందే ఆధునిక మౌతుందా?

జ. ఇందులో ఒక ప్రశ్న పుడుతుంది. సంప్రదాయంలో ఆధునికత లేదా? సంప్రదాయం అంటే కేవలం ప్రాచీనవిలువల సముదాయమనుకోవటం హేతువాద విరుద్ధమైన ఆలోచనా ధోరణి. సంప్రదాయంలో ప్రజా శ్రేయస్సుకు అవసర మైన దీర్ఘకాలిక అనుభూతి మూలక గుణపాఠాల సముదాయమే సంప్రదాయం యొక్క సారాంశమని తేలుతుంది. కొంచెం లోతుగా ఆలోచిస్తే-ఈ పాఠాల్లోంచి పుట్టి ప్రతిష్ఠితమైన విలువలు, ఆచార వ్యవహారాలూ అన్నీ శాశ్వత ధర్మత్వ మున్నవి అనుకోనక్కరలేదు. దేశకాల వశంగా కొన్ని శ్రేయస్కరం కాకుండా పోతూ వుంటాయికూడా. అప్పుడు సంప్రదాయంలో కొత్తవి చేరుతుంటాయి. ఫలితంగా, సంప్రదాయం ఒక నదీ ప్రవాహం లాంటిదే అవుతుంది. కానీ, ఏ ప్రవాహంలో జలం శాశ్వతంగా నిలువుండదో అలాంటి నదీ ప్రవాహమే కాని స్థిర జలరాశి అయిన తటాకం లాంటిదికాదు. కనుక సంప్రదాయ లక్షణాన్ని అర్థం చేసుకోవటం మొదట అవసరం.

ఒక కవితలో కొడుకు తండ్రిమీద విరోధం వహిస్తాడు. ఇది సంప్రదాయ విలువకు విరుద్ధం కనుక ఆ లక్షణం చేతనే ఆధునిక కవిత్వం అంటామా? అలా అన్నట్లయితే, అట్టి ఆధునికత ఒక సాహిత్యపు విలువగా పరిగణించవచ్చా? కనుక కేవల సంప్రదాయ విరుద్ధత ఒక రచనకు ఆధునికతను ఆపాదించదు. కారణం యీ విలువల్లో కూడా కొన్ని శాశ్వత కాలీన విలువలు, కొన్ని తత్కాలీన విలువలు ఉన్నాయి. పుత్ర-పితృ ప్రేమ, దాంపత్య ప్రణయం, స్నేహధర్మం లాంటి పునాది గతమైన మానవీయ సాంస్కారిక లక్షణాలు శాశ్వత విలువలైతే ప్రజాస్వామ్యం, సొంత ఆస్తి - ఇత్యాది రాజకీయ, సామాజిక, ఆర్థిక లక్షణాలు తత్కాలీనములౌతాయి. కవితలో తత్కాలీనత ప్రతిబింబించినంత మాత్రాన లేక శాశ్వత కాలీన తత్కారణంగా ప్రాచీన విలువలకు విరుద్ధంగా రాస్తే అందుచేతనే ఆధునిక కవిత్వం అనటం చాలా బాలక బుద్ధి అనుకోవాలి.

ప్ర. ఉన్న పద్ధతిని విడిచి ఒక కొత్త పద్ధతిని పాటించటమే ఆధునికత అయితే - పాల్కురికి సోమన నుడి వుంది. దాని మాటేమిటి?

జ. పాల్కురికి సోమన ఉన్న పద్ధతిని విడిచి కొత్త పద్ధతిని అవలంబించాడు. ఈ కవిలో విశేషం ఏమిటంటే ఒక్క రచనాధోరణిలోనే కాకుండా తత్కాలీన సంప్రదాయ విలువల విషయంలో కూడా విరుద్ధ మార్గాన్ని అవలంబించాడు. కనుక ఆయన్ని సమగ్రమైన ఆధునిక కవి అనాలి ఐతే, ఇంకా విశేషమేమిటంటే ఆయనలో కవిత్వం ఎక్కడుందో కనుపించదు. పేజీలు పేజీలు - లింగమహిమ, రుద్రాక్షమహిమ, విభూతిమహిమ లాంటి విషయాలమీద పొడి వచనపు రచన అంతం లేకుండా సాగిపోతూ వుంటుంది. ఈనాటి వీర రాజకీయ కవులకు తుల్యుడు కవిత్వం ఉన్నా లేకపోయినా, ఈనాటి వీర వచన కవులు ఆ వీరత్వం చేతనే ఆధునిక కవులు అవ్వగలిగితే, పాల్కురికి సోమన కూడా ఆధునికుడే అవుతాడు. ఐతే, ఒక శతాబ్దం కింద ఆధునిక కవి అయిన వాడు కొన్ని శతాబ్దాల తర్వాత కూడా ఆధునిక కవి అనబడతాడా? అరవై ఏళ్ళ వయసున్న బాలసుబ్రహ్మణ్యాన్ని అరవై య్యేవ ఏట కూడా బాలుడంటామా?

ప్ర. ఆధునికత అన్నది ప్రక్రియను అనుసరించా? వస్తువుని అనుసరించా?

జ. ఆధునికత ప్రధానంగా వస్తువుని అనుసరించే ప్రక్రియ ఏదైనా కావ్య ధర్మ ఖండకం కాదు కనుక ఆధునికత వస్తుగత లక్షణం మాత్రమే. కావ్య ధర్మగతంగా అలంకారాలు, ప్రాచీన కావ్యాల్లో ప్రయోగింపబడి యీనాటి ఆధునిక కవితలో బింబాలు, ప్రతీకలుగా వాడుతున్నప్పటికీ ఈ భిన్నంగా కనిపించే కావ్యద్రవ్యాల్లో అంతరికంగా ఏకత వుండటంచేత వాటినిబట్టి ప్రాచీన, ఆధునిక భేదాన్ని నిరూపించబూనటం అంత గట్టిపని కాదేమో!

ప్ర. ఆధునిక కవిత్వంలో - కవికి సామాజిక స్పృహ, కట్టుబాటు అంటే ఒక కమిట్‌మెంట్ లాంటిది వుంటే తప్ప అది కవిత్వం కాదు - అన్న ధోరణిని మీరెంతవరకు సమర్థిస్తారు?

జ. కవికి కమిట్ కావాలి అన్నంత వరకు నా దృష్టిలో నిర్వివాదమైన విషయం. ఐతే, ఆ కమిట్‌మెంట్ ఏమిటి? అన్న విషయంలో సంకుచితమైన నిర్వచనం నుంచి సారవంతమైన నిర్వచనం వరకు లక్ష సమాధానాలున్నాయి. కవి అనుభూతి పూర్వకంగా, త్రికరణశుద్ధిగా, భావోద్రేకాత్మకంగా జీవితంలో నిమగ్నుడు కావటం ఏదైతే వుందో అది కవిత్వ జన్మకే జీవహేతువు. క్లుప్తంగా చెబితే కవి ఫీలింగ్‌తో బతకటం నేర్చుకోవాలి. లేకపోతే కవిత్వం పుట్టదు. **Feeling** పుట్టటానికి మూలద్రవం నీతి. ఈ సత్యం మన ఆలోచనలని ఎంత లోతులకు తీసుకుపోతుందో ఆలోచించే తెలుసుకోవాలి.

ప్ర మీరు రాసేటప్పుడు మీ కమిట్ మెంట్ ఏమిటి? మీ కవిత్వ సిద్ధాంతం ఏమిటి?

జ. నేను జీవితంలో ఫీలై (Feel) పొందిన అనుభూతిని ఒక అమూల్యమైన సంపదగా ఆర్జించుకుంటాను, అదే కవిత్వానికి మూల ద్రవ్యం కనుక. నేను జీవిత అనుభూతిలో ఫీలై గాయపడి ఒక మాట చెబుతాను. అలాంటి సన్నివేశాల భిన్నతనుబట్టి నా అనుభూతికూడా భిన్నంగా వుంటుంది. తత్కారణంగా నా మాటలు వినబడే స్వరం కూడా భిన్నంగా వుంటుంది. ఒకప్పుడు ఆ స్వరం క్రోధారుణంగా ఉండవచ్చును. మరొకప్పుడు ప్రేమార్ద్రంగా ఉండవచ్చు. నా 'శేష జ్యోత్స్న', 'మండే సూర్యుడు' కావ్య సంపుటాల్లో ప్రేమార్ద్ర స్వరం ప్రధానంగా కనిపిస్తుంది. అన్య ఉపస్వరాలు లేకపోలేదు. నా 'సిరా పారిపోయింది' కావ్యంలో ఒక సౌందర్య రస తపస్సు కనిపిస్తుంది. 'నా దేశం-నా ప్రజలు', 'గొరిల్లా'లలో అధర్మ విద్వేషం, క్రోధ విజృంభణ కనిపిస్తాయి. వీటన్నింటికీ ఒక ఏకైక సిద్ధాంతం ఉండాలనుకోవటం కావ్య మర్మజ్ఞత కాదు. కావ్యానికి అనుభూతి ప్రధానం కానీ, సిద్ధాంతం కాదు ఈ విషయం కోసం ఆర్చిబాల్డ్ మెక్లేస్ 'Poetry and Experience' అనే గ్రంథం కానీ, బొనర్జిస్ రాసిన 'Fundamentals of Marxists', 'Easthatics' గానీ చదవటం చాలా అభిలషణీయం.

ప్ర కమిట్ మెంట్ అనే కళ్ళద్దాల్లోంచి చూస్తే కవికి నిసర్గ సౌందర్యం కనిపించకపోగా లేనిరంగు కనిపించే ప్రమాదం - దాంతో అదే నిజమనే సిద్ధాంతం - వస్తుందంటారు. కాబట్టి కవికి కమిట్ మెంట్ అవసరం లేదంటే మీరొప్పుకుంటారా?

జ. ఈ ప్రశ్న భారమంతా కమిట్ మెంట్ అనే పదంమీద పడుతుంది. దాన్ని గురించి చెప్పాను. అది ఇక్కడ అన్వయించుకుంటే సరిపోతుంది.

ప్ర కమిట్ మెంట్ అవసరం లేదంటే కవి ఎందుకు రాస్తున్నట్టు? ఆత్మానందం కోసమా? ఐతే ఎందుకు ముద్రించాలి?

జ కమిట్ మెంట్ పదానికి ఎక్కువమంది కావ్యమర్మ వివేకం లేనివాళ్ళు ఊహించుకుంటున్న అర్థంచేత ఈ ప్రశ్న పుడుతుంది. కవి అన్న వాడెప్పుడూ రెండు భాగాల అనివార్య సంపుటి. ఒకటి అంతః ప్రపంచం, రెండు బహిః

ప్రపంచం. ఇంగ్లీషులో Subjective, Objective అనేవే యివి. కవి ముందు వ్యక్తిగతంగా ఫీలవుతాడు. ఈ ఫీలింగ్‌కు మూలం బహిః ప్రపంచ సన్నివేశమే. ఈ రెంటి సన్నికర్షణ ఫలితంగా పుట్టిన భావాభివ్యక్తికి ఉన్న కళాత్మక లక్షణాలు కవియొక్క వ్యక్తిగతమైనవే. కనుక ఫీలింగు, అనుభూతి, అభివ్యక్తి-ఈ మూడు Subjctive. ఫీలింగుకు మూలకమైన అనుభవ సన్నివేశం Objective కనుక కావ్య ప్రక్రియకెప్పుడూ కవి, పాఠకుడు అనే రెండు పక్షాలూ అనివార్యమైనవి. ఇందులో ఆత్మానందమున్న కావ్య వివేక బహిష్కృతమైన శబ్దం ఏ పాటి స్థానాన్ని పొందగలదో ఊహించుకోవలసిందే!

ప్ర. కాలానుగుణంగా ధనవంతులు, మధ్యతరగతివారు, పేదవారు అన్న తేడా లేకుండా దాదాపు అన్నిరకములవారు ఒకేరకమైన కవిత్వం రాస్తూండటం కనిపిస్తుంది - అంటే - శ్రామిక, కార్మిక, పీడిత, తాడిత జన బాధల్ని గురించి అనుకోండి. అప్పుడు ఎక్కడో ఒక వర్గంలో అనుభవం లేక పోవటంవల్ల చిత్తశుద్ధి, స్పష్టత లోపించవచ్చు-అటువంటి పరిస్థితుల్లో కవిత్వాన్ని గుర్తించటానికి తగిన కొలమానా లేమిటి?

జ. ఆలీబాబా 40 దొంగలు కథలో దొంగలు ఆలీబాబాను చంపాలనుకొని వాడున్న ఇంటి తలుపుమీద గుర్తుపెట్టి రాత్రి వద్దామని వెళ్ళిపోతారు. ఇది చూచిన ఆలీబాబా భార్య ఆ వీథిలో ఉన్న అన్ని ఇళ్ళ తలుపులమీద అదే గుర్తు పెట్టింది ఫలితం దొంగలు ఆలీబాబా ఇంటిని గుర్తించలేక పోయారు. ఆవిధంగానే ఈనాడు అందరూ పీడిత, తాడిత, శ్రామిక జనాన్ని గురించి కవిత్వమనే రచనలు చేస్తూనే ఉన్నారు. ఆ పీడిత జనాన్ని గురించి రాసినంత మాత్రం చేతనే అది కవిత్వమనే దృఢవిశ్వాసం కూడా వహించారు. వీళ్ళలో ఎవడు కవో, ఎవడు కవికాడో గుర్తించడం అసాధ్యం అనిపిస్తుంది. తెలుగు కవిత్వం ఆలీబాబా కథగా మారింది. కానీ నిజమైన కావ్య మర్మజ్ఞుడు అసలు సరుకును నకిలీ సరుకునుంచి విడదీసి గుర్తించగలడు. ఒక కవిత చదువుతున్నప్పుడు లేక వింటున్నప్పుడు అది ఫీలింగ్ అనే మూల ద్రవ్యంలోంచి పుట్టినదైతే పాఠకుడి హృదయంలో కూడా ఫీలింగ్ అనే జ్వాలను అంటిస్తుంది. ఈ మహాసత్యాన్నే ప్రాచీనులు రసము సహృదయ హృదయైక వేద్యమనే మాటతో చెప్పారు ఈ ఫీలింగ్ కలిగించనిది అలంకారాలున్నా, శ్రామిక జనుల మద్దత్తు ఉన్నా అకవిత్వమని స్పష్టమవుతుంది. కనుక ఫీలింగు కలిగించే శక్తి కవిత్వానికి గీటురాయి.

ప్ర. తన అనుభవంలో లేని విషయాలు చెపితే కవికి కేవలం తన అభిరుచిని మాత్రం ప్రతిబింబించే ఒక రకమైన అసంపూర్ణ ధోరణి వచ్చే అవకాశం వుంది - మరి కవిత్వాన్నిబట్టి కవినా- కవినిబట్టి కవిత్వాన్నా కొలవటం?

జ. నిజమే. కవిత్వాన్నిబట్టే కవిని కొలవాలి. కారణం లోకానికి కవిత్వంతోనే సంబంధం కనక. నిలిచేదో, చచ్చేదో కవిత్వమే కనక. నిలిచినపుడు కవి కనక. ఎప్పుడూ చేతిలో ఉన్న పుస్తకాన్ని ఆధారం చేసుకునే కావ్య విమర్శ జరగాలి. కవి విమర్శ లోకానికి కేవలం అప్రస్తుతం. అనవసరం

ప్ర. కాలానుగుణంగా కవిత్వమా?

కవిత్వానుణగుంగా కాలమా?

జ. అనుభూతి అనివార్య కావ్య జన్మహేతువు కనుక కవి కాలానికి శిశువు. వాస్తవాల కోరల్లో ఇరుక్కున్న ప్రాణి. కానీ కవి ఆ బాధల్లోనుంచి జనించే ఒక కాంతి జ్వాల. కనుక కవి వాస్తవాల అవాస్తవాల దాంపత్యం. కవి గుండె అయిన అలంకారం అందుచేతనే ప్రత్యక్ష పరోక్ష ఐక్యం. కవిత్వం నశ్వర శాశ్వత వస్తు మిథున జన్యం. కవితలోవున్న జ్వాలీన, అవాస్తవ పరోక్ష లక్షణ ప్రధాన అంశ ఏదైతే ఉన్నదో దానిచేత కవిత్వం కవికాలాన్ని అధిగమించి ఇంకా ముందు కాలాలవరకు ప్రయాణం చేస్తుంది ఆ కాలాల ప్రజలమీద పని చేస్తుంది. కనక కవి కాలశిశువు, కాలం కవి శిశువు అనే విచిత్ర తాత్త్వికస్థితి మాత్రమే సత్యం.

ప్ర. కవిత్వం జీవితానికి వ్యాఖ్యానంగా వుండాలంటారు కదా! మీరు ఏకీభవిస్తారా?

మామూలుగా జీవితపరిధిలోకి రాకుండా వ్యక్తి అనుభవించే వివిధ ఆనందాల మాటేమిటి? అవి మాటల కందవుగదా? అప్పుడు కవిత్వం అసంపూర్ణకళ అనవచ్చా? అలాకాక - ఆనందం కూడా జీవితంలో భాగమే అనుకుంటే రాక్షసానందం (హింసాత్మకమైన ఆనందం) మాటేమిటి? అదికూడా జీవితంలో ఒక భాగమని ఒప్పుకుంటే - దాన్ని వర్ణించటం కూడా వాస్తవ చిత్రణే ఔతుందా? అప్పుడు - జీవితంలోని అసౌందర్యాన్ని వర్ణించటం ఔచిత్యం కావచ్చుగదా? కాబట్టి అసౌందర్యం కూడా కవిత్వంలో భాగమని ఒప్పుకుంటారా? అలా ఒప్పుకుంటే ఔచిత్యానికి మీరిచ్చే నిర్వచనం ఏమిటి? దిగంబర కవితా ప్రక్రియమీద మీ మాట ఏమిటి?

జ. కవిత్వం తన బలంచేత మనిషిని కార్యోన్ముఖుణ్ణి చెయ్యాలి. అందుచేత కవిత్వం తన శక్తిని మనిషిలో ఆశాజ్యోతి ఆరనీయకుండా ఉంచటానికే వినియోగిస్తుంది. ఈ పని చెయ్యటానికి కవిత్వం ఏ వస్తువును ఎట్లా చెప్పాలో ఒక సహజమైన ఆంతరంగిక అవగాహనచేతనే గ్రహిస్తూపోతుంది. అది చెప్పవచ్చు, ఇది చెప్పకూడదు అని సూత్రాన్ని ప్రతిపాదించటం సాధ్యంకాదు. రాక్షసానందం, అసౌందర్యం లాంటివి కూడా కవిత్వం యొక్క సహజ ఆంతరంగిక అవగాహనచేతనే కవిత్వంలో స్థానాన్ని గడించుకోవటమో, గడించుకోలేకపోవటమో నిర్ణయమౌతుంది. ఏదైనా అంతిమ పరీక్ష ఏమిటంటే- కవిత చదువుతున్నప్పుడు పాఠకుడికి చెప్పబడుతున్న విషయంమీద ఆకర్షణ కలగాలి. దాని మోహంలో పడాలి. ఈ మోహం, ఆకర్షణ అనే కవిత్వ ప్రభావానికి విఘ్నం కలిగించగలిగిన ఏ విషయాన్నీ కవిత్వంలో చెప్పకపోవటంచేతనే కవి తన విజయాన్ని సాధిస్తాడు. సిద్ధాంతం పేరుచేతనో లేక ఏదో ఒక మూర్ఖ ఆవేశంచేతనో పాఠకుడిలో వైముఖ్యం కల్గించేవాడు, తత్సంబంధమైన జ్ఞానం లేనివాడు కవి అవ్వటం కూడా దుర్లభమే

ప్ర. భావకవిత్వం నుండి తీసుకుంటే - భావకవిత్వంగానీ, అభ్యుదయ కవిత్వంగానీ, ఆ తర్వాత వచ్చిన అతినవ్య కవితాధోరణులు అంటే - అధివాస్తవికత, అరాచక వైచిత్రీ ప్రియత్వ, నిరాశావాదాలు, విశృంఖల కామభావం మొదలైనవన్నీ మనకు విదేశాల నుంచి, ముఖ్యంగా పాశ్చాత్య దేశాలనుంచి వచ్చాయికదా - మరి వీటివల్ల మన తెలుగుసాహిత్యం పరిపుష్ట మయ్యిందని మీరు అనుకుంటున్నారా? అనుకుంటే - A ఎందుకు? B ఎలా? అనుకోకపోతే ఇంత కవిత్వం కళ్ళముందు కనిపిస్తోంటే దాని ప్రభావాన్ని కాదనటం ఎలా?

జ. భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వాలు విదేశాల నుంచి కృత్రిమంగా యిక్కడికి దిగుమతి చేయబడిన సరుకు అనుకోవటం శాస్త్రయుక్తమైన అవగాహన కాదు. అవి ప్రపంచంలో వచ్చిన రాజకీయ, సామాజిక ఆర్థిక విలువలకు సంబంధించిన మార్పుల ప్రభావంగా వచ్చినవి. ఒక దేశంలో ముందు, మరో దేశంలో వెనుక కావచ్చు. ఈ మార్పులు విశ్వజనీనమైన మార్పులు. కానీ, తర్వాత పేర్కొనబడిన - సర్రియలిజం, డాడాయిజం - మొదలైన ఉద్యమాలు విశ్వజనీన ఉద్యమాలు కావు. అవి స్థానికంగా యూరప్‌లో కలిగిన రాజకీయ, సామాజిక, ఆర్థిక కల్లోలంలో నుంచి ఉత్పన్నమైనవి. వాటికి వాటి జన్మభూమి

వరకే సాహిత్యప్రాధాన్యం వుంటుంది. వాటినిక్కడ, అందులోనూ - ఆధునికత యెక్కువగా లోపించిన తెలుగులో అవలంబించటం లేక అవలంబించినట్లు కనిపించటం లోకవంచన అవుతుందేమో కానీ కవిత్వం అవ్వటం మాత్రం దుర్లభం.

అసలు, కవిత్వానికి ఒకటే గీటురాయి - తాను చెప్పింది తన అనుభవమై వుండాలి. అది అనుభూతి కానీ, స్వానుభూతికానీ, ప్రసిద్ధ క్రౌంచవధలో వంటి సానుభూతికానీ కావచ్చు. కానీ యీ రెండూ కాని, ఆరువేలమైళ్ళ అవతల, ఈ వెనుకబడిన జాతి ఊహకు కూడా అందని స్యరియలిజం, డాడాయిజం మొదలైన ఉద్యమాల వంటివి ఎలా యీ కవుల అనుభూతిలో ఒక భాగం కాగల్గుతాయి?

ఆధునిక కవిత్వం అనే పేరుతో వచ్చిన యిలాంటి కృత్రిమ పదార్థానికి ప్రజల్ని ప్రభావితం చెయ్యగలిగే శక్తి ఎలా వుంటుంది?

ప్రభావం అనేది కవిత్వానికి ప్రధాన లక్షణం. పై రచనలు కవిత్వమే కాలేకపోతున్నాయి. కనుక వాటికి ప్రభావమనే లక్షణం కూడా లేదు. ఈ రచనల మొహం కూడా చూసేవాళ్ళే లేరు.

ప్ర ఆధునిక సాహిత్యంలో కొన్ని వాదాలు-అంటే - మానవతా వాదం, అనుభూతివాదం - ఇలా రకరకాల వాదాలున్నాయి కదా!.... వీటిమీద ఎవరి అభిప్రాయాలు వారు చెప్పటంవలన ఇదమిత్థమైన ఒక అభిప్రాయం కుదరలేదు. మీ దృష్టిలో ఆధునిక సాహిత్యాని కంతటికీ అన్వయించే ఏక సూత్రం లేదా వాదం వుందా? ఉంటే - మీ నిర్వచనం ఏమిటి? లేదంటే - మీ రచనల్లో ప్రధానంగావున్న అభిప్రాయం ఏమిటి?

జ. కవిత్వంరాసే కవికి కవి జన్మ ఘడియల్లో ఏ వాదాలూ స్ఫురించవు. వాడు కేవలం వాడి అనుభూతి సుడిగుండంలో పడి పరిభ్రమిస్తున్న ప్రాణి మాత్రుడు. ఆ క్షణంలో సంబంధంలేని వాదాలకు తత్త్వతః కవిత్వంతో ఏ బంధం లేదు. కవిత్వాన్ని అనుభవించేవాడు, వాడి ఆహ్లాదానుభూతిని, వాడి కావ్యతంత్ర జ్ఞానాన్ని బట్టి వర్ణించేటప్పుడు పడే పాట్లే యీ మానవతా వాదం, అనుభూతివాదం - ఇత్యాది నామకరణాలు. ఈ నామకరణాల స్థాయి సాహిత్య విమర్శ, చాలా వరకు అపరిపక్వ మనస్కులకు స్ఫురించేదే. కవిత్వ మూల ద్రవ్యాలు, కవిత్వజన్మ ప్రకారం యింతకుముందు వివరించాను. ఆ కాంతి

పుంజంలో ఈ ప్రశ్నని పరిశీలించండి (కవిసేన మేనిఫెస్టోలో 112-151 పేజీలు చదవటం ఈ సందర్భానికి చాలా ఉపయోగిస్తుంది.)

ప్ర. ఆధునిక సాహిత్య సృష్టి చెయ్యటానికి ప్రాచీన సాహిత్య పరిచయం అవసరం లేదంటారు కొందరు. వ్యుత్పత్తిలేకుండా ప్రతిభ మాత్రం వుంటే మంచి కవిత్వం రావటానికి వీలుంటుందా? మీ అనుభవం ఏమిటి? మీ ఆదేశం ఏమిటి?

జ. ఆధునిక కవిత్వం రాయటానికి ప్రాచీన కవిత్వ అధ్యయనం అత్యవసరం. (తెలుగులో మాత్రం కాదు!) సాహిత్యాధ్యయనం వ్యుత్పత్తిలో ఒక అనివార్య భాగం వ్యుత్పత్తే ప్రతిభని కల్పిస్తుంది. సహజసిద్ధంగా ప్రతిభవున్న చోట మంచి ప్రరోచన కల్గిస్తుంది. ప్రపంచపు ఉభయ భాగాల్లోనూ పూర్వం నుంచి ఈనాటివరకు వచ్చిన కావ్యకోవిద పరంపర వ్యుత్పత్తి కవికి అనివార్యమనే భావించారు. అంటే ఇది మెజారిటీ అభిప్రాయం కూడా.

ప్ర. ఇప్పుడు కవిత్వం రాయటంకన్న ఇలా వుండాలంటూ కవిత్వ లక్షణం చెప్పటం ఎక్కువైపోయింది. ఎవరి లక్షణం వారిదెలా వుంది. మరి మీరు చెప్పే కవిత్వ లక్షణం ఏమిటి?

జ. ఏదైనా ఎక్కువై పోవటానికి కారణం ఈనాడు అనేకరాజకీయ సామాజిక కారణాల మూలంగా విద్యావిహీనత పుంజుకున్న బలమే. అయితే ప్రజాస్వామ్యంలో అన్నీ ఓటింగ్ పద్ధతి ప్రకారమే నిర్ణయమవుతాయి. సాహిత్యం కూడా. ఈ విపరీత పరిస్థితుల్లో ఎవడికివాడే త్రికరణశుద్ధితో కృషిచేసి సత్యాసత్య నిర్ణయం చేసుకోవాలి. నేనింతవరకు చెప్పిన కావ్యమర్మాలనుబట్టి నా లక్షణ మేమిటో గ్రహించుకోమని మనవి.

ప్ర. ఆధునిక వచన కవిత్వానికి మీరేదైనా లక్షణం చెప్పగలరా?

జ. ఆధునిక వచన కవిత్వానికి "వచనత్వం" ఒక్కటే లక్షణం. నా దృష్టికి మరేమీ కనిపించటంలేదు.

ప్ర. ఇప్పుడు "మినీకవిత" లని వస్తున్నాయి. వాటిమీద మీ అభిప్రాయం ఏమిటి?

జ. ఒకప్పుడు మిత్రుడు కుందుర్తి ఆంజనేయులుగారు ఈ మినీ కవితల వ్యాధి తెలుగుకు సోకించిన నేరం నేనే చేశానని ఆరోపించి 'మందే సూర్యుడు' "ఆ క్రిమి" అన్నాడు. నా అభిప్రాయంలో మినీ కవితలు కానీ, వచన కవితలు కానీ, ఛందో కవితలుకానీ - కవితలుగావుంటే చాలని మాత్రమే. వాటి బహిః స్వరూపం చాలా అప్రధానం. ఏది అప్రధానమో దానిమీదనే వీరావేశం పెంచుకుని విర్రవీగటం తెలుగు లక్షణం.

ప్ర. కవికి కల్పించే అధికారం లేదు. ఉన్నదున్నట్లుగా, వాస్తవంగా చెప్పటమే ధర్మమన్నప్పుడు - ఆ చెప్పిన దాన్ని కవిత్వమని ఎందుకనాలి? అప్పుడు వాడు కవి ఎలా ఔతాడు?

జ. కవికి కల్పించే అధికారం నిజంగా లేదు. కవిత్వం నిష్కర్షగా అనుభూతిలోనుంచే పుట్టాలన్నది సిద్ధాంతం. ఈ విషయం కావ్యమర్మాలు పరిశీలించిన మేధావులందరూ చెప్పినదే. కనుక దీని అర్థం - వాస్తవాలను వున్నవి వున్నట్లుగా చెప్పటం అన్నది కాదు. అది వర్తమాన తెలుగు కవుల అవగాహన మాత్రమే!

కవి వాస్తవాలనుంచి వస్తు తత్త్వ స్ఫోరకమైన ఒక మహిమోపేత ఇంద్రజాలాన్ని సృష్టిస్తాడు. ఈ యింద్రజాలం వాస్తవాల సన్నికర్షణచేత జ్వలించిన విస్ఫులింగాల కాంతి మండలం. ఆ విస్ఫులింగాలు - ప్రతీకలు. బింబాలు, అలంకారాలు. ఇది ఒక ద్రష్టృత్వం.

"తల పక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపు కూల్యాంతర
స్థలి నిద్రింపఁగఁజూచి యారెకులుషస్స్నాత ప్రయాతద్విజా
వళి పిండీకృత శాటులన్ సవి తదా వాసంబులంజేర్చ బా
వుల యందున్ వెసడిగ్గు వాని గని నవ్వున్ శాలిగోప్యోఘముల్."

ఈ కృష్ణరాయ కవితలో పొలాల్లో కాలువల మధ్య చల్లగా నిద్రించే బాతువు వాస్తవం. సాధారణ చర్మచక్షువులకు కనిపించే భౌతిక వస్తువు. అంత మాత్రమే చెప్పి వూరుకున్నట్లయితే అది కవిత్వంకాదు; మన వర్తమాన వచన కవులకు మాత్రమే కావచ్చు. కానీ లోకమంతటా అది కవిత్వంకాదు ఆ వాస్తవమైన బాతు పాలేర్లకు బ్రాహ్మణులు స్నానం చేసేటప్పుడు, పిండి, పొలం గట్లమీద పెట్టుకున్న తడివస్త్రపు ముద్దగా కనిపించినట్లూ, వాటిని తీసుకొనిపోయి

బ్రాహ్మణులకు చేయద్దామని పాలేర్లు ముట్టుకోబోగా ఆ బాతులు త్వరున బావుల్లోకి పారిపోవటం - ఇత్యాది వ్యవహారం ఏదైతే కవికి కనిపించిందో ఆ రెండవ భాగం చేతనే కవిత్వం పుడుతుంది కనుక కవిత్వం వాస్తవ, ద్రష్టృత్వ సిద్ధ అవాస్తవ దృశ్య ద్వయ సంయోజనం. ఈ సంయోజన ఏదో అదే అలంకారం. అలంకారంలోనే బింబ ప్రతీకలనే అవయవాలున్నాయి. ఈ సమస్త కావ్య వ్యవహారం చేతనే కావ్య విదులందరూ చెప్పినట్లే Graham Hough కూడా **"Art does not immitate the external world, it expresses the feelings of the artists"** అని చెప్పారు.

ప్ర. కవిత్వంలో కొందరు శిల్పమంటారు - అంటే ఏమిటో ఒక్క ఉదాహరణతో చెప్పగలరా?

జ. కవిత్వంలో మనం శిల్పం అనే దాన్ని యింగ్లీషులో "Form'' అని గానీ, "CRAFT" అనిగానీ అంటారు. కవిత్వపు ఉపరి రూపాన్ని మాత్రమే పరిశీలించి ఆ లక్షణాల్ని వర్ణించేటప్పుడు శిల్పమని సౌకర్యంకోసం వాడవచ్చు. కానీ ఆ చమత్కార జనక ఉపరిస్వరూపం కవిత్వ జన్మతో ముడిపడివున్న వస్తువు. కనక, శిల్పపరిశీలన బహిః పరిశీలన మాత్రమే అవుతుంది. ''రాత్రి పిండారబోసినట్లు వెన్నెల కాస్తోంది" అనే సాధారణ అకవిత్వవాక్యం-కవిత్వంలో-

''రాత్రి నగ్నంగా వెన్నెట్లో స్నానం చేస్తోంది" అన్న రూపాన్ని ధరిస్తుంది. రాత్రి- పండు వెన్నెల అనే వాస్తవాలను అధిగమించి, రాత్రి-నగ్నం-స్నానం చెయ్యటం - ఇత్యాది భౌతికాతీత వ్యవహారం ద్రష్టృత్వ మూలకం. ఇది శబ్దాలతో కవి పన్నుతున్న వ్యూహంకాదు - శిల్పమన్న శబ్దంలో ఇలా బుద్ధి పూర్వక వ్యూహ కల్పన అనే అర్థం వస్తుంది; ఆ అర్థం తప్పు.

ప్ర. ప్రజాకవిత్వమంటే మీ దృష్టిలో ఏమిటి? ఇటీవలి వారిలో ప్రజా కవులుగా మీరెవరినైనా పరిగణిస్తారా? ఎందుకు?

జ. కవులన్న వాళ్ళ నెరుగుదును కానీ ప్రజాకవులనబడే వాళ్ళను ఎరగను. ఈ ప్రశ్నకు సమాధానం 'ప్రజాకవి' బిరుదున్నవాళ్ళు మాత్రమే చెప్పగల్గుతారు. క్షమించండి.

ప్ర. భావ, అభ్యుదయ, విప్లవ కవిత్వాలకోవకు చెందని శ్రీ జాషువా, శ్రీ దువ్వూరివంటివారి స్థానాలేమిటి?

జ. విప్లవం అంటే - విప్లవానికి వర్తమాన సామాజిక వ్యవస్థని ధ్వంసం చెయ్యటం అని అర్థం అయితే - జాషువా, ప్రభృతుల్ని విప్లవ కవులు అనలేం. దువ్వూరి, జాషువాలు భావకవిత్వ మార్గానికి చెందినవారని నా అభిప్రాయం.

ప్ర. 'కృష్ణపక్షం' భావ కవిత్వమైతే - 'గబ్బిలం' ఏమిటి?

జ. కృష్ణపక్షం, గబ్బిలం - రెండూ భావ కవిత్వపు కావ్యాలే. కించిత్ వ్యత్యాసం వున్నంత మాత్రాన ప్రధాన భావ కవిత్వపు ఆ యుగీన స్పర్శని అవి ప్రచ్ఛన్నం చేయలేవు.

ప్ర. ఆధునిక తెలుగు కవిత్వానికి మార్గదర్శకులని చెప్పదగ్గవారు మీ దృష్టిలో వున్నారా? ఉంటే - ఎవరు? ఎందుకు ?

జ. గురజాడ, రాయప్రోలు, శ్రీశ్రీలు - ఆధునిక కవిత్వ మార్గదర్శకు లనటంలో సందేహం లేదు. కారణం నేను వెనక వివరించిన ఆధునిక కాలీన విలువలు, వేషాలు, వాటి విలక్షణత సమగ్రంగా ఈ ముగ్గురు కవుల్లో బహుశ మొదటిసారి సాక్షాత్కరించాయి.

ప్ర. మీ దృష్టిలో, ఆధునిక సాహిత్యంలో వది కాలాలపాటు నిలిచే రచనలేమైనా వున్నాయా ?

A) మీవి ఏమైనా వున్నాయా ?

B) లేవంటే - ఇంత సాహిత్య కృషి వ్యర్థమై పోయిందనుకోటానికి ప్రత్యేకమైన కారణాలున్నాయా ?

జ. అపార్థానికి గురికాకుండా దీనికి సమాధానం చెప్పటం కష్టం. ఏ ఒక్క కవిని గురించి కూడా యీ విషయంమీద తన అభిప్రాయం తెల్పటంకంటె, కవిత్వం మంటే ఏమిటో తుణ్ణమైన జ్ఞానం గడించుకొని, దానితో ఎవడికివాడై అంచనా వేసుకోవటం వివేకపద్ధతి.

A) అదికూడా ఈ పద్ధతి ప్రకారం నిర్ణయించుకోవాలి .

B) సాధారణంగా తెలుగు కవిత్వం, అన్ని భాషల కవిత్వాలతో పోల్చి చూస్తే ఈ ఆధునిక కాలంవరకు - 'కవిత్వం' అన్న పదానికి ఎంతో దూరం పడుతుంది. ఈ వాస్తవ స్థితిని గమనించినప్పుడు, ఇందులో ఎంత నిలుస్తుందో, ఎంత పోతుందో చెప్పటం దుస్సాధ్యం.

ప్ర. మీరు కవిత్వం రాయటం ప్రారంభించిన నాటినుండి నేటివరకు చూస్తే ఎన్నో మార్పులు వచ్చాయి. మీ రిప్పుడే కవిత్వ రచన ప్రారంభించే దశలో వున్నట్లయితే మీరెటువంటి కవిత్వం రాస్తారు ?

జ ఈ ప్రశ్నకి సమాధానం వెనకటి సమాధానాల్లో వెతుక్కోమని మనవి.

ప్ర మీ సాహిత్య జీవితంలో మరపురాని సంఘటనలు ఉంటే చెప్పండి.

జ. నా సాహిత్య జీవితంలో ఘన విజయాలుగాని, మరపురాని సంఘటనలు గాని ఏమీ లేవు.

ప్ర. మీ రచన వెనుకనున్న ప్రభావాలేమిటో చెప్తారా?

జ. నా జీవితంలో నేను అనుభవించిన అన్యాయాలు, పొందిన పరాజయాలు, అవమానాలు నా రచనల వెనుకనున్న ప్రధాన సామగ్రి.

నా కవిత్వమంతా నా కష్ట సుఖాల్లోనించి పుట్టిందే. మా నాన్న గ్రామ మునసబ్‌గా వుండేవాడు. నేను ఆయన నడుముల ఎత్తు బాలుణ్ణిగా వున్నప్పుడు ఆయన చూపుడువ్రేలు నా చేత్తో పుచ్చుకుని, చిన్న నిక్కరు చొక్కా వేసుకున్న నేను తాలూకాఫీసుకు వెళ్ళాను. శిస్తు వసూలు బాగా చేయలేదని మా నాన్నను ఆ తాసీల్దారు మహా ఘోరంగా, ఎంతోసేపు తిట్టాడు. భరించలేక నేను ఏడ్చాను. "Get Out" అన్న తాసీల్దారు అరుపుతో మా నాన్న నన్ను తీసుకుని బయటకివచ్చాడు ఆ దృశ్యం నా జీవయాత్ర ముగిసేవరకు నా కళ్ళలో దేవాలయం కట్టుకుని ప్రతిష్ఠ అయి వుంటుంది. అంత లోతునవుంది నా క్రోధాగ్నికి మూలం; నా ఉగ్రకవితకు పునాది. అప్పటినుంచే ఆఫీసరంటే నిర్దాక్షిణ్యంగా వేటాడి చంపబడవలసిన క్రూర జంతువనే భావం నా చైతన్యంలో ఒక భాగం అయిపోయింది. నేను అధికారానికి శాశ్వత శత్రువుని.

ప్ర. ఈ 30 ఏళ్ళనుండి ప్రభుత్వంగానీ, ప్రభుత్వం ఏర్పాటుచేసిన సంస్థలుగాని వాటి దృష్టిలో ఉత్తమ రచన లనిపించిన వాటికి బహుమతులిస్తున్నాయి.

ఈ విధానం బాగుందా? ఉత్తమ రచన ఎన్నికకు మీరు సూచించే విధానం ఏదైనా వుందా?

జ కేవలం ఆశ్రితులకే అవార్డులు ఇస్తున్నారు - అన్న సంగతి జగద్విదితం. దీనికి ఏ పద్ధతులు అవలంబించినా, చివరికి జరిగేది యిదే కనుక ఆ పద్ధతుల గుణ దోష విమర్శ వర్తమాన తెలుగు సాహిత్యంలో అప్రస్తుతం అవుతుంది.

ప్ర. ఈ క్రింది వ్యక్తుల్ని గురించి మీ అభిప్రాయం ఖచ్చితంగా చెప్పండి.

1. గురజాడ అప్పారావు :

జ. గొప్ప ద్రష్ట. ప్రజాశ్రేయోభిలాషి. గొప్ప సాహిత్య స్రష్ట; కానీ కవిత్వం పాళ్ళు చాలా తక్కువ.

2. దేవులపల్లి కృష్ణశాస్త్రి :

జ. రొమాంటిక్ యుగం దేశంలో రేపిన ఒక సమ్మోహన నాగరికతకి కృష్ణశాస్త్రి ఒక సాహిత్య ప్రతీక.

3. బాలగంగాధర తిలక్ :

జ. తిలక్ నిజమైన కవి. తెలుగు కవులలో, కాలం నోట్లోపడకుండా మిగిలే చంద్రబింబం అనవచ్చు.

4. కుందుర్తి :

జ. అపార కవిత్వ ఉత్సాహం వున్న కర్మిష్ఠి. తెలుగు వచన కవితోద్యమ ప్రవక్త. నిగర్వి. నిరాడంబర జీవి.

5. నారాయణబాబు :

జ. ఆవేదన వున్న అసలైన కవి.

6. డా. సి. నారాయణరెడ్డి :

జ. కావ్యం యశసే, అర్థ కృతే, వ్యవహార విదే-అనే మూడు ముక్కల్లో ఆయన కవిత్వాన్ని అంతటినీ గురించి చెప్పవచ్చు. వర్తమాన రాజకీయ, సామాజిక శక్తుల బలం చేతిలో సాహిత్య శక్తుల బలం ఎలా పరాజితమౌతుందో సూటిగా చెప్పే ప్రతీక ఆయన.

7. పఠాభి :

జ. ఆయనలో కవిత్వ చమత్కారం వుంది; అనుభూతి ఎత్తులు లేవు.

8. డా. దాశరథి :

జ. మనోహర పద్య కవితా శిల్పి. పద్య శిల్ప మయ బ్రహ్మ.

10. శ్రీశ్రీ :

జ. అభ్యుదయ కవితోద్యమం విస్పష్ట రూపురేఖలు పొందటానికి కర్త. కవిగా సామాన్యుడు. వ్యక్తిగా అవకాశవాది. ప్రజల్లో అజ్ఞానం, విద్యావంతుల్లో

అపనీతి కలిసి కల్పించిన సాహిత్య స్థానాన్ని అనుభవిస్తున్న గొప్ప తెలుగు అదృష్టవంతుడు

**11.** కాళోజీ :

జ. తెలంగాణా శ్రీశ్రీ అనడంలో అతిశయోక్తి లేదు.

**12.** గుంటూరు శేషేంద్రశర్మ :

జ. నేను కవిని కాను - కఠోర వ్రతాన్ని. వ్యక్తినికాను - ఉద్యమాన్ని.

**13.** సర్. సి. ఆర్. రెడ్డి :

జ. ఆంధ్ర మహా పురుషులలో ఒకడు - మహా మేధావి.

**14.** పుట్టపర్తి నారాయణచార్యులు :

జ. గొప్ప కవి. గొప్ప విద్వాంసుడు, అన్నిటికంటెమించి మానవత్వం తొణికిసలాడే మహావ్యక్తి.

**15** రాయప్రోలు :

జ. వీరి గొంతు వెయ్యేళ్ళ పారంపరిక వంధాను బ్రద్దలు చేసి, "ప్రసిద్ధాభిధాన వ్యతిరేకిణీ విచిత్రైవాభిదా'' స్వరంతో "వైదగ్ధ్య భంగీ భణితి" తో ఒక నూతన ప్రపంచ ద్వారాలవైపు ఆంధ్రావళిని ఆహ్వానించింది. రాయప్రోలు తొలకరి ఉపమలు తెలుగునేలమీద వెదజల్లిన రాగరాగిణుల్లో తడిసి తెలుగు కవిత్వ భాషా స్వరూపమే మారిపోయింది. ఆయన సృష్టించిన ఇంద్రజాలిక రచనా ప్రపంచం తత్పూర్వం తెలుగులో లేదు. అలాంటి మనోజ్ఞ శబ్ద ప్రయోగ వైఖరి తత్పూర్వ కాలానికి పూర్తిగా అపరిచితం.

తన లేఖినిని ఒక మంత్రదండంలా ప్రయోగించి సాధారణ వ్యవహార భాషని అత్యంత సమ్మోహక సాహిత్య భాషగా ఎలా మార్చాడో చూస్తే, ఈ మహాపురుషుడు వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యం యావత్తూ ఒక పద్మపీఠిక చేసుకుని కూర్చొవున్న సాక్షాత్తు చతుర్ముఖ బ్రహ్మగా దర్శనమిస్తాడు.

ప్ర. భావకవిత్వం, దిగంబర కవిత్వం, అభ్యుదయ కవిత్వం-నేటి రచయిత్రులు-వారి రచనలు, సాహిత్య పోషణలో ప్రచార సాధనాల పాత్ర—

—మీ అభిప్రాయం ఖచ్చితంగా చెప్పండి లేదా విమర్శించండి.

జ. రాయప్రోలు అభినవ కవితాయుగ మహావాహినికి మూలస్రోతస్సుగా ఎక్కడో హిమాలయ శృంగసీమల్లో అమలిన వినీలాకాశాల ఒడిలో మంచు శిలల్లో, పూల భూముల్లో, అరుదైన వాయు కెరటాల్లో, బిలబిల స్రవించే సొన అయిన గంగోత్రి అయితే నండూరి, జాషువా, కృష్ణశాస్త్రి (విశ్వనాథ)లు అందులోనించి పుట్టి, పాయలై పారిన ఉపనదులు. నండూరి, జాషువా లిద్దరూ రాయప్రోలు అనే స్వచ్ఛ శీతల జల స్రోతస్సు తరగల్లో జలకాలాడే రెండు రంగుల చేపలు. ఈ ఇద్దరూ అభినవకవితకు ఆయుర్వేద మహిమనిచ్చిన అశ్వనీ దేవతలు. ఇక విశ్వనాథ మాత్రం శృంగారవీధి, ఆంధ్ర ప్రశస్తి, ఆంధ్ర ఋతువులు అనే రచనల్లో అభినవ కవితాశాఖ కోకిలల్లో ఒక కోకిలగా గొంతెత్తి, మా స్వామి, కుమారాభ్యుదయము ప్రభృతి రచనల ద్వారా క్రమశః రామాయణ కల్పవృక్షము చేరేసరికి - ఆయన భావకవిత్వమనే ఒక మహారమణీయ సృష్టి రాశిని చాపగా చుట్టి మోసుకుపోయి పూర్వకవిత్వాంభోధిలో విసిరి పారేసిన సంహారకర్తగా రౌద్రావతారమూర్తిగా భాసిస్తారు. విశ్వనాథ తర్వాత భావ కవిత్వం లేదు; భస్మమైపోయింది. నేటి రచయిత్రుల రచనలు అశేషప్రజానీకం చదువుతున్నారు. కానీ వాటిలో గుణం అంతగా లేదన్న అప్రథ కూడా వుంది. వాసిరెడ్డి సీతాదేవి నా అభిమాన రచయిత్రి.

ప్ర. ఈ క్రింది రచనల్ని గురించి మీ అభిప్రాయం ఖచ్చితంగా చెప్పండి లేదా విమర్శించండి.

1. ఏకాంత సేవ.

జ. దీనిలో శబ్ద మాధుర్యం వుంది. భావన సుకుమారం.

2. కష్ట కమల.

జ. అపూర్వ శబ్దావళితోపాటు ఒక అపూర్వ భావనా ప్రపంచాన్ని సృష్టించిన కావ్యం.

3. త్వమేవాఽహం.

జ. దీన్ని సాహిత్యంలో కవిత్వ వర్షపుచుక్క పడని కరువు ప్రాంతంగా చెప్పాలి.

ప్ర. మహాప్రస్థానం :—

జ. అభ్యుదయ కవిత్వానికి జెండా.

ప్ర. రామాయణ కల్పవృక్షము :—

జ. కవితా సరస్వతి బహు భంగిమల్లో ముస్తాబు చేసుకుని నర్తించిన నాట్యభూమి.

ప్ర. ఎంకి పాటలు :—

జ. భావ కవిత్వ జగత్తుకు చెందిన కావ్యమాలలో మణిపూస. నండూరి ఎంకి పాటలు లేని భావ కవిత్వం అసమగ్రమై సత్య దారిద్ర్యానికి గురి అవుతుంది.

ప్ర. వజ్రాయుధం :—

జ. అభ్యుదయ సాహిత్యయుగాన్ని శిల్పించిన మహత్తర సాధన సంపత్తిలో ఇది ఒకటి.

8. ముత్యాల సరాలు :

జ. అభ్యుదయ దృక్పథ తేజో మండలం దర్శనమిస్తుంది. కవిత్వపు పాళ్ళు తక్కువ.

9. మండే సూర్యుడు :

జ. నా సుఖదుఃఖాల మేలా; నా అనుభూతుల తిరునాల. కానీ 'నా దేశం-నా ప్రజలు' లోనే నా స్వప్న జగత్తంతా పూర్ణావతారం పొందింది.

10. ఖడ్గ సృష్టి :

జ. ఇందులో ఖడ్గమూ లేదు- సృష్టిలేదు.

11. గుడిసెలు కాలిపోతున్నాయి :

జ. మానవీయ దృక్పథం స్పందిస్తున్న రచన.

ప్ర. వ్యక్తినిబట్టి గాని, ప్రక్రియనుబట్టి గాని ఆధునిక సాహిత్యాన్ని పరిశీలిస్తే అసందిగ్ధంగా వుంది - కాబట్టి దీనికి మీరే ఏమైనా పేరు సూచిస్తారా?

జ. సాహిత్యయుగ విభజన మొదట సాహిత్య కళానుసారంగా చెయ్యబడాలి. రెండవది సాహిత్యంలో సామయికంగా మారే సామాజిక, ఆర్థిక, విలువల ప్రాధాన్యాన్ని విభజన చేసే పద్ధతి, జరిగే చర్చలు, తత్సంబంధమైన

వ్యవహారమంతా ఆర్థిక, సామాజిక, రాజకీయరంగాల్లో కూలంకష పరిశీలనకు చర్చకు వస్తాయి. కనుక సాహిత్య విభజన సందర్భంలో మళ్ళీ అన్య రంగాలకు సంబంధించిన విషయ ప్రాధాన్యాన్ని సాహిత్యరంగం మీద రుద్దటం అంత సమంజసంగా కనిపించదు సామాజిక, ఆర్థిక విలువల మార్పులు సాహిత్యంలో తెచ్చిన కళాత్మక మార్పుల్ని ఆధారం చేసుకుని మాత్రమే సాహిత్య విభజన చేయటం సహేతుకమవుతుంది.

అట్లా చూస్తే తెలుగు సాహిత్యాన్ని చెయ్యవలసిన శాస్త్రీయ విభజన :

1. వాచ్యార్థ ప్రధాన యుగం (నన్నయనుంచి తిరుపతి కవులవరకు)
2. లక్షణార్థ ప్రధాన యుగం (రాయప్రోలు నుంచి కరుణశ్రీవరకు)
3. ద్వితీయ వాచ్యార్థ ప్రధాన యుగం (శ్రీశ్రీనుంచి కుందుర్తి వరకు)
4. ద్వితీయ లక్షణార్థ ప్రధాన యుగం. (శేషేంద్రతో ప్రారంభించి ఇప్పుడు నడుస్తున్న కవిసేన యుగంవరకు)

కానీ స్థూలంగా రాయప్రోలు నుంచి యీనాటివరకు ఆధునిక యుగమనే అనుకోవాలి.

# ఒకడ్ని "కవిగా సామాన్యుడు" అంటే నిందకాదు!

కిన్నెర ఆర్ట్స్ వారు ప్రచురించిన "ఆధునిక కవిత అభిప్రాయ వేదిక" అనే గ్రంథంలో నేను శ్రీశ్రీగారిని నిందించానని కొందరనడం తప్పు.

నా మాటల్లో ఎక్కడా నింద లేదు. ఉన్నది అభిప్రాయం మాత్రమే. ఒకడ్ని "కవిగా సామాన్యుడు" అంటే అతడ్ని నిందించినట్లు కాదు. నింద నేరము. అభిప్రాయము హక్కు.

ఈ దేశపు ప్రజలు, ప్రజలందరికీ కొన్ని ప్రాథమిక హక్కులు ఇస్తూ ఒక రాజ్యాంగ చట్టం చేశారు. అందులో ఎవడి అభిప్రాయం వాడు స్వేచ్ఛగా, నిర్నిరోధంగా, నిర్భయంగా ప్రకటించే హక్కు ఒకటి. ఇది అన్ని నాగరిక సమాజాల్లోనూ. సహజంగా ప్రజలకు లభిస్తున్న హక్కు. ఈనాటి భారతదేశంలో ఈ హక్కును ధిక్కరించి ఒకడ్ని తన అభిప్రాయాన్ని వ్యక్తం చెయ్యనీకుండా అణచివేసే పాశవిక బల ప్రదర్శనా ధోరణులు తలయెత్తడం శుభసూచకం కాదు. అది ఈ దేశపు ప్రజాస్వామ్యానికీ, వాక్ స్వాతంత్ర్యానికీ ప్రమాదం వచ్చిందని సూచిస్తున్న రెడ్ సిగ్నల్. ఈ ధోరణి ముందుకు సాగినట్లయితే, అచిరకాలం లోనే ఈ దేశపు రాజ్యాంగ చట్టాన్ని చింపిపారేసే నియంతృత్వం వస్తుందని మనమంతా భయపడాలి.

వర్తమాన తెలుగు కవుల్ని గురించి చెయ్యబడుతున్న సాహిత్య విమర్శ నూటికి తొంభయిపాళ్ళు, ఒకడ్ని చూసి భయపడో, ఒకడ్ని సంతోషపెట్ట డానికో, లేక తన స్వస్థాన సంరక్షణకో, లేక సంపాదనకో పోగుచేస్తున్న సమ కాలీన సామాజిక, రాజకీయ కశ్మలమేగానీ దాన్ని శాశనచేసే కాంతి కాదు. రాజకీయ సిద్ధాంతాల పేరుకింద వస్తున్నా, వాటి జెండాల నీడలో పెంచబడు తున్నా, సాహిత్య విమర్శకూడా దీనికి భిన్నంగా ఉండడం లేదు; ఉందను కోవడం భ్రాంతి తప్ప వాస్తవం కాదు.

విమర్శకుడు సాహిత్యంలో న్యాయమూర్తి. అతని పాత్ర సమకాలీన సమాజపు అంతరాత్మ! మరి ఇలాంటి పాత్ర నిర్వహణకు ఎంతటి నియమిత మనః ప్రవృత్తి కావాలో తెలుగు ప్రజలు అర్థం చేసుకోవాలి. పైగా అతనికి సాహిత్య శాస్త్రజ్ఞానము, సాహిత్య తత్వవేతృత ఇత్యాది సాధన సంపత్తి కూడా అనివార్యం. ఇంత బలం సేకరించుకుని గానీ, ఒక కవినిగానీ, ఒక కావ్యాన్ని గానీ తూచడానికి ఉపక్రమించ కూడదు.

కవులకు సాహిత్యంలో సాహిత్య స్థానము, చారిత్రక స్థానము అని రెండు స్థానాలు ఉంటాయి. కొందరికి ఏదో ఒకటే వుంటుంది. మరికొందరికి ఏదీ వుండదు. ఈ దృక్కోణంనుంచి, శ్రీశ్రీకి కవిగా సాహిత్యంలో ఏ స్థానముంది? ఆయన మహాప్రస్థానానికి ఏ స్థానముంది? అని నా అభిప్రాయం వెల్లడించాను. కావ్యాన్ని విమర్శించే విమర్శకుడేకాదు. సాధారణ మానవుడుకూడా నిర్భయంగా తన భావాన్ని బయటికి చెప్పాలి. అదే ప్రపంచంలో వుండవలసిన నాగరికత. సాహిత్య ప్రపంచంలో కూడా ఉండవలసిన నాగరికత అదే! త్రికరణ శుద్ధిలేని వాడు మనిషి కావడమే కష్టం. ఇక సాహిత్యంలో విమర్శకుడెట్లా అవుతాడు? నిర్భయంగా చెప్పిన అభిప్రాయాన్ని గురించి జాగ్రత్తగా రాగద్వేషరహితంగా ఆలోచించే నాగరికతనే మనం తెలుగు ప్రజల్లో బలపరచాలని నేను కోరుతున్నాను.

"Let thousand flowers blossom and a million thoughts contend"—

—గుంటూరు శేషేంద్రశర్మ

(ఆంధ్రజ్యోతి, సచిత్ర వారపత్రిక, 19.2.82)

# శేషేంద్ర ప్ర/జ

(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 7-11-86 నుంచి 1-5-87 వరకు)

**ఎన్. దేవదాస్, పులివెందుల**

ప్రశ్న : మీ ఆధునిక మహాభారతంలో "గొరిల్లా" అను పదము చాలా చోట్ల చాలా సందర్భాలలో ప్రస్తావించారు. నాకు సరిగా అర్థము కాలేదు గొరిల్లాకు మీ పరిభాషలో అర్థము తెలియజేయగలరని ప్రార్థన. 'కాదేదీ కవిత కనర్హం' అన్న శ్రీశ్రీ గారి పలుకుల్లోని అక్షర సత్యాలు మీ మహాభారతంలో అక్షరాలా నిరూపించారు. మీరు ప్రస్తావించని ఆ విషయము లేదంటే అతిశయోక్తి కాదు.

జ. గొరిల్లా నా కావ్యంలో మానవ క్రియాశక్తి రూపక ఉగ్ర చైతన్యం. అందులో హింస ఒక భాగం

**కె. శ్రీనివాస్, తెనాలి**

ప్రశ్న : కవిత్వం అంతా సాహిత్యమే. సాహిత్యమంతా కవిత్వం కాదు గదండీ! ఏ సాహిత్యం కవిత్వం అవుతుందో, ఏది కాదో వివరించండి. ఇది కవిత్వం, అది కవిత్వం కాదు అనడానికి మార్గదర్శక సూత్రాలేమైనా వున్నాయా?

జ : సాహిత్యంలో ఎప్పుడూ అంటే ప్రాచీన కాలంలోగానీ అధునాతన కాలంలో గానీ కథామయసాహిత్యం ఎక్కువ, కవితామయ సాహిత్యం తక్కువ. ముఖ్యంగా గమనించవలసింది, కథ, కవిత్వము రెండు విభిన్న ప్రక్రియలు. కథ ఏమిటో అందరూ ఎరుగుదురు. కవిత్వమంటే ఏమిటో చెప్పకపోతే ఎక్కువ మందికి తెలీదు. కవిత్వమంటే ఉపమాద్యలంకారాలు కలిసిన భాష. ఇంకా బాగా చెప్పాలంటే, కవిత్వం అలంకార ప్రధాన భాష. అంటే ఆ భాషలో మంచి అలంకారాన్ని తొలగిస్తే అది కవిత్వంగా వుండడం మానేస్తుంది. ఉదాహరణకు - చంద్రుడు ఆకాశంలోకి ప్రవేశించాడు - హంస నీలోదకాల్లోకి ప్రవేశించినట్లు. ఈ వాక్యంలో రెండు భాగాలున్నాయి. రెండో భాగం వాక్యానికి కవిత్వత నిస్తుంది. అది తీసేస్తే మిగిలే మొదటి భాగం, అంటే చంద్రుడు ఆకాశంలోకి ప్రవేశించాడు అనేది కవిత్వం కాదు. అది మామూలు వచనము కనక కవిత్వాన్ని పోల్చుకోడానికి అలంకారమే గుర్తు.

**సాంధ్యశ్రీ, తెనాలి**

ప్రశ్న : ఛందస్సులు లేని వర్తమాన ఆంధ్ర కవిత్వం కవిత్వాన్ని ప్రాణవంతం చేస్తున్నదా. అభ్యుదయ కవికి ఛందస్సు ఎందుకు వర్జనీయం....? Free Verse ప్రత్యేకత ఏమిటి?

జ : కవిత్వాన్ని ప్రాణవంతం చేసేది కవిత్వమే. ఛందస్సులు కవిత్వానికి దాని అంతస్సత్వాన్ని పెంచి దీర్ఘాయుః ప్రధానం చేస్తుంది - అభ్యుదయ కవికి ఛందస్సు వర్జనీయంకాదని మాయా కోవ్‌స్కీ, పాబ్లోనెరూడా ప్రభృతుల్ని చదివితే తెలుస్తుంది - ఫ్రీవర్సు అంటే స్వేచ్ఛామయ ఛ్ఛందసు. అది మాత్రా ప్రధానంగా వుంటుంది. శార్దూల అలెగ్జాండ్రియన్ అది ఘనవృత్తాలు గణ ప్రధాన ఛ్ఛందస్సులు. అలాంటి వృత్తాల్లో స్వేచ్ఛ లేదు.

**రాయిపల్లిశ్రీ, హైదరాబాదు**

ప్రశ్న : కపటం, గర్వం, ఈర్ష్య కవులకు వుండకూడదు మరి ఈనాటి వారికి అవే ఆభరణాలైనాయి. ఆ గుణాలకు మీరు అతీతులా లేక సమర్థిస్తారా?

జ : మీ ప్రశ్న ఎంత అమాయకంగా కనిపించాలని మీరనుకుంటున్నారో నాకు తెలీదు. కానీ గొంగళిమీద కూర్చుని వెంట్రుకలు లెక్కబెట్టినట్లు మీరున్న దేశంలో, కాలంలో మన మనుష్యుల్లో మీరు సద్గుణాలు వెతుకుతున్నారంటే నమ్మలేరు. "కూరిమిగల దినములలో నేరము లెన్నడును గలుగనేరవు మరి ఆ కూరిమి విరసంబైనను నేరములే దోచుచుండు నిక్కము సుమతీ!"

**సూరి లక్ష్మీనరసింహమూర్తి, వైరా**

ప్రశ్న : శ్రీ విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్షం కళ్యాణఘట్టంలో (సీతారాముల) రెండువైపులా రాజపరిచారకులు (చారికలు?) ఒక అలుకుగడ్డకై పోట్లాడుకొనినారని వ్రాసినారు. దీని ఔచిత్యానౌచిత్యములు తెలుపగోరెదను.

2. భగవద్గీత ప్రథమాధ్యాయంలో 'ద్రుపదో ద్రౌపదేయాశ్చ' వీరందరూ యుద్ధములో వీరులుగా పేర్కొనబడినారు. కాని బమ్మెర పోతనగారి భాగవతం ప్రథమ స్కంధంలో 'భద్రాకారుల పిన్న పాపల రణప్రౌఢ క్రియాహీనులన్' అని వ్రాసినారు. ఈ విరుద్ధ రచనను గురించి తెలుపండి, సమన్వయం చేయండి.

అయ్యా! నరసింహమూర్తిగారూ! ఇది పత్రికలో నడుపుతున్న సాహిత్య వ్యవహారము. మరి మీరడిగిన విషయమా- పెద్ద గ్రంథ పరిశోధన చేసి అద్దంలో పర్వతాన్ని చూపించినట్లు చూపించాలి. తపసా విజిజ్ఞాసస్వ.

**గొ.శ్రీ., హైదరాబాద్**

ప్రశ్న : బహు సులువుగా సినిమా పాటలు వ్రాయవచ్చని ఈనాటి సినీ రచయితలను చూసి నాకు సినిమా రచయిత కావాలని అత్యాశ కలుగుతున్నది. వ్రాసే సత్తా నాలో వుందనిపిస్తుంది. కొనసాగించమంటారా?

జ : మీకు సినిమా రచయిత కావాలన్న "అత్యాశ" వుండడం నేటి కాల ప్రభావానికి మీరు లొంగడమే. దాన్ని ఎదిరించే గట్టి కండరాలు మీ శరీరంలో లేవనుకోవాలి.

(7-11-86 ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక)

**జి. అనంతపద్మనాభయ్య, ధర్మవరం**

ప్రశ్న: నాడు దరిద్ర జీవితము గడుపుతూ కూడా ప్రతిఫలమాశించ కుండా, తన కృతిని ఆ శ్రీరామచంద్రుని(భగవంతునికి)కే అంకితమిచ్చిన పోతనామాత్యుణ్ణి ప్రజలందరూ అభిమానించి గౌరవించిరి. శ్రీనాథుణ్ణి ఆ విధంగా గౌరవించలేకపోయిరి. అయినా ఈ రోజు ప్రజలు తమ కృతు (రచన) లను ప్రతిఫలాపేక్షతో అర్పించుటలోగల అంతర్యమేమి? కాలవైపరీత్యమా? వివరించ గలరు.

జ: అయ్యా! పోతన లాంటి కవులు ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా అతి అరుదుగానే వుంటారు. ఎక్కువమంది కవులు భట్రాజులు. ముఖ్యంగా మన తెలుగులో ఈ జనాభా ఎక్కువ. వాళ్ళకి సాహిత్యం, ఏదో ఒక లాభాన్ని అందుకోడానికి ఒక నిచ్చెన మాత్రమే.

**"శతభిషం", వరంగల్**

ప్రశ్న: శ్రీకృష్ణ దేవరాయలవారి మాతృభాష 'తుళువు' అయినా తెలుగు భాషపై తమకుగల అభిమానంతోనే "దేశ భాషలందు తెలుగు లెస్స'' అని వర్ణించడమే తప్ప శ్రీ రాయలవారు అన్నది కాదని, వారికంటె ముందుగా ఈ నానుడి వ్యాప్తి చెందినదని ప్రముఖ సాహిత్యవేత్త శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అన్నారనే కొందరు సాహిత్యవేత్తల వాదనకు మీ సమాధానం?

2. "తెలుగు వెలుగులు"గా మహనీయులైన వారి విగ్రహాలను ట్యాంక్‌బండ్‌పై ప్రతిష్ఠించుటలో భాగంగా 'వేమన'ను దిగంబరుడిగా చిత్రీకరించే కాంస్య విగ్రహంపై మీ అభిప్రాయం? చారిత్రక ఆధారంగా వేమన దిగంబరు దేనా? కాదా?

జ: ''దేశ భాషలందు తెలుగు లెస్స'' అనే పంక్తి శ్రీకృష్ణదేవరాయలకి ముందు శ్రీనాథుడు తన క్రీడాభిరామంలో చెప్పాడు. ఆ పద్యం- "జనని సంస్కృతంబు సకల భాషలకును / దేశ భాషలందు తెలుగులెస్స / జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద / మెచ్చుటాడు బిడ్డ మేలుగాదె'' - వేమన యోగి. ఆయన దిగంబరుడో కాదో నాకు తెలీదు. నేను ఆయన్ని ఎప్పుడూ చూడలేదు.

**రమేష్, సరస్వతినగర్**

ప్రశ్న: మీ మొట్టమొదటి నవల లేదా కథ పేరు ఏమిటో చెప్పగలరా? ప్రతి కవి ఏదో ఒక జీవితాన్ని లేదా ఒకరి కథను ఆదర్శంగా తీసుకుని వ్రాస్తారు కదా! అయితే మీరు దేన్ని ఆదర్శంగా తీసుకున్నారు?

జ: నా మొదటి కథ "విహ్వాల" సుమారు పాతికేళ్ళ క్రితం అనుకుంటాను ఆంధ్రప్రభ వార పత్రికలో వచ్చింది. దీనికి మరో కథ ఆధారం కాదు. నా జీవితంలో చూచిన సంఘటనల్లో ఒకటి.

**లక్ష్మికొండ, హైదరాబాదు**

ప్రశ్న: వచన కవితను శ్రీశ్రీ, కుందుర్తి, కాళోజీ, శేషేంద్రల్లా వ్రాయాలంటే ప్రాచీన గ్రంథాలు చదవాలా, లేక ఈనాటి కొలతబద్ద చదువు సరిపోదా?

జ: ప్రాచీన సాహిత్య పఠన సాహిత్యమేకాదు, ఆధునిక అన్య భాషా సాహిత్యాల పఠనం కూడా కావాలి. కేవలం సాహిత్యమే కాదు; కొంచెం సైన్సు, కొంచెం చరిత్ర, కొంచెం జాగ్రఫీ, కొంచెం ఎకనామిక్సు, కొంచెం ఫిలాసఫీ - ఇలా ఎన్నో అనేక మానవ విజ్ఞాన సరస్సుల్లో నదుల్లో స్నానం చేసి రావాలి. అప్పుడే కవి అవడానికి కావలసిన కాంతిపుంజం దొరుకుతుంది.

**చందు లక్ష్మిరాజ్యం, చదలవాడ**

ప్రశ్న: మన తెలుగులో 'దు' అనే అక్షరం ఎక్కువగా చెడును సూచిస్తుంది కదా? మరి సన్మానాలు చేసినప్పుడు 'దుశ్శాలువతో సత్కరించారు' అంటారు. అక్కడ 'దు' అనే అక్షరానికి ప్రత్యేక అర్థమేదైనా వుంటుందా? తెలుపగోర్తాము.

ఈ దుశ్శాలువ హిందీ, ఉర్దూల్లో వున్న 'దుషాలా' అనే శబ్దానికి వికృతి. సాధారణంగా కాశ్మీరి శాలుకకు వర్తిస్తుంది. అది కూడా ఖరీదు శాలువకే. దుపట్టా' అనే శబ్దం కూడా ఆ భాషల్లో వుంది. 'వోఢ్ని' అనే శబ్దం కూడా వుంది. అదే తెలుగులో వోణీ అనబడుతోంది.

**ఎస్. ఎ. రహమాన్, రామాపురం**

ప్రశ్న : శ్రీశ్రీ గారికి కమ్యూనిజం తెలియదని ఆరుద్రగారు అనగా విన్నాము. ఆ మహాకవిని మించిన కమ్యూనిస్టా ఈ ఆరుద్ర? మీ అభిప్రాయం తెలుపగలరు.

2. శేషేంద్ర శర్మ - శేషాద్రి శర్మ - ఒకరేనా లేక వేరువేరా?

3. ప్రసిద్ధమైన మీ కావ్యమేదో తెలుపగలరు?

జ: అయ్యా! ఇద్దరు మహాకవుల మధ్య ఇరుక్కున్నవాడు చట్నీ అవక తప్పదు. తమరే ఆ అభిప్రాయ కుస్తీకి పూనుకోండి.

నా పేరు శేషేంద్ర శర్మ - కులసంకేతమైన శర్మ అనే అంత్య ప్రత్యయాన్ని త్యజించి అనేక సంవత్సరాలయింది.

ప్రసిద్ధమయిన నా కావ్యం "ఆధునిక మహాభారతము."

(14.11.86 ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక)

**విశ్వనాథశర్మ, చెముడులంక**

ప్రశ్న : "వ్యాసునివలె వ్రాసినది తుడుచుట చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి కలవాటులేదు" - వివరించండి.

జ : చెళ్ళపిళ్ళవారి ఆశు కవిత అవిచ్ఛిన్న ధారా ప్రవాహమనీ, అనర్గళమనీ ఆ మాట తాత్పర్యమై వుంటుంది.

**ప్రతాప చంద్రశేఖర్, వేములవాడ**

ప్రశ్న : శేషేంద్రగారూ! హృదయం ఆలోచనాంగం కాదు కాదా? మరి- నా హృదయం బ్రద్ధలైందనీ, బాధపడిందనీ, కరిగిపోయిందనీ - ఆలోచించే తత్వాన్ని ఆపాదిస్తామెందుకని?

జ : ప్రాచీన ప్రపంచంలో హృదయం అంటే ఒక శరీర అంగంగా భావింపబడలేదు - ముఖ్యంగా సాహిత్యంలో. హృదయం రసావిర్భావ స్థానంగానే పరిగణింపబడింది. అరిస్టాటిల్ ఇట్లా అన్నాడు: ''హ్యూమన్ బిహేవియర్ ఫ్లోస్ ఫ్రమ్ త్రీ మెయిన్ సోర్సెస్; డిజైర్, ఎమోషన్ అండ్ నాలెడ్జ్ ... డిజైర్ హేజ్ ఇట్స్ సీట్ ఇన్ ది లాయిన్స్, ఎమోషన్ ఇట్స్ సీట్ ఇన్ ది హార్ట్, నాలెడ్జ్ ఇట్స్ సీట్ ఇన్ ది హెడ్.'' ఈ మాటనే తత్తత్కాలీన భాషలో క్యాంటు, ఎమర్సన్లు చెప్పారు. ఇటువైపు మన దేశంలో కూడా అదే భావంతో ''యోర్థోహృదయ సంవాదీ తస్యభావో రసోద్భవః'' అనీ, ''కావ్యే హృదయ సంవాద వశాత్'' అని ఎక్కడెక్కడ హృదయ శబ్ద ప్రయోగం చేశారో అక్కడంతా హృదయాన్ని రసస్థానంగానే భావించారు. ఎంతో విస్తరించి చెప్పవలసిన విషయం ఇది. రసం అంటే ఎమోషనల్ ఐడెంటిటీ - తాదాత్మ్యం.

**తోణ్ణ కూర్మనాథ వరప్రసాద్, శ్రీ కూర్మం**

ప్రశ్న : **బోధాయనుని సూత్రములకు, అపస్తంబుని సూత్రములకు భేదమేమైనా వున్నదా? వీరి కాలం గూర్చి ఎన్నో వాదోపవాదములున్నవి కదా, మీ ఉద్దేశములో వీరి కాలమేది? దయచేసి జ్యోతి పత్రికద్వారా జవాబివ్వండి.**

జ : పేరు బోధాయనుడు కాదు, బౌధాయనుడు; శ్రౌత, గృహ్య, ధర్మ సూత్రాలని సూత్రాలు మూడు విధాలు. వేద ప్రతిపాదిత అఖిల కర్మ ప్రతిపత్తి కోసం బ్రాహ్మణాలు ఉదయిస్తే, బ్రాహ్మణాలను విశదీకరించడానికి సూత్ర గ్రంథాలు పుట్టాయి. పారిభాషిక శబ్దాల్లో ఈ సూత్రాలకే కల్ప సూత్రాలని నామధేయం. శిక్షా వ్యాకరణ ఛందోది వేదాంగాల్లో కల్పసూత్రాలు ఒకటి. ఏయే వేదాలకు ఆయా బ్రాహ్మణాలున్నట్లే, భిన్న వేదాలకు భిన్న సూత్రాలున్నాయి. కృష్ణ యజుర్వేదీయ గృహ్య సూత్రాలు ఏడు లభిస్తున్నాయి. అందులో ప్రప్రథమ సూత్రావళి అపస్తంబ రచితం. మిగిలిన ఆరు హిరణ్యకేశి, బౌధాయన, భరద్వాజ, మానవ, కాఠక, వైఖానస సూత్రాలు. అపస్తంబుడు ధర్మసూత్రాలు కూడా రాశాడు. గృహ్య సూత్రాలు బ్రహ్మ, దేవ, పితృ, భూత, అతిథి యజ్ఞాలనే పంచ యజ్ఞాల్ని వివరిస్తాయి. ధర్మ సూత్రాలు ప్రధానతః బ్రహ్మచారి, గృహస్థ ధర్మాలున్నూ, భోజ్య పదార్థాలు, తపోమార్గాలు నిరూపిస్తాయి; వివాహ, దాయాధికార, దండనియమ ప్రభృతి లౌకిక

విషయాలు కూడా ప్రవచింపబడ్డాయి. ఆపస్తంబుడి ధర్మసూత్రాలకు అత్యంత పూజ్య స్థానం వుంది. 'ఆపస్తంబ సూత్రః యజుశ్శాఖాధ్యాయీ శేషేంద్ర శర్మా అహంభో అభివాదయే' అని ప్రతిదిన సంధ్యావందనంలో చెప్పుకుంటాము.

బౌధాయనుడి కంటే ఆపస్తంబుడు ప్రాచీనుడు. ఆపస్తంబ ధర్మ సూత్రాలు ఆర్షభాషలో వుండడంచేత ఆయన కాలం క్రీ.పూ. నాల్గవ శతాబ్ది అని కొందరి మతం. సూత్ర వాఙ్మయం అత్యంత ప్రాచీనం; ఆ ధారే తర్వాత అనుష్టుప్ శ్లోకాల్లో వచ్చిందనీ, ఆ శ్లోక వాఙ్మయాన్ని స్మృతులన్నారనీ కొందరంటారు. కానీ కొందరు స్మృతి అనే శబ్దం ఈ యావత్తు సూత్ర వాఙ్మయానికీ వర్తిస్తుందని అభిప్రాయపడ్డారు. ఆపస్తంబుడివి సూత్రాలు. మనుస్మృతి కాలం క్రీ.పూ. 1280 అని సర్ విలియం జోన్స్, క్రీ.పూ. 1000 అని షిఌెల్, క్రీ.పూ. 500 అని మోనియర్ విలియమ్స్ అన్నారు. వైద్యనాథ అయ్యర్ తన "మనూస్ ల్యాండ్ అండ్ ట్రేడ్ లాస్'' అనే గ్రంథంలో మనుస్మృతి క్రీ.పూ. 21 వ శతాబ్ది నాటి బాబిలోనియా చక్రవర్తి హమ్మూరాబీ యొక్క శాసనాల ప్రతిక అన్నాడు. ఈ అరణ్య సదృశ పరిశోధన సామగ్రిలో ఆపస్తంబ, బౌధాయనుల కాలం ఎక్కడుందో మీరే వెతుక్కోవాలి. ఇది నిర్ణయాతీత వివాదగ్రస్త విషయం.

**పెన్నా శివరామకృష్ణ, నల్లగొండ**

ప్రశ్న : శేషేంద్రగారూ! మీ కవిత్వంపై బోదిలేర్ ప్రభావం వున్నట్లు కనిపిస్తుంది. మీరేమంటారు?

జ : నిజమే. నా కవిత్వం మీద బోదిలేర్ ప్రభావం వుంది. కానీ నేను సాష్టాంగపూర్వకంగా సరండరయిన కవి వాల్మీకి.

(21-11-86 ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక)

**ముప్పా సాంబశివరావు, వినుకొండ**

ప్రశ్న: శర్మగారూ! సాహిత్యం కూడా తెలిసినట్లు నటించే వనితలను 'బ్లూస్టాకింగ్స్' అని అంటారు కదా! మరి అలా నటించే 'మగవారిని' ఏమని అంటారు?

జ: పర్పుల్ స్టాకింగ్స్ అంటే బాగుంటుందా? ఏమిటో మీ గొడవ, ఇది క్రాస్వర్డ్ పజిల్‌లా ఉంది.... లేక పొడుపుకథ.

**టి. ఉమామహేష్, టి. బి. దామ్**

ప్రశ్న: శ్రమచేసి జీవించే కార్మిక వర్గానికి జరిగే అనుకూల, ప్రతికూల, కర్మలను కర్మ సిద్ధాంతానికి పోల్చి వారు పొందే సంతృప్తి ఏదో నాకు గోచరం కాలేదు.

జ: ఇది సాహిత్య విషయం కాదు. కాకపోయినా ఈనాడు ప్రధానంగా వాడబడే కావ్యవస్తువుకు సంబంధించినది గనక చర్చా యోగ్యం. శ్రమ జీవులు ఒకవేళ కర్మసిద్ధాంతంతో తమ సాఫల్య వైఫల్యాలను అన్వయించుకుని తృప్తి పడితే అది గతానుగతికంగా వస్తున్న అంధ విశ్వాసం చేతనే అవుతుంది. నలభై యాభై ఏళ్ళ కృషి తర్వాత కూడా ఈ దేశంలో వర్గ చైతన్యం పుట్టలేదంటే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. ఆ కృషి జరిగిన అన్య దేశాల్లో ఇంతకాలం పట్టలేదు. కనీసం కొన్ని వర్గాల్లో ఆత్మగౌరవం అన్నా ఉత్పన్నమయింది. ఇక్కడ ఏదీ లేదు!

**ఎం. ఎన్. రాజు, జమిస్తాన్‌పూర్**

ప్రశ్న: 'ఈ శతాబ్దం నాది' అని కంచుకంఠంతో ప్రకటించిన శ్రీశ్రీగారి వ్యాఖ్యపై మీ అభిప్రాయం?

జ శ్రీశ్రీగారి కంచుకంఠాన్ని కాలకంఠం బలపరచాలి మరి.

**షామీర్ బాషా, తనకల్లు**

ప్రశ్న: నేటి సాహితీ రంగంపై మీ అభిప్రాయం విపులంగా వివరించండి.

జ: వర్తమాన సాహిత్య రంగంలో మీరు చూచే దృశ్యాలు అపూర్వమేమీ కాదు. ఈ ఉచ్ఛనీచాలు ఎప్పుడూ అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లోనూ వుండేవే. నిరుత్సాహ కారణాలు కావు.

సాహిత్యం అంటే కథన కళ, కవిత్వ కళ అనే రెండు కళలకు చెందిన సృజనాత్మక రచనా వాఙ్మయం. ప్రపంచ చరిత్రలో అతి ప్రాచీనమని చెప్పబడే సుమేరియన్ నాగరికతలో సాహిత్యం ఒక భాగం అని అభిజ్ఞులు చెపుతున్నారు. సాహిత్యం జన్మ ఎంత ప్రాచీనమో చెప్పలేము.

సాహిత్య కళ ఒక్కటే మనిషిని మార్చే శక్తి వున్న ప్రక్రియ అని మానవ చరిత్ర సూచిస్తుంది.

**పొట్నూడి చక్రరావు, విశాఖపట్నం**

ప్రశ్న: శర్మగారూ! నేటి సినీ సాహిత్యంలో చోటు చేసుకుంటున్న ద్వంద్వార్థ పదాలు వైదొలగి పూర్వపు వైభవాన్ని సంతరించుకుంటుందని ఆశించవచ్చంటారా?

జ: ఆశాభావం ఆరోగ్యదాయకం అంటాను.

**కొత్తపల్లి ఉమామహేశ్వరరావు, గొప్పిలి**

ప్రశ్న: ఏమండీ శర్మగారు! సాహిత్యమంటే ఏంటో మా చెవుల కింపుగా రెండు ముక్కలు వివరిస్తారా? మీ జవాబు కోసం ఎదురు చూస్తుంటాను.

జ: మనిషిలో కరుణ అనే ఒక సంపద వుంది. దాని రూపాంతరమే సానుభూతి. మనిషిలో వున్న సానుభూతిని కొల్లగొట్టే గజదొంగ సాహిత్యం. అది సాహిత్య "కళ". చప్పుడు చేయకుండా మనిషి తీరాల్ని కోస్తూ, మనిషిని వెడల్పు చేస్తూ, మనిషిని సముద్రవోత్సవం చేస్తూ ప్రవహించే ప్రవాహం. అలంకారాలనే పూల పడవల్ని మోస్తూ ప్రయాణం చేస్తుంది.

''నా పాటలు నీ కాళ్ళకు తగిలే సెలయేళ్ళు

చిరు ఉపమలు అందులో చేపలు, తాబేళ్ళు"—

**ఇమ్మడిశెట్టి సోమయ్య, తిమ్మసముద్రం**

ప్రశ్న: సాహిత్యం సినిమాల నాశ్రయించి సగం చచ్చింది. ఇప్పుడు రాజకీయాలలోకి ప్రవేశించి పూర్తిగా చచ్చింది. సాహిత్యానికి పూర్వపు టౌన్నత్యం రావాలంటే గురుతర బాధ్యత ఎవరు వహించవలసివస్తుంది?

జ: సాహిత్యం సినిమాలను, రాజకీయాలను ఆశ్రయించి చచ్చిందనే మీ మాటతో ఏకీభవిస్తాను. కానీ అది తెలుగు సాహిత్యానికి మాత్రమే, వర్తమాన కాలపరిధివరకు వర్తించేమాట. వాస్తవంగా సినిమాలచేత, రాజకీయాలచేత సాహిత్యం దెబ్బతినవలసిన అనివార్య పరిస్థితి ఆ రెంటిలోను లేదు. సమర్థంగా నిర్వహింపబడితే ఆ రెంటిలో సాహిత్యం ఇంకా ఎక్కువగా రాణించే అవకాశం వుంది.

సాహిత్యం ఉన్నతి ఎప్పుడూ సాహిత్యకర్తల నైతికత మీదనే ఆధారపడి వుంటుంది.

(28-11-86 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**ఉప్పిలి రామకృష్ణ, సింహాచలం**

ప్రశ్న: కవిని విమర్శిస్తే పర్వాలేదుగాని. కవిత్వాన్ని విమర్శస్తే సబబు కాదు. అలా విమర్శించడానికి కారణం ఏమిటి?

జ: మీ అభిప్రాయం నాకు సమంజసమని తోచదు. ఎప్పుడూ కావ్యం విమర్శకు విషయం కాగలదు గానీ, కవి కాజాలడు. కారణం, పాఠకుడు చదివేది కావ్యాన్ని గానీ కవిని కాదు. ఏది చదవబడుతుందో అదే కావ్యం. కవి చదవబడడు గనక కావ్యం కాడు. ఫలితాంశం- చదవబడేదే సాహిత్య విమర్శకు విషయం.

**మూర్తి, రామంతపూర్**

ప్రశ్న: మినీ కవితా ఉద్యమం రోజురోజుకూ పెరుగుతోంది. అ పెరుగుదలకు తగ్గట్టు అందులో సాహితీ విలువలు పెరుగుతున్నాయంటారా?

నేటి పరిస్థితుల్లో యువకుడిగా నన్నేం చేయమంటారు?

జ: మినీ కవితా ఉద్యమం రోజు రోజుకూ పెరగడం తెలుగు కవితకు శుభదాయకం. ఆ నాలుగు ముక్కల్లోనే శ్రోతను చమత్కృతిన్ని చెయ్యాలనే అవశ్యకత తెలుగు కవికి బోధపడుతుంది. ఇది తెలుగు కవితలో ఒక బ్రహ్మాండమైన మలుపు. కవిత్వానికి పఠితలు కాదు, శ్రోతలు కావాలి అనే దినం వచ్చింది. శ్రోతలు అయిదారు పేజీల చేంతాటి కవిత్వాన్ని వినే శవాలు కారు అని రుజువవుతుంది. మినీ కవిత్వం దీన్ని సాధిస్తూ వుందనే నా అభిప్రాయం. మీరనే సాహితీ విలువలు ఇందులోనే మిళితమై వున్నాయి.

నేటి పరిస్థితుల్లో యువకుడుగా మీరు వర్గ చైతన్యాన్ని పెంచుకోండి. "అరె-ఈ దేశం మాకేమిచ్చింది? వంకర టింకరగా తిరిగే దేహం, బానిసత్వం మీద వ్యామోహం!" (ఆధునిక మహా భారతం). మన యువత ఈ గులాం మనస్తత్వం నుంచి బయటపడాలి. అవకాశవాదాన్ని ఆంధ్రదేశపు స్పిటూన్ చేయాలి.

**ఎస్. రామప్రసాద్, నెల్లూరు**

ప్రశ్న: ''కవిత్వమొక తీరని దాహం'' అన్నారు తిలక్. దూరంగా వినువీధుల్లో విహరించే అందని అందం అయింది కవితాకన్య శ్రీశ్రీ దృష్టిలో. మహాకవులుగా వాసిగాంచిన వారికే అలా వుంటే, మరి సామాన్యులకు కవిత్వం సొంతం అర్థం అయేదెలా?

జ: ''కవిత్వమొక తీరని దాహం'' అన్నది తిలక్ కాదు, శ్రీశ్రీ. మీప్రశ్న చేత నాకు మృచ్ఛకటిక అనే సంస్కృత నాటకంలో పాత్ర శకారుడు జ్ఞాపకం వచ్చాడు. భయపడి పారిపోతున్న కుంతి రావణుడి వశమైనట్లు, నీవు నా వశ మవుతావంటాడు. మరొకచోట జమదగ్ని పుత్రుడైన భీమసేనుడు అంటాడు. హాస్యరసం కోసం ఈ సంభాషణలు కల్పించాడు నాటకకర్త. కవిత్వం ప్రజా స్వామ్యానికి అర్థం కావాలనడం ఒక నినాదం; అర్థం కావాలని వాంఛించడం ఒక యుటోపియన్ డ్రీమ్.

**జి.వి. శ్యామ్‌సుందర్, కోడుమూరు**

ప్రశ్న: రావణుడు లంకలో సీతాదేవిని బంధించియున్నప్పుడు ఆమెకు ఎలాంటి హానీ కలుగలేదు. కాని అతనిని విలన్‌గా ఎందుకు సృష్టించినట్లు?

జ: వాల్మీకి రావణుడ్ని విలన్‌గా సృష్టించలేదు. రూపవంతుడనీ, విద్వాంసుడనీ వర్ణించాడు. "సమక్ష మివ కందర్పం అపవిద్ధ శరాసనం'' చెరకు విల్లు విడిచిపెట్టి ఎదుటకు వచ్చిన మన్మథుడు.... ''ఏషోఆహితాగ్నిః కర్మసుచ అగ్రవీర్యః వేదాంతః'' అన్నాడు. రావణుడు నిత్యాగ్నిహోత్రి, వైదిక కర్మా చరణలో నిష్ఠాగరిష్ఠుడు, వేదాంత తత్వమార్గానుసారి. కనక రావణుడు సినిమా విలన్ ఎలా అవుతాడు?

**సిహెచ్. రాధాకృష్ణ, పొదిలి**

ప్రశ్న: ''సాహిత్యం" అంటే ఏమిటి? దీని పుట్టుక ఎప్పుడు? (ప్రస్తుత) సమాజంపై 'సాహిత్యం' ప్రభావం ఏమిటి?

జ: అది ముందు కవిత్వంగా ఉండాలి. శ్రోత వింటే చమత్కృతు దయ్యేలా ఉండాలి - ఆ పంక్తిగానీ, ఆ భాషగానీ కవిత్వంగా ఉండడం కవిత్వంలో సాధారణ విషయం. కవిత్వం ఉత్తమ కవిత్వం కావడానికి ఉత్తమ విషయం

చెప్పబడాలి. ఉదాహరణ "హాయ్ ఓ సబ్జా చమన్ కెజిసె! సొయె గుల్ మె సింద్ ఆయిహై" అరె ఆ తోట (ఎంత ఆశ్చర్యం ఆనందం) గులాబీ సీదలో దానికి నిద్ర వచ్చింది! - ఇది సాధారణ కవిత్వం. "దిల్ గయా రౌనఖే హయాత్ గయీ! గమ్ గయా సారీ కాయినాత్ గయీ' - హృదయం పోయిందా, జీవన శోభే పోయింది; బాధ పోయిందా, సమస్త సృష్టే పోయింది. ఇది వట్టి కవిత్వం కాదు, ఉత్తమ కవిత్వం.

(5-12-86 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**మోటమర్రి బేబీకళ్యాణి, తెండమూర్లంక**

ప్ర. 'ముత్యాలముగ్గు' చిత్రంలోని మీ పాట 'నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది'. ఈ పాట వింటూంటే నన్ను నేనే మైమరచిపోతాను. ఇంత మంచి పాట రాయగలిగిన మీరు మళ్ళీ సినిమాలకి రాయటంలేదు. కారణం ఏమిటి? నిజమైన కవిత్వం ఎలా వుండాలి? కవితకు, గేయానికి తేడా ఏమిటి?

జ. తెలుగుదేశ వాతావరణం ఏమిటో మీకు తెలీదా? నన్నెవ్వరూ సినిమాకి పాట రాయమని అడగలేదు, నేను రాయలేదు!

కవిత్వానికి ఉదాహరణ మాత్రమే ఇవ్వగలను. చూడండి:- "వేళ్ళు కాళ్ళయ్ నడిచే చెట్టు మనిషి! చెట్టుగా ఉంటే ఏడాది కొక వసంతమన్నా దక్కేది! మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను!" "జీవించడంలోనే జీవితమంతా ఖర్చుచేసి అలసిపోయాడు! అతడు వర్తమానంలో నుంచి చరిత్రలోకి వలస పోయాడు!"-

కవిత కవిత. గేయం కవిత చెప్పబడే అనేక రూపాల్లో ఒక రూపం.

**అన్నం నాగార్జునరావు, కావలి**

ప్ర రచయితగా జీవించిన కవి శ్రీ గుడిపాటి వెంకటచలంపై మీ అభిప్రాయం ఏమిటి? ఆధునిక తెలుగు కవులలో మీరు మెచ్చేది ఎవర్ని?

జ. శ్రీ గుడిపాటి వెంకటచలం మనలో ఒక మహాపురుషుడు. సూర్య తేజస్సులాంటి ప్రతిభ, పర్వతం లాంటి ధైర్యము, నిర్మలాకాశం లాంటి నీతి - ఈ మూడు ద్రవ్యాలతో చేసిన మూర్తి ఆయనది. ఆయన భావాలతో ఏకీభవించని వాళ్ళు కూడా ఆయన జీవితం ఒక నైతిక ఝంఝూమారుతం అని అంగీకరిస్తారు.

ఆధునిక కవుల్లో నాకు అందరూ కొంత కొంత నచ్చుతారు; నేను మెచ్చుకునేలా చేస్తారు.

**మహాబూబ్ సుభాని, కల్లూరు మండలం**

ప్ర. ఆంధ్ర సాహిత్యలోకానికి 'విప్లవ కవిత్వం' అంటే 'శ్రీశ్రీ'యే స్ఫురిస్తాడు. కాని 'భావకవిత్వం' నుండి విడివడి 'స్వచ్ఛందతావాది'గా స్వేచ్ఛగా 'మహాప్రస్థానం' చేసిన శ్రీశ్రీ కవిత్వం కొంతకాలానికి 'అభ్యుదయ కవిత్వం' గానే ముద్రపడింది. పైగా 'విప్లవం అనే మాట ఎక్కడా కనిపించదు. 1972 ఆ ప్రాంతంలో వచ్చిన 'శేషేంద్రశర్మ' అనగా మీ కవిత్వమే 'విప్లవ కవిత్వ భాష'కు నాంది అయింది కదా! మీకా ప్రతిష్ఠ ఎందుకు దక్కలేదు?

జ. దక్కలేదని మీ అభిప్రాయము; దక్కిందని నా అభిప్రాయము.

**బి. రాజయ్య, నల్లగొండ**

ప్ర. గొప్ప విప్లవ కవిత్వం వ్రాస్తున్న మీరు వి.ర.సం.లో సభ్యులు కాక పోవడానికి కారణమేమిటి?

జ. గొప్ప విప్లవ కవిత్వం రాస్తే విరసంలో సభ్యులు కావాలన్న నిర్బంధం ఎక్కడా లేదు - నన్ను చేర్చుకుంటారేమో ముందు కనుక్కోండి; తర్వాత సంగతి ఆలోచిద్దాం.

**పి. అపర్ణాశర్మ, హైద్రాబాద్**

ప్ర. మీ సాహిత్యంమీద ఏ యూనివర్సిటీలోనైనా ఎవరైనా పరిశోధన చేశారా? లేదా చేస్తున్నారా? మీకు తెలిసిన వివరాలు తెలపండి.

జ. హైదారాబాదు యూనివర్సిటీ, కాకతీయ యూనివర్సిటీ బెంగుళూరు యూనివర్సిటీల్లో చేశారు. వెంకటేశ్వర యూనివర్సిటీలో కూడా చేశారని ఎవరో అన్నారు.

**మక్కువ ప్రసాదరావు, మక్కువ**

ప్ర. మీ దృష్టిలో సాహిత్యాభిమాని గొప్పవాడా? లేక సంగీతాభిమాని గొప్పవాడా?

జ. నా దృష్టిలో ఇద్దరూ గొప్పవారే, ఉభయ కళల తత్త్వం తెలిసిన వివేకవంతులు రెండూ సమానమే అన్నారు గనుక. ఆత్మసాఫల్యానికి రెండు కళలూ సమాన మార్గాలు. వీణా పుస్తకపాణి అన్నారు గదా సరస్వతిని!

**సూధ వల్లభ్ కృష్ణ. ఖరగ్‌పూర్**

ప్ర. ఉత్తమ కవిత్వం అంటే ఎలా వుండాలి? మీరు ఎక్కువగా ఎటువంటి కవిత్వాన్ని ఇష్టపడతారు?

జ. అది ముందు కవిత్వంగా ఉండాలి. శ్రోత వింటే చమత్కృతు దయ్యేలా ఉండాలి-ఆ పంక్తిగానీ, ఆ భాషగానీ కవిత్వంగా ఉండడం కవిత్వంలో సాధారణ విషయం. కవిత్వం ఉత్తమ కవిత్వం కావడానికి ఉత్తమ విషయం చెప్పబడాలి. ఉదాహరణ "హాయ్ ఓ సబ్జాచమన్ కెజిసె! సాయె గుల్ మె నీంద్ ఆయిహై" అరె ఆ తోట (ఎంత ఆశ్చర్యం ఆనందం) గులాబీ నీడలో దానికి నిద్ర వచ్చింది! ఇది సాధారణ కవిత్వం. "దిల్‌గయా రానఖే హయాత్ గయా! గమ్ గయా సారీ కాయినాత్ గయా" హృదయం పోయిందా, జీవన శోభే పోయింది; బాధ పోయిందా, సమస్త సృష్టే పోయింది - ఇది వట్టి కవిత్వం కాదు, ఉత్తమ కవ్విత్వం.

(12 12-86 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**ఎం. రవిప్రసాద్, నందిగామ**

ప్రశ్న : ఆదునిక సాహిత్య ప్రక్రియగా పేరు పొందిన 'ఖండకావ్యం', సాహిత్య ప్రక్రియలో ఒకటిగా పిలువబడుతున్న 'లఘుకావ్యం' - ఈ రెండింటి మధ్యవున్న తేడా ఏమిటి? అనేకమంది పరిశోధకులు రెండు వేరువేరు ప్రక్రియలుగా వీనిని పేర్కొంటూ, తుదకు రెంటిని ఒక ప్రక్రియగా చూపిస్తున్నారు. అది ఎంతవరకు సమంజసం?

జ : మేఘసందేశం లాంటి కావ్యాన్ని ప్రాచీనులు ఖండకావ్యాలనేవారు. ఖండకావ్యం భవేత్ కావ్య స్యైక్య దేశానుసారి చ'' అని సాహిత్య దర్పణం. ఖండకావ్యం రస పర్యవసాయి కాదు. అది భావకావ్యం. కనుకనే తృణకంకణం, కష్టకమల, వనకుమారి ఇత్యాది కావ్యకృతుల్ని భావ కవిత్వం అన్నారు. కొందరు ఖండకావ్యాలని కూడా అనేవారు. పోతే, లఘుకావ్యమేమిటో, మరి. నేనిప్పుడు జ్ఞాపకమున్న విషయాలు చెప్పగలనే గానీ, దీనికోసం గ్రంథశోధన చెయ్యలేను.

**దైవం వెంకట సత్యనారాయణ, నల్లగొండ**

ప్రశ్న : యువ కవులలో మీకు నచ్చినవాళ్ళు ఎవరు?

జ : యువకవులలో నాకు నచ్చినవారు - వై. శ్రీరాములు, వి ఎస్ ఆర్. అవధాని, సుమనశ్రీ, రావు వెంకటరావు, పెన్నా శివరామకృష్ణ, సమద్, వై. రామకృష్ణారావు, ఆచార్య తిరుమల ఇత్యాదులు.

**ఎం. కె వెంకటేశ్, బహరైన్**

ప్రశ్న : భావ కవితలో వ్యాకరణం వుంటుందా? కవి కావాలంటే ఏమి చేయాలి?

జ : భావ కవితలో వ్యాకరణం ఉంటుంది. కవితకీ వ్యాకరణానికీ సంబంధం లేదు. వ్యాకరణం భాషా సంబంధమైన విషయం. కవిత్వాన్ని అభివ్యక్తం చెయ్యడానికి భాష అనివార్యమైన ఆధారం. కవిత్వాభివ్యక్తి వేగంలో భాష ఒక్కొక్క తరుణంలో భాషా నియమాల్ని మరచిపోతుంది. కానీ అలాంటి కవిత్వ భాష కూడా అందంగా ఉంటుంది.

కవి కావాలంటే ఏం చెయ్యాలి అని రిల్కే అనే జర్మన్ కవి జర్మనీ నుంచి ప్యారిస్‌కు సాహిత్య యాత్రచేసి ప్రసిద్ధ శిల్పి రోదేని అడిగాడట. ఆయన రిల్కేని రోజూ జార్డే ది ప్లాంతే అనే పార్కులో ఏదో ఒక మృగాన్ని ఏకాగ్ర ధ్యానంతో చూస్తూ కూర్చో, కవిత్వం వస్తుందన్నాడట!

**సుదర్శన్, చిత్తూరు**

ప్ర : మీరు వ్రాసేది విప్లవ కవిత్వం. విశ్వనాథగారేమో సంప్రదాయ వాది. కవిసమ్రాట్ గారు మీకు గురుతుల్యులని చెప్పుకున్నారు. వారు మిమ్మల్ని ఏ విధంగా ప్రభావితుల్ని చేశారు?

జ : విశ్వనాథ కళాత్మకతకు రక్త మాంసాకృతి. ఆయన నైతికత ఒక అయస్కాంత సీమ. ఆయన తెలుగు సాహిత్యంలో గాంధీ మహాత్ముడు. ఆయన కథన కళా చక్రవర్తి. హిమాలయాల్లో పెరిగే దేవదారువు ఎత్తువాడు. ప్రపంచ సాహిత్యంలో టాల్‌స్టాయిని, భారతీయ సాహిత్యంలో శరత్తును అనేక చోట్ల మించిపోయాడు. ఆయన తన సాహిత్యంలో ప్రతిపాదించిన సామాజిక విలువలతో నేను ఏకీభవించను. వస్తువుతో ఏకీభవించని పాఠకుడు కావ్యాన్ని

ఎలా ఆనందిస్తాడు అనే ఒక ప్రసిద్ధ ప్రశ్న వుంది. సాహిత్యంలో దాన్ని టి. ఎస్. ఇలియట్ ప్రభృతి ప్రముఖ కావ్య తత్త్వవేత్తలు చర్చించారు. దాంతో కావ్యం 'డివైన్ కామెడీ'ని ఆనందించడానికి అందులో అవలంబింపబడిన టాలెమీ సిద్ధాంతాల మీద విశ్వాసం వుండనక్కరలేదని ఆయన చెప్పాడు. యూనిటీస్ అఫ్ టైం, ప్లేస్, అక్షన్ అనే విషయాన్ని గురించి చర్చించే సందర్భంలోనూ, కావ్యమయ భాష అలంకార భాషను చర్చించే సందర్భంలోనూ పాశ్చాత్య విమర్శకులు, అందులోను సుప్రసిద్ధుడు కోలెరిడ్జి ''టెంపొరరీ సస్పెన్షన్ ఆఫ్ డిస్బిలీఫ్'' అనే ఒక సిద్ధాంతం ప్రతిపాదించాడు దాన్నే ఆయనే నెగటివ్ ఫెయిత్ అని, పొయెటిక్ ఫెయిత్ అని అన్నాడు. దాని ప్రకారం ఒక కావ్యం చదివేముందు పాఠకుడికి అందులో చెప్పిన విషయాలమీదా, సిద్ధాంతాల మీదా విశ్వాసం వుండనక్కరలేదు. తాత్కాలికంగా అంటే కావ్యం చదువుతున్నంతసేపు వస్తువుకు సంబంధించిన ఆ విషయాన్ని పక్కకుపెట్టి, మనస్సు నుంచి తొలగించి, కావ్యాస్వాదన చేయాలి అని దాని తాత్పర్యం. ఈ మాట లోకానుభవసిద్ధం కూడా. పోతే - ఒక మనిషిని మరొక మనిషి ప్రేమించాలంటే ఉభయుల మధ్య సంపూర్ణ ఏకీభవత్వం వుండాలన్న నిర్బంధం లేదు. తండ్రీ కొడుకులు చాలా ముఖ్య విషయాల్లో ముఖాముఖి చూచుకోలేకపోవచ్చు. అందుచేత ఒకరి నొకరు ప్రేమించుకోకుండా వుండలేరు.

అన్నిటికంటే ముఖ్యమైన ప్రశ్న నేనొకటి వేస్తాను- శ్రీ కుందుర్తి అభ్యుదయ కవి. ఆయన విశ్వనాథ వారిని తన గురువని చెప్పుకోవడమే గాక ఆయనమీద తన కావ్యాల్లో గురుభక్తి ప్రకటిస్తూ పద్యాలు కూడా రాశాడు. అసలు శ్రీశ్రీగారే విశ్వనాథ శిష్యుడ్నని చెప్పుకున్నారు. ఏమంటారు?

**టి. రేణుకాదేవి, భువనగిరి**

ప్రశ్న : మా క్లాసులో ఒక ముస్లిం స్టూడెంట్ 'మనుచరిత్ర' గురించి ఒక విధంగా చెప్పాలంటే పూర్తిగా సెక్స్! అటువంటి వాటిని నిషేధించాలి అని ఒక ఉపన్యాస సందర్భంలో అన్నాడు. మనుచరిత్ర గురించి వివరించరూ? నాకు ఆ మాటలు బాధను కలిగించాయి. సమాధానం ఇవ్వండి ప్లీజ్....!

జ : సెక్సును కావ్యంలో వాడడానికి సంబంధించిన విధానాన్ని బట్టి, దాన్ని నిషేధించాలా అక్కర్లేదా అనే విషయం నిర్ణయించాలి సెక్సును అశ్లీల స్ఫోరకంగా అనాగరక రూపంలో ప్రయోగిస్తే అది సమాజంమీద, సమాజ పురోగమనం మీద జరిపే హింసాత్మక చర్య అవుతుంది. సెక్సును ప్రేమ రూపంలో కోమలంగా వాడితే అది కళాత్మకతకు దోహదం చేస్తుంది. అయితే ఆశ్చర్యం! ఉత్తరాది భాషా సాహిత్యాల్లో సెక్సు ప్రేమ భావరూపంలో నాజూకుగా కనిపిస్తే, మన ప్రాచీన తెలుగు కావ్యాల్లో మోటు సరసంగా ముతక లైంగిక వర్ణనలు విస్తారంగా కనిపిస్తాయి. హరివంశంలో నారదమహర్షి శ్రీకృష్ణుడి అంతఃపురంలోకి సరాసరి వెడతాడు! అష్టమహిషుల సమేతంగా వున్న శ్రీకృష్ణుడ్ని వాళ్ళ సమక్షంలో "గోపాలీ కుచపీడనంబున కదుంక్రూరత్వముంజెంది పెంపేపారెం గద పద్మ హీదనిటి" అని పొగుడుతాడు! అయితే భారతీయ సాహిత్యంలో రీతి మార్గానికి, భక్తివాఙ్మయంలో బూతు మార్గానికి ప్రారంభోత్సవం చేసిన జయదేవుడు గీతగోవిందంలో "గోపీపీన పయోధర మర్దన" అని వ్రాశాడు; అలాంటి పంక్తులు ఆయనలో కోకొల్లలు. కావ్యారంభంలోనే ప్రకటించాడు - "శ్రీవాసుదేవ రతికేళి కథా సమేతం! ఏవం కరోతి జయదేవ కవిః ప్రబంధం" అని. దాన్నే తెలుగు అన్నమాచారి, క్షేత్రయ్యాదులు అవలంబించారు. కుమారసంభవ ప్రారంభంలోనే జగన్మాత పార్వతిని పచ్చిగా అంగాంగ వర్ణన చేశాడు కాళిదాసు! ఆమె కుచముల మధ్య "మృణాళసూత్రాంతర మప్య లభ్యం" తామరతూడు తుంచితే వచ్చే దృశ్యా దృశ్యమైన నార పోచకు కూడా చోటులేదన్నాడు కాళిదాసు! ఈ వర్ణనంతా అనౌచిత్యానికి ఉదాహరణ అని క్షేమేంద్రుడనే కావ్యశాస్త్ర కర్త చెప్పాడు. ఇది వివాద భోజనానికి చాలా పసందైన విషయం.

(19-12-86 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**తంగిరాల, వాడి**

ప్రశ్న : ఆ మధ్య మీరు మాట్లాడుతూ "నేనింక కవిత్వం రాయను, నవలలు రాస్తాను" అన్నారు. ఈ నిర్ణయం తీసుకుందుకు కారణం ఏమిటి? కవిత్వానికి సరియైన రెస్పాన్స్ లేదనా? మీకు కవిగా గొప్ప పేరుంది కదా?

జ : నేను నవల రాస్తాననే కాదు, రాస్తున్నాను, దానికి కావలసిన సామగ్రి సేకరించాను ఇటీవలకాగితాలు సర్దుతూవుంటే అది బయటపడింది. ఇలాగే1956లో ఒక స్నేహితుడికి చెప్పాను. ఇలా ఎందరికో ఎన్నో సంవత్సరాల్నించీ చెపుతున్నానని ఇప్పుడు నా కర్థమవుతోంది. బహుశా 'పూర్వజన్మ'లో నేను నావలిస్టు నేమో - నా కవిత్వానికి రెస్పాన్సు లేదని నేను కవిత్వం ఆపడం లేదనే సంగతి అందరి కంటే మీకే స్పష్టంగా తెలిసి వుంటుంది. బ్రహ్మాండమైన రెస్పాన్సు వుందని స్పష్టంగా బోలెడు దాఖలాలున్నాయి ఎందరో అనుసరిస్తున్నారు కేవల కవిత్వం కాదు, ప్రభావశాలి కవిత్వం అని రుజువయింది. ఇక ఎందుకు విడిచి పెడుతున్నా నంటే, నా కవిత్వ ప్రభావం పెరిగే కొద్దీ నా మీద కర్తృత్వం పెరుగుతోంది. నా తప్పు కవిత్వం రాయడం తప్ప మరేమీ లేదు. ఇదొకటి. రెండు - మనిషి అయినవాడు ఒక సమంజసమైన బిందు స్థానం చేరిన తరువాత విరమణ చెందాలి. దీని భాష్యం ఈ స్టైటిక్‌గా ఎంతయినా చెప్పుకోవచ్చు.

**రేలంగి శ్రీనివాసరావు, దొంతుకుర్రు**

ప్రశ్న : మీ మొదటి రచన ఏమిటి? అది ఏ పత్రికలో ఎప్పుడు ప్రచురితమైంది? అప్పుడు మీరు పొందిన అనుభూతి ఏమిటి? మీరు మీ గజల్స్, కవితల ద్వారా ప్రజలకు ఏమి తెలియజేయాలనుకుంటున్నారు? గజల్ అనేది ఎప్పుడు పుట్టింది? మొదటి గజల్‌ను వ్రాసిన ఘనత ఎవరిది?

జ : నా మొదటి రచన ''ఈ ప్రపంచంలో ఎక్కడున్నా సరే'' అనే ఒక పాట. అది బహుశ 'క్షేమేంద్ర' లేక 'అశ్విని' అనే వాటిలో ఏదో ఒక కలం పేరుతో విశాలాంధ్ర (దైనిక)లో దాని తొలిరోజుల్లో ప్రింటయింది, నా అనుభూతి, నన్ను నేను ప్రింటులో చూచుకున్న థ్రిల్.

నేను 'గజల్స్' రాయలేదు కవితలు రాశాను. నా దేశంలో నా ప్రజలు నా జీవితానుభూతి ఏమిటో, నా సుఖ దుఃఖాలేమిటో, నా స్వప్నాలేమిటో నా కవితల ద్వారా అభివ్యక్తం చేయబడుతున్నాయి.

గజల్‌కు హిందూస్తాన్‌లో ఆదికవి కులీకుతుబ్‌షా. ప్రాచీన హిందీ తెలుగు మరాఠీ గుజరాతీల మిశ్రమ మయిన దక్కనీ ఆయన భాష. 15వ శతాబ్దము వాడు. అక్బర్ సమకాలికుడు. హైదరాబాదు నగర నిర్మాత.

**జఫరుల్లాఖాన్, జంగారెడ్డిగూడెం**

ప్రశ్న : పూర్వపు కవులు రచించిన పద్య రచనలను వారు రచించిన గద్య రచనల కంటే ఎక్కువగా ఆదరిస్తారు ఈనాటి ప్రజలు. కారణం ఏమిటి?

జ : ఇందులో ఒక మహా రహస్య ముంది. లయబద్ధమైన రచనలే లయ రహిత రచనల కంటే బలీయమైన ఆకర్షణ కలిగినవని రుజువవుతోంది. మన ప్రాచీనుల గద్యంలో కూడా అక్కడక్కడా లయాన్విత పంక్తులున్నాయి. అయినప్పటికీ అది చాలదని ప్రజాఘోష ఇది మానవ స్వభావనిష్ఠమైన లక్షణము.

**హుస్సేన్ చైతన్య, మధిర**

ప్రశ్న : నేను మీ సాహిత్యాభిమానిని. ''నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది'' మరి ఆ తర్వాత ఎదురుచూచే నాకు మరో పాటైనా వినిపించలేదెందుకో సెలవిస్తారా?

జ : అయ్యా, నేను కవిని. నా చేత ఒక పాట రాయిస్తారా అని భిక్షాటన చేసే విదూషకుణ్ని కాదు. తెలుగుదేశ వాతావరణ మేమిటో దయచేసి ఒకసారి ఆలోచించండి. సాహిత్యంలో కూడా ఇంచుమించు అలాంటి చిక్కులే ఎదుర్కొంటున్నాము.

**ఈదుపల్లి వెంకటేశ్వరరావు, ఏలూరు**

ప్రశ్న : కొద్దిరోజుల క్రితం కృష్ణాపత్రికలో మీరు వాల్మీకి కవితా సౌందర్యాన్ని సమీక్షిస్తూ ఒకటిరెండు వ్యాసాలు వ్రాశారు. ఎందుచేతనో ఆ పత్రిక ఆగిపోయింది. దానితోపాటు మీ వ్యాసాలు కూడా ఆగిపోయాయి తిరిగి మీ వ్యాసాలు కొనసాగించకూడదూ మరెక్కడైనా? మాలాంటి వాళ్ళం మీ వ్యాఖ్యాన ముకురం ద్వారా నైనా వాల్మీకి కవితాగిరి శిఖర సౌందర్యాన్ని దర్శించి ధన్యుల మవుతాం.

జ : వెంకటేశ్వరరావుగారూ! నాకేమో రాద్దామనే వుంటుంది. అది ప్రింటు గాని పక్షంలో ఎంత వ్యర్థ ప్రయాస అని మనస్సు విరక్తి పొందుతుంది.

**పాలోజు జ్యోతి, కొత్తగూడెం**

ప్రశ్న : శేషేంద్రగారూ! ''o'' (సున్న) అంటే ఏమిటో వివరంగా మాకు చెబుతారా?

జ : చెపుతాను. సున్నలోనుంచే గదా ఈ సమస్తం పుట్టింది? ''పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే'' అంటోంది ఉపనిషత్తు.

**కె. భవాని ప్రసాద్, తెనాలి**

ప్ర. 'అప్పకవీయం' అంటే ఏమిటి? అప్పకవీయం చేత లేనివారికి లిక్కన పద్యాలలోని యతిస్థానం కాన్పింపదని ఒక సాహిత్య విమర్శలో చదివాను. దీని గురించి తెలుపండి.

జ. ఆదికవి నన్నయభట్టు సంస్కృతంలో రాసిన ఆంధ్ర శబ్ద చింతామణి అనే ప్రథమ తెలుగు వ్యాకరణానికి అప్పకవీయం మొదటి వ్యాఖ్యానం అప్పకవి గ్రంథకర్త నామధేయం. ఇది ఐదు ఆశ్వాసాల గ్రంథం. భాషా, వర్ణ, వళిప్రాస, పద్య, సంధి, తత్సమ, దేశ్య, క్రియ అనే ఎనిమిది మూల గ్రంథ పరిచ్ఛేదాల్లో సంధి పరిచ్ఛేదం వరకే అప్పకవి వ్యాఖ్యానం చేశాడు. కనక అసంపూర్ణ రచన. పెద్దవయిన తృతీయ చతుర్థాశ్వాసాల్లో విస్తృత ఛందో విషయ చర్చ జరిగింది. "సాధ్యోహి రసో యథాతథం కవిభిః" అనే సూత్ర వివరణ క్రింద విభావానుభవాది రస చర్చ, నాయికా నాయక భేదాలు, కవి లక్షణము, కవి భేదాలు ఇత్యాది కావ్య విషయ చర్చ జరిగింది. తెలుగు సాహిత్యానికి వుపయోగించని ప్రాకృత వ్యాకరణాల ప్రసక్తి; శౌరసేని, మాగధి, పైశాచి మొదలైన ప్రాకృత భాషల ప్రయోగ విధానం, ఇత్యాది విషయాలు కూడా చెప్పాడు. మూలగ్రంథాతిక్రమణ ఎక్కువగా జరగడంచేత దానితోపాటు ఛందో విషయ చర్చ అతి మాత్రంగా జరగడం చేత అప్పకవీయానికి ఎక్కువగా ఛందో గ్రంథం అనే అపప్రథ వచ్చింది.

**మువ్వా ప్రభాకర్, ఎల్లాయపాలెం**

ప్ర. అనంతమైన విశ్వంలో అతి విచిత్రమైనది, ఆశ్చర్యకరమైనది ఏది?

జ. మొదట మనిషి, తర్వాత సృష్టి. అలెక్సీ కారల్ అనే ఒక (డాక్టర్) రచయిత అంటాడు: "వెన్ యు ఎంటర్ ఇంటుది ఎనాటమీ అఫ్ మ్యాన్, ఇటీజ్ ఎ ఫారెస్ట్ హూజ్ వేస్ అర్ మిస్టీరియస్ ఎండ్ కన్ఫౌడింగ్." మనిషి శరీర నిర్మాణంలోకి ప్రవేశిస్తే అదొక అరణ్యం. దాని మార్గాలు రహస్య మయము, భ్రాంతి క్లేశకరము. నిజమే. సృష్టిలో నుంచి పుట్టి సృష్టిలో ఒక భాగమైన మానవుడు సృష్టి రహస్యం అన్వేషించడం, కొడుకు తండ్రి భుజం

ఎక్కి కూర్చోవడం లాంటిది. మానవుడి నిర్మాణము, మానవుడు జ్ఞానార్జన చేయడానికి అతడిలో వున్న అద్భుత యంత్రజాలము, మానవ కార్యకలాపాలు సరోవరి ఆశ్చర్య జనకం కాకపోతే మరేమిటి?

ఇందులో మీ యక్షప్రశ్నకు జవాబు దొరికిందో లేదో!

**డి. ఆర్. ప్రసాద్, కావలి**

ప్ర. సమాజమునకు స్త్రీల సాహిత్యం ప్రయోజనకరంగా వుందా? లేక పురుషుల సాహిత్యం ప్రయోజనకరంగా వుందా? నిస్వార్థంగా తెలుపరూ?

జ. కొందరు స్త్రీల సాహిత్యం, కొందరు పురుషుల సాహిత్యం ప్రయోజనకరంగా ఉంది. అసలు సాహిత్య సృజనలో స్త్రీ పురుష బేధం లేదు. స్త్రీ రచయితలు, పురుష రచయితలు అనే విభాగం - దిగంబర కవులు, భావ కవులు, అభ్యుదయ కవులు ఈ రకంగా విభజన చేసుకునేటప్పుడు వాళ్ళ ఉద్దేశం అంతరాంతరాల్లో ఎలా కీర్తిలాభము మాత్రమేనో, ఈ స్త్రీ పురుష విభజన కూడా అలాంటిదే. ఈనాడే కాదు, ఏనాడో రాజశేఖరుడనే సుప్రసిద్ధ కావ్యశాస్త్రకర్త ఇలా అన్నాడు - 'పురుషవత్ యోషితోపి కవీభవేయుః సంస్కారోహ్యాత్మని సమవైతి,నస్త్రైణం పౌరుషం వావిభాగ మపేక్షతే" (కావ్యమీమాంస)

**కాంతి, కాకినాడ**

ప్ర. ఆంధ్ర సాహిత్యాన్ని ఆమూలాగ్రముగా తెలుసుకోవాలంటే ఏ భాష నేర్చుకోవలసి వుంటుంది. ఇంగ్లిషా, సంస్కృతమా? ఆధునికాంధ్ర కవిత్వంలోని సింబాలిజమ్‌కు, కాళిదాసు ఉపమాలంకారమునకు తేడా ఏమిటి?

జ. ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని అవగాహన చేసుకుంటూ ఆస్వాదించాలంటే పితృవాక్యం లాంటి సంస్కృత భాష అవసరం. ఆధునికాంధ్ర సాహిత్య అంకురాన్ని జలదానం చేసి జాగృతం చెయ్యాలంటే మాతృవాక్కులాంటి ఇంగ్లీషు భాష అవసరం.

అలంకారం రెండు వస్తువుల యొక్క రెండు చిత్రాల సంయోగం. "ప్రజగామ నభశ్చంద్రః/హంసోనీల మివోదకం" ఆకాశంలోకి చంద్రుడు ప్రవేశించాడు, హంస నీలోదకాల్లోకి ప్రవేశించినట్టు. చంద్రుడు - ఆకాశం అనేది

మొదటి దృశ్యం, ఎవడో ప్రత్యక్షంగా చూస్తున్నది; కనుక అది ప్రత్యక్షము. హంస నీలోదకాల్లోకి ప్రవేశించడం, చూచేవాడి ఎదుటలేని దృశ్యం. కనుక అది పరోక్షం. పరోక్షం ప్రత్యక్షంతో సంయోగం పొందినప్పుడే కవిత్వ శ్రోత చమత్కృతుడవుతున్నాడు. కనక చమత్కార కారణం పరోక్షం. ఈ పరోక్ష సాక్షాత్కారమే కవి దర్శనము. ఇది ఉపమాలంకారంలో ఉన్న రహస్యం. సింబల్‌లో రెండు దృశ్యాలుండవు. పరోక్ష దృశ్యమే చెప్పబడుతుంది. అది ప్రత్యక్ష దృశ్య స్ఫోరకమవుతుంది. ఇది గ్రంథాలు గ్రంథాలే రాయమని బలాత్కరించే చర్చా వస్తువు. దాన్నంతా ఒక ఏకుల బుట్టలో పెట్టమంటే నా వల్ల కాదు. ఆర్చిబాల్డ్ మెక్లీష్ అనే ఒక విఖ్యాత కావ్యతత్త్వవేత్త ప్రతీక, అలంకారాల భేదాన్ని గురించి ఇలా అన్నాడు: "సింబల్ ఈజ్ కప్లింగ్ అఫ్ ఇమేజెస్. బట్ ది రిలేషన్‌షిప్ అఫ్ ఇమేజెస్ ఈస్ వన్ అఫ్ కాంగ్రుయిటీ, దటీజ్ పార్టేకింగ్ ఇన్ రియాలిటీ, దటీజ్ వన్ మేకింగ్ ది అదర్ ఇంటిలిజిబుల్. సో ఇన్ ఎ సింబల్ వన్ థింక్స్ అఫ్ ఓన్లీ వన్ ఇమేజ్, బట్ నాట్ టు, దో దేర్ ఆర్ టు. మెటఫర్ ఈజ్ కప్లింగ్ అఫ్ టు ఇమేజెస్ వేర్ దెయిర్ రిలేషన్‌షిప్ ఈజ్ ఇన్‌కాంగ్రుయస్, వేర్ దేరీజ్ నో పార్టేకింగ్ ఇన్ రియాలిటీ, బట్ పర్‌సీవింగ్ సిమిలారిటీ ఇన్ డిస్ సిమిలారిటీస్ ఎలోన్, ఎక్జిస్ట్స్." మీరు ఈ విషయానికి సంబంధించిన గ్రంధాలు చదవండి.

**మారగాని కొండల్రావ్ గౌడ్, ఖమ్మం**

ప్ర. శేషేంద్రశర్మగారూ! కవిత్వానికి, సాహిత్యానికి గల తేడా ఏమిటి? ఏ దేశ కవిత్వమైనా, సాహిత్యమైనా ఆ దేశ నడవడికమీద ఆధారపడి మారుతుందా? కవుల నుంచి వాటిల్లో మార్పు వస్తుందా?

జ. నవల, నాటకము, కథ, కవిత్వము ఇత్యాది సృజనాత్మక వాఙ్మయ ప్రక్రియలన్నిటికీ ఉమ్మడిగా వర్తించే మాట సాహిత్యం. అలాంటి సాహిత్యంలో ఒక ప్రక్రియా విశేషం కవిత్వం. ఏ భాషలోనైనా కవిత్వం ఒకటే విశ్వజనీన ప్రక్రియ- ఆహారము, వేషభాషలు, గ్రామాలు, పట్టణాలు ఇత్యాదుల్లా. ఆర్చిబాల్డ్ మెక్లీష ఒక గొప్ప మాట చెప్పాడు: "ఎ పొయెం ఈజ్ ఎ పొయెం ఇన్ ఎనీ

లాంగ్వేజ్" - ఏ భాషలోనైనా పొయెం పొయమే. అయితే భాష మారగానే మట్టి మారుతుంది, పక్షి మారుతుంది, నది మారుతుంది, చెట్టు మారుతుంది, వాయువులు మారుతాయి, ఆకాశాలు మారుతాయి. మనిషి సుఖ దుఃఖాలు, కథలు, గాథలు, పురాణాలు, చరిత్ర, భూత భవిష్యద్వర్తమానాలు ఇత్యాదులన్నీ మారుతాయి. మారుతాయంటే పరిపూర్ణ భిన్నత వస్తుందనిమాత్రం కాదు. వాటన్నిటిలో నీ భాష, నీ మట్టి, పక్షి, నీ నది వగైరాల్లో లేని ఒక విశేషం వుంటుంది. ఆ రుచి విశేషాన్ని ఆ పరిమళ విశేషాన్ని ఆ రంగు విశేషాన్ని, ఆ ప్రాంతపు సజీవ చిత్రాన్ని మోసుకొస్తుంది ఆ మట్టిలో పుట్టిన కావ్యాలంకారం. కవులు మట్టికి ఆధీనులు....

(2.1.87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**పి. సురేష్‌బాబు, గౌహతి**

ప్రశ్న: 'మహాకవి' స్థానానికి జరిగే పోటీలో మీరున్నట్టు వింటున్నాను. నిజమా? వాగ్దేవు చిన వీరభద్రుడుగారిని పిల్లలమర్రి పిన వీరభద్రుడుతో ఎందుకు పోల్చారు?

జ: మహాకవి స్థానానికి పోటీ ఒకటి ఏర్పాటు చేయబడిందని నాకు మీరు తెలిపేవరకూ తెలీదు. పూర్వం రెడ్డ రాజధాని అయిన కొండవీటి నగర వీథుల్లో శ్రీనాథుడు ప్రతి గాడిదనూ నీవునున్ కవివి గాదుగదా అని ప్రశ్నించాడట. అలాంటి ఈ తెలుగుదేశంలో మహాకవి స్థానానికి తమరి ప్రకారం ఇప్పుడు జరుగు తున్న పోటీలో లక్షలాది సంఖ్యలో పాల్గొంటారనీ, అది పోటీగాకాక జాతరగా వుంటుందనీ అనుకోవచ్చు. ఇక నాలాంటి సామాన్య మానవుడికి అంత బ్రహ్మాండ మైన సమూహంలోకి తోసుకుపోగలిగే శక్తి ఎలా వుంటుంది? మిత్రమా! ఈ పోటీకి అన్ని విధాలా మీరర్హులని నా అభిప్రాయం.

మీరన్న చిన వీరభద్ర పిన వీరభద్ర వ్యవహారమేమిటో నాకు జ్ఞాపకం లేదు - కానీ ఒక రహస్యం చెప్పనా? నేను మహాకవి నవుదామనుకుంటున్నాను, మీకు గుండెపోటు రాదుగదా?

**జి. అనంతపద్మనాభయ్య, ధర్మవరం**

ప్రశ్న: సుమారు రెండు మూడు దశాబ్దములుగా ఆంధ్రభాష ఔచిత్యము, సాహిత్య సంపద పత్రికల ఒరవడిలో పట్టుసడలింది. వ్యావహారిక (గ్రామ్యము) భాష విలయతాండవం చేస్తూ గ్రాంథికం మూలపడుతూవుంది. సాహిత్యోపాస కులుగా మీ స(మాధానం) లహా?

జ: సోదరా! భాష ప్రవహించే జీవనది. దేశ ప్రజలు తరాలు తరాలు అందులో తరంగాలై ప్రవహిస్తారు. ప్రజలు భాషా జలాల్ని గ్రంథాలనే కడవ లతో పట్టి తెచ్చుకుంటారు. ఏ తరం వాళ్ళ భాష ఆ తరంవాళ్ళ కడవల్లో వుంటుంది. "అసమున మీదెరుంగక మహాగ్రహవృత్తి గడంగి చెచ్చెరన్" అన్న 13 వ శతాబ్ది భాష ఇరవయో శతాబ్ది తరానికి చెందిన భాషకాదు. అందులో కవిత్వ చమత్కారాలు చేస్తే అవి ఈ తరం వాళ్ళకు చేరవు. నిష్ఫలవుతాయి. ఏ తరం భాష ఆ తరానికి సాఫల్యమిస్తుంది. పత్రికలు ఈ సాఫల్యాన్ని కలిగి స్తున్నాయి (అందర్నీ చేరాలన్న నిర్బంధం చేతకావచ్చు). సాహిత్యోపాసకుడిగా నేను వర్తమాన భాషను అనివార్యంగా ఆశ్రయిస్తాను.

**మల్లెల జయరాజు, చింతలపూడి**

ప్రశ్న: "లు". అక్షరము బహువచన విభక్తి. అనగా 'లు' చేరగా బహు వచనమగును. మరికొన్ని నామవాచకములలో ఏకవచనమునందు బహువచన ద్యోతకమైన 'లు' కనిపిస్తుంది. కారణమేమిటి? తెలుపగలరు. ఉదా: రాములు, సీతాలు ఈ పదాలపై చేరిన 'లు' ఏకవచనమునందు ప్రయోగించుచున్నారు. నా ఉద్దేశం 'రామ' ధాతువుపై 'ఉ' చేరి రాము అయిన తరువాత 'లు' గౌర వార్థక ప్రత్యయంగా చేరిందని తలుస్తాను. ఇటువంటి వాటిని గౌరవార్థక ప్రత్య యాలు అని నేనంటాను. మరి తమరు నా సందేహమును తీర్చగలరు.

జ : మీ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తాను.

**కె. రామ్‌సుదర్శన్, రామక్కపేట**

ప్రశ్న : మిల్టన్, జాన్ కీట్స్, విలియమ్స్‌వర్డ్స్‌వర్త్, ఆలివర్ గోల్డ్ స్మిత్, రాబర్ట్ ఫ్రాస్ట్ మొదలైన ఆంగ్ల కవులలో మీకు నచ్చిన వారెవరు? ఎందుకు?

జః మీరు పేర్కొన్న కవుల్లో నాకు నచ్చినవారు కీట్సు, వర్డ్సువర్తు, రాబర్టు ఫ్రాస్టు. కారణం వాళ్ళలో కవిత్వం ఉంది. మిగతా వారిలో కవిత్వం పల్చన, అకవిత్వం ఎక్కువ. ముఖ్యంగా మిల్టన్ కావ్యాన్ని (ప్యారడైజ్ లాస్ట్....) ఫ్లాట్ అన్నారు విమర్శకులు. ప్రసిద్ధులైన డ్రయిడనే మిల్టన్ గురించి ఆ మాట అన్నారు. అయితే 'కోలెరిడ్జ్' 'లాంగ్ పొయెంలో అన్ని భాగాలూ కవితా మయంగా ఉండాలన్న నిర్బంధంలేదు' అన్నాడు. కానీ ఎడ్గార్ అలాన్‌పో లాంగ్ పొయెం అన్నది లేనేలేదు పొమ్మన్నాడు. అంటే, లాంగ్ పాయెంలో అకవిత్వ పంక్తులే ఎక్కువగా ఉంటాయి గనుక, లాంగ్ పోయెం కవిత్వం కాదని తాత్పర్యం. మిల్టన్ రచిత ప్యారడైజ్ లాస్ట్ & రీగెయిన్డ్ కథా ప్రధాన కావ్యం. అక్కడ సహజంగా అలంకారానికంటే కథాకథనానికే ప్రాధాన్యం ఉంటుంది. ఎడ్గార్ పో పొయెం ఎప్పుడూ క్లుప్తంగా, హ్రస్వంగా ఉండాలంటాడు. ఆధునిక ప్రపంచంలో, ముఖ్యంగా తూర్పు దేశాల్లో ఇదే అమలులో ఉంది. (గజళ్ళ నుంచి హైకూలవరకు.)

బందా సూర్యనారాయణ, ఏలూరు

ప్రశ్న: తమరు ఆస్తికులా, నాస్తికులా?

జః మీరడిగింది ఒకడి గుప్త జీవనానికి సంబంధించిన విషయం. నేను ఆస్తికుడ్ని. నేను నాస్తికుడ్ని అని చెప్పుకునేవాడికీ బట్టలు విప్పేసి బజారుల్లో తిరిగే వాడికీ తేడా ఏమీలేదని నా అభిప్రాయం. తత్త్వతః గోపనీయతకున్న సముద్రమంతటి విలువ వాడికి తెలీదు. ద్రౌపదీ మానరక్షణ కంటే ద్రౌపదీ వస్త్రాపహరణలో వాడు క్రూర సంతోషాన్ని ఉద్రేకపూరితంగా జుర్రుకుంటాడు.

అసలు సంగతి ఏమిటి అంటే - నేను దేవుడ్నెప్పుడూ చూడలేదు; ఆయనతో మాట్లాడలేదు, ఆయనతో ఏ విధమైన పరిచయమూ లేదు. ఇది నా దురదృష్టం కావచ్చు. నాకు తెలీదు. ఐనప్పటికీ ఎంతో పరిచయమున్నట్లు దేవు డున్నాడని చెప్పేవాళ్ళను చూస్తే అది వాళ్ళు నిజం తెలిసీ చెవుతున్న మాటగా కనిపించదు. దేవుడు లేడనేవాడు కూడా అంత నిష్కర్షగానే చెవుతాడు. వాడు గానీ వీడుగానీ ఎలా ఈ విషయం తెలుసుకున్నారో మనకు తెలీదు. ఈ ఉభయు

లవీ నాకు మాత్రం సత్య దర్శనాలనిపించవు. వాళ్ళ వాళ్ళ మూఢ నమ్మకాలనే నా అభిప్రాయం. ఇప్పుడే మంత్రిగార్ని కలిసి వస్తున్నానని రాజకీయాల్లో బెదిరించేవాళ్ళలాంటివాళ్ళు వీళ్ళు. ఈ సమస్యను ఇటో అటో తేల్చే శక్తి నాకు లేదు. ఈ మహా ప్రశ్నలముందు నేను ఒక బలహీన మానవుణ్ని.

కానీ ఒకటి మాత్రం గట్టిగా చెప్పాలి. ఈనాడు హద్దులు మీరిపోతున్న భక్తిమీద, లౌడ్ స్పీకర్ల ద్వారా మాట్లాడుతున్న దేవాలయాలమీద, బక్కెట్లతో వీళ్ళు తోడినట్లు లారీలతో మనుషుల్ని తోడుతున్న రాజకీయాలమీద, భయానక శబ్దాల దండయాత్రగా మారిన హిందూ పండుగల మీద నాలో పెరుగుతున్న ద్వేషాన్ని నా భాష మోయలేకపోతోంది. అవన్నీ ధనిక రాక్షస వర్గాల తాండవ నృత్యాలు అసహాయ మానవుల ఆర్తనాదాలు వినిపించని క్షణాలు. నేటి సిగ్గులేని బుద్ధిహీన లౌడ్ స్పీకర్ల మతం, దేవుడు చెవిటివాడని చాటి చెపుతోంది.

**'స్వాతి', ఉప్పల్**

ప్రశ్న: చాలామంది రచయితలు వారి రచనలలో ఎన్నో ఉన్నతమైన ఆశయాలు చెపుతారు. కాని వారి వ్యక్తిగత ప్రవర్తన సామాన్య మానవుని కన్నా అధ్వాన్నంగా వుంటుంది. ఆశయాల ఆచరణలో రచయిత ఎలా వుండాలని ఒక రచయితగా మీ అవగాహన?

జ: రచయిత, రచన రెండూ అభిన్నం అని నా నమ్మకం. ఒక గజ దొంగ, ఒక నీచుడు, ఒక కుట్రదారు నిజమైన కవి కాలేడు అని నా నమ్మకం. *

(9.1.87 ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక)

**కె.ఎన్. ప్రకాష్, హైదరాబాద్**

ప్ర. జ్యోతిష లెక్కల ప్రకారము కలియుగము ప్రస్తుతం ఎన్నవ సంవత్సరము నడుస్తున్నది తెలుపగలరు.

జ. ఏ పంచాంగమైన తీసుకుని చూడండి. జవాబు దొరుకుతుంది. సాహిత్యం వేరు - జ్యోతిష లెక్కలు వేరు మిత్రమా!

**కొల్లి శివరామిరెడ్డి, నందివెలుగు**

ప్ర. నేడు సాహిత్యమనే సముద్రపు ప్రవాహ వేగం ఎటు పయనిస్తోం దంటారు శేషేంద్రశర్మగారూ?

జ. మిత్రమా! సాహిత్యం సముద్రమేమో గానీ సముద్రం మాత్రం ప్రవాహం కాదు. ఎటువైపో పయనిస్తున్నట్టు అభినయించే మహానటుడి స్వరూపం సముద్రం. నదులే ప్రవహిస్తాయి సముద్రంలోకి. అలాగే మనిషి కరుణ, క్రోధము, ప్రేమ, అసూయ, ద్వేషము, అనురాగము ఇత్యాది రసప్రవాహాలుగా మారి సాహిత్య సముద్రంలోకి ప్రవహిస్తాడు. సాహిత్యం ఒక బ్రహ్మాండమైన జల రాశిలా ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు ఊగిసలాడే వక్షస్సులా ముందుకూ వెనక్కూ ఊగిసలాడుతూ వుంటుంది. ఎక్కడికీ ప్రయాణం చెయ్యని అనాది వృద్ధుడు, అనాది బాలుడు సాహిత్య సముద్రం!

**కీర్తి నాగరాజు, బళ్ళారి**

ప్రశ్న. ప్రాచీన సాహిత్య మథనం ఆధునిక కవితా రచనకు కలిగించే పుష్టిని గురించి యువకులకు తెలియపరచండి.

జ. మిత్రమా! అనుభూతి వినా కవిత్వం లేదు. సాధారణ అనుభూతి కాదు, ఉజ్జ్వలిత అనుభూతి. లేకపోతే అనుభూతి అందరికీ వుంది - మరి అందరూ కవులు కాలేకపోతున్నారు. అనుభూతిని ఉజ్జ్వలితం చేసేది పాండిత్యం. మామూలు పాండిత్యం కాదు. ఏ గ్రంథ పఠనా ఫల స్వరూపజ్ఞానం అంతశ్చైతన్య సాగరాన్ని జాగృతం చేస్తుందో తద్వారా ఆత్మ శాఖల మీద కవిత్వాంకురాలు పొటమరిస్తాయో అది విలక్షణ పాండిత్యం. దాన్ని జగన్నాథుడు క్వచిచ్చ విలక్షణ వ్యుత్పత్తి కావ్యకరణాభ్యాసా అన్నాడు. బోదిలేర్ "పెర్‌ఫెక్టెడ్ సెన్సిబిలిటీ కల్టివేటెడ్ బై రీడింగ్ అండ్ ఎక్స్‌పీరియన్స్" అనీ అన్నాడు. పాండిత్యం గ్రంథస్తం చేయబడిన మన పూర్వజుల సహచరుల అనుభూతి ప్రకాశపుంజము.

**కె. ప్రభాకర్, చింతకుంట**

ప్రశ్న. మన రాజ్యాంగము కూడా సాహిత్యమేనా? దీనికి రసాలు, ఛందస్సు, అలంకారం, సంధి సమాసాలు, మరియు తదితర సాహిత్యవిషయాలు వర్తిస్తాయా?

ప్రబంధము అంటే ఏమిటి? దీనికి, గ్రంథానికిగల తేడా ఏమిటి? నాకు సమాధానాలు ఇవ్వగలరని కోరుతున్నాను.

జ. తమరికి తెలిసే అడుగుతున్న ప్రశ్నలని తెలుస్తోంది. రాజ్యాంగము తత్తుల్య గ్రంథాలు సాహిత్యేతర రచనలు. సాహిత్యానికి సంబంధించిన రసాలంకారములు వర్తించవు. ఛందస్సంధి సమాసాది సాహిత్యేతర విషయాలు కావాలనుకుంటే వర్తిస్తాయి, లేకపోతే లేదు.

గ్రంథము అంటే సాధారణంగా పుస్తకమని అర్థం. కానీ ప్రాచీనకాలంలో గ్రంథం అంటే ముప్పయి రెండు అక్షరాలున్న ఒక రచన. పూర్వం పురాణాదుల పరిమాణాన్ని చెప్పడానికి శతకోటి ప్రవిస్తరం అంటే శతకోటి గ్రంథాల పరిమాణమున్న కృతి అని చెప్పేవారు. కృతుల పరిమాణాన్ని చెప్పడానికి ఒక కొలత. అయితే ఆ అర్థం ఇప్పుడు వాడుకలో లేదు. ఇప్పుడు గ్రంథం సామాన్య వాచకం. ప్రబంధం కావ్యమైన గ్రంథం. అందులోను ప్రబంధం కథా కావ్యం. కథారహిత కావ్యాన్ని ముక్తకం అంటారు. భామహుడు మొదట కథాకావ్యాన్ని నిబద్ధం అన్నాడు. వామనుడు ప్రబంధం అన్నాడు. రాజశేఖరుడు, ఆనందవర్ధనుడు ప్రబంధం అన్నారు. ఇలా ప్రబంధశబ్దం ప్రాచీన కథాకావ్య పారిభాషిక పదం.

**ఎల్. నాగేశ్వరరావు, హైదరాబాద్**

ప్రశ్న. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 'తెలుగు విజ్ఞానపీఠం'గా మారిన తర్వాత తెలుగు విశ్వవిద్యాలయంలో లీనమయింది. అకాడమీవారు ఇదివరలో ఉత్తమ సాహిత్య రచనలకు అవార్డులు ఇస్తుండేవారు. ఆ సంప్రదాయాన్ని విశ్వవిద్యాలయంవారు కొనసాగిస్తున్నారా? సాహితీ రచనలు వారి పరిశీలనకై పంపవచ్చునా? కేంద్ర సాహిత్య అకాడమీవారు అవార్డు ప్రదానానికి అవలంబించే కార్యవిధానం ఏమిటి? మనంత మనం రచనలను పంపుకోవచ్చునా వారి పరిశీలనకు?

జవాబు. బాబూ! అకాడమీల అవార్డుల గొడవ నేనెరుగను. సాహిత్యంతో సంబంధంలేని వ్యవహారాలు. రాజులు, భట్రాజులు కుట్రచేసి నిర్మించుకున్న ప్రయివేటు స్వర్గం. సాహిత్యం పేరు చెప్పకుంటూ సంచరిస్తున్న ఈ సంస్థల్ని

గురించి ఒక్క మాటలో చెప్పాలంటే ఒక శ్లోకం చెపుతాను: "ఉష్ట్రాణాం వివాహేషు గీతం గాయంతి గార్దభాః పరస్పరం ప్రశంసంతి అహోరూప మహో స్వరం"—

## రిడ్‌హిల్, హైదరాబాద్

ప్రశ్న: ప్రతిభావంతుడితో స్నేహం చేయాలన్నప్పుడు కొంత స్వయం ప్రతిభ వుండాలంటారా? లేక బలహీనుడైనా ఫర్వాలేదు, ప్రతిభ ప్రభావంతో పుంజుకోవచ్చంటారా? మిమ్మల్ని విరసం ఎందుకు ద్వేషిస్తుంది?

జ : ప్రతిభావంతుడితో స్నేహం చెయ్యాలంటే ప్రతిభ అవసరంలేదు. ప్రతిభ ప్రతిభాహీనుడిలోకి ప్రవహిస్తుంది- నీరు పల్లెమెరుగు, నిజము దేవుడెరుగు అన్నట్లు. విరసం నన్నెందుకు ద్వేషిస్తుందో నాకు తెలీదు. నేనుమాత్రం ఒక దానికి ఆశ్చర్యపడతాను. వాళ్ళు మానవ కన్నీటిని మార్క్సిస్టు కన్నీరు, మామూలు కన్నీరు అని రెండుగా విభజిస్తారు. ఈ విభజనకు ఆధారం వాళ్ళకు ఒకడు నచ్చడం, నచ్చకపోవడం. మైకాసురభంజన, కవిత్వ కంఠీరవ, ఉపన్యాస భస్మాసుర ఇలా ఎన్ని బిరుదులకైనా వాడే రాజధాని.

## నంతేపల్లి పవన్‌కుమార్, వేములవాడ

ప్రశ్న: జీవితం - సాహిత్యం- ఈ రెండిటి మధ్యగల సంబంధం ఏమిటి? కాస్త చెప్పండి శర్మగారూ!

జ. జీవితానికి, సాహిత్యానికి అవినాభావ సంబంధం ఉంది. జీవితం తల్లి అయితే సాహిత్యం శిశువు. సాహిత్యకర్త లేక కవి జీవితానుభూతులచేత తీవ్రంగా కుదపబడి సాహిత్య పంక్తులు పలుకుతాడు. సాహిత్యానికి జీవితం జన్మభూమి.

## జ్యోత్స్నాప్రసాద్, హైదరాబాద్

ప్రశ్న : కొందరిని కవితే వరిస్తుందట. మరి నేను వరింపమని ప్రాదేయపడ్డా, చివరకు బలవంతం చేసినా నాకు కవిత దక్కడం లేదు. అలాగని ఆశ చావడం లేదు. అంతరాంతరాల్లోంచి కవి కావాలన్న కోరిక పుట్టుకొస్తోంది. సాధ్యం కావడంలేదు. నా ఆవేదన, బాధ తీరేదెట్లా? మీరు అనుభవజ్ఞులు కదా - నాకో మార్గంలాంటి సలహా ఇస్తారా?

జ: కవిత్వం వరించి వస్తుందన్నమాట ఒక గొప్ప హంబగ్. ఒకడి సామాజిక పరిసరాల ప్రభావంచేత, వ్యక్తిగత అనుభూతి తుఫానులచేత, వాడి వాడి వికసిత చైతన్య పరాగం బహిర్గతమై పరిమళిస్తుంది. ఈ మాటనే వెయ్యి విధాలుగా చెప్పవచ్చు. ఇది ఒక విధం. గిరీశం, శ్రావణ, భాద్రపదాలు, శకారుడు, మేక్బెత్, ఇయాగో, మారీచ సుబాహులు, కరటక దమనకులు లాంటి పాత్రలు చస్తే కవిత్వం చెప్పలేరు; కవులు కాలేరు. కాని బిరుదులు, బహుమానాలు పొందలేరని మాత్రం చెప్పలేము. మీరు మంచి కవిత్వం చదవండి, మీ వేదనని, మీ బాధని సురక్షితంగా కాపాడుకోండి, జీవితం మిమ్మల్ని అనుగ్రహిస్తుంది కవిత్వంతో!

(23-1-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**తంగిరాల సత్యనారాయణ, చల్లపల్లి**

ప్రశ్న. కాక వంధ్య - కదళీ వంధ్య అంటూంటారు. వాటిని వివరించ ప్రార్థన. కుండకులు - గోళకులు అంటే ఏమిటో కూడా తెలుప ప్రార్థన.

జ. జీవితంలో ఒకే ఒక శిశువును ప్రసవించిన స్త్రీ కాకవంధ్య అనబడుతుంది. కుండః అంటే పతి వుండగా పరపురుషుడి మూలంగా ఒక స్త్రీ పొందిన సంతానము. గోలః అంటే విధవకు పరపురుషుని వలన కలిగిన సంతానము. అయితే ఇలాంటి శబ్దార్థ జ్ఞానం కావ్యాస్వాదనకు ఉపయోగించదు. "శబ్దార్థ శాసన జ్ఞాన మాత్రేణైవ నవిద్యతే / వేద్యతే సతు కావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలం" అంటుంది ధ్వన్యాలోకం.

అందులోనూ మీ కుండక గోళకాది వ్యవహారం ఆధునిక సాహిత్యానికి అసలు ఉపయోగించదు. ''నహి నహి రక్షతి డుకృన్కరణే.''

**"శింజని", గుంటూరు**

ప్రశ్న. కవిత్వంలో ఎన్ని రకాలున్నాయి? అందులో దిగంబర కవిత్వమంటే ఏమిటి? దాని స్వరూప స్వభావాలెలా వుంటాయి? దాని వలన ప్రయోజనమున్నదా? సామాన్యునికి అది ఎంత వరకు అర్థవంతమై, ప్రయోజనాన్నిస్తుంది?

జ. కవిత్వంలో ఎన్ని రకాలున్నా దిగంబర కవిత్వం అందులో ఒకటి కాదు. చిత్ర కవిత్వం, బంధ కవిత్వం, మార్గ కవిత్వం, దేశి కవిత్వం, గద్య

కవిత్వం, పద్య కవిత్వం, చంపూ కవిత్వం, వచన కవిత్వం, గేయ కవిత్వం, జానపద కవిత్వం-ఇలా ఎన్నో రకాల కవిత్వాలున్నాయి. పోతే వస్తువునుబట్టి ఆధునిక కాలంలో వచ్చిన భావ కవిత్వ, అభ్యుదయ కవిత్వ, విప్లవ కవిత్వ, కవిసేన కవిత్వాదులున్నాయి. కానీ వీటన్నిటికీ కొన్ని పోల్చుకోడానికి వీలయ్యే లక్షణాలున్నాయి. కానీ మీరు చెప్పిన దిగంబర కవిత్వానికి అలాంటి విశిష్ట లక్షణాలేవీ లేవు. వాస్తవంగా అభ్యుదయ కవిత్వ ప్రారంభంనించీ కవిసేన కవిత్వం వరకు వచ్చిన కవిత్వమంతా ఆంధ్రదేశంలో విప్లవాన్నే కావ్య వస్తువుగా తీసుకుంది. విప్లవం కావ్య వస్తువుగాలేని కవిత్వం చినుకులు చినుకులుగా అక్కడక్కడా రాలుతుండడమే ఈ యుగ లక్షణం. అభ్యుదయ కవిత్వమనే పేరుతో వచ్చిన కవిత్వం కూడా విప్లవాన్నే కావ్యవస్తువుగా స్వీకరించింది గనక అదీ విప్లవ కవిత్వమే; లేబెల్ వేరే కావచ్చుగాక. కనక తెలుగు దేశంలో అభ్యుదయ కవిత్వం నుంచీ కవిసేన కవిత్వం వరకు అంతా ఒక దీర్ఘ విప్లవ కవిత్వ యుగమే అని పరిగణించడం సరియైన సాహిత్య విమర్శ. దీనికి భిన్నంగా దిగంబర కవిత్వమని మీరనే దాంట్లో విశిష్ట విభిన్న లక్షణాలేవీ లేవు. ఇక ప్రయోజనమా? ఇన్నేళ్ళనించీ ఎన్ని కావ్యాలో కావ్య సంకలనాలో అంథాలజీలో వచ్చాయి. అవన్నీ ఏదయినా ప్రయోజనం సాధించి వుంటే ఇది కూడా అందులో ఏదో కొంత చేసే వుండదా?

**సి హెచ్. గణపతి ప్రసాద్, ఖుర్దారోడ్**

ప్రశ్న. "కవిత్వం అలంకార ప్రధాన భాష. అంటే ఆ భాషలో నుంచి అలంకారాన్ని తొలగిస్తే అది కవిత్వంగా వుండడం మానేస్తుంది" అన్నారు మీరు. ఆదికవి వాల్మీకి ఆది శ్లోకం "మానిషాద ప్రతిష్ఠాద్య గమః.... కామ మోహితమ్"లో ఏ అలంకారం లేదు కదా - మరి కవిత్వం కాదంటారా? తెలుగు కవిత్వం గురించి చెప్పానంటారా? అయితే తిక్కన భారతంలో "తనువున విరిగిన యలుగులు...." అన్న సుప్రసిద్ధమైన పద్యంలో ఏ అలంకారం వుంది? సరైన వివరణ ఇవ్వండి.

జ. అలంకారము లేని భాష కవిత్వం కాదు అన్నమాట కావ్య కోవిద ప్రపంచం చేసిన నిష్కర్ష. వక్రోక్తి, ధ్వని, చమత్కారాదులన్నీ అలంకారం

లోనే ఉన్న అలంకార లక్షణాలు లేక అలంకార శక్తులు. భిన్న భిన్న అలంకారిక మత సంబంధ వివాదమంతా కావ్యమర్మ జ్ఞానానికి అనివార్య సామగ్రికాదు. "వక్రాభిధేయ శబ్దోక్తిః ఇష్టావాచామలంకృతిః" అని భామహుడన్న మాట కావ్య విషయంలో పరమవాక్యం. మా నిషాద శ్లోకం ఛందోబద్ధ భాషావిర్భావానికి ప్రారంభం! కనుక అది సాహిత్యంలో చరిత్రాత్మక సంఘటన. వాల్మీకే ఆ శ్లోకాన్ని గురించి "పాదబద్ధోక్షరసమః తంత్రీలయ సమన్వితః" అన్నాడు. కనకనే ఆ సంఘటన సాహిత్య జగత్తులో మార్తాండ మండలాయమానంగా నిలిచింది. అది కవిత్వ విషయం కాదని మాత్రం గుర్తించాలి. ఏతత్ శ్లోకావిర్భావాన్ని గురించి వివరిస్తూ రాజశేఖరుడు కావ్య మీమాంసలో కావ్యపురుష సరస్వతీ సంవాదంలో సరస్వతి చేత ఇలా చెప్పించాడు - "త్వత్తః పూర్వేహి విద్వాంసో గద్యం దదృశుః నపద్యం; త్వదుపజ్ఞ మథాతః ఛందస్వద్వచః ప్రవర్త్స్యతి (నీకు ముందు విద్వాంసులు గద్యనే చూచారు పద్యాన్నెరుగరు. నీవే పద్యాన్ని సృష్టించావు.) రాజశేఖరుడి ప్రకారం ఆ ఛందోమయవాక్కు కావ్య పురుషుడి చేత శుక్రుడికి మొదట ఇవ్వబడింది. అప్పటి నుంచీ శుక్రుడి పేరు కవి. తర్వాత సరస్వతే ("సాపి....ప్రాచేత సాయాపి.... స్వచ్ఛందాంసి వచాంసి ప్రాయచ్ఛత్") వాల్మీకికి ఆ ఛందోమయ వాక్కులను ఇచ్చింది. ఆమే తన పుత్రుడయిన కావ్య పురుషుడి శరీరాన్ని వర్ణిస్తూ అంగాంగ క్రమంలో ముఖ బాహు జఘనాదుల తర్వాత "నీ రోమములు ఛందస్సులు" అంటుంది. (రోమాణి ఛందాంసి) కానీ ప్రథమ శ్లోకావిర్భావం సాహిత్యంలో రోమాంచక సంఘటన.

**వంగనామముల రామమోహనరావు, సికింద్రాబాద్**

ప్రశ్న. పద్య కవిత్వానికి పూర్తిగా స్వస్తి చెప్పి స్వీయ కవితలు, భావ కవితలని ప్రతి చిన్న కుర్రవాడి దగ్గర్నుంచి మొదలుపెట్టి శ్రోతలను, పాఠకులను కవితా కళకు విముఖుల్నిగా చేయుటలో గల కారణం? ఆ వ్యామోహం ఏమిటి, ఎందువలన? తిక్కన, అల్లసాని పెద్దన, పోతనగార్ల పద్య కవిత్వంలో కంటె అధిక మాధుర్యాన్ని నేటి ఈ చిల్లర కవులతో కురిపించగలదని, పాఠకులు ఆనందించగలరనేనా నేటి ఈ రచయితల అభిప్రాయం?

జ. తమరన్న చిల్లర కవితలు రాసే వాళ్ళదే నేటి తెలుగుదేశంలో పైచేయి. ప్రతి చిల్లర కవీ తానే మహాకవి నంటాడు. దాన్ని కుల, ప్రాంత, రాజకీయాది కారణాలచేత బలపరిచే వర్గాలు, కంపెనీలు, దుకాణాలు బోలెడు దేశపు రాజ వీధుల్లో బారులు తీరాయి. ఒక బొడ్డూడని కుర్రవాడు కూడా, జీవితంలో నిమ్నోన్నత యాత్ర చేసి, బాష్ప సముద్రాలు ఈది, శాస్త్రాలలో కృత పరిశ్రముడై క్షతగాత్రుడై కవిత్వ శిఖరమెక్కి కూర్చున్నవాడ్ని, తన కంటే తక్కువ కవిగా భావిస్తాడు. అంటే వాడిలో వినయమనే నాగరక లక్షణం కూడా లేదు. కుండలు చేసే కుమ్మరివాడు బ్రహ్మాండాలు చేసే బ్రహ్మదేవుడ్ని నాకంటే నీవే తక్కువ పొమ్మంటాడు ఒక సంస్కృత శ్లోకంలో - "భవే దద్య శ్వోవాకి మిహ బహునా పాపిని కలౌ! ఘటానాం నిర్మాతుః త్రిభువన విధాతుశ్చ కలహః." ఇదీ, మనం ఈనాటి తెలుగు సాహిత్య క్షేత్రంలో అనుభవిస్తున్న నాగరకత!

(30-1-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

సిరి, హైదరాబాద్

ప్ర. పత్రికలు, రేడియో, టి.వి. స్వార్థా పేక్షా కుటిల స్వభావుల చేతుల్లో వున్నాయి. ఎదగకుండా అడ్డుపడి పోజా పెడుతున్నారు దుండగులు. భావలతలు వాడిపోతున్నాయి. అవకాశం లేక మాడిపోతున్నాయి. నన్ను శాంతపరచరూ?

మీరు అందంగా వుంటారు గదా, చలన చిత్రసీమలోకి ఎందుకుపోలేదు? అసలు మీకు ఐడియానే రాలేదా?

జ. అయ్యో! తమర్ని శాంతపరచే ఆయుధం నా చేతిలో లేదు. పత్రిక, రేడియో, టి.వీ లు అధికారవర్గం పాదాలవైపు మాత్రమే ప్రవహించే పంట కాలువలు. మనబోటి సామాన్యులకు దుర్లభస్థానాలు. బహుశా అన్ని కాలాలలో దేశాల్లో ఇది ఇంతే అనిపిస్తుంది చరిత్ర చూస్తే. ప్రచార సాధానాలు ప్రభుత్వ వర్గాల అంగాలు. బాధపడడం వివేకం కాదు. ఈ టి.వీ. ఇత్యాదుల నిరంకుశత్వాన్నీ, ప్రజాస్వామ్యమనే గోముఖ వ్యాఘ్రాన్నీ భరించవలసిందే, దేశంలో వర్గ చైతన్య జ్వాల ఉదయించనంత వరకూ.

మిత్రమా! మన తెలుగు సమాజం ఎలా వుందో అలాగే వున్నాయి మన చిత్రసీమ, మన సాహిత్యసీమ వగైరా. ఈ సమాజం బ్రహ్మాండమైన కందకాలు,

కోటగోడలు, బురుజులు లాంటి అడ్డంకులున్న నిర్మాణం. అందంగా వుంటే చాలదు వెండితెర ఎక్కడానికి. ప్రతిభ వుంటే చాలదు పదవి చిక్కడానికి. ఒక మైకు ముందు నిల్చోవాలంటే ఎన్ని జన్మలెత్తాలో ఈ తెలుగు నేల చెపుతుంది. అరే! ప్రతిభ అనే నేరం చేస్తే ఇక్కడ శిక్షించినంత కఠినంగా భారతదేశంలో మరెక్కడా శిక్షించరు. ఇక్కడ మేధాశక్తి వుంటే మెదడు నరాలు తెగడమే ఫలితం, సేద్యం చేస్తే చెమట పట్టడమే ఫలితం. ప్రభుత్వ పటాటోపాలు చూచి ప్రజ్ఞాపాండిత్యాల మీద ప్రజలలో విశ్వాసం ఎప్పుడో ఎగిరిపోయింది.

**క్రిష్ణ శ్రీనివాస్, పెద్దాపూర్ క్యాంప్**

ప్రశ్న: మీ 'గొర్రిల్లా'పై ఎమర్జన్సీ ప్రభావంవుందా? ఉంటే ఎంతవరకు?

జవాబు: గొర్రిల్లా కావ్యం ఎమర్జన్సీ గర్భం నుంచి పుట్టిన శిశువు. ఆ కాలంలో జరిపిన దారుణ హింసాకాండకు అది ప్రతిక్రియ. అందుకనే "ప్రభుత్వ మార్కు ముఖాలు చూస్తా! చెట్లవైపు కేకవేస్తా! ఇవి పూలెందుకు పూస్తాయి, బుల్లెట్లెందుకు పుయ్యవు" అని గర్జిస్తుంది కావ్యం.

**వేమూరి కామేశ్వరరావు, తిరుపతి**

ప్రశ్న: మనము అలంకార శాస్త్రం అంటాము. హిందీవాళ్ళు దాన్ని కావ్య శాస్త్రం అంటారెందుకో చెప్పగలరా?

జ: అలంకార శాస్త్రమనడమే శిష్ట ప్రయోగము. కావ్య శాస్త్రమని హిందీ వాళ్ళు ఎందుకంటారో మరి! కావ్యశాస్త్రమన్నప్పుడు సమస్త సృజనాత్మక ప్రక్రియలూ దాని క్రిందికి వస్తాయి. నాటకము, నవల, కథ, కవిత్వము - వీటి నన్నిటినీ కావ్య మనవచ్చు. కానీ ఇందులో మొదటి మూడు కథా ప్రధాన రచనలు, కవిత్వం కథారహిత సృజన; అలంకార ప్రధాన రచన. కథాప్రధాన రచనలలో పాఠకుడు అంత్యానుభూతిగా పొందే తాదాత్మ్యాన్నే రసమంటారు. అలంకార ప్రధానమైన కవిత్వంలో పాఠకుడు అంత్యానుభూతిగా పొందే తాదాత్మ్యాన్ని చమత్కారమంటారు. చమత్కారమే ఆనందము. ("సౌందర్యం చ చమత్కృత్యాధాయకత్వం, చమత్కృతి రానంద విశేషః సహృదయ హృదయ ప్రమాణికః" అని జగన్నాథుడు ఉపమాలంకార చర్చా సందర్భంలో చెప్పాడు)-

కాళిదాస మహాకవి రచిత కథా రహిత మేఘ సందేశం మూలంగా భారతీయ కావ్య శాస్త్రంలో ఒక గొప్ప మార్పు వచ్చింది. తత్పూర్వం కథా ప్రధానమైన నాటకము, అఖ్యాయిక, కథ ఇత్యాదులు యుగ యుగాలు పరిపాలించి పాఠకుల ప్రాణం విసిగిన తరుణంలో మేఘసందేశం వచ్చింది. దాని ప్రభావం చేత అప్పటి వరకూ వస్తున్న నాట్యశాస్త్ర రచనని అంతం చేసి భామహుడు. ప్రప్రథమంగా కావ్యాలంకారమనే అలంకార శాస్త్ర గ్రంథం రాశాడు నాట్యశాస్త్రం రాసిన చివరివాడు భరతుడు, అలంకార శాస్త్రం మొదట రాసినవాడు భామహుడు రస చర్చ నాట్యశాస్త్రంతో అంతమయింది. అలంకార శాస్త్రంతో అలంకార చర్చ ప్రారంభమయింది. కిరాతార్జునీయ, శిశు పాలవధాది కావ్యాలు ప్రబంధాలయి నప్పటికీ అవి అలంకార ప్రధాన కావ్యాలు. పాఠకులు అందులో రస నిర్వహణ కోసం వెదకరు: అలంకారాన్నే ప్రధానంగా ఆనందిస్తారు. కనుక అలంకా శాస్త్ర మనదమే కరెక్టు

**ఎం. విజయలక్ష్మి, ములకలపల్లి**

ప్రశ్న: భవికవులు ఎవరు? వారి రచనలు ఏమిటి? పంచకావ్యాలను వ్రాసిన వారెవరో కూడా తెలియజేయండి.

జ: భవి శబ్దము చిత్రమైనది. భవిన్ అని సంస్కృతంలో ఒక నకారాంత పుంలింగ శబ్దముంది దాని అర్థం ప్రాణి అని. తెనుగు నిఘంటువులలో ఈ శబ్దం కనిపించడం లేదు శబ్ద రత్నాకరములో చూడండి వుందేమో! కానీ భవి శబ్దము కేవలం వీరశైవ కృతులలోనే కనిపిస్తుంది తెలుగు నిఘంటుకారులు దీనికి వివరణ ఇవ్వవలసినది. దీనికే కాదు-అనేక వీరశైవ కవి ప్రయోగములైన 12, 13 శతాబ్దాల కావ్య గత తెలుగు శబ్దాలకు అర్థము ఇవ్వనే లేదు. ఆ పనికి చాలా పరిశోధన అవసరం. కుర్చీ, టేబుల్ పరిమిత స్వల్ప కార్యము కాదు. ఆ కృతికర్తల ప్రాంతాలకు వెళ్ళి అక్కడి వృద్ధ జనాన్ని కలుసుకొని మాట్లాడాలి. అన్యథా మార్గం లేదు.

అయితే, నే నెరిగిన వరకు వీరశైవ కృతులలో ప్రయుక్తమైన భవి శబ్దం వీరశైవాచార దీక్షితులైన వారి మతానికి విరుద్ధంగా వున్న అందరూ భవి శబ్దము

కిందకు వస్తారని తోస్తున్నది. దాన్నే మహమ్మదీయులు కాఫిర్లని, ఆదిమ క్రైస్తవులు ప్యాగన్లనీ లేక హెరెటిక్స్ అని అనేవారు. ఈ విధంగా ఇవన్నీ సమానార్థక శబ్దాలని నాకు అనిపిస్తున్నది.

వీరశైవ దీక్ష పుచ్చుకున్నవారు భవి అయిన వాడిని కన్నెత్తి చూడను కూడా చూడరు. ఇది వారి వ్రతము.

కనుక భవి కవులు వీరశైవేతర కవులు అనుకోవాలి, బహుశః నన్నయ, తిక్కనాది కవి పరంపరను వీరశైవులు భవి కవులు అంటారు. పైగా, వీరశైవ మతంలో అద్వైత ద్వేషం చాలా ఎక్కువ. "పాతకులాత్మాద్వైతులు నీతి ఎరుంగుదురే"- ''అద్వైత విమూఢునకును లోకాయతునకు భేదమ్ము గలదె''- ''ప్రచ్ఛన్న దోష లజ్జానాచ్ఛాదిత దుష్టచిత్తుల ద్వైతులు"- ఈ విధంగా విస్తృత అద్వైత మత దూషణ పండితారాధ్యుడు, తన ''శివతత్త్వ సారము'లో చేశాడు. వీరశైవులందరికీ ఇదే మార్గం. నన్నయాదులది అద్వైత మార్గం. తిక్కనతో ప్రారంభించిన కవి పరంపరను నేను హరిహర కవులన్నాను (చూ. నరుడు - నక్షత్రాలు 1962). భవి కవితా అద్వైతులే గాక బౌద్ధ జైనులు కూడా ఉన్నారు.

మనుచరిత్ర, వసుచరిత్ర, పాండురంగ మాహాత్మ్యం, శృంగార నైషధం, ఆముక్తమాల్యద - ఈ కావ్యాలు పంచకావ్యాలు. కాని నేటి పాఠకుడికి పంచ కావ్యాలు చాలవు. ప్రపంచ కావ్యాలు కావాలి.

(6-2-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

ప్రత్యూష, హైదరాబాద్

ప్రశ్న : కవిత్వం వ్రాసేటప్పుడు ఛందస్సు నియమం పాటించినా ఒక్క అక్షరంలో అటు ఇటు అయినా ప్రమాదమంటారు - నిజమా? ఇది తలచినప్పుడల్లా కవిత్వం జోలికి పోకూడదనిపిస్తుంది. సాధనలో వున్నవారికి ఒక్కమారుకే పటుత్వం రాదు గదా? తప్పులు దొర్లవచ్చు. దాని నివారణకు సలహా ఇస్తారా? మరి మా కవితాతృష్ణ తీరేదెట్లా చెప్పండి?

జ : బాబూ! వచన కవిత మిమ్మల్ని రక్షించు గాక! భగవంతుడు ప్రజల్ని రక్షించుగాక! (పీ బారి నుండి )

లంకా వెంకటేశ్వర్లు, నాగార్జున విశ్వవిద్యాలయం

ప్రశ్న : ఒకే కవికి అటు అంగారంలోను, ఇటు శృంగారంలోనూ కూడా సమాన ప్రతిభ వుంటుందా? అన్ని రసాలలోను సమర్థుడు కావచ్చేమో కాని, ఒక రసంలో మరీ సమర్థుడు కదూ?

జ : మానవుడు అనేక భావాల, సంవేదనల సముద్రం. జీవన కల్లోలంలో ప్రయాణంచేసే మానవుడే కవి. సుఖ, దుఃఖ మిశ్రితమైన జీవన సన్నివేశాల్లో మనిషి భిన్న భిన్న అనుభవాలకు గురి అయి, భిన్న భిన్న భావ ప్రవాహాలుగా ప్రవహిస్తూ వుంటాడు. మానవ జీవితం, అనుభవం ఒకే భావ ప్రవాహం కాదు. కనుక కవి భిన్న భిన్న అనుభవాలకు అభివ్యక్తి రూపం ఇస్తూ వుంటాడు. కవి రచన అనుభవాధీనంగా వుంటుంది. జీవనానుభవాల్లో అంగారము శృంగారము రెండు అగ్రగణ్య అనుభవాలు. క్రోధము, ప్రేమ - ఇవి మానవ జీవనంలోనేకాదు అన్ని ప్రాణికోట్ల జీవనంలోనూ ప్రాథమిక అనుభవాలు, భావాలు, ఇందులో ఏదో ఒక్కటే వుండాలనుకునేవాడు వర్తమాన కుటిల రాజకీయ సాహిత్య ఖైదీ అన్నా అయివుండాలి, లేదా మానవ జీవనలీల ఎరుగని అర్భకుడైనా అయి వుండాలి.

కొప్పన సీతారామకృష్ణ, నేమాం

ప్ర. "పతిత" అంటే ఏమిటి - "వెలయాలు" అంటున్నారు, నిజమేనా?

జ. సంప్రదాయానుసారంగా స్త్రీ మీద సమాజం విధించిన లైంగిక వ్యవహార నియమాలు ఉల్లంఘించిన స్త్రీని పతిత అంటారు. వెలయాలు సహజంగా ఈ వర్గంలోకి వస్తుంది. ఈ నియమాలు దేశ కాలానుగుణంగా మారుతుంటాయి. వాటి న్యాయాన్యాయవిచారం అనాదిగా జరుగుతోంది. దాని జోరు ఒక యుగంలో ఎక్కువ, ఒక యుగంలో తక్కువ. అలాగే దేశ దేశానికి మార్పు ఉంటుంది. - అయితే స్త్రీల కంటె ఎక్కువ సంఖ్యలో "పతితలు" ఉన్న పురుషుల మీద స్త్రీల మీద విధింపబడినన్ని నియమాలు విధింపబడి ఉండక పోవడం ఘోర అన్యాయం అన్న విషయం సర్వ జనీన అంగీకారం పొందిన మాట. తన కూతురు పుట్టింది దాసీగా బ్రతకడానికే అంటే ఏ తండ్రి హృదయ పూర్వకంగా అంగీకరిస్తాడు? సమాజ వైరుధ్యాలు ఒక్క ఆర్థిక సమానత్వంతోనే

విధ్వస్తమైపోతాయి. స్త్రీల దైనిక సమస్యల కోసం వెతికే పరిష్కారం అయింట్మెంట్ లాంటిది; అసలు కడుపులోకి తీసుకోవలసిన మందు, స్త్రీ పురుష భేదం లేకుండా వర్తించేది - విప్లవం!

**రామన్, మద్రాసు**

ప్ర. కమ్యూనిజం, మార్క్సిజం అంటే ఏమిటి? వాటి వ్యత్యాసాలను స్పష్టంగా తెలుపగలరు.

జ. మానవ జీవనాధార వస్తువుల ఉత్పత్తి సాధనాలు వ్యక్తుల చేతులలో నుంచి సమాజం చేతులలోకి మారడం, తత్ఫలితంగా అందరికీ కావలసినవి అన్నీ అందరికీ లభించడం వున్న సామాజిక వ్యవస్థ తీసుకురావాలనే ఉద్యమం పేరు కమ్యూనిజం. ఇక్కడ ఇంత స్థూలంగా మాత్రమే చెప్పడానికి వీలవుతుంది. మూలతః వస్తువులు, ఉత్పత్తి, మానవ శ్రమ, ధరలు, మార్కెట్లు, సామూహిక సంపద, ప్రభుత్వము, సామాజిక విలువలు ఇలాంటి విషయాల్ని విశ్లేషించి చర్చించి రూపొందించిన ఆర్థిక సిద్ధాంతం కమ్యూనిజం. కనుక సైద్ధాంతికంగా సాధారణ మేధకు లొంగని దుర్గ్రాహ్యమైన విషయం. కానీ సాధారణ మానవాళి జీవనస్థితి ఉన్నతం చెయ్యడానికి చేసే కృషికి వర్తించే సిద్ధాంతం కనుక, సాధారణ మానవాళి సమస్యల పరిష్కారంకోసం జరిపే పోరాటాలలో అమలు జరిపే సిద్ధాంతం గనుక, లక్ష్యసాధనకోసం రూపొందించబడిన కార్యక్రమాలు అందరికీ అవగాహన అవుతాయి. అందుబాటులో వుంటాయి. కానీ మూల సిద్ధాంతాన్ని అర్థం చేసుకోడానికి చాలా కృషి అవసరం - కమ్యూనిజం మాకు కరతలామలకం అనే కుహనా మేధావులు మన తెలుగు దేశంలో కుప్పతిప్పలుగా పడున్నారు. ఈ కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడు కార్ల్ మార్క్స్ గనుక కమ్యూనిజాన్ని మార్క్సిజం అని కూడా అనవచ్చు.

**పి. కవిత, పాలెం**

ప్ర. తెలుగు సాహిత్యంలో పద్యానికి ఓ ప్రత్యేక గౌరవం వుంది. "పద్య విద్య" తెలిసిన ఆధునిక మహా కవుల్లో మీరొకరని మీ 'ఋతుఘోష' వల్ల తెలుస్తుంది. తర్వాత మీరు పద్యానికి ప్రాధాన్యం ఎందుకివ్వడం లేదు? పద్య కవిత్వం ఔట్ డేటెడ్ అని మీరూ అనుకుంటున్నారా?

జ తెలుగు మేధ వెయ్యేళ్ళు సాధించిన ఒక మహోజ్జ్వల సంపద పద్య శిల్పం నేను అందులో కొంత కృషి చేశాను. భారతదేశంలో ప్రయాణం చేస్తుంటే కొండలమీద అక్కడక్కడ కోటలు కనిపిస్తాయి గతించిపోయిన నాగరికతకు గర్వోన్నత చిహ్నాలుగా. మన సుప్త స్మృతుల్ని రెచ్చగొట్టి వర్ణ చిత్రాల వసంతాలు పీచేలా చేస్తాయి. కాని ఆ కోటల్ని మళ్ళీ వాడుకోలేము. అందుకని వాటిని చూచి విచారగ్రస్తులవుతాము. ఈనాడు మనం ఏ జనులతో కలిసి జీవిస్తున్నామో, ఏ సమకాలీన జన సంపర్కం మన జీవన సౌభాగ్యమో వాళ్ళకు ఆ పద్య నిర్మాణ శిల్పాల్ని చేర్చలేము. దాని నిర్మాణంలో వున్న శబ్దాల శిలలు ఆ శిలలమీద చెక్కబడిన శిల్పాలు సంకేతించే నాగరికత, మానవీయ విలువలు, సౌందర్యరీతులు ఈనాటి మన ప్రజల జీవనక్షేత్రాన్ని జల మయం చెయ్యలేవు. అందులో నుంచి ఫలపుష్పాలు రావు, అవి శిలలమీద చెక్కిన ఆకృతులు. అన్నిటికంటే ఈతరం జనులు పద్యభాషను దాటి పద్య గర్భాంతఃస్థ కావ్యచమత్కారము నందుకోలేరు, ఈ ఒక్క కారణం చేతనే పద్యం కావ్యప్రాణమైన చమత్కారానికి భంజకమవుతోంది. తిక్కనలో చూడండి "ఉపతాయిలో తన కొదవినతోరహ/త్రము సూపి వేయక సమది వృత్తి." "యెదమేని నెత్తాని సుడియంగ బయ్యెద/ సగము దూలించి పై మగుడ దిగిచి"- పిన వీరభద్రుడు "పాప కన్నెలు మేతపట్టి పోవిడుచునో వెసగాడ్పు రెక్కలు విరిగెనేని" - తెనాలి రామకృష్ణ కవి, "కొదమ సంపెగ మొగ్గ తుదజోన్న విరివోలె / ముక్కున ముంగర ముత్యమమర," "శిఖితాండవము కళాసిక జేసి సదలించె / గరిమటా మదవృష్టికైతవమున" - అందమైన పూర్వ కావ్య పంక్తు లిచ్చాను. కానీ ఈతరంవాళ్ళకు ఆ అందం అలభ్యం. కారణాల వివరణ ఒక క్లిష్టబంధం; అది చెపితే ఒక గ్రంథం. ఇప్పుడు చెప్పవలసిన కవిత్వం ఇలా వుండాలి చూడండి, "కాళ్ళు వేళ్ళయి నడిచే చెట్టు మనిషి / చెట్టుగా వుంటే ఏడాదికొక వసంతమన్నా దక్కేది/మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను" (ఆధునిక మహాభారతము - ప్రజాపర్వము). ఈ కవిత్వాన్ని కవి తన సమకాలీన జనులతో పంచుకోవచ్చు. కవికీ, శ్రోతకూ ఈ మార్గంలోనే సాఫల్యం లభిస్తుంది.

(13-2-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక)

**పి. రవికుమార్, మొండెంఖల్**

ప్రశ్న : ''శేషేంద్ర కవిత్వంలో కొత్త దృక్పథం వెలువడింది. ఆయన కవితారీతులు కొత్త పుంతలు తొక్కుతున్నాయి'' అన్న శ్రీశ్రీ ''శేషేంద్ర 'కవిసేన' అభివృద్ధినిరోధకమైంది'' అన్నారు. దానిమీద మీ అభిప్రాయం?

రిఫరెన్స్ : ఏప్రిల్ 1979 'జ్యోతి' మాసపత్రిక, డిసెంబర్ 1979 'సృజన' పత్రికల కోసం ఇచ్చిన ఇంటర్వ్యూలు.

జ : శ్రీశ్రీ ''కవిసేన మేనిఫెస్టో'' చదివి వుండడు. మేనిఫెస్టో కంటే మిత్రవాక్యమే మధురంగా తోచివుంటుంది ఆయనకు.

**అంజనేయప్రసాదరావు, నెల్లూరు**

ప్రశ్న : పాణిన్యాచార్యులు తమ వ్యాకరణ అష్టాధ్యాయిలో భారతవీరుల పేర్లు ప్రస్తావించారు కాని, రామాయణ పాత్రల పేర్లు కాని, ఆదికవి వాల్మీకిని కాని, రామాయణ కావ్యాన్ని కాని ప్రస్తావించలేదు. అందువల్ల రామాయణ రచన భారతానికి, పాణినికి పిమ్మట జరిగినది, రామాయణ కథకు రామాదులకు అంతకుముందు ప్రచారం లేదు - ఇది ఒక పక్షం.

తిరుపతి దేవస్థానాల ప్రచురణ - షోడశి రామాయణ రహస్యాలు అనే తమ పుస్తకంలో తాము భారతానికన్నా రామాయణం పూర్వరచన, కథా అంటూ తాము చూపిన కారణాలు. 1. రామాయణం నాటి సంఘస్థితి, 2. ఉపమలు వేదాలలోని చిత్రణను పోలివున్నవని, 3. అపాణినీయ ప్రయోగాలు, 4. చారిత్రిక హద్దులు - దేశాల విస్తరణ, వివరణ భారతంలో వానికంటే తగ్గివుండడం, విష్ణుప్రశస్తి కంటే ఇంద్రపారమ్యం ఎక్కువగా వుండడం.

పాణిని వ్యాకరణంలో తనకంటె పూర్వపు రచనయైన రామాయణం, రామాది పురుషుల ప్రస్తావన ఎందుకు చేసి వుండకపోవచ్చో తమ అభిప్రాయాన్ని తెలుప ప్రార్థన.

జ : రామాయణం పాణిన్యనంతర రచన అని ఒక పక్షం అనడానికి మీ ప్రకారం ఆధారం పాణినిలో రామాది పాత్రల ప్రస్తావన లేదనుకోవడం ఒక్కటే; కానీ హల్సంధి ప్రకరణము, విసర్గసంధి ప్రకరణము, అజంత పుంలింగ ప్రకరణము, ప్రాగ్ఘితీయ ప్రకరణము, విభక్త్యర్థ ప్రకరణము ఆది స్థలాలలో ఆ ప్రస్తావన వున్నట్లు జ్ఞాపకం. ఇది దీర్ఘకాలిక స్మృతి. మీరు సద్యోసక్తిగ్రస్తులు గనుక దయచేసి ఒకసారి శోధించండి.

విషయం మూలతః రామాయణం భారత అనంతరం కాదా అనేదే. కొందరు పాశ్చాత్య పండితులు (ఉదా. వింటర్నిట్జ్) మూల భారతం మూల రామాయణం కంటే పూర్వమే అని అభిప్రాయపడ్డారు. వారిచ్చే అనేక కారణాల చర్చ సువిస్తృతం. నేను మాత్రం 'షోడశి'లో రామాయణాంతర్గతమైన అలంకార, వైదిక పురాణాది సంబంధిత సామగ్రిని ఆధారంగా తీసుకున్నాను. పాణినిలో రామాదుల ప్రస్తావన లేకపోవడం మాత్రం చేతనే రామాయణం పాణిన్యనంతర రచన అని ఒక సిద్ధాంతం చెయ్యటం తొందరపాటు. రామాయణం పాణిన్యనంతర రచన అనడం ఒకటి, మహాభారతానంతర రచన అనడం మరొకటి. ప్రసిద్ధ పండితులెవరూ రామాయణం పాణిన్యనంతర రచన అన్నట్లు నాకు తెలీదు. పాణిని, చరిత్రలో అలెగ్జాండర్ తర్వాత వచ్చిన ఇండో బాక్ట్రియన్ రాజుల కాలంవాడు భాసుడు కూడా ఆ కాలంవాడే కాని పాణినికి పూర్వుడని పండితాభిప్రాయం. పాణిని అలెగ్జాండరు పూర్వుడని ఎ. కె. నారాయణ్ తన "ది ఇండో గ్రీక్స్" అనే గ్రంథంలో అన్నాడుగాని, యవనాల్లిప్యాం (స్త్రీ ప్రత్యయ ప్రకరణం) కంబోజాల్లుక్ (అసత్యాదికార ప్రకరణం) అది అష్టాధ్యాయి సూత్రాల మూలంగా పాణిని యవనుల్ని, కంభోజుల్ని, వాళ్ళ లిపిని కూడా బాగా ఎరిగినవాడనాలి. (తక్షశిల సమీప గ్రామవాసి) కనక క్రీస్తు పూర్వం 4 వ శతాబ్దం అనంతరంవాడే. ఆ కాలంలో భాస పాణినులుండగా ఈ ఉభయులకు తర్వాతే రామాయణ రచన జరిగిందనడం విశ్వాసపాత్రం కాదు. బుచర్, ల్యాంగ్ అనే హోమర్ అనువాదకులు (1879) హోమర్ కాలం, క్రీస్తుపూర్వం 900-700 అన్నారు; "ది రైజ్ ఆఫ్ గ్రీక్ ఎపిక్" కర్త గిల్బర్ట్ ముర్రే హోమర్ కాలం క్రీస్తుపూర్వం 700 అన్నాడు. వాల్మీకి హోమర్‌కు ఇంత కాలం తర్వాతవాడా!

**టి. వేదాంతసూరి, హైదరాబాద్**

ప్రశ్న : మహాశయా! పురాణాలు మన దేశంలో ఆధునికత అడుగు పెట్టనీకుండా వున్న గోడలు అంటాను, మీరేమంటారు?

జ : మీ పొరపాటంతా ఇతర దేశాల్లో పురాణాలు లేవనుకోవడంలోనే ఉంది. గ్రీకు, రోమన్ భాషల్లో మైథాలజీ అనే పేరుతో పురాణాలున్నాయి. ఆయితే, అవిఇతిహాసాల్లో, కావ్య నాటకాల్లో మిశ్రితమై ఉన్నాయి. భారత

దేశంలో కూడా అతి ప్రాచీన కాలంలో అలాగే ఉండేవి. కాని, తర్వాత పురాణాల్ని శ్లోకబద్ధం చేసి, 18 పురాణాలు, 18 ఉప పురాణాలు అని క్రోడీకరించారు. అయినప్పటికీ, కొన్ని మిగిలిపోయాయి. కాని, పురాణాల్ని క్రోడీకరించి ఛందోబద్ధ సంపుటాలుగా చేయడం అన్యదేశాల్లో అతి క్వాచిత్కంగా తప్ప విరివిగా లేదు. అన్యదేశాల్లో మైథాలజీ కెక్కని ఎంతో పౌరాణిక సామగ్రి జానపద వాఙ్మయంగా మిగిలిపోయింది. భారతదేశపు జానపద వాఙ్మయం కూడా అంతే. ఇటీవలే అంకమ్మ కథ అనే ఒక జానపద సామగ్రిలో నేను అనేక ఆశ్చర్యాలు చూచాను. ఆ అంకమ్మ కథ ఋగ్వేద పూర్వకాలాన్ని ప్రతీకాత్మకంగా చిత్రించిన ఉదంతం. అంకమ్మ కథనే ఋగ్వేదం తీసుకుంది, ఋగ్వేద ప్రతీకలతో ఉదంకోపాఖ్యానం చేసి భారతం తీసుకుంది. ఇదే కథ సుమేరియన్ ఇతిహాసం గిల్గమేష్‌లో ఉంది. మన వామన కథ ఫిన్లండు పురాణాల్లో ఉంది. ఐరిష్ పురాణం తౌతాదెదన్నాన్ ఎండ్ ది మైలీషియన్స్ అనేది గ్రీకు వాఙ్మయం కంటే పురాతనమట! ఇదంతా చూస్తే, మన తిలక్ ప్రతిపాదించిన ఉత్తరధ్రువం ఆర్యుల తొలి నివాసం అనే సిద్ధాంతం నిజమే ననిపిస్తుంది. పురాణాలు చాలా అక్కడ్నించి ఇక్కడికి వచ్చినట్లు తోస్తుంది. ఏ దేశమూ, ఏ ప్రజలూ పురాణ రహితంగా లేరు. పురాణాలు ప్రజల వికాస సంపద, ఐంద్రజాలిక సంపద, ఆబాలగోపాలానికి ఆకృతి ఇచ్చే సంపద; దాన్ని గురించి మనం గర్వించాలి గానీ ఏడవకూడదు. మన స్వర్గ నరకాలు, మన దేవతలు, మన పాప పుణ్యాలు, మన ప్రాయశ్చిత్త అపరకర్మాదులు అన్ని దేశాల్లోనూ ఉన్నాయి ఉదా: మన వాళ్ళు పరలోకం చేరేముందు వైతరణీ నది ఉందంటారు, అలాగే గ్రీకులకు హేడ్స్ (పరలోకం) చేరేముందు స్టయిక్స్ అనే నది ఉంది. దాన్ని దాటందే హేడ్స్ ప్రవేశించలేరు ఇక్కడ విద్యుక్త అంత్యక్రియలు చేయందే ఒక మృత మానవుడు వైతరణీ దాటి పరలోకం ప్రవేశించలేడు; అంత్యక్రియలు మతానుసారంగా జరపందే గ్రీకు మానవుడు కూడా స్టయిక్స్ దాటి హేడ్స్ ప్రవేశించ లేడు; 100 సంవత్సరాలు ప్రేత రూపంతో నది ఇతవలే పడి ఉంటాడు. పురాణాలు సృజనాత్మక విలాసాలు, ఆధునికతకు అడ్డుగోడలు కావు.

(20-2-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**రాయిపల్లి శ్రీ, హైదరాబాద్**

ప్రశ్న: నాకు కవితాసక్తి ఖలే మెండు. ఖావాలు ఏకం కావడం లేదు. అసలు రావడం లేదంటే బాగుంటుందేమో! అసలు ఆ ఆలోచనే మానుకుని పామరజనంలో కలిసి పిచ్చిగా వుంటే బాగుంటుందంటారా?

జ: పామర జనంలో కలిసి పిచ్చిగావుండే అదృష్టం నాకు కలిగితే బాగుండునని కలలు కంటుంటాను. ఆ పరమానందం, ఈ కవిత్వంరాని అర్ధ మైన వెధవల అసూయా ద్వేష విషదంష్ట్రల్లో చిక్కుకుని గిలగిల కొట్టుకోవడం కంటె, చాలా గొప్పది. ఈ బురదలో ఎందుకు కాలు పెడతారు?

**స్టోన్, పెద్దచెల్మెద**

ప్రశ్న: కాళోజీని కలిసినప్పుడు మీ గూర్చి 'ఆయన కవేనా?' అనడి గాను. అందుకాయన సీరియస్‌గా 'కవి అంటే ఆయనే. కవిత్వ లక్షణాలున్న మంచి మనిషి. నిజమైన ఆర్ట్ వుంది' అన్నారు. 'గంధర్వ అంశ వున్నవాళ్ళకే అలాంటి సుగుణాలు లభ్యమౌతాయా?' అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. మీరేమంటారు?

జ: శ్రీ కాళోజీ కావ్యాశ్రమ ముని. కనుక కరుణాళువు కూడా. గంధర్వ అంశ గురించి నాకు తెలీదు; కానీ ప్రాచీనులు ఇలా అన్నారు: 'న అనృషిః కురుతే కావ్యం న అగంధర్వః సురూపధృక్, న అదేవాంశః దదాత్యన్నం న అవిష్ణుః పృథివీ పతిః.'

**కురువెళ్ళ ఖావనారాయణ, వికారాబాద్**

ప్రశ్న: దిగంబర కవిత్వము ఉద్యమమా? "నా దేశం నా ప్రజలు" పునరుక్తి కాదా?

జ: దిగంబర కవిత్వం ఉద్యమమా కాదా అనే విషయం నేను నిర్ణయించ నక్కరలేదు. ఇలాంటి విషయాల్లో ఎవడికి వాడే బాధ్యత వహించాలి. దానికి సాహిత్య శాస్త్ర జ్ఞానం కావాలి. మొదట ఉద్యమం అంటే ఏమిటో, దాని లక్ష ణాలు తెలుసుకుంటే కావలసిన జవాబు దొరుకుతుంది - ఒక సామాజిక ఒత్తిడి పిలుపుకు జవాబుగా వచ్చే ఝంఝూ పవనం ఉద్యమం. ఆ ఒత్తిడి దాటిపోగానే ఈ ఉద్యమం కూడా అంతర్ధానం అయిపోతుంది. చరిత్ర పరిశీలిస్తే సాధారణంగా

సాహిత్య ఉద్యమాలు 25 సంవత్సరాలు, రాజకీయ ఉద్యమాలు 50 సంవత్స రాలు, మత ఉద్యమాలు 100 సంవత్సరాలు జీవిస్తాయని తెలుస్తుంది. తర్వాత, ఉద్యమాలు మహా పురుషుల చేతుల్లో ఉద్భవిస్తాయి, అన్యుల చేతుల్లో కాదు. భావ కవిత్వ కర్తలైన రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభృతులు గానీ, ఇంగ్లండులో వర్డ్స్‌వర్త్, కోలెరిడ్జ్, షెల్లీ, కీట్సు ప్రభృతులుగానీ, కమ్యూనిస్టు ఉద్యమానికి కర్తలైన లెనిన్, స్టాలిన్ ప్రభృతులుగానీ, భారత జాతీయ కాంగ్రెసు ఉద్యమ కర్తలైన బాలగంగాధర తిలక్, గాంధీ, నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ లాంటివారు గానీ, అద్వైత ఉద్యమానికి కర్త అయిన శంకారాచార్యులు గానీ, వీరశైవానికి కర్తలయిన బసవేశ్వరుడు, పాల్కురికి సోమనాథుడు, పండితా రాధ్యుడులాంటి వారుగానీ మిడిమిడి జ్ఞానపారీణులైన యువకులు, అర్ధ యువకులు, అర్భకులు కారు. పాండిత్యము, జీవన దర్శనము, మహా పురుష త్వము ఉన్నవారు - ఆ తర్వాత, ఉద్యమం కాల ప్రభావంగా పుట్టి ప్రజల మీద ప్రవహించే ప్రవాహం; అది అయిదారుమందికి పరిమితమైన లిమిటెడ్ కంపెనీ కాదు. ఇలాంటి కీలక లక్షణాలు దృష్టిలో పెట్టుకుని విషయాన్ని పరిశీలించండి, జవాబు దొరుకుతుంది.

ఇక 'నా దేశం - నా ప్రజలు':

పునరుక్తి కాదు - దేశం అన్నప్పుడు భూమి, చెట్లు, కొండలు, నదులు, నగరాలు, గ్రామాలు, మనుషులు మాత్రమేకాదు- దేశం చిరంతన పదార్థం. దాని మీద ఉన్న మనుషులు శత వర్ష పరిమిత ఆయుష్కులు. ఒక తరం పోతుంది మరో తరం వస్తుంది. దేశంలో ఇలా ఎన్నో తరాలు పోతుంటాయి వస్తుం టాయి; అంతంలేని తరాల తరంగాలు ప్రతి తరమూ దానికి ప్రియమైన భాషను, సాహిత్యాన్ని, ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థల్ని, విలువల్ని కొత్తగా తయారుచేసుకుంటాయి. వంద ఏళ్ళనాటి భాషని మనం ఇవాళ మాట్లాడం. అలాగే అన్ని మానవీయ వ్యవస్థలు, విలువలున్నూ; ఎంతో చరిత్ర మారింది, ఎన్నో యుద్ధాలు జరిగాయి; దేశంలో ప్రజలు ఎన్నో జయాప జయాలు, సుఖ దుఃఖాలు అనుభవించారు. కనుక దేశమంటే మనుషులోయ్ అన్నప్పుడు ఏ మనుషులోయ్? ఏదో ఒక తరపు మనుషులు కాదు. దేశం అంటే ఆద్యంతాలు లేని అనేక తరాల మనుషులు, సుదీర్ఘంగా ప్రవహిస్తున్న వాళ్ళ చరిత్ర, దారులు మార్చుకుంటున్న నదీనదాలు, ఒకచోట అదృశ్యమవుతూ, ఒక

చోట పుడుతున్న అరణ్యాలు, ఔన్నత్యాలు మార్చుకుంటున్న పర్వతాలు, రేఖలు విప్పుకుంటున్న సముద్ర తీరాలు - ఇలా ఎన్నో కలిస్తే దేశం. దేశమంటే కేవలం మనుషులనుకోవడం సామాన్యుడు ఆ శబ్దంలో చూచే లోతు; వెనుక చెప్పిన విరాట్ స్వరూపమంతా ఆ శబ్దంలో కవి చూచే లోతు. కనుక, నా దేశం నా ప్రజలు పునరుక్తి కాదు. కవిత్వంలో వచ్చేవి సామాన్య శబ్దాలే అయినా, వాటిని సామాన్యుడిలా గాక కవిలా చూడటానికి ప్రయత్నించాలి. అట్టి ప్రయత్నమే సాహిత్య అధ్యయనం.

**రేలంగి శ్రీనివాసరావు దొంతుకుర్రు**

ప్రశ్న: ఒకనాడు మహా గ్రంథాలు వెలసిన ఈ భరత భూమిలో నేడు ఒక్క మంచి నవలైనా లేకపోవడానికి (వ్రాసేవారున్నా) కారణమేమిటి? వివరించగలరు. మనిషిపై సాహిత్యం ప్రభావం వివరించగలరు.

జ: మీరు చాలా గొప్ప ప్రశ్న వేశారు. ఇది ఒక జాతి తన అంతః శోధన చేసుకోడానికి ప్రేరితం చేసే ప్రశ్న. నీతి కోల్పోయి నిర్వీర్యమైన జాతిలో నుంచి కనీసం గడ్డి కూడా మొలవదు. ధైర్యం కోల్పోయిన దేశం దరిద్ర దేవతకు దేవాలయం, దొంగలకు రహదారి, తిరుగుబాటుకు సజీవ సమాధి. ఒక మంచి కథ పుట్టాలంటే ఆ జాతిలో ఎంతో సత్త్వముండాలి. ఎంతో సాహస ముండాలి. ఎన్నో యుద్ధాలకు, రక్తపాతాలకు, ఎన్నో జయాపజయాలకు, ఎన్నో మానవ భూకంపాలకు ఆ జాతి గురి అయివుండాలి. ఇలా శాశ్వతంగా ఆరి పోయిన బూడిద పోగులోనుంచి ఏ కథ పుడుతుంది, ఏ అలంకారం, ఏ ప్రతీక ఉదయిస్తుంది. కథ పుట్టాలన్నా,ప్రతీక పుట్టాలన్నా మనిషిలో ఫీలింగు వుండాలి. అది పునాది. ప్రక్కవాడు చస్తుంటే తన దారిన తానుపోయే ఈ దేశంలో-ఏనాడో ఫీలింగు చచ్చిన ఈ దేశంలో కథ ఎలా పుడుతుంది?! గొప్ప కావ్య తత్త్వవేత్త ఆర్చిబాల్డ్ మెక్లీషు అంటాడు "ది క్రైం ఎగెనెస్ట్ లైఫ్, ది వర్స్ట్ ఆఫ్ ఆల్ క్రైమ్స్, ఈజ్ నాట్ టు ఫీల్" (జీవితం మీద చేసే అపచారాలలో అతి ఘోర మైన అపచారం ఫీలింగు కోల్పోవడం, అంటే కరుణ కోల్పోవడం). దీని పర్యవ సానంగానే ఒక జాతి సాహిత్య సృజనా శక్తిని కోల్పోతుందంటాడు. "వ్హెన్ ఎ మెటఫర్ డైస్ ఎ సివిలిజేషన్ డైస్" (ఒక అలంకారం చచ్చిపోయిందంటే ఒక నాగరకత చచ్చిపోయిందన్నమాటే - అర్థాత్ నాగరకతకు, అలంకారానికి ఒక

సజీవ అవినాభావ సంబంధం వుంది). దీన్ని మీలో మీరు వ్యాఖ్యానించుకుంటే మీ ప్రశ్నకు జవాబు దొరుకుతుంది.

(27-2-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**ఎం. లక్ష్మణాచార్యులు, హైద్రాబాద్**

**ప్ర. ఆదునికాంధ్ర కవితపై పారిశ్రామిక విప్లవ ప్రభావం ఎంతవరకు పడింది? అది ఏ విధంగా పడింది?**

జ, వస్తువుల ఉత్పత్తి విధానంలో వచ్చిన కొన్ని మహత్తర ఆధునిక మార్పుల మూలంగా 18 వ శతాబ్దం ఉత్తరార్ధం నుంచి 19 వ శతాబ్దం ఉత్తరార్ధం వరకు వున్న నడిమి కాలంలో ఇంగ్లండు వ్యవసాయ గృహ పరిశ్రమల వ్యవస్థ నుంచి ఆధునిక పారిశ్రామిక వ్యవస్థకు చేరడం ఏదయితే వుందో ఆ సంఘటనను పారిశ్రామిక విప్లవమన్నారు. దీనికి మూలతః ఉత్పత్తి విధానంలోకి ప్రవేశించిన ''యంత్రం" కారణము. దాని సామాజిక, రాజకీయ, పారిశ్రామిక, చారిత్రిక పరిణామా లేమిటో అందరికీ తెలిసినవే. ఇంగ్లండులో పుట్టిన పారిశ్రామిక విప్లవం అమెరికా, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్‌లలోకి ఇంచుమించు అదేకాలంలో వ్యాపించింది. ఇలాంటి పారిశ్రామిక విప్లవం ఖండ ఖండాంతరాల్లోకి ప్రాకడానికి చాలాకాలం పట్టింది. ఆసియా దేశాలు ఇంకా ఆ దశకు చేరలేదు. ఈ విషయం ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, ఇండియామీద పారిశ్రామిక ప్రభావం ఏమిటంటే, సమాధానం క్లుప్తంగా, సూటిగా చెప్పలేము.

ఇండియాలో ఉత్పత్తిరంగం మీద దాని ప్రభావమేమిటో మొదట తెలుసుకోవాలి. అలాంటి ప్రభావం వుంటే అది సాహిత్యం మీద, సమాజం మీద ఏం చేసింది అని వివేచించవలసిన అవసరం గుర్తింపబడుతుంది. ఇంగ్లండులో వచ్చిన పారిశ్రామిక విప్లవాన్ని ఇండియా మీద మొదట కలోనియనిజంగా, తర్వాత ఇంగ్లీషు విద్యా విధానంగా, తద్వారా ఇంగ్లీషు సాహిత్యకర్తల సంపర్కంగా, తద్వారా పాశ్చాత్య జీవనవిధాన జీవనదృక్పథాల పరిచయంగా, తద్వారా భారత దేశంలో ఒక నూతన వాతావరణోదయంగా మనము చూశాము. ఆ నూతన వాతావరణమే రాజకీయాల్లో స్వాతంత్ర్యోద్యమంగా, సంఘ సంస్కరణలుగాను, సాహిత్యంలో భావకవిత్వంగాను సంభవించాయి. కమ్యూనిస్టు ఉద్యమం మాత్రం నేరుగా రష్యాలో వచ్చిన అక్టోబర్ రివల్యూషన్ మూలంగానే వచ్చిందనేది

శ్రీ ఉన్నవవారి "మాలపల్లి" ద్వారా, 1936 లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతన జరిగిన అభ్యుదయ రచయితల సమావేశం మూలంగానూ తత్కాలీన రాజకీయ సంఘటనల చేతను తెలుస్తుంది. ఐరోపాలోలాగా పారిశ్రామిక విప్లవం మూలంగా కాపిటలిస్టు సమాజం పుట్టి, తద్వారా కమ్యూనిస్టు ఉద్యమం రావడం అనే రాజకీయ పరిణామ క్రమం మన దేశంలో జరగలేదు కనుక పారిశ్రామిక విప్లవ దూర ప్రతిధ్వనులుగా, అక్టోబర్ రివల్యూషన్ సన్నిహిత ప్రకంపనలుగా మన సాహిత్యంలో, అందులోనూ తెలుగు సాహిత్యంలో మార్పులు వచ్చాయి. ఈ రెండు ప్రవాహాలూ మన సాహిత్యంలో ప్రవహించాయి. ఒక ప్రవాహం కాలపు ఇసుకల్లో ఇంకిపోగా, మరొక ప్రవాహం ఇంకా ప్రవహిస్తూనే వుంది.

**ఆర్. వి. రాఘవరావు, ఒంగోలు**

ప్ర. తెలుగు సాహిత్యానికి సంబంధించి చాలామంది శ్రీ చలం గారిని వివాదాస్పదమైన వ్యక్తిగా భావిస్తారు. ఒక పాఠకుడిగా చలంగారి రచనలపై మీ అభిప్రాయం ఏమిటి?

జ. ఆయన సాహిత్యం కళాస్వరూపము. ఆయన బోధించిన విలువలు వివాదగ్రస్తమైనవి. ఆదర్శానికీ, ఆచరణీయతకు, చిత్తశుద్ధికి, శిష్ట వ్యవహారానికి మధ్య జరిగే తీవ్ర సంఘర్షణకు ఆయన జీవితం ఒక ప్రతీక.

**అన్నాబత్తుల వెంకయ్య, నందిగామ**

ప్ర. దేవులపల్లి, శ్రీశ్రీ గొప్ప కవులు కదా! వారిమీద మీ అభిప్రాయ మేమిటి? ప్రస్తుత కవిత్వం ఏ విధంగా వున్నది?

జ. వారు గొప్ప కవులనే నా అభిప్రాయము. ప్రస్తుత కవిత్వం అన్ని కాలాల్లోలాగే పలు పలు విధాలుగా వుంది

**శైలశ్రీ, హైదరాబాద్**

ప్ర. భావాలు పరుగెత్తుకు రాగ కవి అయినారా? లేక ఆలోచిస్తూ జీవితం సార్థకం చేసుకుందామనే కవిత్వం వ్రాస్తున్నారా?

జ. జీవితం సార్థకం చేసుకుందామనే ఒక బుద్ధిపూర్వక ఉద్దేశంతో ఏ కవీ కవిత్వం రాయడు. జీవన తుపానుల్లో కొట్టుకుపోతూ ఏ కొమ్మో ఆశ్రయంగా దొరికినప్పుడు చేసుకునే సమీక్ష కవిత్వం. ఇది అవిచ్ఛిన్నంగా జరిగే

దీర్ఘకాలిక ప్రక్రియకాదు; అప్పుడప్పుడూ చెప్పకుండా వచ్చి సంభవించే విద్యుత్తు లాంటి సంఘటన.

**కొర్ల రమేష్‌నాయుడు, మచిలీపట్నం**

ప్ర. సాహితీ ప్రపంచంలో ఆధునిక కవిత్వం ఎప్పుడు ఉద్భవించింది? తొలుదొల్త ఆధునిక కవితను వ్రాసిన కవి ఎవరు? ప్రాచీన సాహిత్యానికి ఆధునిక కవిత్వానికి గల ప్రముఖమైన భేదమేది?

జ. రొమాంటిక్ కవిత్వంతో ప్రపంచంలో ఆధునిక కవిత్వం ఉద్భవించింది. (19 వ శతాబ్దం.) మొదట ఫ్రాన్స్, జర్మనీల్లో, తర్వాత ఇంగ్లండ్‌లో ప్రారంభమయింది. ఫ్రాన్సులో హ్యూగో, లా మార్టిన్, జార్జ్ శాండ్, బాల్జాక్ ప్రభృతులు, జర్మనీలో ష్లీజెల్ సోదరులు, షెల్లింగ్, ఇంగ్లండ్‌లో వర్డ్స్‌వర్త్, కొలెరిడ్జ్, కీట్స్, షెల్లీ వగైరాలు ఈ ఉద్యమానికి మూల పురుషులు.

ప్రాచీన కవిత్వం ప్రధానంగా కథాకావ్యం. ఆధునిక కవిత్వం ప్రధానంగా అలంకార కావ్యం; అంతేకాక కథారహితం కూడా. ఆధునిక కవిత అలంకార ప్రధాన కవిత కావడానికి కారణం ముసలి కథ ఆధునిక కవితలో నుంచి విడిపోవడమే. ఆధునిక సాహిత్యంలో కథ వేరు, కవిత్వం వేరు. ప్రాచీన సాహిత్యం ఈ రెండింటి మిశ్రమం.

**టి. అవంతి, హన్మకొండ**

ప్ర. భావకవిత్వం అంటే ఏమిటో తెలియచేస్తారా? సాహిత్యంలో విమర్శనా పరిజ్ఞానం అలవడాలి అంటే ఏయే గ్రంథాలు చదవాలి? లేక ముందుగా మన మనసులో ఎలాంటి స్పందన కలగాలో తెలియచేస్తారా?

జ. భావకవిత్వం అంటే రాయప్రోలు సుబ్బారావుగారి తృణ కంకణం లాంటిది, కాళిదాసుగారి మేఘ సందేశం లాంటిది. శాస్త్రీయంగా ఏమిటంటే - భావమంటే 'మూడ్'; ఈ 'మూడ్' పఠితను కావ్యంతో తాదాత్మ్యంపొందేదాకా తీసుకుపోదు. ఒక భావాత్మక సుడిగుండం కలిగించి అందులో తిప్పుతుంది. వృక్షచ్ఛాయామాత్ర అహ్లాదం ఇస్తుంది; ఇల్లును ఇవ్వదు. భావకవితలో కథాలేశం వుంటుంది, ఉండకనూ పోవచ్చు. కానీ రసపర్యవసాయి కవితలో కథ సంపూర్ణంగా వుంటుంది.

సాహిత్యంలో విమర్శనా పరిజ్ఞానానికి టి. ఎస్. ఇలియట్, జార్జ్ శ్యాంటాయనా, అన్నెర్‌జిస్, షెప్పర్డ్నా, లూనాషార్స్కీ ఇత్యాది గ్రంథకర్తలను చదవాలి.

(6-3-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**మేడిపల్లి విష్ణుమూర్తి బేగంపేట**

ప్ర. మంత్ర, తంత్ర శాస్త్రాలను లోతుగా అధ్యయనం చేశారు. షోడశి, స్వర్ణహంసలాంటి గొప్ప గ్రంథాలను రాశారు మీరు. విప్లవ కవిగా ప్రస్తుతం మంత్ర, తంత్ర శాస్త్రాలమీద మీ అభిప్రాయం ఏమిటి?

జ. మనిషి భౌతిక, అధిభౌతిక భాగాల సంయోజన. ఈ రెంటిలోనూ మానవుడు శిఖరాన్ని చేరడానికి ప్రయత్నం చేస్తాడు; చేశాడు; చేస్తున్నాడు. దీని స్పష్టమైన సాక్ష్యం మానవ చరిత్ర అన్ని పేజీల్లోనూ దొరుకుతుంది. భౌతిక, అధిభౌతిక భాగాలని రెండు లేవు- ఏదో ఒకటే వుంది అని చెప్పేవాడు మూర్ఖుడు. అయితే మూర్ఖుడు అతి ధైర్యశాలి. బేదాభిప్రాయం మీద ప్రచారంగా దండయాత్ర చేస్తాడు.

**కె.వి.వి.యస్. మూర్తి, భద్రాచలం**

ప్ర. 'ఎజ్రాపౌండ్' సాహిత్యంలో తెచ్చిన విప్లవం ఏరకమైనది? దాన్ని గూర్చి వివరించగలరు.

జ. ఎజ్రాపౌండు యొక్క అపార అన్యభాషా సాహిత్య ఆసక్తి మూలంగా, అప్పటికే యూరోప్‌లో అంకురించి పెరుగుతున్న అంతర్భాషా సాహిత్య చైతన్యం అంతర్జాతీయ సాహిత్య చైతన్యంగా పరిణమించడానికి మార్గమైంది. మాథ్యూ ఆర్నాల్డ్ తత్పూర్వం అన్నాడు - "యూరప్ ఈజ్ ఎ గ్రేట్ కాన్‌ఫెడరేషన్ ఆఫ్ థాట్ ఎండ్ ఫీలింగ్. ది క్రిటిక్ మస్ట్ టేక్ యూరోప్ యాజ్ ఎ కాన్‌ఫెడరేషన్ ఫార్ ఆల్ ఇంటలెక్చుఅల్ ఎండ్ స్పిరిచుఅల్ పర్పసెస్'' - (యూరోప్ భావాత్మకంగా, చింతనపరంగా ఒక పెద్ద ఐక్య రాజ్యసమితి. సాహిత్య విమర్శకుడు యూరోపును బౌద్ధిక ఆధ్యాత్మిక ప్రయోజనాలకు ఆ దృష్టితోనే స్వీకరించాలి.) అందుచేత ఆయన ''ఎ క్రిటిక్ మస్ట్ హేవ్ అనదర్ లిటరేచర్ బిసైడ్స్ హిజ్ ఓన్'' అనీ, ''హిమస్ట్ ప్రొవైడ్ ఎ స్టాండర్డ్ టు హిజ్ ఓన్ లిటరేచర్'' అనీ అన్నాడు. (ఒక విమర్శకుడు

తన భాషలో వున్న సాహిత్యమేగాక అన్య భాషల్లో వున్న మరొక సాహిత్యం కూడా హస్తగతం చేసుకోవాలి! తద్వారా తన సాహిత్యానికి ఒక ప్రమాణం, ఒక మానదండం ఇవ్వాలి.) ఈ భావ బీజమే టి. ఎస్. ఇలియట్‌లో "మైండ్ ఆఫ్ యూరోప్" అనే కాన్సెప్ట్‌కి కారణమయింది. తత్పూర్వం ఇలియట్ గురువు జార్జి శాంటాయనా రాసిన ఒక వ్యాసంలో ల్యూక్రీషియస్, దాంతే, గెటే అనే ముగ్గురు విభిన్న కాలాల, విభిన్న ప్రాంతాల కవుల్ని తీసుకుని యూరప్ యొక్క జిజ్ఞాసా దశాత్రితయాన్ని చర్చించాడు. తర్వాత ఫ్రాన్స్‌లో పాల్ హజార్డ్ యూరపియన్ కాన్షన్స్ అన్నాడు. (ఐరోపా అంతరాత్మ.) తర్వాత జర్మన్ కవి గెటే ప్రపంచ సాహిత్యమనే చిత్రాన్ని వాఙ్మయ క్షేత్రంలో ఎగరేశాడు. మధ్యలో జె. బి ప్రీస్ట్లీ యూరోపియన్ మైండ్‌ని వెస్టర్న్ మైండుగా విస్తరించాడు. అది కూడా చెప్పుకోవాలి. అంతతః, యూరోపియన్ సాహిత్యంగా రూపొందిన భావం ఎజ్రాపౌండ్ చేతిలో ప్రపంచ సాహిత్యమనే కాన్సెప్ట్‌గా మారింది. ఆయన అంటాడు, "ఎ పొయెట్ షుడ్ బి జడ్జ్‌డ్ ఆన్ ది బేసిస్ ఆఫ్ వరల్డ్ పోయిట్రీ, ఆన్ ది బేసిస్ ఆఫ్ ఎక్సలెన్స్, అయాం కన్‌సర్న్‌డ్ నాట్ విత్ వన్ లిటరేచర్, బట్ విత్ లిటరేచర్ ఆఫ్ ఆల్ ప్లేసెస్." (ఒక కవి ప్రతిభ ప్రపంచ కవిత్వం ఆధారంగా నిర్ణయించబడాలి; గరిష్ఠ మానదండంతో కొలువబడాలి. నా ఆసక్తి ఒక చోట పరిమితమై వున్న సాహిత్యంమీద కాదు, అన్ని చోట్లా వున్న సాహిత్యం మీద.) ఆయన క్యాంటోస్‌లో చేసిన జపానీస్, చైనీస్ కవిత్వానువాదాలు ఐరోపీయ సాహిత్య దృక్పథ పరిధుల్ని సప్తసాగర పర్యంతం విస్తృతం చేశాయి; ఆధునిక కవికీ, ఆధునిక మానవుడికి కావలసిన కాస్మోపాలిటన్ లిటరరీ సెన్సిబిలిటీని ప్రదానం చేశాయి. ఈ విశాల సాహిత్య విప్లవానికి ఎజ్రాపౌండ్ అంతిమ స్వరూప ప్రదాత.

ఇలా దీర్ఘ సమాధానాలు అనివార్యమయ్యే ప్రశ్నల్ని పాఠకులు వెయ్య వద్దని మనవి.

**టి. రేణుకాదేవి, భువనగిరి**

ప్ర. నేను 'శ్రీశ్రీ' గారిని ఎంతో అభిమానిస్తాను. ఆయన దృష్టిలో "శిల్పికి ఉలి కావాలి. కవికి కలం కావాలి. మగాడికి ఆడదీ, ఆడదానికి మగాడూ కావాలి. ఇందులో ఏ ఒక్కటి రెండోదాన్ని ప్రేమించ నక్కర్లేదు." ఇది తెలిశాక బ్రమాన్పడిపోయాను - వ్రాసింది శ్రీశ్రీ యేనా అని. శ్రీశ్రీ రచనల్లో, దృష్టిలో 'స్త్రీ' అలా ఎందుకుందో వివరించగలరా?

జ. మీరేకాదు నేను కూడా "భ్రమాన్పడిపోయాను" శ్రీశ్రీ నాకు సన్నిహిత స్నేహితుడే కానీ, ఈ జీవన కోణాలతో నాకు ఎప్పుడూ పరిచయం కలగలేదు.

**తేజోమూర్తుల శ్రీనివాసశర్మ, నిడగల్లు**

ప్ర. రైతుకి గిట్టుబాటు ధర ప్రకటిస్తే ధరలు పెరుగుతాయి కదా! మరి నేటి ప్రభుత్వాలు గిట్టుబాటు ధర అంటూనే ధరలు అదుపు చేస్తామంటే ఈ రెంటికి సమన్వయం ఎలా కుదుర్తుంది? వివరించగలరు.

జ. అసలు బాబూ - మన దేశంలో ఈ రైతు అన్న మాట ఒక మాయా బజార్ భాష. దేశంలో అర ఎకరం వున్న రైతు అయిదెకరాలున్న రైతునుంచి అయిదు వందలు లేక వేలాది ఎకరాలున్న రైతుల వరకూ వున్నారు. వేలాది ఎకరాలున్న రైతుల్నీ రైతు అంటారు. రైతన్నా అంటూ సానుభూతి కురిపిస్తారు. ఆదే అర ఎకరం వున్న రైతు అనే ఎముకల గూడుకూ వర్తింపజేస్తారు. వీళ్ళందరూ కలిసి రైతు సంఘం! నాగార్జున సాగర్ డామ్ నిర్మిస్తే ఆ నీళ్ళు భూస్వాములనవలసిన వేలాది ఎకరాలున్న రైతుల పొలాలలోకి ప్రవహిస్తాయి. అర ఎకరా రైతుకు పుడిశెడు నీళ్ళు ప్రవహిస్తాయి. తమ చేతులతో డామ్ నిర్మించిన వాళ్ళకు మాత్రం ఒక్క బొట్టు నీరుకూడా ప్రవహించదు. కారణం? వాళ్ళకు పొలాలే లేవు నీళ్ళు ప్రవహించడానికి. మరి కోట్లాది రూపాయిల ప్రజా ద్రవ్యం, కోట్లాది కూలీ మానవుల శారీరక శ్రమ ఆ డామ్ నిర్మాణంలోకి పోయి బడ్డాయి. "ధనికుల పొలాల్లోకే ప్రవహిస్తున్నాయి దేశంలో నదులన్నీ కలిసి, స్వప్నాల గోల లేని నిద్రపోతున్నారు ప్రజలంతా కలిసి." (ఆధునిక మహా భారతము) - అందుకనే బాబూ మాయాబజారన్నాను. రైతులకు గిట్టుబాటు ధరలు అంటే భూస్వాములకు అత్యధిక ధనలాభం కలిగించే ధరలు! తిండి గింజలు కావలసిన సాధారణ పౌరుడికి అది గిట్టుబాటు ధర కాదు. పాడ్యమి చంద్రుడిలాంటి వాడి దృశ్యాదృశ్య రాబడిలో వాడు తిండి గింజలు ఆ ధరకు కొనలేడు. ఇది ప్రజా సామాన్యంమీద బ్రహ్మాండమైన పీడన యంత్రాంగం. బక్క రైతులు, మధ్యతరగతి రైతులు కూడా ఈ ధరల మాయాజాలంలో దెబ్బతింటున్నారు. దీనికి ఒక్కటే పరిష్కారం. భూసంస్కరణలు, వాటిని అతి త్వరగా, అతి కఠినంగా అమలుజరపడమే.

**శిరీష, నిజామాబాద్**

ప్ర. శేషేంద్రగారూ! శోషగ్రస్త సమాజానికి సాహిత్యం సంజీవి కాగలుగుతుందా? సాహిత్యకారుల్లోని అనైక్యతాభావం.... సంఘంలో ఐక్యతను సాధించగలుగుతుందా?

జ. శోషిత సమాజానికి సాహిత్యమే సంజీవిని. సాహిత్యకారుల్లో అనైక్యత సమాజంలో అనైక్యతకు దారితీయదు. కారణం? సమాజం సాహిత్యాన్ని చదువుతుంది గానీ, సాహిత్యకారుల్ని కాదు. *

(13-3-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**శ్రీశైలం, హైదరాబాదు**

ప్ర. వాదేశబ్దాల్లో ఎవరిదారి వారిదైనా ప్రతిభావంతుల భావాలు ఒక్కటే నని మా అభిప్రాయం. ఉదా- "నేను సైతం భువన భవనపు బావుటానై పైకి లేస్తాను"; "నేనొక పిడికెడు మట్టినే కావచ్చు; కలం కదిత్తే ఒక జెండాకున్నంత పొగరుంది'' వాక్యాలను చూస్తుంటే విషయం ఒక్కటేనని, తీరు వేరని అనుకుంటాం. దేశభక్తిని ఎలా వివరించారని అనుకుంటాం. ఒకోసారి గురజాడ గుర్తుకు వస్తారు. మీరు మాతో ఏకీభవిస్తారా?

జ. అవును - మీతో ఏకీభవిస్తాను.

**రేడియమ్, గద్వాల**

ప్రశ్న. తెలంగాణా విమోచనోద్యమం ఫ్యూడల్ భూస్వామ్య సంబంధాల నుంచి విముక్తి అనే అర్థంలో ఇంకా అసంపూర్ణంగానే మిగిలిపోయిందని వివాదం వుంది. ఎంతవరకు వాస్తవం?

జ. అనాటి కేంద్ర ప్రభుత్వ జోక్యం మూలంగా తెలంగాణా విమోచనోద్యమం ఫ్యూడల్ భూస్వామ్యం నుంచి కూడా విముక్తి సాధించలేదు. దేశంలో సర్వత్రా ఫ్యూడల్ భూస్వామ్యం యథాతథంగా వుంది; పూర్వంకంటె సురక్షితంగా వుంది. ఈ వర్గానికీ, నవీన ఇండస్ట్రియలిస్టు వర్గం ఒకటి బలీయమైంది కోడయింది. ఈ మిథునానికి పుట్టిన శిశువులే నేడు మన దేశంలో వున్న ప్రభుత్వాలు. ఈ ప్రభుత్వాలకు ఓటింగు విధానం వాటంగా దొరికింది ఒక బ్రహ్మాండమైన ఆత్మరక్షణ యంత్రాంగంగా.

**టి. ఉమామహేష్, టి. వి. దాస్**

ప్ర నేటి సమాజంలో కారణాంతరాలవల్ల ఒక స్త్రీ వివాహితగా దాంపత్య జీవితాన్ని గడపలేక తన స్వశక్తితో గౌరవంగా జీవితాన్ని గడుపుతూ వుంటే ఆమెకు వార్ధక్యంలో కలిగే భావాలు ఎలా వుంటాయి. ఆ దశలో మన సమాజం ఆమెకు ఇచ్చే విలువ ఎలాంటిది? విశదీకరించగలరా?

జ. అవసరమైతే ఒక స్త్రీ అవివాహితగా స్వశక్తితో జీవితం గడపడానికి సిద్ధపడడం గొప్ప విషయం. ఈ దేశంలో ముఖ్యంగా స్త్రీలు స్వశక్తిమీద విశ్వాసం పెంచుకోవాలి. కఠినతర జీవితాన్ని భుజంమీద వేసుకోడానికి వెనకాడ కూడదు. స్త్రీ పురుషుడు కావాలి. లైంగిక భేదాన్ని తిరస్కరించాలి. స్త్రీ ఒంటి మీద ఆభరణాలు, మొహం మీద సిగ్గు, దేహ చలనంలో వక్రరేఖలు అత్యంత గర్హనీయాలు. వార్ధక్యం స్త్రీకే కాదు-పురుషుడికి కూడా వస్తుంది. ఉభయులకూ అన్యమానవ సహాయం కావాలి. మానవతామయమైన సమాజాన్ని నిర్మించే సాహిత్యమూ రాజకీయాలూ కావాలి మనకు.

**సూరి లక్ష్మీనరసింహమూర్తి, వైరా**

ప్ర. మహాకవుల గ్రంథములు, కావ్యములు రసవంతములుగా నుండునని అందురు. ఈ 'రసము' అను శబ్దమునకు నిర్వచనము వివరముగా ఇవ్వ ప్రార్థన.

జ. ''రసము'' చాలాకాలం నుంచీ చాలా అపార్థానికి గురి అయిన 'అనాథ' శబ్దము. ప్రాచీనకాలంలో రసం. రంగస్థలం మీద నడుస్తున్న నాటకానికే వర్తించే శబ్దం. ''విభావానుభావ వ్యభిచారీభావ'' సంయోగము చేత ఈ రసము ఉత్పత్తి అవుతుందని శాస్త్రకర్త నిర్వచనము. విభావము రెండు విధాలు: ఒకటి అయిన ఆలంబన విభావము నాయికా నాయకులు; రెండవది అయిన ఉద్దీపన విభావము చంద్రిక, మలయమారుతము, ఇత్యాది కామోద్దీపన హేతుభూతములైన పరిసర సామగ్రి. రెండవది ఉంటేనే నాయికా నాయకులు ప్రేరితులౌతారు, ఒకరి వైపు ఒకరు ఉద్వేగితులై కదులుతారు, కౌగలించుకుంటారు. ఇంకా ఏవేవో చేసుకుంటారు. ఉద్దీపన విభావం లేకపోతే నాయికా నాయకులు రంగస్థలం మీద చెరొక అంచున బొమ్మల్లా ఉంటారు. కనుక ఉభయ విధ విభావాలు కావాలి. ఆ రెంటిలో నుంచే నాటకం పుడుతుంది. (అంటే నటన, ఏక్షన్.) నాటకం పుట్టే

సమయంలో సంభవించేవి అనుభావ, వ్యభిచారీ భావాలు. అనుభావాలు అంటే నాటకం చూస్తూ ప్రేక్షకుడు దానితో తాదాత్మ్యం పొందడానికి దారితీసే చెమర్పు, గగుర్పాటు, సంభ్రమము మొదలైన పాత్రల దృశ్యమాన శారీరక చిహ్నాలు. వ్యభిచారీ భావాలు ఈ దృశ్యమాన చిహ్నాలకు హేతువులైన అదృశ్య మానవ భావాలు - భయము, నిర్వేదము, క్రోధము ఇత్యాదులు. అంటే విభావ అనుభావ వ్యభిచారీ భావాలనేవి నాటకం పుట్టడానికి కావలసిన మూడు కనీస మూల ద్రవ్యాలు. వాటి సంయోగం చేత అంటే కలయిక చేత ఏక్షన్ (నాటకం) పుడుతుంది. దాన్ని చూచే ప్రేక్షకుడు ఆ నాటకంలో తాదాత్మ్యం చెందుతాడు. అలా ప్రేక్షకుడు నాటకంతో పొందే తాదాత్మ్యాన్నే ''రసం'' అంటారు. కనుక రసం కావాలంటే నాటకం పుట్టాలి, నాటకం పుట్టాలంటే విభావ, అనుభావ, వ్యభిచారి భావాలు కలవాలి. ఈ మూటి కలయికే సంఘటన లేక స్థూలంగా చెపితే కథ. అంటే కథ ఉన్నప్పుడే రసం అనాలి. రసం నాటకాది కథాకావ్యాలకు వర్తించే మాట. ఇంకా దీనికి సంబంధించినవి ఎన్నో చెప్పాలి. కాని, ఇక్కడ ఇంతవరకు చాలు.

**పి. సురేంద్రమోహన్, రామగిరి**

ప్ర. అనుభూతి కవిత్వము, స్వచ్ఛ కవిత్వము అని అంటుంటారు. వీటిని గుర్తించడము ఎట్లా?

జ. అనుభూతి కవిత్వమూ, స్వచ్ఛ కవిత్వము అనే మాటలు వట్టి సాహిత్య అంబేదలు సృష్టించుకుని ప్రింటులో తిప్పుతున్న కల్మష క్రిములు. విప్లవ కవిత్వం గానీ, ప్రేమ కవిత్వంగానీ ఏ కవిత్వమైనా సరే అనుభూతిలో నుంచే పుట్టాలి అని లోకంలో ఉన్న కావ్యతత్వవేత్త లందరూ ఏకగ్రీవంగా ఘోషిస్తూ ఉంటే, అర్ధజీర్ణ, అజీర్ణ, మిడిమిడి జ్ఞాన పాండిత్య ధురీణులు అనుభూతి కవిత్వం అనే మాటను గట్టిగా కౌగిలించుకొని గిజ గిజ కొట్టుకుంటున్నారు. అనుభూతి కవిత్వమంటే పేపర్ కాగితం అన్నట్లుంది. అనుభూతి కవిత్వం, విప్లవ కవిత్వానికి విరుద్ధం అని కూడా ఈ పండిత ప్రకాండులు ఘోషిస్తూ ఉంటారు. విప్లవ కవిత్వం క్రోధంలో నుంచి పుడుతుంది. అందులో క్రోధం ''స్థాయిభావ.'' క్రోధం ఒక ఉగ్రజీవనానుభూతిలో నుంచి పుడుతుంది. కనుక విప్లవ కవిత్వం కూడా ఒక అనుభూతి నుంచి పుట్టిన కవిత్వమే. అయితే అనుభూతిలో ఉన్న విభిన్నతల్నిబట్టి దానిమీద ఆధారపడి పుట్టిన కవిత్వానికి

విప్లవ కవిత్వమనీ, ప్రేమ కవిత్వమనీ భిన్న భిన్న నామకరణాలు చేయవచ్చు కానీ, అనుభూతి కవిత్వమనే నామకరణం మాత్రం సెంట్ పర్సెంట్ తప్పుడు నామకరణం. అనుభూతి కవిత్వం అనే మాట చేత ఏ వ్యక్తిగత అనుభూతి సామగ్రి ఆధారితకవిత్వాన్ని సూచిస్తున్నారో, ఆ కవిత్వాన్ని ఆత్మాశ్రయ కవిత్వం అంటే నిర్దుష్టంగా ఉంటుంది. స్వచ్ఛ కవిత అంటే సామాజిక రాజకీయాది వస్తు ఆధారితం కాక, కేవలం పూలు, పక్షులు, నదులు, వస్త్రాలనే వస్తువుల మీద ఆధారితమైన కవిత అని వాడుతున్నారు. ఇదొక అజ్ఞాన వ్యాధి గ్రస్తత. స్వచ్ఛ కవిత అంటే కల్తీలేని కవిత; అంటే అకవితా కాలుష్యంలేనిది. రాజకీయాలు, సామాజిక విషయాలు అనే కావ్య వస్తువుల్ని కవితా కాలుష్యాలు అనకూడదు అవి కావ్య వస్తువులు; వాటి తప్పేమీ లేదు. ఎప్పుడూ కవితలో అకవితే కాలుష్యం. *

(20.3.87 ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక)

**కిషన్, పియస్., వేములవాడ**

ప్ర : మీ కవిత్వాన్ని శ్రీశ్రీ ఫ్రెంచి మద్యంతో పోల్చారు. అయితే కవిత్వ లక్షణం సమాజాన్ని నిద్రపుచ్చేదిగా ఉండకూడదంటారుగా! మరి మీరే మంటారు?

జ : శ్రీశ్రీ కావ్యరసలోలుడు, శుష్క రాజకీయ కాష్ఠం కాడు. కనక కవితలో ఉన్న మజా పీలుస్తాడు, చప్పరిస్తూ ఆస్వాదిస్తాడు. కప్పల్ని సైంటిస్టులు చేబిళ్ళమీద కోసినట్లు, తెలుగు రాజకీయ సాహిత్య విమర్శకులు కావ్యాన్ని కోసి పేగులు చూపిస్తారు. శ్రీశ్రీ ఆ కోవకు చెందినవాడు కాడనుకోవాలి. కావ్యపు మజాని వ్యక్తం చెయ్యడానికి ఆయన ఫ్రెంచి మద్యం అన్నాడు. ఈ మాత్రం మీరు గ్రహించలేకపోయారని నేననుకోను కిషన్‌గారూ!

**డి. గుణవతి, దేవరకొండ**

ప్ర : శైవ వాఙ్మయము నందలి "జాను తెనుగు" అనగా ఏమిటో తెలియజేయ ప్రార్థన.

జ : 'జాను తెనుగు' అనే మాట బహుశ మొదట పాల్కురికి సోమనాథుడు వాడినట్టు జ్ఞాపకము. బసవ పురాణంలో -

"ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుదెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట
గూర్చెద ద్విపదలు గోర్కిదైవార
దెలుగు మాట లనంగ వలదు....!" (ప్రథమాశ్వాసం)

అయితే తత్పూర్వం "జాణ్ నుడి" అని కన్నడ సాహిత్యంలో ఒక ప్రయోగం వుందని పండితులు చెపుతున్నారు. సంస్కృత భాషా ప్రయోగం వర్జించి ప్రధానంగా తెలుగు మాటల్నే వాడే శైలిలోవున్న తెలుగు జాను తెలుగు కావచ్చును. కమ్మటి తెనుగనీ, సొంపైన తెనుగనీ ఇంకా ఏవేవో జాను తెనుగుకు అర్థంగా చెప్పారు. జాను తెనుగు ఒక అందమైన శరన్మేఘం లాంటి మాట. ఇద మిత్థమైన రూపం లేదు. పదార్థం లేదు. ఎందుకు దాని వెంబడి బడతారు? వీర శైవ కవుల వెర్రి; ఈ వంద ఏళ్ళ వెర్రి తిక్కన సోమయాజి వెర్రి అయింది. తిక్కన గారి భాష పాల్కురికి అది వీరశైవ కవులు సృష్టించి వంద ఏళ్ళకు పైగా సాహిత్యంలో వాడి ప్రహత మార్గంగా చేయబడిన భాషే!

**మూర్తిగారి జనార్దన్, వల్లగొండ**

**ప్ర : రామాయణం చారిత్రకమా? పౌరాణికమా?**

జ: రామాయణం చారిత్రకము, పౌరాణికము అయిన కావ్యము. చారిత్రకము అనడం కంటె ఐతిహాసిక మనాలి. రామాయణంలో ఇతిహాసము, పురాణము రెండు వున్నాయి. ఇతిహాసం వేరు, పురాణం వేరు. ఈ రెంటికంటె భిన్నమయిన మరొకటి - కావ్యం. అతి ప్రాచీనకాలంలో 'ఇతిహాసపురాణం' అని ఒకే మాట వాడబడేది. అప్పుడు బహుశా ఈ రెండు వాఙ్మయాలు మిశ్రితంగా వుండేవి కాబోలు! తర్వాత విడదీయబడ్డాయి. కానీ పురాణం అని ఏకవచనం వాడబడేది. బహుశా వేదాన్ని నాలుగు వేదాలుగా విభజించిన వ్యాసుడు, అనంత సామగ్రిగా పడివున్న పురాణ రాశిని పద్దెనిమిది పుస్తకాలుగా విభజించి అనుష్టుప్ శ్లోకాల్లో రాసిన తర్వాత పురాణం అనే మాటపోయి, పురాణాలు అనే బహువచన వాడుక వచ్చి వుంటుంది. పురాణాల్లో ప్రతీక, దాని బృహద్రూపమైన మిథిక విస్తారంగా వాడబడుతాయి. మిథిక కథాత్మకము, ప్రతీక బింబాత్మకము. పురాణంలో నూటికి తొంభై పాళ్ళు ఊహామయ పదార్థం వుంటే [illegible] అరవై

దెబ్బై పాళ్ళు వాస్తవమయ పదార్థం వుంటుంది. భాష, రాజకీయ, భౌగోళిక, మత సంబంధ ప్రభృతి సమస్త సరిహద్దులు అతిక్రమించి ప్రపంచమంతటా అనేక భాష లెక్క గాలిలో సంచరించే మిథిక, పతీకల మిశ్రమ సామగ్రి పేరు పురాణం. కనుక పురాణం ప్రపంచ ప్రజలకు సంబంధించింది. ఇతిహాసం - ఏ ప్రజల్లో నుంచి ఆ ఇతిహాసపు వాస్తవ పదార్థం పుట్టిందో ఆ ప్రజలది. రామాయణం - మహాభారతాలను గ్రీకు ఇతిహాసాలని గానీ, చైనా ఇతిహాసాలని గానీ అనలేము. అలాగే హోమర్ రాసిన ఇలియడ్‌ని భారతీయ ఇతిహాసం అనలేము. ఇలాంటి ఇతిహాసము, పురాణము రెండూ మిశితమై వున్న కావ్యం రామాయణము.

**పి. నాగరంజని, చిలకలూరిపేట**

ప్ర : పూర్వ కవులు రచించిన శృంగార రచనలు నేటికీ ప్రసిద్ధి చెందుతున్నాయి కదా! కాని, నేటి శృంగార కథలు తొందరగానే అపఖ్యాతి చెందుతున్నా యెందుకు? ఆధునిక కవిగా మీ కవిత్వం సమాజంపై ఎంతవరకూ ప్రభావం చూపిందంటారు? మీ రచనలలో మీకు అమితంగా నచ్చిన రచన ఏది?

జ : పూర్వకవుల శృంగార రచనలు (అంటే కావ్యాలని మీ అభిప్రాయమేమో) ప్రసిద్ధి 'చెందుతున్నాయి'అని మీరంటున్నారేగానీ, వాటిని ఇవాళ చదివే వాళ్ళు అత్యల్ప సంఖ్యాకులు. దాన్ని ప్రసిద్ధి అంటామా? నేటి శృంగార కథలు తొందరగా అపఖ్యాతి చెందుతున్నాయనడం కూడా అంత వాస్తవంగా కనిపించదు. శృంగార కథలకు - అవి సెక్సుకథలు కానీ, లేక ప్రేమకథలు కానీ, ఎప్పుడూ పాఠకలోకం ఉంటుంది. పూర్వకవుల పాఠకులు అల్పసంఖ్యాకులు కావడానికి కారణం వాళ్ళ భాష పాతబడిపోయి ఈ నాటివాళ్ళకు అర్థం కాక పోవడమే. నా కవిత్వం సమాజంమీద ఎంత ప్రభావం వేసిందో మీలాంటి పాఠకులే చెప్పాలి. నా రచనల్లో నాకు నచ్చింది 'ఆధునిక మహాభారతము' ఒకటి, రెండోది 'కవిసేన మేనిఫెస్టో' అనే ఆధునిక కావ్యశాస్త్రము.

**గాంధారపు ప్రేమానందం, విశాఖపట్నం**

ప్ర : ఎంకి - వెంకుమాంబ, వెంకటలక్ష్మిలాగ తన ప్రియుడికి గుత్తి వంకాయ కూరెందుకు వండుతుంది - ఎంచక్కా కోడికూర వండాలిగాని?

జ : బాబూ ప్రేమానందం! ఇంకా గుత్తివంకాయ కూర అని జపంచేస్తూ ఎంకి పాటల యుగంలోనే ఉండిపోతే ఎలా? కృష్ణశాస్త్రి బాధ లోకానికి బాధ

లోకం బాధ శ్రీశ్రీ బాధ అనే మూడు నాలుగు దశాబ్దాలనాటి మాటని ఎందరో ఎన్నిసార్లో నమిలి పారేసినదాన్ని ఈనాటికి కొందరు సాహిత్య కుబ్జులు మళ్ళీ నోట్లో వేసుకుని నములుతున్నట్లు, గుత్తివంకాయ ఇంకా ఎందుకు నములు తారండి? కొత్త భావాలు మెరవడం, వాటిని కొత్తమాటల్లో వ్యక్తం చెయ్యడం లాంటి నూతన క్రియల చేతనే సాహిత్యం ముందుకు పోతుందిగానీ గుత్తివంకాయ కూర, కృష్ణశాస్త్రి బాధ అంటూ భరతనాట్యపు అడుగులు వేస్తే సాహిత్యం వెనకడుగు వేస్తుంది.

సుహాణి, గుంటూరు

ప్ర : జనహితమును కోరేదే జాతిమెచ్చు సాహిత్యం అంటున్నారు కదా? అలాంటప్పుడు కొందరు రచయితలు విప్లవం పేరిట 'తిరగబడు! కొట్టు! చంపు!' అన్న మాటలతో మంటలు పుట్టిస్తుంటే - అది సాహిత్యం కోవలోకి చేరుతుందా?

జ : "జనహితమును కోరడానికే" 'తిరగబడు కొట్టు చంపు'అనే మాటలు సాహిత్యంలో వాడబడవలసి వస్తోంది. అది సాహిత్యంలో వర్తమాన అవశ్యకత. అయితే, ఈ మాటల ప్రయోగం మాత్రమే సాహిత్యం కాదు. ఒక మాటల గుంపు, కథన కళాత్మకత చేత రసపర్యవసానం పొందడం మూలంగా గానీ లేక ప్రతీకాలంకార బింబ ప్రయోగవశాన చమత్కార దాయకం కావడం చేతగాని మాత్రమే సాహిత్యమవుతుంది. వట్టిమాటలు సాహిత్యం కావు. *

(27-3.87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

ఎ. తిరుమలరెడ్డి, ఎంబాకం

ప్ర. ప్రస్తుతం మనదేశంలో "మేము కమ్యూనిస్టులం" అని చెప్పుకునే చాలామంది సిద్ధాంతాలని మాత్రం వల్లిస్తున్నారు కానీ అచరించి చూపడంలేదు. అలాంటప్పుడు నిజమైన కమ్యూనిజ లక్ష్యం నెరవేరే కాలం దగ్గరలో వుందంటారా?

జ. మీరు చెబుతున్నది వాస్తవమే. సిద్ధాంతాలు వల్లిస్తూ శుష్క వాక్యాలూ శూన్యహస్తాలూ అన్నట్టు తాండవ నృత్యం చేస్తున్న వాళ్ళలో రాజకీయవాదులే కాదు సాహిత్య రాజకీయవాదులు కూడా వున్నారు. పైగా తమ కుహనా ప్రవర్తన

మూలంగా రాజకీయవాదులు రాజకీయాలకు మాత్రమే కీడు చేస్తుంటే సాహిత్య రాజకీయవాదులు అటు సాహిత్యానికి, ఇటు రాజకీయానికి రెంటికీ కీడు చేస్తున్నారు. ఈ పరిస్థితులలో మన దేశంలో కమ్యూనిజం ఎంత దూరమో ఎవరూ చెప్పలేరు.

**వనం సూర్యనారాయణ, కేసముద్రం**

ప్ర. భాషా రసాస్వాదన దృష్ట్యా పరిశీలించినట్టయితే ఆధునిక వచన కవిత్వం సాంప్రదాయ కవిత్వం ముందు కవిత్వంగానే కనిపించదు. ఎప్పటికైనా సంప్రదాయ కవిత్వమే ప్రమాణంగా వుండగలదేమో! అలాంటప్పుడు వ్యవహారిక భాషోద్యమము స్థానే సంప్రదాయ కవిత్వోద్యమము ఎప్పటికైనా రాక మానదేమో! మీరేమంటారు?

జ. అయ్యా కవిత్వమనేది, సంప్రదాయంలోనూ లేదు, మీరనే ఆధునిక వచనంలోనూ లేదు. కుకవిత్వధురంధరులు కవిత్వాభినయం కోసం అవలంబించే కత్తి, డాలులాంటి ఆయుధాలు మాత్రమే అవి. కవిత్వమంటే "చమత్కార జనక భావనా విషయార్థ ప్రతిపాదక శబ్దము", "వనితాంతాది మాత్రేణ జాయతే చారుతాగిరాం, వక్రాభిధేయ శబ్దోక్తిః ఇష్టా వాచామలంకృతిః", "లిటరేచర్ ఈజ్ ది ఆర్ట్ ఆఫ్ ఇమేజస్ అండ్ ఎవ్విరి ఇన్వేషన్ ఆఫ్ నేకెడ్ అయిడియాస్ అర్ ప్రోపగాండా ఈజ్ ఆల్వేస్ డెట్రిమెంటల్ టు ది గివెన్ వర్క్" -వ్యవహార భాషోద్యమము స్థానే సంప్రదాయ కవిత్వోద్యమం ఎప్పటికైనా రాకమానదేమో అనే మీ ఆశలేక ఊహ అపమార్గచింతన. ఫలం పుష్పంలోకి పోవడం, పుష్పం శాఖలోకి పోవడం, శాఖ వృక్షంలోకి పోవడం, వృక్షం గింజలోకి పోవడం - ఇలాంటివి లోకంలో జరగవు.

**టి. విజయగోపాల్, హైదరాబాదు**

ప్ర. సాహిత్యం ప్రజల ఉద్యమాల నంటిపెట్టుకొని నడవాలా? అక్కర్లేదా?

జ. అంటిపెట్టుకునే నడవాలి. ప్రజల ఉద్యమాలు కనుపించనంతగా సాహిత్యపు కళ్ళు మూసుకుపోతే ఎలా! "ఒక అందమైన పొయెం అంటే/దానికి ఒక గుండె ఉండాలి... పీడితుల పక్షం అవలంబించి/మనిషి రుణం తీర్చుకోవాలి/కాలపు బరువుల్ని మొయ్యాలి/బ్రతకడానికి పద్యం ఒక కోట బురుజు కావాలి/పద్యం మనిషి విజయానికి/ఒక జెండా అయ్ ఎగరాలి" *

(ఆధునిక మహాభారతం - ఆద్మిపర్వం)

**3. గోదావరి శర్మ, కాకినాడ**

ప్ర. కవి ఏదో ఒక ఇజమ్‌కి కట్టుబడితే అతడి దృక్పథం సంకుచిత మౌతుందన్నవాదాన్ని మీ రంగీకరిస్తారా? 2. మంచి కవిత్వం అనిర్వచనీయమనీ, అనుభవైక వేద్యమనీ కొందరంటారు. ఇలా కవిత్వంలో గుణాన్ని మిస్టిఫై చెయ్యడం మంచిదేనంటారా? 3. సంప్రదాయ బలం ఉన్నవాళ్లే ఆధునికులు కొందరు సంప్రదాయాన్ని నిరసిస్తున్నారు. కొత్త వ్యవస్థ రావాలంటే పాతదాన్ని సాంతం తిరస్కరించాలని వారి వాదం. మరి విప్లవకవిగా మీ మాట ఏమిటి? దయచేసి జవాబివ్వండి.

జ. సంపూర్ణంగా అంగీకరిస్తాను. కానీ ఆ ఇజం మానవ జీవితానికి అన్వయించడంలో వర్తమానత, హేతుబద్ధత, వాస్తవికత వున్నట్లయితే ఆ ఇజానికి కట్టుబడక తప్పదు. ఉదాహరణకు మార్క్సిజం. 2. కవిత్వం అనిర్వచనీయం అనడం తప్పు. నాగరక సమాజాలన్నీ శాస్త్ర నిర్మాణం వైపే నడిచాయి. శాస్త్రం నాగరకతకు పరాకాష్ఠ. మానవుడు సేకరించే వస్తు జ్ఞానంలో తర్కబద్ధత, సుస్పష్టత, తద్వారా నిర్వచనీయత శాస్త్రం సాధిస్తుంది. ఈ దశ చేరని సమాజం నాగరకతలో పరిపక్వత పొందిన సమాజం అనలేము. కవిత్వాన్ని ప్రాచీన పాశ్చాత్య కావ్య శాస్త్రిలు నిర్వచించాయి. ప్రాచీన భారతీయ కావ్య శాస్త్రిలూ నిర్వచించాయి. భామహుడు కవిత్వం అలంకారమన్నాడు, కుంతకుడు వక్రోక్తి అన్నాడు, ఆనందవర్ధనుడు ధ్వని అన్నాడు, జగన్నాథుడు చమత్కార మన్నాడు. వాస్తవంగా ఇవి భిన్న మతాలు కావు. అలంకారం వుంటే అందులోనే వక్రోక్తి వుంది. వక్రోక్తి వుంటే అందులోనే ధ్వని వుంది, ధ్వనిస్ఫోరకత్వ లక్షణమే చమత్కారము. కనక అన్నిటికీ మూలమైన అలంకారం వుంటే కవిత్వ మవుతుంది. అలంకారం మూలం, చమత్కారం పర్యవసానం. "కోసావలంకార ఇత్యాహ" అని వామనుడు, "సౌందర్యమలంకారః" అన్నాడు. ఉపమాలంకార చర్చ చేస్తూ జగన్నాథుడు సౌందర్యమేమిటంటే "సౌందర్యం చమత్కృత్యా ధాయకత్వం" అన్నాడు. మరి చమత్కారమేమిటంటే "చమత్కృతి రానంద విశేషః సహృదయ హృదయ హృద్ప్రమాణకః" అని అలంకార శాస్త్రిని కంతటికీ అంతిమ మహావాక్యంగా జవాబిచ్చాడు. నేటి ప్లెఖనోవ్ "లిటరేచర్ ఈజ్ ఆర్ట్ ఆఫ్ ఇమేజస్" అన్నాడు (లిటరేచర్ అనిర్వచనీయం అనలేదు). 3. కొత్త వ్యవస్థ రావడం అంటే, ముఖ్యం - మార్క్సిజం ద్వారా ఆర్థిక

సమానత సిద్ధించడం - అది కావాలి. దానికి విరుద్ధమైనంతవరకూ పాతది నిష్కర్షగా తిరస్కరింపబడాలి. పాత అయినదంతా తిరస్కరింపబడాలి అని దీని అర్థం కాదు. "పురాణ మిత్యేవన సాధు సర్వం నచాపి కావ్యం నవ మిత్య వద్యం'' అన్నమాట కావ్యానికే కాదు— అన్ని విషయాలకూ వర్తించే విలువైన మాట.

సిహెచ్. కిషన్, గుడివాడ

ప్ర. 'నిజదార సుతోదర పోషణార్థమై' అనచోట స్త్రీలింగమైన దారా శబ్దమునకు దీర్ఘముండాలి కదా! అలాగే 'అజాగళ స్తనము' అనుచోట పులింగ మైన అజ శబ్దమునకు హ్రస్వముండాలి కదా! ఎందుకు లేవు? లేకుంటే తప్పులు కావా? వివరించమని మనవి.

జ. దారా అనే స్త్రీలింగ శబ్దం లేదు. దారాః అనే నిత్య బహువచన పుంలింగ శబ్దమే వుంది. ఆ శబ్దానికి సమాసంలో దీర్ఘం పోతుంది. అంటే ప్రకృతి మాత్రమే మిగులుతుంది. ఉదాహరణ - ఉత్తర రామచరితలో ప్రథమాం కంలో రాముడు లక్ష్మణుడితో అనడం, 'జీవత్సుతా తపాదేమ నూతనే దార సంగ్రహే/మాతృభిశ్చింత్య మానానాం తేహినో దివసాగతాః.' కానీ దారాః శబ్దము నిత్య బహువచన పుంలింగ శబ్దమే అయినా ఏక వచనార్థంలోనే అంటే ఒక్క వ్యక్తి నుద్దేశించే వాడబడుతుంది ఉదా - ఉత్తర రామచరిత చతుర్థాం కంలో జనకుడు, "ఇయం మహారాజ దశరథస్య ధర్మదారాః ప్రియసఖీ మే కౌసల్యా.'' ఇక అజాగళ స్తనం - ఇందులో అజ శబ్దం పుంలింగం కాదు స్త్రీ లింగము. స్త్రీలింగం కనుక అజ అనే శబ్ద ప్రకృతి మీద టాప్ అనే స్త్రీలింగ ప్రత్యయం చేరి అజా అయింది. *

(3-4-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

ఆర్. బవన్ హో, రామక్కపేట

ప్ర : సమాజంలోని సామాన్య ప్రజలలోకంటె ఆధునిక కవులలో విప్లవ వాదం ఎక్కువగా వినిపిస్తుంది. అసలు భారతదేశంలో ఎప్పుడైనా సమసమాజం సిద్ధిస్తుందంటారా?

జ : మీరన్నది ఒక వింత సత్యం. అయితే ఒక్క సవరణ - ఆధునిక కవులైన ఎక్కువ మందిలో విప్లవవాదం ఒక మృగతృష్ణ. అల్పసంఖ్యాకుల్లోనే

అది నిజమైన తృష్ణ. భారతదేశంలో ఇప్పుడున్న ప్రజల్ని చూస్తుంటే చాలా నిరుత్సాహకరంగా వుంది. అందరు ఓటర్లూ అవకాశవాదులు. ఐవన్‌హోగారూ! "ప్రజలంటే ఎవరండీ ఇజాలచే తాడితులు! కులమతాల భయంకర కుష్ఠురోగ పీడితులు! సర్కారీ నవుకరీలు చల్లార్చిన చవటలు! ధనికుల్లోనే సర్వం దర్శించే దరిద్రులు! వీరంతా ఎన్నుకునే వీరులే ఓ శేషేన్! నీ ప్రభువులు, నీ కవులు, నీ సాహిత్య విమర్శకులు!" (అధునిక మహాభారతము - మయూర పర్వం) ఈ చిత్రం నుంచి సమసమాజ చిత్రానికి ఎన్ని శతాబ్దాల దూరమో మీరే అంచనా వేయండి.

సి. మధుసూదనశర్మ విజయవాడ

ప్రశ్న : శేషేంద్రశర్మగారూ! శ్రీశ్రీ 'మహాప్రస్థానం' అనే గ్రంథం వ్రాశారు కదా-ఇందు మహాప్రస్థానం అంటే అర్థమేమిటి? ప్రస్థానమంటే సాహితీ పరమైన అర్థమేమైనా వున్నదా? తెలుపగలరు.

జ : అసలు మహాప్రస్థానమంటే సంస్కృత భాషలో ప్రాణత్యాగం చేయడం, లేదా మరణం. వేదవ్యాస విరచితమైన మహాభారతంలో ఉన్న పద్దెనిమిది పర్వాల్లో పదిహేడవ పర్వం పేరు మహాప్రస్థాన పర్వము. (పద్దెనిమిదవ పర్వం పేరు స్వర్గారోహణ పర్వం.) పంచపాండవులు ద్రౌపదీసహితులై ఉత్తర దిశగా హిమవత్పర్వత ప్రాంతాల్లో ప్రయాణంచేస్తూ వెళ్ళడం; అలా మరణాభిముఖులై అంటే మరణించేవరకూ వెడుతూఉండడమే. కనక మహాప్రస్థానమంటే మరణయాత్ర. "యత్రభ్రాతౄన్ నిపతితాన్ ద్రౌపదీంచ యుధిష్ఠిరః / దృష్ట్వా హిత్వా జగామైన సర్వాన నవలోకయన్! ఏతత్ సప్తదశం పర్వ మహాప్రస్థానికం స్మృతం! అత్రాధ్యాయాస్త్రయః ప్రోక్తాః శ్లోకానాంచ శతత్రయం! వింశతిశ్చ తథాశ్లోకాః సంఖ్యాతా స్తత్వదర్శివా" కనక భారతంలో మహాప్రస్థాన పర్వానికి అర్థం మరణాభిముఖంగా చేసే ప్రయాణం. (ఈ పర్వంలో 320 శ్లోకాలు, 3 అధ్యాయాలు ఉన్నాయి). భాషాపరమైన అర్థం చెప్పాను, సాహితీపరమైన అర్థం చెప్పాను. ఇదీ మహాప్రస్థానమంటే - ఒక విధంగా ఇది బౌద్ధుల మహానిర్వాణానికి మహాభినిష్క్రమణకు సమానము కావచ్చు.

నంకేపల్లి పవన్‌కుమార్, వేములవాడ

ప్ర : సాహిత్యంలో సెక్సుకు ప్రాధాన్యత అవసరమా?

జ : సెక్సుకూ, సాహిత్యానికీ అవినాభావ సంబంధం లేదు.

**వికాస్, కళ్యాణఖని**

ప్ర : పాఠకుల దిగజారిన స్థాయికి రచయితలు దిగజారే బదులు వారిని ప్రభావితం చేయగల రచనలు చెయ్యరెందుకు? పాఠకుల్లో మంచి సాహిత్యాభి రుచి క్రియేట్ చెయ్యడం ఈనాటి రచయితల బాధ్యత కాదంటారా?

జ : పాఠకుల్ని, రచయితల్ని రెండు వర్గాలుగా తీసుకుంటే, రచయితలు సాధారణంగా పాఠకులకంటే ఉన్నతస్థాయిలో వుంటారు. (ఉన్నత అవగాహన, ఉన్నత అభిరుచి వున్న అత్యల్ప సంఖ్యాకులైన పాఠకుల్ని గురించి నేను ఇక్కడ చెప్పడం లేదు.) రచయిత తన లక్షణంగా రూపొందిన నిరంతర జిజ్ఞాసచేత, సునిశిత లోకపరిశీలనచేత, రచనాభ్యాసంచేత వృద్ధిపొందిన సతర్క మానసిక ప్రక్రియచేత, వీటన్నిటికీ సాముదాయిక రూపమైన విలక్షణ వ్యక్తిత్వం చేత అతడు జ్ఞానప్రవాహం అవుతాడు. అతడు పాఠకలోకక్షేత్రాల్లోకి ప్రవహిస్తాడు. పాఠకుల్ని జ్ఞానవంతుల్ని చేస్తాడు. ఇలాంటి పాత్ర నిర్వహించడంచేత రచయిత లోకాన్ని గురించి ఒక బాధ్యత తనమీద వేసుకుంటాడు. పాఠకుడిలో లేని కొత్త జ్ఞానం రచయిత తన రచన ద్వారా అందివ్వాలి. పాఠకుడిలో లేని కొత్త భావాత్మక సంస్కారం రచయిత తన రచన ద్వారా కలిగించాలి. రచయిత తానే సోపానపంక్తిగా మారి పాఠకుడ్ని పైకి తీసుకెళ్ళాలి. ఇది రచయిత నైతిక బాధ్యత. రచయిత చెప్పాలి, పాఠకుడు నేర్చుకోవాలి. ఇదీ పుస్తకలోక సంస్కారం. దీనికి విపరీతంగా పాఠకుడి అశిక్షిత ప్రకృతిలో వున్న వన్యమృగాల్లాంటి కామనలకు మేతవేసి అరణ్యాన్ని దోచుకుందామనే దుర్బుద్ధి రచయితకు కలగడం రచయిత పతనావస్థ. అతడు పుస్తకాన్ని వ్యాపారంగా మారుస్తున్నాడు తన లాభంకోసం. పాఠకుడి శ్రేయస్సుకోసం బ్రతుకు అంకితం చేయవలసిన రచయిత తన శ్రేయస్సుకోసం అంకితం కావడం గర్హనీయం. పాఠకుడి శ్రేయస్సు అంటే, పాఠకుడి సంస్కారం పుస్తకంచేత ఉన్నతోన్నత శిఖరాలకు చేరడం.

**మోటుమర్రి బేబీ కళ్యాణి, బెండమూర్లంక**

ప్ర : భాగవతం గురించి ఎంతో గొప్పగా విని ఆసక్తితో తెలుగులో 2వ భాగం దొరికితే చదివాను. ముందువున్న ఉత్సాహమంతా చచ్చుబడిపోయింది. మితిమీరిన సెక్స్‌తప్ప ఏముంది అందులో? వేలకొద్దీ భార్యలు, లక్షలకొద్దీ పిల్లలు

నమ్మతగ్గదేనా? గొప్ప కావ్యాలంటే ఇలాగే వుండాలా? మితిమీరిన శృంగారమే మహాకావ్యాల గొప్పతనమా?

జ : ''మితిమీరిన శృంగారం ఉండడమే మహాకావ్యాల గొప్పతనం'' ఎంతమాత్రమూ కాదు. మీరు ఏ భాగవతం చదివారో! పోతనగారి భాగవతము (దాని సంస్కృత మూలము) మహాకావ్యం కాదు. అది పురాణము. సాంద్ర కావ్యస్పర్శ ఉన్న భాగాలు అందులో చాలా ఉండడంచేత మీకు అది కావ్యం అని పించి ఉండవచ్చు. మీరు కొంచెం జిజ్ఞాసతో చదువవలసిన గ్రంథం. (జిజ్ఞాస అంటే తెలుసు గదా?) "వేలకొద్దీ భార్యలు, లక్షలకొద్దీ పిల్లలు'' అని ఆశ్చర్య పడ్డారు. ఈనాటి ఫేమిలీ ప్లానింగున్న రోజులు కావాయె! అట్లని, కుచేల సంతానము కోరేవాళ్ళూ కారు. పురాణాలు ఆధునిక చరిత్రలు కావు. అవి పాఠకుడిలో వేగంకంటే మందగమనం కోరుతాయి. దృశ్యమాన చిత్రంకంటే అదృశ్యమాన అర్థాంతరాన్ని సూచిస్తాయి. ఆ పుస్తకాల్లో మహార్థం ఎలా ఉంటుందంటే - బజారులో వెల్లకిల పడుకో ఉన్న లక్సు టాయిలెట్‌సబ్బులా ఉండదు. "అలవైకుంఠ పురంబులో, నగరిలో నామూలసౌధంబుదా / పలమందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో / త్పల పర్యంకరమావినోది"వలె ఆకాశపు లోతుల్లో ఎక్కడో ఉన్న నక్షత్రంలా ఉంటుంది. నమ్మదగ్గవా అంటే పురాణాలు, చరిత్రలు కావన్నానుగదా! వామనుడు మరుగుజ్జు; మూడడుగుల నేల బలిచక్రవర్తి దగ్గర దానం తీసుకుని, ఆకాశం ఎత్తు పెరిగి ఒక అడుగుతో భూమండలమంతా ఆక్రమించి రెండో అడుగుతో ఆకాశమండలం ఆక్రమించి, మూడో అడుగు ఎక్కడ పెట్టమంటావు అని బలిని అడిగాడు; బలి నా నెత్తిన పెట్టమన్నాడట! ఇలా ఉంటాయి పురాణాలు - పురాణాల్ని గురించి పాశ్చాత్య పండితులు రాసిన గ్రంథాలు చదవండి; బహుశా కొంతవరకు మీ ఇబ్బంది తగ్గవచ్చును. *

(10-4-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**అడుసుమల్లి రాధారాణి, కావలి**

ప్రశ్న : శ్రీశ్రీ అభ్యుదయ గీతాలు మధ్యాహ్నపు ఎండలా తళతళ మంటుంటే - శేషేంద్ర తిలక్‌ల అభ్యుదయ గీతాలు పున్నమి వెన్నెల్లా మిల మిల మంటున్నాయి. కారణం ఏమిటి మాష్టారూ? భాషా సౌందర్యమేనా? మరేదైనానా?

జ : "నేను జేబుల్లో కోకిలల్ని వేసుకురాలేదు/పిడికిళ్ళలో బాంబులు బిగించుకుని వచ్చాను" - "నా పిల్లలచేత వాడు తిండిగింజలు తినిపించకపోతే/నేను భూమిచేత వాడి రక్తం తాగిస్తాను" - "నా కవిత్వం ఏ జెండానూ ఎగరేయదు/కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు" - "రండి నా శబ్దజ్వాలలమీద మీ హృదయాల్ని రొట్టెల్లా కాలుస్తాను/మీరెటుపోవాలో చూపిస్తాను" - రాధారాణిగారూ! మీకు ఈ పంక్తులు వెన్నెల్లా మిలమిల్లాడుతున్నాయా?!

**భమిడిపాటి గౌరీశంకర్, వరసన్నపేట**

ప్రశ్న : సనాతన కవితా రీతులకు, నవీన కవితా రీతులకు తేడా వుందంటున్నారు ఈ మధ్య చాలామంది. ఎటువంటి తేడా అది? ఎందుకు ఆ తేడా? దయచేసి వివరిస్తారని ఆశిస్తాను.

జ : సనాతనుల దృష్టిలో సాహిత్యం లోక సంగ్రహార్థం అనే భావం కీలకస్థానంలో వుండేది. కనుక సామాన్య ప్రజల్నే దృష్టిలో పెట్టుకుని కవిత్వం రాశారు. దాని ఫలితంగా వాళ్ళ కావ్యాలకు కథ ప్రధానమయింది. ప్రజా సామాన్యాన్ని కథ ప్రభావితం చేసినంతగా మరే ప్రక్రియా చెయ్యలేదు. కథే సామాన్య ప్రజా ప్రక్రియ. దాన్ని ఛందస్సంగీతాలతో కలిపి మరింత బలిష్ఠంచేసి పూర్వులు ప్రజలమీద ప్రయోగించేవారు. ఈ కథా గమనంలో అలంకారాలు అక్కడక్కడా దొర్లేవి. అవి ప్రధానం కావు. కానీ ఆధునిక కాలంలో కవిత కథారహితమై కేవలం అలంకార మాత్రమయింది. ఇలాంటి కవిత ప్రగల్భ మనస్కులైన తరగతుల వారికే ఆస్వాదనీయం. ప్రజా సామాన్యానికి కాదు. కానీ కథ, కవిత విభిన్న ప్రక్రియలుగా ఉండటం ఆధునికతకు కీలక లక్షణం.

**ఎస్. ఎమ్. గౌరీశంకర్, కోరుకొండ**

ప్రశ్న : విప్లవ కవిత్వం అంటే ఏమిటి? అభ్యుదయ కవిత్వం అంటే ఏమిటి? ఈ రెండింటికీ తేడా ఏమిటి?

జ : అభ్యుదయ కవిత్వం కూడా వాస్తవంగా విప్లవ కవిత్వమే. కారణం, అభ్యుదయ కవిత్వానికి కూడా కావ్యవస్తువు విప్లవమే. విప్లవమంటే వర్తమాన ఆర్థిక వ్యవస్థ పునాదిగా ఏర్పడిన అధర్మ శోషక సామాజిక వ్యవస్థని బలాత్కారంగా ధ్వంసంచేసి వర్గరహిత, సామ్యవాద ఆధార నిర్మిత న్యాయ సమాజాన్ని

నిర్మించడం. ఈ విషయమే ఇతివృత్తంగా చేసుకొని అభ్యుదయ కవిత్వమంతా వచ్చింది 1930ల్లో, 1940ల్లో వున్న ప్రతికూల రాజకీయ పరిస్థితుల మూలంగా ఆదిమ విప్లవకవులు, రచయితలు అభ్యుదయ కవిత్వమనే అమాయక రూప నామధేయం ఇచ్చారుగానీ, ఆనాడు దాన్ని విప్లవ కవిత్వమని ఉంటే శాస్త్రీయంగా, సాహిత్య శాస్త్రీయంగా, వాటి సమకాలీన స్థితిగతుల దృష్ట్యాకూడా ఆ పేరు ఆ కవిత్వానికి నిష్కర్షగా సముచిత నామకరణం అయి వుండేది. శ్రీశ్రీ, సోమసుందర్ ప్రభృతులు రాసిన ఆనాటి కవిత విప్లవ కవితే. ఆ కోవ ఆనాటినుంచి ఈనాటివరకూ విప్లవ సాహిత్య మార్గమే. సాహిత్య విమర్శ అనే శాస్త్రీయదృష్ట్యా శ్రీశ్రీతో ప్రారంభించిన వినూత్న కవితామార్గాన్ని ఇప్పటి వరకూ ఒకే మార్గంగా పరిగణించాలి. పూర్వోక్త ఇతివృత్త కారణంచేత . మధ్యలో వచ్చిన భిన్నభిన్న లేబిళ్ళ కవిత్వాలు అసాహిత్య కారణాలచేత వచ్చాయి గనుక, సాహిత్య విమర్శలో ఆ కారణాలకు ప్రాముఖ్యత లేదు, అవి గణనీయం కావు.

**పెయ్యేటి చాముండేశ్వరి, చిలకలూరిపేట**

ప్రశ్న : మీ దృష్టిలో పూర్వ రచయితల సాహిత్యానికి, నేటి రచయితల సాహిత్యానికి తేడా ఏమైనా వుందా? నూతనంగా సాహిత్యంలో ప్రవేశిస్తున్న రచయి(త్రు)తలకి మీ సలహా ఏమిటి?

జ : పూర్వ సాహిత్యానికీ, ఆధునిక సాహిత్యానికి వున్న తేడా మీకు చదువుతుంటేనే తెలిసిపోతుంది. పూర్వ సాహిత్యం పూర్వ భాషలో ఉంటుంది. ఆ భాష మీకు అర్థంకాదు. ఆధునిక సాహిత్యం మీ కర్థమయ్యే ఈనాటి భాషలో వుంటుంది. అయితే భాష అర్థం అవడం వేరు, కవిత్వం అర్థం అవడం వేరు. కానీ ఈ పేచీ కథల్లో, నవలల్లో రాదు. రచయిత్రులకి, రచయితలకి తేడా లేదు. స్త్రీ పురుషులు సమానమనే ఈ 20 వ శతాబ్దంలో స్త్రీ తన వ్యక్తిత్వాన్ని ప్రాణంతో సమానంగా చూచుకోవాలి. నీతి, ధైర్యమూ ప్రధానంగా నిర్వహింపబడాలని నూతన సాహిత్యాభ్యాసకులకు నా సలహా.

**విన్నకోట శ్రీప్రకాష్, నాగార్జునసాగర్**

ప్రశ్న : సాహిత్యాభిమానిగా భారత సాహిత్యంలో మిమ్మల్ని బాగా కదిలించివేసిన సంఘటన ఏది?

జ : భారత సాహిత్యంలో నన్ను బాగా కదిలించిన సంఘటన దుర్యోధన ఊరుభంగము. భారతీయ సాహిత్యంలో నన్ను బాగా కదిలించిన సంఘటన అయోధ్యకాండలో శ్రీరామ, భరతుల సంయోగము. మీ ప్రశ్నలో అస్పష్టత అత్యధికం.

**కె. గంగారెడ్డి, పొన్నారి**

ప్రశ్న : నేటి సాహిత్యం సాహిత్య పరిధిని దాటి కొట్టుకుపోతూంటే మీలాంటివారు ఏమీ చేయలేరా? మాలాంటి యువకులకు సాహిత్యం అంటే ఏమిటో తెలియకుండా గడిచిపోవలసిందేనా?

జ : రెడ్డిగారూ! బహు సంఖ్యాక మానవ వ్యవహారాల్లో సాహిత్య మొక్కటే స్వేచ్ఛాయుత వ్యవహారం. దాని స్వేచ్ఛమీదే దాని జీవం ఆధారపడి వుంది. దుష్ఫలితాలు కొన్ని వుండవచ్చు. కానీ కాలమనే ఒక మహా జల్లెడ చక్రాయుధంలా తిరుగుతోందని మరిచిపోకండి. అదే మనలాంటి వారికి ధైర్య ప్రదాత.

**అ. వ. రాజు, అనంతపురం**

ప్రశ్న : తెలుగులో భాష - పరిభాష; జ్ఞానం - పరిజ్ఞానం; పాలన - పరి పాలన అనే మాటలు (జంటపదాలు) ఎక్కువ వాడుకలో వున్నవి. పరి అనే పదం చేర్చటంవలన అర్థమేమైనా మారుతుందా? 'పరి'కి అర్థమేమిటి?

జ : పరి అనేది అధి, ఉప, ప్రతి, సు, అభి, అవ, అను ఇత్యాది ఉప సర్గల్లో ఒక ఉపసర్గ. పరి అంటే చుట్టు అని అర్థం. ఉపసర్గం చేరికచేత ధాతువుల అర్థం మారుతూ వుంటుంది. హరతి-హరించు, విహరతి-విహరించు, సంహరతి-సంహరించు, పరిహరత-పరిహరించు. ''ఉప సర్గేణ ధాత్వర్థో బలాదన్య త్రనీయతే'' - భాష వేరు, పరిభాష వేరు.

**బొప్పన సీతారామకృష్ణ, వేమూం**

ఛందస్సు వచ్చినవారంతా పద్యాలు రాయగలరా? పద్యం రాయడం ఎలా? పద్యాలు రాసినా ముందుముందు చదివేవారే వుండరనుకుంటాను?

జ : ఛందస్సు వచ్చినవారంతా పద్యాలు రాయలేరు, సైకిలు కొనుక్కున్న వాళ్ళందరూ ఎలా సైకిలు తొక్కలేరో అలా. పద్యం రాయడం

ఎలాగో తెలుసుకోవడానికి పద్యం రాసే అలవాటున్నవాడిని ఆశ్రయించండి. ప్రాచీన భాషతో ముడిపడ్డ ఉత్పల చంపకాది వృత్తాల్లో అలాగే రాస్తే చదివే వాళ్ళు వుండరు, సందేహం లేదు. కానీ కవిత్వం భవిష్యత్తులో ఏదో ఒక ఆధునిక కాలీన ఛందస్సులో తప్పక రాయబడుతుంది. *

(17-4-87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**ఈదుపల్లి, ఏలూరు**

ప్రశ్న: 19.9.86వ తేదీ ఆంధ్రజ్యోతి వీక్లీలో ''వచన కవితలు'' అనే వ్యాసంవ్రాస్తూ ''తెలుగులో వచనకవిత్వాన్ని తెచ్చినవాళ్ళు ఆత్మీత విషయంలో, ప్రతిభా పాండిత్యాది ప్రజ్ఞా విషయంలో ఫ్రెంచి లాఫోర్గ, గుస్టాన్‌కాన్ లాంటి వాళ్ళతో గానీ, ఇంగ్లీషు ఎజ్రా పౌండు, ఇలియట్ ప్రభృతులతో గానీ పోల్చగలమా?" అని ప్రశ్నార్థకంగా వ్రాశారు మీరు. వచన కవితను తెలుగులో బహుముఖాలుగా విస్తరింపచేసిన శ్రీశ్రీ, కుందుర్తి బాలగంగాధర్ తిలక్ లాంటి వాళ్ళు మీరు చెప్పిన కవులకు ఏ విషయంలో తీసిపోతారు?

జ: సైన్సు, లా, జూవాలజీ ఇత్యాది శాస్త్రాల్లా గాక, సాహిత్యం స్వానుభవైకవేద్యం. పంచదార మరొకడు తింటే రుచి మనకు తెలీదు. మనమే తినాలి. కనుక మీరు పేర్కొన్న కవుల తారతమ్యాలు మీరే చదివి తెలుసుకోవాలి. నా మీద బాధ్యత పెట్టడానికి ప్రయత్నించడం సమంజసం కాదు.

**ఎ.వి. భార్గవ్, వాత్తేరు**

ప్రశ్న: అడంబరాల కోసం, ఆర్థిక సహాయం కోసం మీరు మంత్రుల వైపా? లేక మా వైపా? అని ఇటీవల కొందరు విమర్శకులు కలిసి రచయితల్ని ప్రశ్నించారు. నిజానికి రచయితలు ఎటో ఒక వైపు వుండాలంటారా? రచయితలూ, కవులూ కలిసి తమ రచనల్ని తామే అచ్చేయించుకొని లాభాలు పంచుకునే మార్గమేదన్నా మేధావులు ఆలోచిస్తే ఎలా వుంటుంది?

జ: నిజానికి రచయితలు ఒక పీడిత ప్రజల పక్షానతప్ప మరెవ్వరి పక్షాన వుండకూడదు; సమాజంలో అన్యాయం పరాజితం కావాలంటే రచయితలు అన్యాయ శోషితుల పక్షాన నిలిచిపోరాడాలి. మీ మరొక ప్రశ్నకు నా అభిప్రాయమేమిటంటే, నిజంగా ఈ రోజు రచయిత పుస్తక ముద్రణ కోసం, పుస్తక విక్రయం కోసం చాలా కఠిన పరిస్థితులు ఎదుర్కొంటున్నాడు. దీని కోసం

ప్రభుత్వం కనీసం రాష్ట్రవ్యాప్తంగా ఒక పుస్తక విక్రయ పరిషత్తును ఏర్పాటు చేయాలి. ప్రభుత్వపు విద్యాశాఖగానీ, సమాచారశాఖ గానీ ప్రతి జిల్లా కేంద్రం లోనూ ఆ శాఖల ఆఫీసులలో పుస్తక విక్రయ విభాగం ఏర్పాటు చేయాలి. అక్కడ ఈ రాష్ట్రంలో రచయితలు రాసిన పుస్తకాలన్నీ కొనేవాళ్ళకు దొర కాలి, ఏయే పుస్తకాలు రాయబడుతున్నాయో సమాచారం ఇవ్వబడాలి, పుస్తక విక్రయ ఫలితం సక్రమంగా రచయితకు అందాలి. ఇది ప్రయివేటు వ్యక్తుల చేతుల్లో వుండడం చేత గొప్ప అరాజకం ఏర్పడి రచయిత దెబ్బ తింటున్నాడు, పుస్తక రచన కుంఠితం అవుతోంది. ఇది ప్రజల సాంస్కృతిక అభ్యుదయానికి భంగకరమైన పరిస్థితి. కనుక గవర్నమెంటు రాష్ట్రవ్యాప్తంగా ఒక బుక్ డిస్ట్రిబ్యూషన్ సిస్టం లేక అన్ని జిల్లా కేంద్రాలలో శాఖోపశాఖలన్నీ ఒక ఆర్గ నైజేషన్‌ను వాళ్ళ అడ్మినిస్ట్రేషన్ యంత్రాంగంద్వారా నిర్వహించాలి.

**తేజోమూర్తుల శ్రీనివాసశర్మ, నిడగల్లు**

ప్రశ్న: ప్రజల్లో పాపభీతి, దైవభక్తి ఎక్కువగా ఉండే రోజుల్లో ప్రజా జీవనం చక్కగా వుండేది కదా! ప్రస్తుత సమాజాన్ని మళ్ళీ ఆ విధంగానే సంస్క రిస్తే బాగుంటుంది కాని, సమాజాన్ని సంస్కరించడానికి రక్తపాత విప్లవం రావా లని ప్రజల్ని భయాందోళనలకు గురిచేయడం సబబంటారా? మీరు ఏ విధమైన విప్లవాన్ని ఇష్టపడతారు? విప్లవమే ఎందుకు తప్పనిసరో వివరిస్తారా?

జ: మీ మొదటి వాక్యమే వివాదగ్రస్తం. ఆ రోజుల్లో ఎంత ఘోర అన్యా యాలు జరిగాయో చరిత్ర పేజీలు చూస్తే తెలుస్తుంది. కనుక ప్రస్తుత సమాజాన్ని మళ్ళీ అక్కడికి తీసుకుపోవడం అంత హాస్యాస్పద విషయం మరేమీ కాబోదు. రక్తపాత విప్లవం కావాలన్నప్పుడు భయాందోళనలకు గురిఅయ్యే ప్రజలెవరో బాగా ఆలోచించండి. అత్యధిక సంఖ్యాకులైన అన్నార్తులు ఎందుకు భయపడతారు, పండుగొచ్చిందని ఆహ్వానిస్తారు కాని. పీడిత వర్గాల్ని ఉద్దేశించి కార్ల్‌మార్క్స్ అందుకే ఘోషించాడు- ఈ యుద్ధంలో "యు లూజ్ నథింగ్ ఎక్సెప్ట్ యువర్ చెయిన్స్''

**విరాజి, వనపాకల**

ప్రశ్న: పూర్వాంధ్ర కవులు నాటకాలను ఎందుకు రచించలేదు?

జ: పూర్వాంధ్ర కవులు ఎందుకు నాటకాలను రచించలేదో కార ణాలు తెలుసుకోవడానికి సాహిత్యంలో వెతికితే లాభం లేదు. ఈ ప్రజల చరి

త్రలో, ఆ ప్రజల గుణగణాల్లో లోతుకు దిగి వెతకాలి. ఏ జాతి చరిత్ర ఒక సాహసోపేత యాత్ర కాదో, ఏ జాతి ప్రమాదభరితమైన స్వాతంత్ర్యం కంటే నిశ్చల నిద్రాప్రాయమైన పారతంత్ర్యాన్ని ఆహ్వానిస్తుందో, ఏ జాతికి ఏ కోశానా తిరుగుబాటు తత్వం లేదో, ఏ జాతి మాతృగర్భం నుంచి బయటపడుతూనే ఒక యజమాని కోసం వెతుక్కుంటూ వెడుతుందో అలాంటి జాతి సాహిత్య సృజనకు కావలసిన ప్రాణ పదార్థం లేని జాతి అనుకోవాలి. అందులోనూ నాటకం నాగరికతకున్న ముఖ్యలక్షణాలలో ఒకటి. మన తెలుగుదేశంలో అనువాద సాహిత్యం వచ్చిందే గాని మౌలిక సాహిత్యం రాలేదు; వచ్చిన అల్పప్రమాణ సాహిత్యం ఈ అనువాద సాహిత్య పర్వతశ్రేణుల క్రింద పడి నలిగిపోయింది. సాధారణ సాహిత్యమే రాని నాగరికతలో 'నాటకాంతం హి సాహిత్యం' అనబడిన నాటకం రావడం దుర్లభం, ఇది జాతిలోనే వున్న ఏదో ఒక గొప్ప లోపం. శ్రీ కట్టమంచి నాటకాన్ని గురించి మాట్లాడుతూ "దేర్ ఈజ్ సంథింగ్ వెరీ రాంగ్ విత్ ఎ పీపుల్ ఇఫ్ ది లైఫ్ దట్ దే హేవ్ టు లీడ్, ది స్ట్రగుల్స్ దే హేవ్ టు ఫేస్ ఎవ్విరి డే, డిడ్ నాట్ ఫార్మ్స్ పార్ట్ ఆఫ్ ది ఆర్టిస్టిక్ కాంపోజిషన్ అండ్ రెప్రెజెంటేషన్ ఆఫ్ ది కంట్రీ.''

**నూరంపూడి విశ్వం, తణుకు**

ప్రశ్న: నేటి ఆదునిక సాహిత్యంలో కనిపిస్తున్నంతగా ''హాస్యం'' ప్రాచీన కాలంలోని సాహిత్యంలో కనిపించకపోవడానికి కారణం ఏమిటి?

జ: ప్రాచీన సాహిత్యంతో ప్రాకృత సంస్కృత నాటకాలలో హాస్యం తగుమాత్రంగా వుండేది లేదనలేము. ముక్తకాల్లో కూడా వుండేది. ఒక రాజును దర్శించిన కవి రాజును పొగిడి లాభం పొందుదామనే ఆశతో ''అర్థం దానవ వైరిణా గిరిజయా వ్యర్థం శివస్యాహృతం! దేవేత్థం జగతీ తలే పురహరా భావే సమున్మీలతి....'' అంటూ చెప్పిన శ్లోకార్థం ఇలా వుంటుంది: శివుడి దేహంలో సగం (మోహినీ రూపంలో) విష్ణువూ, మిగతా సగం పార్వతీ తీసేసుకోగా, లోకంలో శివుడంటూ లేకుండా పోయాడు. అప్పుడు శివుణ్ని ఆశ్రయించుకుని వున్న వాళ్ళ గతి ఏమయిందో చూడండి. గంగ వెళ్ళి పాపం సాగరాన్ని ఆశ్రయించింది. చంద్రకళ ఆకాశాన్ని, నాగరాజు భూమిని ఆశ్రయించారు. ఇకపోతే మిగిలినవి మూడున్నాయి. అందులో ఓ రాజా, సర్వజ్ఞత్వము, ఆదీశ్వరత్వము అనే రెండు నిన్నాశ్రయించాయి. భిక్షాటనమనే మూడోది నన్నాశ్రయించింది. ఇలాంటివి ఎన్నో ఉదాహరణ లివ్వవచ్చు. *

(24 4.87 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

**ఎన్ టి.పి.వి. రామానుజాచార్యులు, నూజివీడు**

ప్రశ్న : ఇటీవల కవిత్వంలో అనుభూతివాదమనే ప్రచారం ప్రారంభమైంది. కవిత్వానికి అనుభూతివాదం ముఖ్యమా? జన చైతన్య ప్రదాయకత్వం ముఖ్యమా? ఇప్పటి కవితా ధోరణులెలా వున్నాయి?

జ : అనుభూతివాదం అనేమాట అజ్ఞాన మూలకం. శాస్త్రీయ దృక్పథము, ప్రాచ్య పాశ్చాత్య కావ్య శాస్త్ర జ్ఞానము ఉన్నవాళ్ళు ఆ మాటను పుల్లతో కూడా ముట్టుకోరు అనుభూతి కవిత్వానికి ఏకైక జన్మస్థానము. అనుభూతి నుంచి పుట్టని కవిత్వం లేనే లేదు. అనుభూతి రెండు విధాలు. ఒకటి స్వానుభూతి. రెండు సహానుభూతి. ఈ రెంటికీ సుప్రసిద్ధ ఉదాహరణాలు మన దేశంలో వాల్మీకి వ్యాసులు. కురుక్షేత్రంలో పారింది వ్యాసుడి రక్తమే! వ్యాసుడికి ధృతరాష్ట్ర పాండు రాజులు ఇద్దరు ఔరస పుత్రులు. కనక కౌరవ పాండవులు ఆయన పౌత్రులు. కనుక వారి ఘోర మరణం వ్యాసుడికి అపార శోకదాయకం. భారతం అందుచేత స్వానుభూతి నుంచి పుట్టిన కావ్యం. కానీ వాల్మీకి అలా కాదు. కిరాతుడు పక్షిని చంపితే తనను చంపినంత బాధ పొందాడు. అది కావ్యం చెప్పేంత బాధ! ఇది స్వానుభూతి కాదు, సహానుభూతి.

ప్రజా బాధను కూడా తన సహానుభూతిగా మార్చుకున్నప్పుడే, అంటే తాను అనుభవిస్తున్నట్టుగా బాధ పడినప్పుడే ఒకడు ప్రజా కవిత్వం రాస్తాడు. అంటే జనచైతన్య ప్రదాయక కవిత్వం కూడా కవిత్వం అవ్వాలంటే కవి పర బాధను ఏదో ఒక రూపంలో తన అనుభూతి చేసుకోవాలి. అదే సహానుభూతి అన్నాను. కనుక అనుభూతి లేకుండా ప్రేమ కవిత్వం లేదు, విప్లవ కవిత్వం లేదు. తాత్త్విక కవిత్వం లేదు. ఏ కవిత్వమూ లేదు. ఇక అనుభూతి కవిత్వం ఏమిటి పేపర్ కాగితమన్నట్టు?! ప్రపంచంలో ఏ సాహిత్యంలోనూ ఈ మాట లేదు, ఒక్క తెలుగులో తప్ప!

**వి. మురళి, గజ్వేల్**

ప్రశ్న : సాహిత్యవేత్తలకు డి.లిట్ లాంటి పట్టాలు వారి వ్యాసంగానికి ఎంతవరకు తోడ్పాటు నిస్తాయంటారు? ఆ రచయిత కీర్తి శిఖరాలకు ప్రభుత్వం ఇచ్చే పట్టాలే పరాకాష్ఠంటారా? కవి - రచయితల నడుమ భేదాన్ని ఎంచితే వారి ప్రతిభలో మీ సమర్థన ఎవరివైపు - కవిగా, కాబోయే రచయితగా?

జ : సాహిత్యవేత్తల వ్యాసంగానికి డి.లిట్ లాంటి పట్టాలు చెప్పుకోదగ్గ తోడ్పాటు చేయలేవు. ప్రభుత్వం ఇచ్చే పట్టాలే ప్రజా సామాన్యం దృష్టిలో ఆ రచయిత కీర్తి శిఖరాలు. రచయిత అంటే మీ అభిప్రాయం ఏమిటో స్పష్టంగా లేదు. కథ, నవల, నాటకం రాసేవాళ్ళు కూడా శాస్త్రప్రకారం కవులే. అయితే రాసేవాళ్ళందరూ రచయితలే.

**పెయ్యేటి శ్రీరంగశాయి, చిలకలూరిపేట**

ప్రశ్న : మీ దృష్టిలో నేడు కొత్తగా రచనారంగంలో ప్రవేశించాలన్నా, ప్రవేశించినవారు రాణించాలన్నా ముందుగా కవిత రాయాలా? లేక కథ రాయాలా?

జ : సాహిత్యంలో రాణించడానికి కథయినా ఒకటే, కవితయినా ఒకటే. ప్రతిభ అంటూ ఉంటే ఏదైనా రాణిస్తుంది. కథయితే ఎక్కువ పాఠకుల్ని సంపాదించుకోవచ్చు. కవిత అలా కాదు. కానీ ప్రజాకవుల మనుకునే కొందరు మూర్ఖులున్నారు! అన్ని సాహిత్య ప్రక్రియల్లోనూ అమోఘమైన శిఖరాలు అందుకోవచ్చు. ఓ హెన్రీ, చెకోవ్, బోదిలేర్, ఇబ్సెన్, శరత్, స్టెండాల్, బాల్జాక్, షేక్స్పియర్ లాంటి రచయితల్లో వారివి విభిన్న సాహిత్య ప్రక్రియలైనా ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అని ఎలా చెప్పగలము? అందరూ సమానంగా మానవజాతి సంపద.

**మూసా అలీఖాన్, మిర్యాలగూడ**

ప్రశ్న : శృంగార సాహిత్యానికి, పద్య సాహిత్యానికి తేడా ఏవిధంగా గమనించగలము? పద్యరూపములో వున్న అర్థం శృంగారంలో వాటి విలువ తగ్గిపోయే అవకాశం వుందా? వివరించండి.

జ : ఏ విధంగానూ గమనించలేము. శృంగార సాహిత్యం పద్యరూపంలో వుండవచ్చు. పాట రూపంలో వుండవచ్చు. విలువ తగ్గడం, పెచ్చడం రచయితల ప్రతిభలో వున్న తారతమ్యాలకు సంబంధించిన విషయం. *

(1-5-87, ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక)

# శేషేంద్ర లేఖలు

## (ఆంధ్రప్రభ దినపత్రిక 26-3-87 నుండి 9-8-87 వరకు)

## దేశము, కవి, బౌద్ధిక వర్గాల నాయకత్వం

## 1

నిజంగా ఒక సమస్యే! పరిష్కారం లేని సమస్యనే నేనెదుర్కొంటున్నది. దేశం దేశమంతా నన్ను అడుగడుగునా వేధిస్తున్నట్లు ఒక అంతరిక బాధ.... దేశమే బాధిస్తే ఎక్కడికి పరుగెత్తుకు పోతాం? ఎవడయితే మానవ జీవనంలో కోట్లాది సూక్ష్మాలకూ మర్మాలకూ లొంగక కోమల స్పృహ పెంచుకుంటాడో వాడే ఎక్కువ వేదనకు గురి అవుతాడు. ఈ నాజూకు చేతన వికసించని సామాన్య మానవుడికి అమాయకత్వం ఒక కవచం, అజ్ఞానం ఒక కోట బురుజు.

లోకాన్ని దుష్టత్వం ఎప్పట్నుంచో వేటాడుతోంది. ఎందరో కార్యశూరులు దానికి విరుద్ధంగా నిలిచినప్పటికీ అన్ని కాలాల్లో అన్ని దేశాల్లో తత్త్వ చింతకులు, యోద్ధలు, నైతిక వీరులు ఎందరెందరో అవమానాలకు హింసలకు బలి చేయబడ్డారు. చరిత్ర ఇంత బెదిరించినా, నేను మాత్రం మారలేకపోతున్నాను. ఆశ్చర్యం!

## 2

కవిలో, కవి పనిముట్లలో నా తాత్త్విక నేత్రం ఏమి దర్శిస్తుందో, అది చెపుతాను. కవిత్వం భాషకూ మానవానుభూతికీ మధ్య జరిపే సంగ్రామం. భూగోళం మీద ఉన్న మానవుడి సంపూర్ణానుభూతి అభివ్యక్తి చెయ్యడానికి వాహికగా ఎన్నుకోబడ్డ కవి అభివ్యక్తి శిఖరాలకు నిరంతరం ఎగబ్రాకుతున్న ఒక శాశ్వత సాహస యాత్రికుడు. కవి ఒకవైపు శిఖరాలకు ఎగబ్రాకుతూ ఉంటే మరోవైపు వేదనమోయలేని దుర్బల వ్యావహారిక భాష ఏదయితే కవికి సమాజంలో లభ్యమవుతూ ఉందో అది ఎగబ్రాకే కవిని దిగజారుస్తూ ఉంటుంది.

కవి చేసే ఈ యుద్ధాల్లోనే సాధారణ భాష, సూక్ష్మాతి సూక్ష్మ, కుశాగ్ర సదృశ మానవానుభూతులకు అభివ్యక్తిగా రూపొందుతూ, ఉచ్ఛకోటి చేరుతుంది. భాష గరుత్మంతుడై అంతరిక్ష మండలం వరకూ ఎగురుతుంది.

మానవుడిలో పెరిగే జీవన అవగాహన కేవలం వయస్సు మూలంగా అతడు పోగుచేసుకుంటున్న ముడి సరుకులాంటి అనుభవం మూలంగా కాదు. అతనిలో ఉన్న ఏదో ఒక అనిర్వచనీయమైన ఆత్మికపుష్పం జీవన క్రమంలో వికసిస్తూ ముందుకు పోవడం చేత... ఆ పుష్పవికాసానికి జీవనం ఎరువు—

ఆత్మిక పుష్పం వికసిస్తూ దాని పరాగ పరిమళాలు వాయువుల మీద ప్రయాణం చేయసాగినపుడు, ఆ ప్రయాణాన్ని సృజనాత్మక కళాక్షేత్రంలో రొమాంటిసిజం అనీ క్లాసిసిజం అనీ స్ర్రియలిజం అనీ ఏదో ఒక ఇజం అనే ఇనపచట్రంలో బంధించి పాతిపెట్టే ప్రయత్నం, సాధారణ అనుభవాన్ని అధిగమించి వెడుతున్న సూక్ష్మాన్ని వేళ్ళతో పట్టుకోడానికి ప్రయత్నించినట్లవుతుంది. అంత ఉదాత్తస్థాయి వస్తువుని పట్టుకుని ఒక నామకరణ యంత్రంలో బంధించే యత్నం జయప్రదం కాలేదు. ఈ నామకరణాల వ్యాపారం ద్వేషదూషితం కావడం కూడా ఆ ప్రయత్నం నిరర్థకం కావడానికి మరొక కారణం.

నేను పొందే ప్రతి తీవ్ర అనుభూతి కలిగించే సంవేదనాత్మక బాధ, నా కవిత్వ పర్వతారోహణంలో నేను పైకి ఎక్కే ఒక్కొక్క అడుగు! కారణం, అక్కడ ఆ అడుగు నిలదొక్కుకుని చుట్టూ ఉన్న వస్తువుల్నీ దృశ్యాల్నీ చూచినప్పుడు, నా అనుభూతి సీమల్లోకి అంతకంతకు విస్తృతమవుతున్న విశాల మానవజీవనం ప్రవేశిస్తోంది.

# 3

మీలాంటి జిజ్ఞాసువులతో సోదరత్వమూ అవగాహనా పెంచుకోవడం జీవితానికి మరింత ఊపిరి పోసుకోవడంలా అనిపిస్తుంది నాకు. కవులు, రచయితలు పరస్పర సంపర్కము, అవగాహన పెంచుకోవలసిన కాలం ఆసన్నమయింది మన దేశంలో. దురదృష్టం! తెలుగుదేశంలోనే కవులు, రచయితలు బురదతో హోళీ ఆడుకుంటున్నారు. పరస్పర సంపర్కం మూలంగా మన దేశపు సమైక్య బౌద్ధిక చిత్ర పటాన్ని రూపొందించి, ప్రజల మీద ఒక స్పష్టమైన ప్రభావం కలిగించి, ఒక దిశ దర్శకత్వం వహించి, బౌద్ధిక వర్గాల విశిష్టస్థానం

కల్పించవలసిన చారిత్రక సమయం ఇది. ఈనాడే మనదేశంలో బౌద్ధికవర్గ నాయకత్వం కోసం ఒక ఉద్యమం ఉద్భవించాలి.

ఈ దృష్టితో చూస్తే కాశ్మీర్ నుంచి అంటే దేశపు కొస నుంచి మీ గొంతుని మోసుకొచ్చిన ఉత్తరం నన్ను పులకిత గాత్రుడ్ని చేసింది. వెనకటి సారి మనం హైదరాబాద్‌లో కలవడం ఇంకా నా స్మృతిలో ముత్యంలా వేలాడుతూనే ఉంది. మే నెలలో మేము ఊటీ వెళ్ళడం చేత ముషాయిరాకు రాలేకపోయాం. ఊటీలో నా తాజాకృతి "నా దేశం నా ప్రజలు" పూర్తి చేశాను. మీరు హిందీ చదువుతారనుకుంటాను. 'నా దేశం నా ప్రజలు' హిందీ అనువాదం అచిరకాలంలోనే రాబోతోంది.

# 4

ఏదో ఒక మామూలు ఉత్తరం రాస్తే చాలనే ఉద్దేశం లేకపోవడం చేతనే ఇంత ఆలస్యం జరిగింది. మీ మనస్సుతో నాకు ఏదో ఒక చెప్పలేని అనుబంధం కలగడంచేత చాలా విషయాలు రాద్దామనిపించింది. చరిత్ర, జిజ్ఞాస, సమకాలీన దృశ్యం. రాజకీయాలు, మన బౌద్ధిక వర్గాలు ఇలా ఎన్నో విషయాల మీద రాద్దామనిపించింది. మీముందు నా హృదయాన్ని ఒక మేప్‌లా పరుద్దామనిపించింది. ఒక ఆత్మిక సంవాదంకోసం దిశాన్వేషణక్కోసం ఎలా నావికులు నౌకాయానంలో టేబిల్ మీద తమ మేపుని పరచుకుంటారో.

మీ రచనలో శిల్పమర్మాల్ని గురించి కావ్య వస్తువుని గురించీ ఒక గంభీర అవగాహన కనిపిస్తోంది. సృజనాత్మక కళాప్రక్రియాబోధ సాధారణంగా వర్తమాన భారతీయ సాహిత్యంలో కనిపించడం లేదు. సాధారణంగా మీరు మన కాలపు భారతీయ జిజ్ఞాసా వికాసానికి దోహదం చేయగల కతిపయ శిఖరాయమాణ మేధస్సుల్లో ఒకరని స్పష్టంగా చెప్పవచ్చు.

భాష, ప్రాంతం, స్థానిక సాహిత్య సంకుచిత వైఖరుల్లాంటి కృత్రిమ కందకాన్ని దాటి రెండు మేధల్ని కేవల జ్ఞానాత్మక సహజత్వంతో పోల్చి పరిశీలించడం, సాహిత్యాన్ని జిజ్ఞాసని బృహత్తర జాతీయ స్థాయిలో మూల్యాంకన చేయడం నాకు చాలా సంతోషం కలిగించింది. ఇది మన దేశంలో ఒక గొప్ప నూత్న పంథా, చాలా విశిష్టమైన విధానం. ఆధునిక రాజకీయవాది చేతిలో బాగా దెబ్బతిన్న భారత బౌద్ధిక ఐక్యతని పునస్థాపన చెయ్యడానికి సాహిత్య

క్షేత్రంలో భాషా ప్రాంతాన్ని అధిగమించి ఈనాడు మూల్యాంకన జరగాలి. సాహిత్యంలో భాషాంతరీకరణ పొందాలి. అనువాద సంస్కృతి దేశమంతటా వ్యాపించాలి.

అమెరికన్ కావ్య శాస్త్రవేత్త ఆర్చిబాల్డు మెక్లీష్ ఏ భాషలోనైనా కవిత కవితే అన్నాడు. ఈ కారణంచేతనే ప్రాచీన భారతీయ కావ్యశాస్త్రం సంస్కృత భాషలో వచ్చినప్పటికీ దేశంలో ఉన్న అన్ని ప్రాంతీయ భాషలూ యథాతథంగా స్వీకరించి అనుసరించాయి. తత్త్వశాస్త్రం, రాజనీతిశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, అలాగే ఆహారం, గృహం, గ్రామం, వ్యవసాయం మొదలైన విశ్వజనీన వస్తువుల్లాగే కవిత్వం కూడా ఒక విశ్వజనీన వస్తువు. కనుక మనిషి సాధించే బౌద్ధిక విజయాల మూల్యాంకనని స్థానికీకరించే ధోరణి అజ్ఞాన మూలకము, అశాస్త్రీయము. బౌద్ధిక నాయకత్వం పూర్వం ఎప్పుడూ అవసరంకానంత అవసరం అయిన ఈనాడు మన దేశం ఒక గొప్ప చారిత్రక సన్నివేశంలోకి ప్రవేశించిందని అనేక కారణాలు విదితం చేస్తున్నాయి. బౌద్ధిక నాయకత్వం త్వరగా రూపొందక పోతే దేశం హతం అయిపోయే తరుణం వచ్చింది.

# 5

మానవుల్ని ఎన్ని హద్దులు ఎన్ని లోపాలు సృష్టిలో పీడిస్తున్నాయో చెప్పలేము. అలా పీడించే వాటిలో భాష ఒకటి. అలాంటి నైసర్గిక పీడలు మనిషిని ఒకవైపు వికలాంగుడ్ని చేస్తూ ఉంటే మరోవైపు మనిషి తన చేతులతో తానే మరికొన్ని పీడల్ని సృష్టించుకుంటున్నాడు. వాటిని లేవనెత్తి ఉన్నత స్థానాల్లో కూర్చోబెట్టి ప్రజాదరణ కూడా ఇప్పిస్తున్నాడు. ఒక రంగుకూడా పులిమి సిద్ధాంతంగా శిల్పిస్తున్నాడు. ఇది అతడు స్వార్థం చేతకాని స్వకేంద్రిత అహంకారం చేతగానీ చేస్తాడు. ఈ రెంటిమధ్య ఉన్న సన్నగీత తరచూ చెరిగి పోతూ కూడా ఉంటుంది.

నేను మీతో ఏకీభవించలేను. రాజకీయవాది తన ఆత్మరక్షణకోసం ఎత్తిన నూతన ఆయుధం భాషాభిమానం.

# 6

ఏది సృజనాత్మక రచన అనేది ఒక విషయం; ఏ సృజనాత్మక రచన లోకం మెప్పుకు యోగ్యం అనేది మరో విషయం. ఇది శిష్ట రచన అని గుర్తించ

డానికి గుర్తు ఆ రచనలో మనిషిని ఒక ఉదాత్తభావంవైపు, ఒక ఉదాత్త కార్యం వైపు ఉద్యుక్తుడ్ని చేసే శక్తి ఉండడమే. పుస్తకం చదివిన తర్వాత పాఠకుడు చదవక పూర్వం ఎలా ఉన్నాడో అలాగే ఉన్నట్లయితే, లేక అంతకంటే దిగ జారితే, ఆ పుస్తకంలో ఎంత సృజనాత్మక ప్రతిభ ఉన్నప్పటికీ అది మంచి పుస్తకం కాదనవచ్చు.

యావత్తు పుస్తక సౌధ నిర్మాణానికీ పునాది ఇతివృత్తం. అలాంటి ఇతి వృత్తం ఎన్నుకునే విషయంలో రచయిత చాలా జాగ్రత్తగా ఆలోచించాలి. ఇతివృత్తం అంటే కవి చెప్పేమాట, కవి అనుభూతి! కవి ఫీలింగు! **Poet's Experience felt and lived.**

# 7

దయచేసి అర్థం చేసుకోండి. ఇక్కడ వాదంకంటే అంతర్వితర్కమే ఉపయోగిస్తుంది. మార్క్సిస్టు సిద్ధాంతం పునాదిగతంగా ప్రతిపాదించిన ఆర్థిక సిద్ధాంతము, మానవ జిజ్ఞాస ఆ విషయం మీద శతాబ్దాల పర్యంతం పరిణామం పొందుతూ, చివరకు చేరిన అంతిమదశా ఫలితంగా నేను భావిస్తాను. ఈ శతాబ్దపు సారాంశంగా దానికి ఒక సర్వజనీన అంగీకారం లభించింది. ఈ శతాబ్దంలో పోగైన విస్తార సాహిత్యాన్నిగానీ సమకాలీన సమాలోచన్నిగానీ విశ్లేషితం చేసి చూస్తే ఈ విషయం స్పష్టమవు తుంది. మానవ సమాజంలో ఉన్న సామాజిక ఆర్థిక ఒడుదుడుకుల్ని ఈ సిద్ధాంతం తప్ప మరేదీ పరిష్కారం చేయలేదని నా నిశ్చితాభిప్రాయం. ఈ చారిత్రక వాస్తవాన్ని విస్మరించడం అవివేకమూ హ్రస్వదృష్టి మాత్రమేగాక అమానుషం అని కూడా అంటాను. కారణం, శతాబ్దాల నుంచీ జరుపబడుతున్న అపార మానవ హింసను గురించీ, మనిషికి ఇవ్వవలసిన సామాజిక ఆర్థిక న్యాయాన్నిగురించీ ఏలాంటి సంవేదనా లేకపోవ దాన్ని సూచిస్తుంది అలాంటి దృక్పథం.

వివేకవంతులు, జిజ్ఞాసువులు, తత్త్వచింతకులు ఒక సుదృఢ వర్గంగా రూపొంది ఆ మార్క్సిస్టు సమాజానికి నిరంతర కావలాదార్లుగా ఉండాలి. వాళ్ళు ఎంతవరకు ఈ విషయంలో ఆతురత చూపించవచ్చునంటే- మార్క్సిస్టు సిద్ధాం తాన్ని అమలుజరపడానికి కల్పించే యంత్రాంగం సమాజం మీదనే ఒక ఉన్నత అధికారస్థానం కల్పించుకుని నియంతృత్వ శక్తిఅయి ఆ సిద్ధాంతం పేరుతోనే

జిజ్ఞాసకూ కార్యాచరణకూ ఉండవలసిన స్వాతంత్ర్యాన్ని గొంతు నులిమివేసే స్థితి రానీయకుండా చూడాలి. వాళ్ళ రచనలు తదితర కార్యకలాపాలు ఇలాంటి పాత్ర నిర్వహించాలేగానీ సిద్ధాంత విరుద్ధ రచనలు చేసినా మార్క్సిస్టు సమాజ భంజకమైన కార్యకలాపాలు నిర్వహించినా అది దేశద్రోహమే గాక మానవ ద్రోహంగా పరిగణించబడుతుంది. ఒకవైపు మార్క్సిస్టు సామాజిక నిర్మాణానికీ, మరోవైపు జిజ్ఞాసా కార్యాచరణలకు కావలసిన పూర్ణ స్వేచ్ఛకూ మధ్య సోదరత్వం స్థాపించే విధి నిషేధాలు మనం బుద్ధికుశలతా పూర్వకంగా సృష్టించాలి.

మార్క్సిస్టు సామాజిక ఆర్థిక విధాన సిద్ధాంతాన్ని అంగీకరించడానికి మార్క్స్ ప్రతిపాదించిన తాత్త్విక తర్కాన్ని కూడా ఆమోదించవలసిన అవసరంలేదు. మార్క్సిస్టు సిద్ధాంతంలో ఉన్న తర్కానికీ సిద్ధాంత లక్ష్యానికీ అంత అవినాభావ సంబంధం కూడా లేదు. తర్కాన్నీ ఫలస్వరూప సిద్ధాంత లక్ష్యాన్నీ విడదీసి ఫలాన్ని మాత్రమే తీసుకోవచ్చు. ఆ ఫలాన్ని తీసుకోవాలంటే ఈ తర్కాన్ని కూడా తీసుకోవాలని నిర్బంధించడం మూర్ఖత్వం కావడమేకాక మానవజాతికి అపకారం కూడా అవుతుంది. తర్కాన్ని మనమీద అనివార్యంగా రుద్దడం, మానవజాతి శ్రేయస్సుకోసం పుట్టిన ఒక మహా సిద్ధాంతం విశ్వజనీనం అయ్యే ప్రక్రియను నిరోధించడం అవుతుంది. కేవలం ఒక అనవసరమైన వివాదానికి శాశ్వతంగా జీవంపోసి నిలిపినట్లవుతుంది. 1845 లో ఫ్యూర్‌బాక్ మీద రాసిన థీసిస్‌లో మార్క్స్ ఇలా అన్నాడు- "తాత్త్వికులు ఇప్పటివరకు లోకాన్ని గురించి నానా విధాలుగా వ్యాఖ్యానం చేశారు. ఇప్పుడు లోకాన్ని గురించి వ్యాఖ్యానాలు చెయ్యడం కాదు - లోకాన్ని మార్చివేయాల్సిన కాలం వచ్చింది.''

సమకాలీన ప్రపంచానికి ఈ సూచన ఒక గొప్ప పరిష్కారంగా భావించాలని కోరుతాను. రష్యా, చైనా, యుగోస్లావియా దేశాల్లో ఇప్పటికే నానావిధాల మార్పులు చెందిన మార్క్సిస్టు సిద్ధాంతం భారతభూమి మట్టిని ముట్టుకుని ఇంకా కొన్ని అంతిమ మార్పుల్ని తప్పకుండా పొందుతుందని నా అభిప్రాయం. భారతదేశంలో అది పొందిన మార్పుల పరిణామంగానే మార్క్సిజం మానవజాతి కంతటికీ సర్వదేశీయయోగ్యంగా రూపొందుతుందని ఊహించవచ్చు.

# 8

కవి పుట్టడు; పుట్టిన తర్వాత రూపొందుతాడు. ఈ విషయంలో నాకే సందేహమూ లేదు. కవి పుడతాడనేది ఒక మూఢ నమ్మకం. దాని వెనక ఎలాంటి హేతువాద బలమూ లేదు. విద్యా విహీనుడూ, కవీ అనే ఈ రెండు మాటలు పరస్పర విరుద్ధమైన మాటలు. యావత్తు మానవజాతిచేతనకూ కవి ఒక కేంద్రీకృత అభివ్యక్తి. ఇదే నిజమైతే అలాంటి కవి విద్యావిహీనుడుగా ఉండడం మనం ఊహించలేము.

తెలుగుభాషలో కావ్యకళ అత్యంత ప్రధాన సమస్యగా మారి సాహిత్య క్షేత్రంలో దృష్టి అంతా అటువైపే ఖర్చు కావడం, చర్చల తుఫానులు చెలరేగడం ఒక శోచనీయ పరిస్థితి. అల్పసంఖ్యాకులు ఏ కొందరో తప్ప చాలామంది కవులకి, విమర్శకులకి కావ్యచేతన లేకపోవడమే దీనికి కారణం. సాధారణంగా కావ్య శిల్పాన్ని గురించి తక్కువ మాట్లాడాలి. ఎందుకంటే-కావ్యశిల్పి అయిన కవి తన శిల్పసాధనాలను గురించి తెలిసినవాడయ్యే ఉంటాడనీ, శిల్పంవరకు సహజంగా అతడు నిపుణుడుగానే నిర్వహిస్తాడనీ మనం అనుకోవాలి. అందుచేత కవిత్వంలో మనం అంతిమ ఫలంగా చూచేది - ఆ కవిత్వంతో కవి ఏం చేశాడు అన్నదే.

కవి - నిజంగా కవిగా భావింపబడినప్పుడు - సమాజం అతనిలో యావత్తు సమాజపు అనుభవానికి అభివ్యక్తి ఉందా లేదా అనేది చూస్తుంది. పాఠకలోకం తెలీకుండానే ఈ పని చేస్తుంది. కవిలో తన అనుభూతిని చూచుకునే సమాజం సాఫల్యం పొందుతుంది. ఇక్కడే కవి తన సంపూర్ణ ఔన్నత్యాలకు ఎదిగినట్లు దర్శనమిస్తాడు. ఇక్కడే అతని ప్రజ్ఞకూ కావ్య జీవనానికీ సఫలత సిద్ధిస్తుంది. కవి చేసే ఈ కళాత్మక అంతరిక్ష యానంలో కవి తన శిల్పకళా సూత్రాలని ఎంత బాగా అమలు జరిపాడన్నది కాదు, యావత్తు మానవ జీవన విశాలతను అంతర్భూతం చేసుకున్న ఒక మానవజాతి అభివ్యక్తిగా కవి ఎంతవరకు రూపొందాడు అనేదే విలువకట్టబడుతుంది.

# 9

భాషకు దాని నాగరకత ఒకటి ఉంది. భాష అనే సమాజంలో సంతోష పూర్వక ఆమోదం పొందే హృదయ చుంబక శాబ్దికత, ఒక గంభీరగమనము,

ఒక ఉదాత్తకంఠము రచనకి ఉండాలి. శబ్దచయనము, వాక్యనిర్మాణము, రచనాశైలి లాంటి సూక్ష్మాలన్నీ ఈ పరిశీలన పరిధుల్లోకి వస్తాయి. మొదట ఈ భాషా సమాజాన్ని కన్ను నియమిస్తున్నట్లు అనిపిస్తుంది; లిపి వచ్చిన తర్వాతే భాషా సమాజం మీద నేత్ర శాసనం మొదలై ఉంటుంది. కానీ ఈ కంటి శాసనం అడుగున కర్ణమాధుర్యమే రాజ్యం చేస్తున్నట్లూ, శ్రావ్యతే అంతిమ నిర్ణయం చేసే శక్తి అనీ మనకు నెమ్మదిగా తెలుస్తుంది. తన అనుభూతిని శ్రోతకు అందజేస్తున్న కవికి భాషా సమాజంలో శ్రవణేంద్రియానికున్న ఈ కీలకపాత్ర అర్థం చేసుకోవడం అత్యవసరం. అభివ్యక్తి క్రియచేత కవి కలిగించాలనుకున్న ప్రభావం కవి తన ఉక్తిలో చేసే శబ్ద స్వీకార కళమీద, శబ్దానికిచ్చే స్థానం మీద ఆధారపడి ఉంటుంది. అభివ్యక్తిలో విజయం సాధించదలచుకున్న కవి భాషా వ్యవహారంలో ఉన్న మర్మాల్నీ, శబ్దజగత్తులో ఉన్న నాగరకతనీ గుర్తించాలి. కవిత్వం అనాగరక శబ్దాల్నీ అభివ్యక్తుల్నీ తనలో లీనం చేసుకోలేదన్న సూక్ష్మం కవి గ్రహించాలి.

## ఆధునికతకు జన్మస్థానం యూరప్

## 10

మీ మనస్సులో ఇంకా మెదులుతూ ఉన్న అంతిమ ఆతురత రేఖలు నాకు కనుపిస్తూనే ఉన్నాయి. విషయం మీద మాత్రం నేను చెప్పవలసినదంతా చెప్పాను. కనుక ఇప్పుడు కావలసింది మనమధ్య సంవాదం ఇంకా కొనసాగడం కాదు. ఇప్పుడు కావలసింది అంతర్గత చింతన; ఇంతవరకు వాదోపవాదరూపంలో మీ మనస్సులో పోగయిన సామగ్రిని గూర్చి ఒక విచక్షణాత్మకమైన వివేచన. ఒకడు మరొకడ్ని ఎంతదూరం తీసుకువెళ్ళగలడో అంతదూరమూ నేను మిమ్మల్ని తీసుకెళ్ళాను. ఇక ఇక్కడ మీ దారి మీరు ఎన్నుకోడానికి మిమ్మల్ని విడిచిపెట్టాలి. గుర్తుంచుకోండి - మీ ఏకాకి యాత్రలో మీ నిష్పాక్షిక మనస్సే మీకు దారి చూపించే దీపం.

మీ ఉపయోగం కోసం ఇటీవల సంభవించిన కొన్ని ప్రపంచ సంఘటల్ని మీకు గుర్తు చేస్తాను. తూర్పు యూరోపియన్ దేశాల్లో శ్రామికనేతృత్వం రష్యాలో సంభవించిన వర్గపోరాటం లాంటి ఒక వర్గపోరాటం చేత తీసుకురాబడలేదు. ఆ దేశాల్లో వచ్చిన కమ్యూనిస్టు ప్రభుత్వాలు ప్రపంచ యుద్ధానంతరం అగ్ర

రాజ్యాలు సంఘర్షణ పడి తమ మధ్య పంచుకున్న యుద్ధఫలాలు మాత్రమే. కొరియా, ఇండో చైనాల్లో కూడా ఇంచుమించు ఇదే పరిస్థితి. చైనాలో జరిగిన సామాజిక మార్పు కూడా కొంతవరకు ఈ పరిస్థితి పోలికలు ఉన్నదే. రెండవ విషయం ఏమిటంటే - మార్క్సిస్టు సిద్ధాంతమూ దాని టెక్నిక్సూ యుగోస్లావియాలో, చైనాలో ఎలా మార్పుచెందాయో ఆ మార్పుకు అన్నివిధాలా అత్యంత చారిత్రక ప్రాధాన్యముంది. మూడో విషయం - మార్క్స్ సిద్ధాంతానికి విరుద్ధంగా కమ్యూనిస్టు స్కంధావారంలోనే కమ్యూనిస్టు దేశాలమధ్య యుద్ధాలూ పోరాటాలూ చెలరేగడం.

సిద్ధాంతంలో ఎలా బీటలు ప్రారంభించాయో, మార్క్సిస్టు తర్కాన్ని చరిత్ర ఎలా లోలోపలే కోసివేయడం ప్రారంభించిందో ఈ సంఘటనలు మీకు విదితం చేస్తాయనుకుంటాను. అందుచేతనే మనం సమస్యకు కావలసిన పరిష్కారం ఏదో అదే తీసుకుందాం, సమస్యకు చుట్టూ అల్లిన వాదోపవాదాల్ని విసర్జిద్దాం అని మళ్ళీ అంటున్నాను. ఈ ఒక్క నిర్ణయమే ఒక బ్రహ్మాండమైన ముందడుగు కాగలదు.

మీరు సమాజంలో ఉత్పత్తి సాధనాల్ని హస్తగతం చేసుకోవడానికి వర్గ పోరాటం అవసరమా అని అనుమానిస్తున్నారు. కేవల వర్గచైతన్య జనిత వర్గ పోరాటం వినా లక్ష్యసిద్ధి అసంభవం. మార్క్సిజాన్ని ఒక అరేబియన్ నైట్స్ కథగా మార్చగూడదు—జ్ఞాపకం ఉంచుకోండి....

## 11

యూరోప్‌లో సాహిత్యంలో సంభవించిన జిజ్ఞాసా విప్లవాలూ కళాత్మక ప్రపంచంలో జరిగిన విస్ఫోటలూ, మూలతః అక్కడ మానవ వివేచన సంభవించిన సజీవ పరిణామంతో బాంధవ్యం ఉన్నవే. ఇవి విభిన్న మానవక్షేత్రాల్లో జరిగిన విభిన్న కార్యాలు కావు. ఇవన్నీ మానవ సమాజం మీద అనాడు ప్రసరించిన ఏకైక బృహద్విద్యుత్తుకు రూప రూపాంతరాలే.

భిన్న భిన్న శాఖలుగా కృషి సాగిన విజ్ఞానశాస్త్రము, తత్త్వశాస్త్రము, సాహిత్యము, రాజనీతి ఇత్యాది అనేక శాఖలన్నీ అంతిమంగా మూలగతంగా అనాడు మారుతున్న మానవీయబౌద్ధిక ప్రక్రియ నుంచి ఉద్భవించిన శాఖలే. సామాజిక జీవనస్థాయిలో ఈ భిన్న భిన్న శాఖలకు చెందిన జ్ఞానం తమ పరిధు

ల్లోనే ఉండక పరస్పరం ప్రభావితం చేసుకుంటూ చివరకు అన్నీ కలిసి మానవ జిజ్ఞాసను మానవజీవనాన్ని రూపొందిస్తాయి. జిజ్ఞాసతో స్పందించే ఒక సజీవ సమాజంలో దాని జీవనస్థితికి ఇదే ముఖ్య చిహ్నం. యూరోప్‌లో సాధారణంగా ఆధునిక కాలంలో సాహిత్యకృతులు చైతన్యస్రవంతి, అస్తిత్వవాదము, అర్థ శూన్యవాదము ఇత్యాది బౌద్ధిక సిద్ధాంతాలు ఆధారంగా ఉద్భవించాయి. అంటే దానికి కారణం ఇదే. జిజ్ఞాసాక్షేత్రంలో రూసో, హెగెల్, మార్క్స్, సార్త్రె, పికాసో, కామ్యూ, కాఫ్కా ప్రభృతులు రావడం అనే ఒక చారిత్రిక సంఘటనల పరంపరలో క్రమానుగతమైన ఒక అర్థం ఉన్నట్లు మనం గ్రహించాలి. అందు చేత సింబలిజం, సర్రియలిజం, డాడాయిజం, క్యూబిజం, ఇంప్రెషనిజం మొదలైన ఉద్యమాలన్నీ జ్ఞాననేత్రానికి, సామాజిక దృశ్యం మీద ప్రవహించిన జిజ్ఞాసావాహినికి ఉపనదులుగానే కనిపిస్తాయి.

చరిత్ర తన చక్రాకార పరిణామంలో అదే సత్యాన్ని పునః పునః వ్యక్తం చేస్తూ వచ్చింది. నాగరకత పరాకాష్ఠ చేరిన ప్రతి సమయంలోను బౌద్ధిక కార్య కలాపాలు సాంద్రతమైన సాహిత్యాదికళలు, అన్యజ్ఞాన విజ్ఞాన శాఖలు ఒక దానితో ఒకటి సన్నిహితం కావడం, కలిసిపోవడం మనకు కనిపిస్తుంది. అవి ఒకదాన్ని ఒకటి ప్రభావితం చేసుకోవడమే గాక ఒక శాఖమీద ఇంకో శాఖ పడడం కూడా కనిపిస్తుంది. ఇది, మానవ జ్ఞాన పురోగమనంలో జన్మించిన శాఖోపశాఖలు ఒక దశలో వాటి అడ్డుగీతలు విసర్జించి యావన్మానవ బౌద్ధికలో ఐక్యరూపం ధరించడం అనే ఒక సహజధోరణి.

ఆధునిక కాలంలో ఇటీవలి శతాబ్దాల్లో యూరోపియన్‌చరిత్ర, ఆ ఖండపు బౌద్ధిక క్రియాకలాపాలు ఈ దశలోకి ప్రవేశించినట్లు సూచిస్తుంది. ఆధునిక ప్రపంచ నిర్మాణంలో పాల్గొన్న కవులు, విజ్ఞానశాస్త్ర కర్తలు, తత్త్వ చింతకులు, రాజనీతివేత్తలు ఏ బౌద్ధిక వాతావరణ పరిస్థితుల్లో నుంచి వచ్చారో అందులోనుంచే శిల్పులు, చిత్రకారులు కూడా రావడం ఈ దశలో కనిపిస్తుంది. ఒక న్యూటన్, ఒక ఓల్టేర్, ఒక నియట్షే, ఒక షోపెన్‌హోవర్, ఒక పికాసో, ఒక రోడేం భిన్న భిన్న వ్యక్తుల గుంపు కాదు; ఒకే కుటుంబానికి చెందిన ఆత్మలు.

ఆధునిక చరిత్ర, కళ అధ్యయనం చేసే విద్యార్థికి ఎలా యూరోప్‌లో చిత్రకారులు, కవులు, సంగీతకర్తలు ఒకర్నొకరు ప్రగాఢంగా ప్రభావితం చేసు

కున్నారు అనే విషయం అధ్యయనానికి అత్యంత సాఫల్యం ఇచ్చే ముఖ్యవిషయం. రిల్కే అనే జర్మన్ కవి రోడేఁ అనే ఫ్రెంచి శిల్పినుంచి తన కావ్యకళకు మహత్తర ప్రేరణ పొందడం లాంటి అనేక ఉదాహరణలు ఆధునిక యూరోపియన్ చరిత్రని ఒక చిత్రవర్ణమనోహర దృశ్యంగా మారుస్తాయి.

ఈ విస్తృత ఆధునిక యూరోపియన్ దృశ్యం నుంచి ఉద్భవించే అతి ప్రధాన సత్యం ఏమిటంటే - అక్కడ కవి యావత్తు బృహత్తర చరిత్రకూ పుట్టిన శిశువు. అతడు తన వర్తమాన కాల సమస్త చైతన్య క్షీరాన్నీ తాగి కవిగా ఎదిగాడు. ఈ కారణం చేతనే రెంబో, బోదిలేర్, పోల్ వేలరీ, వాల్ట్ విట్మన్ లాంటి కవుల్ని మనం చదువుతోన్నప్పుడు మనకు, ఒక ప్రగాఢ జీవత్ జిజ్ఞాసా విద్యుత్తు మనమీద ప్రాకినట్లు అనిపిస్తుంది. ఈ కవులు యావన్మానవజాతి సాధించిన సిద్ధిని గురించి ఒక గంభీర చైతన్యాన్ని తమ అభివ్యక్తి ద్వారా విదితం చేస్తున్నారని మనం గ్రహిస్తాము.

# 12

కవిత్వం ఒక సంవేదన అంటే ఫీలింగు. కవిత్వం, తన కళాత్మక శాబ్దికస్పర్శతో, మర్మమయనిర్మాణవాస్తువుతో, నిపుణభంగిమతో, అయస్కాంత స్వభావంతో మానవుడి సంవేదనాత్మక తంత్రుల్ని మీటుతుంది. అశ్రుపూరిత నేత్రాలు, ముఖమాంస విన్యాసాలు, నేత్రాల వెనుక అస్తమిస్తున్న కాంతిరేఖలు కలిగిన ఒక మనిషిని చూచినప్పుడు, మాత్ర నేత్రానుభవం ఎలా మన సంవేదనాత్మక స్థితిని గాఢంగా మార్చివేస్తుందో అలాగే కవిత్వం శ్రోతని గానీ పఠితని గానీ తన ఉపరితలం చేతనే ప్రభావితం చేస్తుంది.

పూర్వ వర్ణిత శోకగ్రస్త మానవుడి విషాదగాథ ఏమిటో తెలియకుండానే అతడ్ని చూచినంత మాత్రాన్నే మనం ఎలా కరుణాగ్రస్తుల మవుతున్నామో అలాగే కవిత్వం శ్రోతని మొదట ప్రభావితం చేసినప్పుడు శ్రోతకు కవిత అర్థమేమిటో తెలీదు. తర్వాతనే మెల్లిమెల్లిగా కవిత తన హృదయాన్ని శ్రోత ముందు విప్పుతుంది. ఇది కవిత్వంలో ఉన్న ఒక లీల, ఒక మాయ. అందుచేతనే కవిత్వం ఒక విశిష్ట ప్రక్రియ. టి యస్ ఇలియట్, "Communicating before being understood" అన్నప్పుడు అయన భావం ఇదే అయి ఉంటుంది. కళలో ఉన్న ఈ సద్యఃప్రభావాన్నే చిత్రకారుడు పట్టుకుంటాడు.

# 13

కవితా వాస్తువులో శబ్దస్థానం భాషాత్మకం కాదు, కావ్యాత్మకం. కవితలో ఒక విదేశీ పదాన్ని వాడవచ్చా లేదా అనే ప్రశ్న కవితలో అప్రస్తుతము. ఒకవేళ, విదేశీ పదం వాడకుండా ఆ కవిత కోరిన ప్రభావాన్ని ఉత్పన్నం చేయలేకపోతే, ఒక కవిత యొక్క రచనా విశ్వాసం ఆ విదేశీపద ప్రయోగాన్ని అనివార్యం చేస్తే ఆ పదం నిస్సందేహంగా వాడవలసిందే. అయితే ఆ సందర్భంలో ఆ విదేశీ పదం కవితకు 'విదేశీ' కాదు అని గ్రహించాలి. అంతతః ఇక్కడ ఉన్నది ఒక కవితా సమస్యేగానీ భాషా సమస్య కాదు.

## ఆధునిక సాహిత్యంలో ఎపిక్

# 14

'ఎపిక్' అనే నామకరణం విషయంలో ఆర్నాల్డు మతం ఆధునిక కాలంలో శిథిలావశిష్టమయిపోయింది. ఆయన మనకంటే వందఏళ్ళు వెనకటిదైన ప్రపంచానికి చెందినవాడు. అందులోనూ ప్రపంచంలో ఐరోపీయ ప్రాంతం జిజ్ఞాసాక్షేత్రంలో చూపించిన వేగం, మాథ్యూ ఆర్నాల్డుకు సంబంధించిన 19 వ శతాబ్దంలో కంటే, మనం జీవిస్తున్న 20 వ శతాబ్దంలో అత్యధికం.

20 వ శతాబ్దం ఎంత మహత్తర విస్ఫోటాత్మక శతాబ్దం అంటే, ఆ శతాబ్ది చరిత్రలో జరిగిన సంఘటనలన్నీ బ్రహ్మాండమైన పరిమాణం ఉన్నవే, మార్పులన్నీ ఆశ్చర్యకర ఝుంఝూమారుతాలే. ద్రష్టృత్వంలేని మేధ ఈ శతాబ్దంలో మానవ జిజ్ఞాస పరుగును అందుకోలేదు. సాహిత్య క్షేత్రంలో ఆర్నాల్డు చాలా మంది తన సమకాలికులతోబాటు సాహిత్యచెత్తలో చేర్చబడ్డాడు. విస్తృత పాశ్చాత్య సాహిత్య చిత్రంలో ఎప్పుడో వాళ్ళ గొంతులు నివిపించడం మానేశాయి.

'ఎపిక్'లో ఆర్నాల్డుకు సంబంధించిన వాస్తు విన్యాస విశేషాలు ఆధునిక శిల్ప విన్యాస పరిణామంలో కొట్టుకుపోయాయి. స్పానిష్‌కవి లోర్కా గ్రెనేడాలో 1932 లో చేసిన "దాన్‌లూయీ దే గోంగోరా లో కవితాబింబాలు" అనే ప్రసంగంలోనుంచి ఇక్కడ కొన్ని వాక్యాలు ఉల్లేఖిస్తాను. "కొమ్మలో పువ్వుగా ఉన్న దశనుంచి నేలమీద పచ్చగడ్డిలోకి రాలేదశ వరకు ఒక ఆపిల్ పండు చేసే కాలయాత్ర, సముద్రపు ఆటుపోట్ల లయ కంటే తక్కువ మహత్తరము రహస్యమయము కాదు. కవి ఇది గ్రహించాలి. ఒక కవిత యొక్క ఉదాత్తత దాని

ఇతివృత్తపు ఖారీతనం చేతగానీ, స్థూల పరిమాణం చేతగానీ నిర్ణయింపబడదు. రక్తనాళాల్లో శ్వేతకణం చేసే యుద్ధాన్ని గురించి ఎపిక్ కవిత్వం రాయవచ్చు. ఒక గులాబి మొక్క రూపంలో పరిమళంతో దాగివున్న అనంతత్వాన్ని గురించి శాశ్వతానుభూతిని కవి అందజేయవచ్చు.

మహాకవి గోంగోరా అన్ని వస్తువుల్లోనూ సమాన లయచూస్తాడు. పలాస్నీ ఇసుకరేణువుల్నీ, పర్వతాల్నీ, సముద్రాల్నీ ఒకే రాక్షసనేత్రంతో కొలుస్తాడు. వస్తువు ఎంత అల్పమైతే ఆయన సంతోషం అంత అనల్పం. లఘుత్వగర్భంలో ఉన్న గురుత్వ దర్శనం చేసుకునే ద్రష్ట ఆయన.

సెయింట్ జాన్ పెర్స్ తన కావ్యం "విండ్స్"ని ఎపిక్ అన్నప్పుడు వర్తమాన ప్రపంచం ఒప్పుకుంది. మనం మామూలుగా అనుకునే కథలాంటి కథ అందులో ఏదీ లేదు. విమర్శకులకు గత్యంతరం లేకపోయింది. సాహిత్య లోకంలో వాళ్ళకు నామకరణం చేసే పాత్ర ఎప్పుడూ లేదు.

ఇంకా విశేషం ఏమిటంటే - ఇంగ్లిషు జిజ్ఞాసా పరిధులు ఇంగ్లిషు ఛానెల్ జలాలు దాటి విస్తృతం కాని కాలానికి చెందినవాడు ఆర్నాల్డ్. కానీ, పాశ్చాత్య సాహిత్యం అనే భావన ఇరవయ్యో శతాబ్దానికి చెందినది. ఆర్నాల్డు ముందున్న ఎపిక్స్ అన్నీ ఇలియడ్, ఈనియడ్, డివైన్ కామెడీ, ప్యారడైజ్ లాస్ట్- ఇంతే. ఆయన బుద్ధి మిల్టన్ పరిసరాల్లోనే పనిచేసి ఉంటుంది. అంతేకాకుండా ఆర్నాల్డు ఎపిక్ వాస్తు నియమాలతో కొలిస్తే ఒక్క ఇలియడ్ తప్ప అన్య ఎపిక్‌లు నిలువలేవు. వాటి ఇతివృత్తం సునిబద్ధంకాక అతివిరళంగాను పృథులంగానూ, ఏ దృష్టితో చూచినా ఆర్నాల్డు నియమావళికి భిన్నంగానూ ఉంటాయి. కనుక ఒక విశాల సామ్రాజ్యచ్ఛాయల్లో విశ్రాంతిగా పడుకొనివున్న కేవల ఇంగ్లిషు ప్రపంచమైన ఆర్నాల్డు ప్రపంచాన్ని ఇరవయ్యో శతాబ్దపు చరిత్ర తోసిపారేసింది.

ఇరవయ్యో శతాబ్దపు 'ఎపిక్'లు భిన్నంగా ఉంటాయి. మనస్సు విప్పి చెప్పాలంటే నేను వర్తమాన భావధోరణులచేత ప్రభావితుడ్ని. ప్రపంచం ఈనాడు ఒక జిజ్ఞాసాళువైన మానవుడికి ఏ ప్రాంతంలోనైనా అదే ప్రపంచం; ముక్కలు ముక్కలుగా చేసి చూసే సంకుచిత అవగాహనకు వర్తమాన ప్రపంచం

లొంగదు. ఈ ఆలోచనల్ని కొన్నింటిని మీముందు వినమ్రతతో ఉంచుతున్నాను— మీరు విషయాన్ని పునరాలోచన చేస్తారనే ఉద్దేశంతో.

నేనిప్పుడు మరో ఎపిక్ రాయడంలో నిమగ్నుడ్నయి ఉన్నాను. 'ఎపిక్' అంటే నాకు, భూగోళం మీద చేయబడే మానవ మహాయాత్రను గురించి ఉచ్చైః స్వరంలో పాడే గొంతుక అని మాత్రమే

# 15

గత ఉత్తరంలో నేను చర్చించిన విషయాల్ని గురించి కించిద్వివరణ ఇంకా అవసరం అని మీ ప్రశ్నలు సూచిస్తున్నాయి. కవిత్వము, రాజనీతి - ఈ రెంటి ప్రభావము పనిచేయడంలో స్థాయి భేదాలున్నాయి. కొన్ని విలువల్ని మానవ ప్రకృతిలోకి ఊది మానవ ప్రవర్తనను, మానవుడి దృక్పథాన్ని మార్చి మానవీయ చింతనకు పునాదులు వేస్తుంది కవిత్వం. కవిత్వం ఉత్పన్నం చేసిన క్షేత్రం మీద తత్కాల సంజనిత కార్య స్థాయిలో రాజనీతి పని చేస్తుంది. (కవిత్వం అంటే ఇక్కడ కవిత్వమూ దానికి బంధువర్గమైన అనేక అన్య కళలు కూడా అని భావం.) కవిత్వం వేసే పునాదులు లేకపోతే రాజకీయ చైతన్యమే ఉదయించదు. కవిత్వం జనబాధకు జనగాథకు అభివ్యక్తి ఇచ్చి రాజకీయ బోధ ఉత్పన్నం చేస్తుంది. సమాజానికి రాజకీయ వాణి ఇస్తుంది. ప్రాచీన ప్రపంచంలో గానీ, మధ్యయుగీన ప్రపంచంలోగానీ ఆధునిక ప్రపంచంలోగానీ చరిత్ర చెప్పే రాజకీయ సంఘటనల్ని ఈ దృష్టితో మీరు మళ్ళీ పరిశీలించండి.

కవిత్వానికి కార్యరూపశిశువు రాజకీయం. కవిత్వం మనిషి నాజూకు స్థానాన్ని స్పృశించి మర్మజలాన్ని స్పందింపజేసి వాడి పునాదిగత ప్రవృత్తిని రూపొందించే విద్య. ఆ స్థాయినుంచి, దాన్ని రాజకీయం పనిచేసే ధూళి ధూసరిత స్థాయికి తీసుకురావడం చేత కవిత్వం దాని మహిమ కోల్పోతుంది. దాని పని అది చేయలేదు అందుచేత సమాజం అపార నష్టానికి గురి అవుతుంది.

# 16

ఈరోజు ప్రపంచంలో పాశ్చాత్య సాహిత్యంలో ఉన్నంత సృజనాత్మకత అన్యప్రాంతాల్లో లేదు ప్రపంచంలో అన్యదేశాల్లో నాగరికతలు మృతప్రాయమై పోయిన తర్వాత పాశ్చాత్య దేశాల్లోనే సమకాలీనతా స్పృహ జన్మించి శిఖర

స్థానం ముట్టుకుంది. అందుచేత అక్కడ ఆధునికత జన్మించింది. అక్కడ ఆధునిక కాలం జన్మించింది అదంతా ఒక్క సాహిత్యంలోనే గాక అనేక అన్య మానవీయ కార్యక్షేత్రాల్లో జ్ఞానక్షేత్రాల్లో సాక్షాత్కరించింది. జీవత్ కాలబోధ లోంచీ సమకాలీనతా స్పృహలోనుంచీ పుట్టి వాటిని మోసుకొస్తుంది సాహిత్యం. సాహిత్యం తన ప్రాణధారణకు వాస్తవాన్ని శ్వాసలా పీలుస్తుంది. సాహిత్యానికి వాస్తవం అంత ప్రాణప్రదమా అని మీరనవచ్చు. ఔను. మానవుడు తన కాలంలో తాను జీవిస్తున్న తృప్తిని పొందగోరుతాడు. ఆ తృప్తి తన ప్రపంచం తాను సృష్టించుకున్నప్పుడే లభిస్తుంది. అలాంటి నిజ ప్రపంచ నిర్మాణం తాను అనుభవిస్తున్న జీవన వాస్తవాలతోనే నిర్మించడం సాధ్యం అవుతోంది. అనుభవానికి పూర్వమే గతించిపోయిన అతీత కాలానుభవాలు తనకు వాస్తవాలు కావు. ప్రాచీన ప్రపంచం శాశ్వత సహోదరులైన దేశ కాలాలచేత నిరంతరం భుజించి వేయబడుతూ ఉంటుంది. జీర్ణమై పోతూ ఉంటుంది. రోదసిలో పదార్థగమనం చేత పదార్థం కోసమే కాలం తయారు చేయబడుతూ ఉంటుంది. అట్టి కాలం ఆ పదార్థానికి అర్థ రహితమూ అక్కరలేదు. మృతిచెందిన తరం అనంతర కాలానికి ఆ పదార్థం గతించిన కాలానికి నీవు సజీవ పదార్థం. అందుచేత ఈ ఉభయుల మధ్య సజీవ సంపర్కం లేదు. సృష్టి ప్రతి జీవత్కాలావధిలోనూ సజీవ పదార్థానికీ, కాలానికీ మధ్య సచేతన సంపర్కం స్థాపిస్తుంది. ఈ నైసర్గిక ప్రక్రియ వాస్తవ బోధకు కారణమై జీవనాన్ని అర్థవంతం చేస్తుంది. ఈ తత్త్వాన్ని గుర్తించనివాడు సజీవ సాహిత్యాన్ని సృష్టించలేడు. వాస్తవ బోధ దీర్ఘకాలిక నాగరికతలు అనుభవిస్తూ శతాబ్దాల పర్యంతం జీవించిన జాతుల్లో పతితావస్థలో ఉంటుంది. ప్రాచీన నాగరకతలు మరణించిన శిథిలాల్లోంచి నూతనంగా ఉదయించే జాతుల్లో వాస్తవ బోధ నవనవోన్మేష పుష్పంగా ఉంటుంది. కనకనే లాటిన్, అమెరికన్ దేశాల్లో అద్వితీయ సృజనాత్మకత ద్యోతకమవుతుంది.

## 17

పాశ్చాత్య తత్త్వశాస్త్రాల్లో ఏ విధమైన విశేష జ్ఞానమూ ఉందనుకునే హక్కు నాకు లేదు. కానీ నా వ్యక్తిగత జీవిత ఒత్తిళ్ళనుంచి తట్టుకుంటూ నేను చేసిన స్వల్ప అధ్యయనంలో కనిపించేదేమిటంటే - ప్రాచీన భారతీయ తాత్త్విక జిజ్ఞాసకూ ఆధునిక పాశ్చాత్య జిజ్ఞాసకూ మధ్య చాలా పోలికలు ఉన్నాయి.

ప్రాచీన భారతీయ అని ఎందుకన్నానంటే, ఆ కాలంలోనే దేశంలో జిజ్ఞాస జీవంత దశలో ఉన్నట్టు కనిపిస్తుంది. సమీప పూర్వకాలంలోగానీ వర్తమాన కాలంలో కానీ అది స్థాణుత్వం పొంది క్రమంగా మృతప్రాయమైపోయింది. దీనికోసం ఒక ఉదాహరణ - వాసన ప్రాచీన తత్త్వ శాస్త్ర పారిభాషిక ఇంట్యూషన్, చైతన్య స్రవంతి ఆధునిక పాశ్చాత్య భావాల్లో ఉన్న అర్థావగతులన్నిటినీ సమంగా సంకేతిస్తుంది.

# 18

ఆంధ్రదేశపు చిత్రాలు ఆశ్చర్యకరంగా ఉంటాయి—గొప్పవాడి బాధలు వినడానికి కోట్లాది వస్తారు. దరిద్రుడు చస్తున్నా తిరిగి చూచేవాడు లేడు. ఒక్కసారి తలుపులు తెరవాలే గానీ, నీవు ధనికుడివైతే, సలహాదారుల సమూహాలు లోపలికి తోసుకుని వస్తారు. ప్రతి డాక్టరూ ఒక తత్త్వవేత్తగా తయారవుతాడు. ఒక్కక్షణంలో, ఊరు ఊరంతా గురువులుగా, డాక్టర్లుగా, లాయర్లుగా, త్యాగమూర్తులుగా, ప్రేమస్వరూపులుగా మారిన మనుషుల్ని కలిపి అల్లిన అల్లికగా మారిపోతుంది. ఎవడిదగ్గరా ఆ సమస్యకు సమాధానం లేకుండా ఉండదు. నాకు తెలివిలేదని చెప్పే తెలివితక్కువవాడు ఒక్కడూ దొరకడు!

# రినైసాన్స్ యుగం

# 19

భారతదేశస్థులకు ప్రాచీన పాశ్చాత్య ప్రపంచ చిత్రం ఆసక్తిజనకంగా ఉంటుంది. అక్కడి రినైసాన్స్ యుగానికి చెందిన విఖ్యాత షేక్స్పియర్ నాటకాలు ఇత్యాదులు నేను చెపుతున్న కథలో ఒక ముఖ్యభాగం. అవి మన పాప పుణ్యాల్లాంటి మంచి చెడ్డల్ని నిర్ణయించే జాతికి చెందుతాయి. అలాగే గ్రీకు నాటకాలు, రోమన్ నాటకాలు, మధ్యయుగానికి చెందిన సాహిత్యానికి కేంద్రప్రాయమైన దాంతే- ఆయన సమకాలీన సాహిత్యం, ఇవన్నీ అదే కోవకు చెందినవి. బహుశా అవి తదనంతర శతాబ్దాల్లో వచ్చిన పాప పుణ్య నిర్ణాయక స్వభావ సాహిత్యానికి మూలస్థానం కావచ్చు. ఎందుకంటే ఎస్కిలస్, సోఫోక్లిస్ ఆది గ్రీకు నాటకకర్తల్లో ఉన్న కెథారిసిస్ దేవతాభీతి అన్యాయభీతి కలిగించి ప్రేక్షకుడికి ఆత్మక్షాళన కలిగించే ప్రక్రియ. గ్రీకు సాహిత్య ప్రభావం ఐరోపీయ

సాహిత్యం మీద నాటికీ నేటికీ సంస్కారగతంగా ఉండనే ఉంది. షేక్స్పియన్ పండితులు ఈ సందర్భంలో ఏమి చెప్తారో చూడండి: "తన నాటకం మూలంగా ప్రేక్షకుడు చెడును మంచిగా స్వీకరించే ప్రమాదం కలగదు గదా అనే సర్వదా షేక్స్పియర్ యొక్క భీతి.... 'మొరాలిటీ నాటకా'ల్లో మానవుడి ఆత్మను వశం చేసుకోడానికి ఎప్పుడూ పాపదేవతలూ పుణ్యదేవతలూ పోరాడుతుంటూ ఉంటారు. మొరాలిటీ నాటకాల్లో ఈ రెండు తెగల దేవతలు నాటకంలో పాత్రలుగా వస్తారు. క్రిస్టఫర్ మార్లో రాసిన డాక్టర్ ఫాస్టస్ లాంటి ప్రౌఢ నాటకాల్లో కూడా ఈ పాపపుణ్య దేవతల సంగ్రామం ఉంది. తదనంతరం నాటకాల్లో ఈ విషయాన్ని సంకేతప్రాయంగా చిత్రించారు. మేక్బెత్‌లో నాయకుడి ఆత్మ సంఘర్షణ అస్పష్టమయిపోయింది. కారణం - అతడు మంత్రగత్తెల మాటలు విని సులభంగా దురాశకు బలి అవుతాడు. అయినప్పటికీ మేక్బెత్‌కూ అతని అంతరాత్మకూ మధ్య జరిగిన వాగ్వివాదం గురించి ప్రేక్షకులకు తెలుసు...." (ఇంట్రొడక్షన్ టుఫోల్గర్ లైబ్రరీ ఎడిసన్ ఆఫ్ మేక్బెత్).

షేక్స్పియర్ వాల్మీకి లాగే మనుషుల కార్యాల మంచి చెడ్డల్ని నిర్ణయిస్తాడే గానీ మనుషుల మంచి చెడ్డల్ని నిర్ణయించడు. అందుచేతనే ఆయన చేసిన మేక్బెత్ వ్యక్తిత్వ చిత్రణతో కాఠిన్యంగానీ పక్షపాతంగానీ లేదు. వెనక పేర్కొన్న ఇంట్రొడక్షన్‌లో ఇలా చెప్పబడింది: "అయినప్పటికీ షేక్స్పియర్ మేక్బెత్‌ని బ్రహ్మరాక్షసుడిగా చిత్రించలేదు. అలా చిత్రించి ఉన్నట్లయితే, మేక్బెత్ మీద ప్రేక్షకుడికి జాలి కలిగే అవకాశం ఉండేది కాదు. తద్వారా మేక్బెత్ దయనీయత ఉన్న విషాద పరిధుల్లోనుంచి తొలగించబడి ఉండేవాడు." అంటే పాశ్చాత్య విషాదాంత నాటకాల్లో నాయకుడు దుష్కృత్యాలు చేస్తాడు, వాడి కృత్యాలనుబట్టి వాడికి జీవితంలో దుర్దశ సంభవిస్తుంది; అలాంటి దుర్దశను అనుభవించేటప్పుడు మనిషిగా అతడు ప్రేక్షకుడి సానుభూతి చూరగొంటాడు. వాడు అనుభవించే కష్టాల్ని చూస్తూ ప్రేక్షకుడు 'అయ్యో పాపం' అంటాడు. ఇది విషాదాంత నాటక లక్షణం.

ఇదే వాల్మీకి రావణుడికి చేసింది కూడా. రావణుడి పాత్ర చిత్రణ యుద్ధ కాండలో పరాకాష్ఠ చేరుతుంది. రావణుడు రూపవంతుడు. ''సమక్ష మివకందర్పం అపవిద్ధ శరాసనమ్'' అని ఆయన రూపాన్ని వాల్మీకి వర్ణిస్తాడు. అద్వితీయ పరాక్రమశాలి. ''యస్యదేవా స్సగంధర్వాః పిశాచ పతగోరగాః విద్రవంతి

భయాత్ భీతాః మృత్యోరివ సదా ప్రజాః'' అని రావణుడి పరాక్రమం వర్ణింప బడింది. రావణుడి గొప్ప పండితుడు. ఇలా సంపూర్ణ ప్రజ్ఞామండల పరివేష్టితు డైన ఒక మహాపురుషుడు పరదారాపహరణమనే ఒక్క పాపకృత్యం చేత తిరుగు లేని రీతిగా దెబ్బతిన్నాడు. విభీషణుడు రావణవధానంతరం అతడికి అగ్ని సంస్కారం చేయడానికి అనుమతి ఇమ్మని రాముడ్ని అడుగుతాడు. అప్పుడు రాముడంటాడు, "మరణాంతానివైరాణి నివృత్తం నః ప్రయోజనంః। క్రియతాం అస్య సంస్కారః మమ ప్యేషయథా తవ'' (మరణంతో విరోధాలు ముగిసి పోతాయి. మా ప్రయోజనం నెరవేరింది. ఆయనకు దహనసంస్కారం చేయబడు గాక! ఇప్పుడు ఆయన నీకు ఎలాగో నాకూ అలాగే). ఈ విధంగా రావణుడి దుష్కృత్యం నుంచి వ్యక్తిని విడదీయడం నాగరకత చేరిన నాజూకు స్థాయిని సూచిస్తుంది. ఈడిపస్ లాంటి గ్రీకు నాటకాల్లో ఇదే జరుగుతుంది. రాజు, కథానాయకుడు అయిన ఈడిపస్ చిత్రణలో ఎంతో సానుభూతి, దయనీయత పొందుతాడు; కానీ అతడు తెలీక చేసిన తప్పుకు కూడా కృత్యాన్ననుసరించి క్రూరదండన పొందుతాడు.

అస్తిత్వవాదం ఈ నైతిక దృక్పథాన్ని ఆధునిక సాహిత్యంలో పునరుద్ధ రించడానికి ప్రయత్నిస్తోంది. ''మనిషే తన కృత్యాలకు బాధ్యుడు. అతడు అతడి కృత్యాలనుబట్టే న్యాయ నిర్ణయానికి గురి చేయబడాలి - అతని మనసులో ఉన్న ఆలోచనల్ని బట్టికాదు'' అని అంటుంది అస్తిత్వవాదం. మానవీయబాధ్యతా దృశ్యంనుంచి దైవీయ హేతువును బహిష్కరించి మానవ కర్మఫలానికి మాన వుడే కర్త, మానవుడే భోక్త అనే భారతీయ కర్మ సిద్ధాంతంతో అస్తిత్వ వాదా నికి సాదృశ్యం ఉంది. క్రైస్తవ సానుభూతి వాదం యూరోపియన్ సాహి త్యంలో పూర్వంనుంచీ ఉన్న పాపపుణ్య ఫలభోక్తబుత్వవాదాన్ని క్రమంగా శిథిలం చేస్తున్నదశలో అస్తిత్వవాదం ప్రవేశించింది. పాపంమీద సానుభూతి అనే క్రైస్తవ దృక్పథంతో ప్లావితమైన మదాం బొవేరీ, అన్నా కెరీనా, గయ్‌దె మొపాసా కథలులాంటి పుస్తకాలు ఇరవయ్యో శతాబ్దపు పాశ్చాత్య సృజ నాత్మక కళాక్షేత్రాన్ని పూర్తిగా విప్లవీకరించాయి. మానవుడి కృత్యానికి అడు గున ఉన్న ఉద్దేశాలు కృత్యాల పాపపుణ్య నిర్ణయానికి కేవలం అప్రస్తుతం అని ఉద్ఘోషించే అస్తిత్వవాదం క్రైస్తవ సానుభూతి వాదానికి ప్రతిక్రియగా వచ్చి నట్లు కనిపిస్తుంది. సృజనాత్మక కళలో పాపానికి సహాయత ఇచ్చే పతన

ధోరణిని అస్తిత్వవాదం అడ్డుపడి ఆపినట్లు ఆధునిక పాశ్చాత్య సాహిత్య సమీక్ష చూపిస్తుంది.

జిజ్ఞాసలో మూలభూత జీవన దృక్పథంలో యావత్ ప్రపంచ స్వభావం ప్రాథమికంగా ఒక్కటే అనీ, ప్రాచీన ప్రపంచంలో గానీ ఆధునిక ప్రపంచంలో గానీ, ప్రాచ్యదేశాల్లో కానీ మానవజాతి ప్రస్తుతః ఒకే రీతిగా ప్రవర్తిస్తుందనీ పూర్వకథిత చర్చ విశదం చేస్తుంది. అందుచేత ప్రాచీన సాహిత్యం ఈనాడు మనం చెప్పుకునే సామాజిక చైతన్యంచేతనే ప్రేరితమయిందని అనుకోవాలి. భేదమేమిటంటే - ప్రాచీన కవి ఆనాటి సామాజిక విలువల్ని బట్టి మానవకృత్యాల పాపపుణ్యాలు నిర్ణయిస్తే ఆధునిక కవి ఆర్థిక సిద్ధాంత దృక్కోణంనుంచి మనిషి కృత్యాల మంచిచెడ్డల్ని నిర్ణయిస్తున్నాడు. అంటే, సామాజిక న్యాయం ఆధారంగా తీసుకున్నాడు.

# 20

సాధారణ అనుభూతిని అందజెయ్యడానికి సాధారణ భాష చాలు. అది వాచ్యార్థ ప్రధానంగా ఉంటుంది. కానీ ఒక ఫీలింగు (అంటే సంవేదన) నిండిన సందర్భాన్ని వర్ణించడానికి ఆ భాష చాలదు. దానికి సాధారణ భాష చాలక, భాషలోని అన్యశక్తుల్ని వినియోగించుకోలేక పోయినవాడు అభినయాన్ని ఆశ్రయిస్తాడు. ఒకడు మరొకడి ముఖాన ఉమ్మేస్తాడు. ఆ రెండోవాడు ఓరి లంజకొడకా అంటూ లేస్తాడు, చేతులెత్తుతాడు, గుడ్లెర్రజేస్తాడు, కొట్టబోతాడు. అంటే అక్కడ వాడు అభివ్యక్తం చెయ్యదలచుకుంది సాధారణ అనుభూతి కాదు. ఒక ఫీలింగు పూరిత అనుభూతి. ఫీలింగు అభినయాన్ని ఉత్పన్నం చేస్తుంది. ఫీలింగుకి అభినయానికీ మధ్య గీత దృశ్యాదృశ్యం. ఇక్కడ ఉమ్మి వేసిన దృశ్యంలో ఆ రెండవ వాడికి సాధారణభాష సహాయం చెయ్యలేకపోయింది. అప్పుడు అతని చేతికందిన సాధనాలు బూతులు, గుడ్లెర్రజెయ్యడం ఇత్యాది అభినయం. ఇవన్నీ అంటే ఈ అభినయమంతా వాడి నోటినుంచి వచ్చిన సాధారణ బలహీన భాషకు సహాయం చెయ్యడానికే. ఎమోషన్ అంటే భావోద్వేగం సాధారణ మానవుడిలో అభినయంలోనే పర్యవసానం చెందుతుంది. ఉమ్మి వేసిన దృశ్యంలో రెండోవాడు ఏమీచెయ్యకుండా నిశ్చలంగా కూర్చుని ఓరి లంజకొడుకా అంటే, వెనుకటి బలీయ దృశ్యం పుట్టదు. పైగా, పుట్టే దృశ్యం హాస్యజనకంగా

వుంటుంది. దృశ్యంనాటకం మానవ సమాజం లోయలో ఇలాగే పుట్టింది. శ్రవ్యకావ్యం భాషచేతనే అభినయ జన్య ప్రభావాన్ని సాధిస్తుంది. నాటకం అభినయంచేత ప్రేక్షకుడిమీద సాధించే ప్రభావాన్ని కావ్యం అలంకారంచేత భావాన్ని శ్రోతమీద సాధిస్తుంది. అంటే, నాటకంలో అభినయం, కావ్యంలో అలంకారం సమానం, ఈ రెండూ మనిషి ఫీలింగుని మోసే వాహికలు. ఫీలింగు జీవితాను భూతినుండి పుడుతోంది. అభినయ ఫలితం రసం అనబడింది: అలంకార ఫలితం చమత్కారమనబడింది. రసం అంటే ఆనందము, చమత్కారమంటే కూడా ఆనందమే. "చమత్కృతానందవిశేషః" అని రసగంగాధరం ఉపమాప్రకరణం.

# 21

దీపావళి శుభాకాంక్షలకు నా కృతజ్ఞత. మీకు నా శుభాకాంక్షలు. పాబ్లో పికాసో మరణించాడు; ఈ వార్త చాలా విచారకరం. యూరోప్ ఖండం ఒక శకానికి సమాప్తి చెప్పింది.

'రేపు' 'నిన్న' అంటూ మీరు రాసిన వాటిని గురించి - కావాలనుకుంటే ఒకరు రేపటి ప్రభావం అంత అధునికంగా ఉండవచ్చు. నిన్నటి అంత పురాతనంగా ఉండవచ్చు-అంతా స్వఇచ్ఛ చేతనే. అయితే అలా అది ఒకడి చేతిలో ఉంటుందా? స్వభావం, సమాజం మధ్య ఘర్షణ జరిగితే వ్యక్తే నలిగిపోతాడు గదా? తన జీవితకాలంలో చార్లెస్ బోదిలేర్ రేపటి ప్రభాతంలా తాజాగా ఉండేవాడు. కానీ కవి భౌతికకాయం కోల్పోయిన తర్వాతకూడా తాజాగా ఉంటాడా? వంద ఏళ్ళు దాటిన తరువాతకూడా జె.బి. ప్రీస్ట్లీ బోదిలేర్ని గురించి అంటాడు "ఏ కవుల ఊరేగింపు బయలుదేరిందేగానీ ఇంకా ముగియలేదో ఆ ఊరేగింపుకు ఆయన అగ్రభాగాన ఉన్నాడు." కానీ బోదిలేర్ బ్రతికివుండగా ఎవ్వరూ ఒక్క మంచి మాట చెప్పలేదు ఆయన్ని గురించి. చివరకు ఏ స్నేహితుల సహాయం మీద ఆయన ఆధారపడ్డాడో ఆ స్నేహితులు కూడా పాపం, ఆయన్ని గురించి ఒక్క మంచిమాట చెప్పలేదు. గోథియేర్ మౌనంగా ఉండిపోయాడు. సెయింట్ బోవ్ "లెఫ్లేర్‌దెమాల్"ని గూర్చి చెపుతూ అది బోదిలేర్ జీవితంలో చేసిన గొప్ప పొరపాటన్నాడు. ఆ మాట విని బోదిలేర్ హృదయం భగ్నమయింది బహూశా ఆయన మృత్యువుని మరింత శీఘ్రంగా వచ్చేలా చేసింది.

కానీ తన రోజుల్లో సింబలిజానికి మతగురువుగా భావింపబడి ఎవరి ఇంటికి కవులు, చిత్రకారులు సాహిత్యయాత్రలు చేసేవారో ఆ కవి మల్లార్మే మరణించిన తర్వాత అనాటి అతని ప్రఖ్యాతి క్రమంగా తగ్గిపోగా మరణించిన బోదిలేర్ కీర్తి అతని మరణానంతరం ఆకాశమధ్యాన్ని అంటుకుంది అర్ధశతాబ్దం తర్వాత ష్టాంకోక్తో అన్నాడు: ''మల్లార్మే జర్నలిజం శైలిని ప్రభావితం చేస్తాడు; కానీ ఆయనలో ఆశ్చర్యకరమైన యౌవనం తొణికిసలాడుతోంది.''

మానవజాతి పురోగమనం ఎప్పుడూ జిజ్ఞాసాక్షేత్రంలో వేగుచుక్కల్లాంటి నూతన దర్శనమున్న మహా మానవుల చేతనే తీసుకురాబడిందని చరిత్ర చూపిస్తుంది. కానీ, వాళ్ళని వాళ్ళ సమకాలికులు ఎప్పుడూ ఈర్ష్యా ద్వేషాలకు గురిచేసి కాలానికి బలిపశువుల్ని చేశారు వాళ్ళ రక్తపాతం మీదనే కొత్త యుగం నడిచి వచ్చింది. మహా కవి ఇక్బాల్ అన్నట్లు, "లక్షలాది నక్షత్రాలు చితికిపోయిన తర్వాత గానీ ఒక ఉషస్సు ప్రభవించదు."

## మార్క్సిస్టు పండితులు

## 22

క్షమించండి, ఇక్కడ నేను లేఖావ్యవహార మర్యాదలు విడిచిపెట్టవలసి వస్తోంది. 19 వ శతాబ్దపు 90ల్లోనూ, 20 వ శతాబ్దపు 20ల్లోనూ మాదిరిగాక, ఈనాడు మార్క్స్ విద్యార్థి ముందు అనేక ప్రశ్నలు లేస్తాయి. మహత్తర మార్క్సిస్టు గ్రంథావళిలో ఉన్న చింతనాగత ప్రజ్ఞావిశేషాల్ని అవగాహన చేసుకోవడానికి ఒక తీక్షణ విశ్లేషణాత్మక బుద్ధిశాలిత కావాలి. మార్క్సిస్టు పండితులమని కొందరు ప్రగల్భాలు పలుకుతుంటే హాస్యాస్పదంగా ఉంటుంది. ఇలా మనకు క్షుద్ర అక్షుద్ర పత్రికల్లో తారసిల్లే వాళ్ళు సాధారణంగా వాయుగుంభన కళాప్రవీణులు, ధూర్తులు. ఒక వీర భంగిమ ధరించి అమాయకుల్ని బెదరగొడతారు. దాస్ క్యాపిటల్‌కు, "ది పీపుల్స్ మార్క్స్" అనే ఒక సంక్షిప్తకృతి తెచ్చిన జాలియన్ బోర్హార్డ్ ఇలా అన్నాడు, "శాస్త్రజ్ఞానం లేని సాధారణ పాఠకుడు దాస్ క్యాపిటల్ని ఎంత మాత్రమూ అర్థం చేసుకోలేడు; మార్క్స్ అభివ్యక్తి విధానం కూడా సాధారణ పాఠకుడి అవగాహనకు అతీతంగా ఉంటుంది." అయనే మార్క్స్ మా జేబులో ఉన్నాడంటూ సంచరించే ఛద్మవేషధారుల్ని గురించి ఇలా అన్నాడు, "మార్క్స్ సులువుగా స్పష్టంగా అర్థమవుతాడు అని

అంటూ ఆ మిషతో ఒక గొప్పవాడ్ని పొగుడుతున్నట్టు అభినయం చేసి తాము గొప్ప వ్యక్తుల మనిపించుకోవాలనే ఆతురతే వాళ్ళలో ఉంది వేరే మహదాశయా లేవీ లేవు" అని చెప్పి, వాళ్ళ మాటలు వట్టి అబద్ధాలని కూడా చెపుతాడు. అది వేరే విషయం.

ఈ శతాబ్దంలో మార్క్సిజానికున్న కీలకమైన ప్రాధాన్యందృష్ట్యా ప్రతి కవీ, ప్రతి జిజ్ఞాసువూ, ప్రతి వర్గచైతన్య ప్రచారకుడు మార్క్సిజంని గురించి ఒకపాటి లఘుజ్ఞానమైనా సంపాదించుకోడానికి ప్రయత్నించడం కర్తవ్యం. పాండిత్యం అక్కరలేదు. మార్క్సిస్టు సిద్ధాంత ప్రథమ కార్యకర్త లెనిన్ అంటాడు: "మార్క్సిస్టు గ్రంథావళి వర్గ చైతన్య శ్రామికుడి టేబిల్ మీద ఉండవలసిన దైనందిన గ్రంథావళి."

డయలెక్టికల్ మెటీరియలిజం అనీ సైంటిఫిక్ సోషలిజం అనీ రెండు భాగాల సంయోగమయిన మార్క్సిజంలో మార్క్స్ యొక్క నిజప్రదానం చాలా తక్కువ భాగం. మార్క్సకే ఆపాదింపబడవలసిన ఆ భాగం మానవ చరిత్రలో పరిణామం పొందుతూ వచ్చిన మానవజిజ్ఞాసకు అంతిమసారం. ఈ అల్పసారానికి ఎంత అద్భుత విస్ఫోటక శక్తి ఉందంటే మానవ సమాజాన్ని మానవ జీవితాన్ని గురించి మానవచింతనని పునాదుల్నుంచీ మార్చివేస్తుంది.

డైలెక్టికల్ మెటీరియలిజంగానీ హిస్టోరికల్ మెటీరియలిజం గానీ కీలక పాత్ర వహించవు. మార్క్స్ అన్వేషించిన ఏ సామాజిక యంత్ర అదృశ్య అంగాలున్నాయో ఆయన పరిశోధించిన చరిత్రను నడిపించే ఏ అదృశ్య శాసనాలున్నాయో, వేటి సాక్షాత్కారం సమాజాన్ని సామ్యవాద సమాజంగా మార్చడంలో ఆయనకి మార్గం చూపించాయో ఆ సామాజిక రహస్య అంగాలు ఆ చారిత్రిక రహస్య శాసనాలు నిజంగా కీలక పాత్ర వహిస్తాయి. ఇక్కడే ఆయన ప్రతిభ స్వీకరించిన మహత్తర కార్యం ప్రారంభం అవుతుంది. "క్యాపిటల్, ఏన్ అనాలిసిస్ ఆఫ్ కాపిటలిస్ట్ ప్రొడక్షన్" అనే సిద్ధాంత వ్యాసం, మార్క్స్ అర్థశాస్త్రానికి చేసిన విఖ్యాత ప్రదానం; మానవ జిజ్ఞాసా చరిత్రకే ఒక మహత్తర ప్రాణదానం. అది మొదటిసారి మానవ చరిత్రని అర్థం చేసుకోవడానికి ఒక కొత్త కోణాన్ని అన్వేషించి ఇచ్చింది. అందుచేతనే మార్క్స్ మానవజాతి మేధల్లో శిఖరమయ్యాడు.

మార్క్స్‌లో ఎంతభాగం పూర్వపుచింతన, ఎంతభాగం పరిణామం వికాసం అనే పరిశీలన వర్తమాన శతాబ్దానికి ఆసక్తిజనకమైన సఫలమైన ప్రయత్నం. మార్క్స్ తాత్త్విక తర్కం చాలా భాగంలో హెగెల్ సూత్రాలు విలువైన పాత్ర నిర్వహిస్తాయనేది విశదం. ఇక్కడ హెగెల్‌కు మార్క్స్‌కు ఉన్న ఆకీలక సంబంధం ఏమిటి అనే ప్రశ్న వస్తుంది. చరిత్రను గురించి హెగెల్ చేసిన తత్త్వజిజ్ఞాసలో ఆయన చరిత్రను ఒక గతి తార్కిక గమనంగా, ఒక విప్లవాల పరంపరగా చూచాడు. ఈ విధానంలో "జీట్‌జీస్ట్" అనే యుగచేతన ద్వారా చరిత్రను నిర్ణయించే ఒక మానవాతీత నిర్ణాయక శక్తి చేతిలో ప్రజలు పనిముట్లు మాత్రమే. ఆ పని ముట్లు విప్లవాన్ని రూపొందించే సాధనాలు. ఈ "జీట్‌జీస్ట్" స్థానంలో ప్రజా ఉద్యమాలు, ఆర్థిక శక్తులు వస్తుప్రపంచంలో గానీ మార్పు తెచ్చే మూలకారణాలనే భావాన్ని మార్క్స్ ప్రవేశ పెట్టాడు.

మార్క్స్ చరిత్రకు ఇచ్చిన తర్కాన్ని మనం తెలుసుకుంటే హెగెల్ యొక్క 'అబ్సొల్యూట్' హెగెల్ యొక్క "జీట్‌జీస్ట్" మార్క్స్ మనస్సును పాదాక్రాంతం చేసుకున్నాయని విదితం అవుతుంది. ఆయన సైంటిఫిక్ సోషలిజం అనే సిద్ధాంతం అంతా హెగెల్ యొక్క జీట్‌జీస్ట్ అనే యుగచేతనలో నుంచి పరిణామంగా వికసించిన విషయమేనని మనకు తెలుస్తుంది. దాన్నే లుడ్విగ్ ఫ్యూర్‌బాక్ మీద ఆయన రాసిన సిద్ధాంత వ్యాసంలో ఇలా అన్నాడు: "తత్త్వవేత్తలందరూ ప్రపంచాన్ని ఇంతవరకు వ్యాఖ్యానించారు. ఇప్పుడు ప్రపంచాన్ని మార్చే కాలం వచ్చింది." ఈ సూక్తి హెగెల్ యొక్క జీట్‌జీస్ట్‌లో నుంచి ఉత్పన్నమైన వైజ్ఞానిక శిశువే హెగెల్ చింతన మార్క్స్‌లో పొందిన ఒక మెరుపు లాంటి మెలికే. మార్క్స్ యొక్క సైంటిఫిక్ సోషలిజం. ఇక ఆయన డయలెక్టికల్ మెటీరియలిజం తన ఆర్థిక సామాజిక సిద్ధాంతాన్ని గౌరవస్థానానికి ఎత్తడానికి తత్త్వవేత్తగా తాను కల్పించిన ఒక మెటఫిజికల్ రంగు మాత్రమే.

మానవజాతి వర్తమాన నిమ్న దశలోనుంచి ఉన్నత దశలోకి క్రమంగా పోయి తీరుతుందన్న హెగెల్ యొక్క తాత్త్విక కంఠమే మార్క్స్ యొక్క ద్రష్టృత్వపు లోతుల్లోకి దిగి పెరిగి పెద్దదై మార్క్సియన్ డైలెక్టిక్స్‌గా రూపొందింది. మానవ సమాజంలో తత్త్వశాస్త్ర గమనాన్ని మనం పరిశీలిస్తే మనకు ఒక అవిచ్ఛిన్న ధారారూప పరిణామం కనిపిస్తుంది. శుష్కజ్ఞానాత్మక

తర్కంగా మొదట ఉంటూ వచ్చిన తత్త్వశాస్త్రం క్రమంగా ఆ ధోరణి విడుస్తూ మానవ సమాజాన్ని గురించి క్రమాభివృద్ధి పొందుతూ వచ్చిన ఒక ఆతురతను చూపిస్తూ వచ్చింది. తన పరిసర వస్తు తత్త్వజ్ఞానంగా బయలుదేరిన తత్త్వ శాస్త్రం క్రమంగా ఆ జ్ఞానం మానవ సమాజ శ్రేయస్సుకు వాడబడాలనే ధోరణి అవలంబించింది. ఈ ధోరణే హెగెల్‌లో ఒక మహత్తర మానవజాతి భవిష్యత్తును దర్శించే ద్రష్టృత్వంగా ఉదయించింది; మార్క్స్‌లో మానవ సమాజాన్ని మార్చాలన్న దృఢ సంకల్పంగా మారింది. మార్క్స్ తర్వాత తత్త్వశాస్త్ర విద్యార్థి కంటికి తత్త్వశాస్త్రంలో ఇంకా తచ్చాడుతున్న వాద వివాద ప్రకరణాలు క్షీణదశ చేరుతున్న ఒక శాస్త్రపు అంతిమ చిహ్నాలుగా కనిపిస్తాయి - మనిషి శరీరంలో ఆపెండిక్సులా.

## 23

మీ ఉత్తరాలన్నీ కలిసి ఒక్కరోజే వచ్చాయి. మీ ఉత్తరాలు ఆకాశ లోకాల్నుంచి రాలిన చినుకుల దేవతల్లా వచ్చాయి. వర్షరుతువులోనే ఉంది ఒక చల్లటి ఆత్మీయత. చెట్లు నదులు కొండలు ఆశించే భావశిశువుల్ని మేఘాలు కురుస్తున్నట్లనిపిస్తుంది. ఈ రుతువులో కనిపించే భూమ్యాకాశాల దాంపత్యంలో నుంచి కొత్త జీవనాంకురాలు పుడతాయి. ఫలిస్తాయి. కాలంచేత భుజింపబడి అదృశ్యమవుతాయి. మళ్ళీవస్తాయి ఎక్కడ్నుంచో. నూత్న జీవనమంతా చినుకుల కుట్రలా ఉంది. ఈ వర్షరుతువు జీవన వేదాంతగురువు. ఇప్పుడు వాన జోరుగా కురుస్తోంది బయట....

## 24

అంచనా వెయ్యలేకపోతున్నారు. ఆర్థికశాస్త్రాన్ని వాస్తవ జీవనశాస్త్రంతో మొట్ట మొదట ముడివేసినవాడు మార్క్స్. ప్రాచీన వేదాంతులంతా అదే పనిచేశారు గదా అంటారు మీరు - నాకు తెలుసు. అది కేవలం ఆధ్యాత్మిక జీవనం చేతిలో వాస్తవ జీవనాన్ని బలిచేయమనే విధానం. అసలు ఆర్థిక వ్యవహారాలమీద

వైరాగ్యం కలిగించే ప్రయత్నం. కనుక మార్క్సు చేసిన పని అపూర్వం. మార్క్సు ముఖ్యతః వేదాంతి. మొదట ఆయన చేతుల్లోనే సమాజపు పునర్వ్యవస్థీకరణ అనే భావం ఒక శాస్త్రీయ, ఆచరణీయ రూపంతో పుట్టింది. అనేక శతాబ్దాలు తత్త్వశాస్త్రం ఒక జిజ్ఞాసాత్మక తర్కంగానే ఉండిపోయింది. తత్త్వశాస్త్రం అభివృద్ధి పొంది సారాంశ సిద్ధాంతము, జ్ఞాన సిద్ధాంతము (అంటోలజీ, ఎపిస్టొమాలజీ) లాంటి శాస్త్రీయ లక్షణాలు ఉద్భవించినప్పటికీ, తత్త్వశాస్త్రం ఎప్పుడూ ఈ రెండు సిద్ధాంతాల చుట్టూ చేసిన తర్కక్రీడగానే ఉండిపోయింది. మానవ సమాజము, వర్గదోపిడి, సామాజిక న్యాయంలాంటి ప్రాథమిక మానవ ధర్మం స్పృశించలేదు. మనకు తత్త్వశాస్త్ర వికాసంలో క్రమంగా పూర్వం చెప్పిన సిద్ధాంత ద్వయ చక్రభ్రమణం ఆగిపోయి - మానవ జీవనాన్ని, సామాజిక న్యాయాన్ని, కార్యోన్ముఖత్వాన్ని స్పృశించని శుద్ధజ్ఞానకేళి నిరర్థకం అనే జ్ఞానోదయం కలగడం కనిపిస్తుంది.

ఈవిధంగా మార్క్సును ప్రభావితం చేసిన హెగేల్‌లో మొదట తత్త్వశాస్త్రంలో అంటోలాజికల్, ఎపిస్టొమోలాజికల్ భాగాల ప్రాధాన్యం క్షీణించి అన్యసామాజిక తత్త్వభాగాల ప్రాధాన్యం పెరగడం కనిపిస్తుంది. హెగెల్ ఇచ్చిన ఈ కొత్త ట్విస్టే ప్రాణతుల్యం; అదే చరిత్రని మార్చింది. హెగెల్ ప్రతిపాదించిన డయలెక్టికల్ మువ్మెంట్, స్పిరిట్ ఆఫ్ ది ఏజ్, ఆబ్సొల్యూట్ అనే మూడు సూత్రాలే మార్క్సు యొక్క సైంటిఫిక్ సోషలిజంకు, ఆయన కమ్యూనిస్టు మేనిఫెస్టో ప్రణాళికకు జన్మ ఇచ్చాయి. ఈ రోజు 20 వ శతాబ్దపు తత్త్వశాస్త్ర కర్తలందరూ మార్క్సు ముందు ఎందుకు తలంవంచుతున్నారంటే - వాళ్ళెవ్వరూ సమాజంలో ఉన్న మానవ పీడనకు మార్క్సులా చికిత్సా విధానం కనిపెట్టలేదు. వాళ్ళందరూ జ్ఞానం, సారాంశం అనే సిద్ధాంతాల వాదోపవాద ఊబిలో ఇరుక్కుపోయారు శాశ్వతంగా. ఈ శతాబ్దం సమాప్తం కావడానికి ఒక పాతికేళ్ళ కాలమే ముందుండగా మార్క్సిజాన్ని ఇరవయ్యో శతాబ్ది అనుభవాల కాంతిలో అభివృద్ధి చేసి మార్క్సును ఇరవయ్యొకటో శతాబ్దంలోకి తీసుకుపోయే విశిష్ట మేధావి ఇంకా దిగంతరేఖల మీద ఉదయించలేదు. కాని ఈ లోపుగా మార్క్సు అనే రొట్టె మీద ఎలుకల దాడిమాత్రం జోరుగా సాగుతోంది.

# కవిసేన ప్రభావం

కవి సేన గట్టిగా ఒక దశాబ్దం పైగా (1970 - 1980) తెలుగు కవుల్ని, విమర్శకుల్ని, పాఠకుల్ని సుశిక్షితుల్ని చేసిలది. పూర్వం తెలీని రచయితల్ని, పూర్వం చర్చితంకాని గ్రంథాల్ని, భావాల్ని, నూత్నలోకాల్ని తెచ్చి తెలుగులో ప్రవేశ పెట్టింది. ఒక నూతన భావ ప్రపంచాన్ని ఆవిష్కరించింది. ఒక నూత్న దృక్కోణానికి నాంది పలికింది. ఈ రోజు కవిసేన మూలంగా అందరు కవులూ కొత్తపంథాలో రాస్తున్నారు. నూటికి తొంభయిమంది కవిసేన ఒత్తిడి, ప్రభావం చేతనే వాచ్యార్థ ప్రధానమార్గం విడిచిపెట్టారు.

నైతిక న్యాయస్థానంగా వ్యవహరించవలసినవాళ్ళు పోలీసులుగా ముద్దాయీలుగా వ్యవహరిస్తే నోరులేని ప్రజలగతి ఏంకావాలి? ఒక దేశపు వైజ్ఞానిక వర్గం స్వయంగా సంకెళ్ళను ఆహ్వానించడం, స్వతంత్ర మస్తిష్కతను ఇతరులకు పాదాక్రాంతం చెయ్యడం ఆ దేశానికి ఎంత అవకారమో ఎంత ద్రోహమో ఈనాడు ఆలోచించవలసిన సమయం వచ్చింది. కవిసేన మేనిఫెస్టో చదవండి. అన్నీ స్పష్టంగా ఉన్నాయి. 40 ఏళ్ళనుంచీ నడిపిస్తున్న తమ మోసం బయట పడేరోజు వచ్చేసరికి తమ బౌద్ధిక శూన్యత, వైజ్ఞానిక న్యూనత, స్వప్రయోజనైక కాంక్ష నగ్నం భగ్నం అయ్యేరోజు వచ్చేసరికి ఈ సాహిత్యముఖ రాజకీయ భటులు విభ్రాంతులై క్రోధాగ్ని కురిపిస్తున్నారు పాపం, ఎంత దెబ్బ తగలక పోతే ఇంత చెమట పట్టి ఉంటుంది?

కానీ కవిసేన ఒకటి గుర్తుంచుకోవాలి. ఈ అల్పక్రోధం చక్కర్లోపడి సిద్ధాంతాలమీద స్వవిశ్వాసాన్ని అస్పష్టం కానీకూడదు. మేనిఫెస్టోలో ఏ సాంఘిక, రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలమీద విశ్వాసం ప్రకటింపబడిందో ఏ సాహిత్య లక్షణంమీద ఏ సాహిత్య ప్రయోజనంమీద విశ్వాసం ప్రతిపాదిం బడిందో దాన్ని ఈ 'బురదలో మండూక సమూహాలు చేస్తున్న యుద్ధా గోలలో' ఇరుక్కుని మరచిపోగూడదు.

సాహిత్యపు ఉత్తమ ప్రయోజనం అనే ప్రజాశేయస్సు 20వ శతాబ్ద మనకు ప్రదానం చేసిన విప్లవతత్త్వం చేతనే సాధించబడగలదనే దృక్పథ మన వర్తమాన మానవీయ సభ్యత. ఇదే కవిసేన ఆశయం. కానీ ఈ సభ్యత వ్యాప్తం చెయ్యాలంటే సాహిత్యపక్షాన గుర్తించవలసిన ఒక మహాసత్యం సాహిత్యం ఏ ఆకర్షణీయ భాషో ఏ అలంకార భాషో ఏ ప్రతీకల బింబాల భాషో ఆ భాషా విశేషంగానే సాహిత్యాన్ని ఉండనివ్వాలి. సాహిత్య ప్రాణమైన అల

కారాన్ని సాహిత్య స్రష్ట జీవితానుభూతి జ్వాలల్లోనుంచే పోగుచేసుకుంటాడు. అలంకారాలకు మరో జన్మస్థానం లేదు. అనుభూతికీ కవిత్వానికీ ఉన్న బంధం అవినాభావ సంబంధం!

అలంకారం అయిన సాహిత్య భాషకే ఆకర్షణశక్తి ఉంటుంది. అలంకారాలు లేని నిత్యవ్యవహారభాషకు అంటే సాధారణ భాషకు ఆకర్షించే శక్తి ఉండదు. అది పని గడుపుకోడానికి మనిషి దైనిక జీవనంలో వాడుకునే చొక్కా, పంచె, కుర్చీ, చాప లాంటి వస్తువు. కనుక ప్రజాశ్రేయస్సు కోరేవాడు, విప్లవం కోరేవాడు, ప్రగతి కోరేవాడు సామాజిక స్పృహా అని నినాదం చేసేవాడు మొట్టమొదట ఆకర్షించే శక్తి ఉన్న భాషకే ఈ ప్రయోజనాల్ని సాధించే శక్తి ఉంటుందనీ, అదే అలంకారభాష అని,దాని పేరే సాహిత్యమనీ కవిత్వమనీ అర్థం చేసుకోవాలి. అలంకారాల్లేని, అందుచేత ఆకర్షణలేని, భాష అసాహిత్యం, అకవిత్వం అది ఎవర్నీ ఆకర్షించదు. ఆకర్షించలేని మాటలు హృదయ పరివర్తన కలిగించలేవు. హృదయ పరివర్తన లేకపోతే ప్రజాచైతన్యం లేదు. ప్రజాచైతన్యం లేకపోతే ప్రగతిలేదు, విప్లవం లేదు. ఇదీ అలంకారం నుంచీ విప్లవం వరకూ ఉన్న సాహిత్య ప్రస్థానం.

అందరూ కవిసేన మేనిఫెస్టో క్షుణ్ణంగా చదవాలి, అందులోనే అన్ని ప్రశ్నలకూ జవాబులున్నాయి. కవి సేనకు శత్రువులెవ్వరూ లేరు - అజ్ఞానం తప్ప! (సంపూర్ణ సూర్యగ్రహణం 16-2-1980 సందర్భంలో విడుదల చేసిన కవిసేన పోస్టరు కట్టలు పంపిస్తూ రాసిన లేఖ.)

# 25

నేనంత గొప్పకవినైనా భూకంపం వచ్చినప్పుడు నేనూ పోతాను. ఉద్యానవనాలు శిల్పఖండాలు లైబ్రరీలు నాగరకతలు అన్నీ పోతాయి. కానీ వసంతం వస్తుంది - ఆ శిథిలాల మీదనే! అక్కడే మళ్ళీ పిడికెడుపూలు చల్లుతుంది. వర్ణమయం చేస్తుంది. వేదనామయం చేస్తుంది.

నేనెంత గొప్ప కవినైనా లోకానికి నా అనే నా స్వరం అనివార్యం కాదు. నేను కొత్తగా లోకానికి ఇచ్చాననుకునే సౌందర్యం నేను చేసిన సృష్టి కాదు. చెట్టున పూచిన పూలు చెట్టు సృష్టించినవి కావు. కాంతి నెవడు సృష్టిస్తాడు? వెలిగే జ్యోతికి ప్రమిదనైనందుకుమాత్రం నేను ధన్యుడ్నని సంతోషిస్తాను.

# కవితాయాత్ర - శబ్దసైన్యాలు

# 26

కవిత్వం ఇన్‌స్పిరేషన్ మూలంగానే వస్తుందని సాధారణంగా అంటూ ఉంటారు. ఇన్‌స్పిరేషన్ అంటే ఒక తీవ్ర ఉద్రేకం; అంటే ఒక మహత్తర ప్రభావశాలి. వస్తువో, వ్యక్తో, సంఘటనో కవిని తీవ్రంగా కుదిపి భావోద్వేగానికి గురిచేసేది కానీ అలాంటి తీవ్ర ఉద్రేకం ఆకాశంనుంచి ఊడిపడదు; జీవితంలో ఏదో ఒక సన్నివేశం అగ్నిలా చురక వేస్తుంది; ఆ అగ్ని ఏ రూపంలో ఉంటుందో చెప్పలేం. కానీ ఆ చురక ఫలితం ఇన్‌స్పిరేషన్ అని తెలుసుకోవచ్చు. ఈ విషయం మీద జిజ్ఞాస చేస్తూ స్పానిష్ కవి లోర్కా అంటాడు, "కవిత్వం రాయడానికి భావోద్వేగ స్థితి అంత అనుకూలమైన స్థితి కాదు. విదేశ ప్రయాణం నుంచి తిరిగి వచ్చినట్లు ఒకడు భావోద్వేగం నుంచి తిరిగి వస్తాడు. కవిత ఆ ప్రయాణానికి ఇవ్వబడిన ఒక అద్భుత సాహిత్య రూపం."

విన్న రాగం కంటే వినని రాగం మరింత మధురం అనే ఒక మనోజ్ఞ సూక్తి జ్ఞాపకం వస్తోంది. కవితా తత్త్వాన్నంతా పిండి ఒక్క బిందువుగా ఇచ్చిన మాట ఇది. కవిత తన జన్మస్థలంలో ఆవదుల్లేని మాధుర్యం. దాన్ని బహిః ప్రపంచానికి అందజేద్దామన్న సంకల్పం కలిగినప్పటినుంచీ ప్రమాదభరితమైన కవితా యాత్ర ప్రారంభిస్తుంది. కవి యొక్క అంతరాంతర కుహర తీరాల్లో ఎక్కడో ఘర్ఘర ధ్వని చేస్తూ పడి ఉంటుంది కవిత. దాన్ని వాఙ్మయ రూపంలో బయటకు తీసుకొచ్చే ప్రయత్నం అభివ్యక్తి. ఈ అభివ్యక్తి యొక్క బలాత్కార హస్తానికి ఆ దూర తీర నివాసి కవిత అంత సులువుగా లొంగదు. ఎదురుతిరుగుతుంది, అభివ్యక్తి ఒడిసి పట్టుకుంటుంది. శబ్దాల్ని మార్చి మార్చి ప్రయోగిస్తుంది అభివ్యక్తి. చివరకు కవి యొక్క శబ్దాల చుట్టలోకి ఎలాగో ప్రవేశిస్తుంది ఒక మహా సర్పంలా కవిత! ఎంత గొప్ప కవిత అయినా కావొచ్చు, కానీ క్రూరమైన అభివ్యక్తి బలాత్కార చిహ్నాలుమాత్రం దాని శరీరంమీద ఉంటాయి.

భాష అభివ్యక్తికి అనివార్యమైతే శబ్దాలు కవిత్వానికి పునాదిగత నిర్మాణ వస్తువులవుతాయి. అప్పుడు కవిత్వంలో అభివ్యక్తి ఒక బ్రహ్మాండమైన చిక్కు సమస్య అవుతుంది. భాష అనే యుద్ధరంగంలో కవి ఏకాకిగా నిరాయుధుడై బ్రహ్మాండమైన శబ్ద సైన్యాలతో చారిత్రాత్మక యుద్ధాలు చేస్తాడు. పాత ఆయుధాలు పాత కాలపు యుద్ధాలు చేయడానికి పనికొస్తాయి. కాని నిజమైన కవి

సమస్యలు కొత్తవి, వర్తమాన జీవన పాత్రలో నుంచి పుట్టుకొచ్చేవి. కనుక కవి తన యుద్ధ వ్యూహాన్ని తన శస్త్రాల్ని తానే సృష్టించుకోవాలి. తన ఆయుధాగారాల్ని తానే నిర్మించుకోవాలి. ఈ వ్యూహ రచనా విక్రమంలో శబ్దాల్ని తన ఉద్దేశానికి అనుకూలంగా ఒకచోటి నుంచి మరోచోటికి నెట్టుతూ ఉంటాడు. రొట్టె పిండిలా పిసుకుతూ ఉంటాడు. రకరకాల భంగిమల్లో రూపం ఇస్తూ ఉంటాడు ఈ శబ్ద వ్యూహ రచనా ప్రక్రియ కళాత్మక స్థాయికి లేస్తుంది. కానీ ఎంత కళ అయినప్పటికీ అది కవితను వ్యక్తం చేద్దామన్న ఆతురతే, అంతతః అది అభివ్యక్తి సమస్యే. అభివ్యక్తిలో కుట చిక్కబడుతుంది; అందులోనూ కవిత్వమయితే భయానక ప్రమాదాలు సిద్ధమవుతాయి.

కానీ కవిత్వం మాత్రం భాష కాదు అనే మహాసత్యం అర్థం చేసుకోండి; భాషాస్థాయిని పట్టుకుని వేలాడేది అధమ కవిత్వం లోకంలో అసలు కవిత్వంతో పరిచయం లేని కొన్ని తెగల ప్రజలున్నారు వాళ్ళు చరిత్ర కాటువేసిన దురదృష్ట వంతులు. వాళ్ళు ఇలియట్ చెప్పినట్లు కొన్ని భాషా సౌందర్యాల భ్రాంతుల్ని కవిత్వమనుకుంటారు మంజుల మనోహర, కోమల, సురుచిర ఇత్యాది ప్రాబంధిక భాషా శబ్దాల్ని, కొన్ని పునరావృత్తమైన సంస్కృత సమాసాల్ని, కొన్ని నలిపిపారేసిన ఛందోబంధ విశ్వాసాల్ని కాలానుగత పూజ్యభావ అంధత్వం చేత తిరస్కరించే ధైర్యం కోల్పోయి అదే కవిత్వంగా భావిస్తూ వాడుతుంటారు. ఈ చక్రవ్యూహంలోనుండి బయటపడని తెలుగు కవులు ఆధునిక కవులనే పేరుతో చలామణీ అవుతున్నా ఆధునికతా స్పృహలేని వాళ్ళు అనుకోవాలి.

భారతీయ కావ్య శాస్త్రంలో సుప్రతిష్ఠితమైన ధ్వని, చమత్కారాది సిద్ధాంతాన్ని సుమారు వెయ్యేళ్ళు తెలుగు కావ్యాలకు వర్తింప జేయాలన్న సంకల్పం కలగకపోవడమే తెలుగు సాహిత్యంలో ఒక విచిత్రమైన చరిత్రాత్మక సన్నివేశం. కావ్య శాస్త్ర సిద్ధాంతాన్ని వర్తింపజేయాలన్న సంకల్పం గనక ఆనాడు తెలుగులో ఏ దశలోనైనా తలయెత్తిఉంటే, తెలుగు కావ్యరచనా విధానం ఛందోబద్ధ శబ్ద సౌందర్య మాత్రంగా ఉండిపోక ప్రపంచంలో అన్య ప్రాంతాల్లో లాగే ఉక్తి చమత్కార ప్రధాన విధానంగా మారిపోయి ఉండేది. బహుశా నన్నయ కలమెత్తే నాటికి దేశంలో ధ్వని, వక్రోక్తి ఇత్యాది సిద్ధాంతాల ప్రాభవం తగ్గిపోయి, శబ్ద ప్రధానమైన ఓజోగుణ దీప్తి రచన ప్రచారంలోకి వచ్చి ఉంటుంది.

# కవితాయాత్ర - శబ్దసైన్యాలు

# 26

కవిత్వం ఇన్స్పిరేషన్ మూలంగానే వస్తుందని సాధారణంగా అంటూ ఉంటారు. ఇన్స్పిరేషన్ అంటే ఒక తీవ్ర ఉద్రేకం; అంటే ఒక మహత్తర ప్రభావశాలి. వస్తువో, వ్యక్తో, సంఘటనో కవిని తీవ్రంగా కుదిపి భావోద్వేగానికి గురిచేసేది కానీ అలాంటి తీవ్ర ఉద్రేకం ఆకాశంనుంచి ఊడిపడదు; జీవితంలో ఏదో ఒక సన్నివేశం అగ్నిలా చురక వేస్తుంది; ఆ అగ్ని ఏ రూపంలో ఉంటుందో చెప్పలేం. కానీ ఆ చురక ఫలితం ఇన్స్పిరేషన్ అని తెలుసుకోవచ్చు. ఈ విషయం మీద జిజ్ఞాస చేస్తూ స్పానిష్ కవి లోర్కా అంటాడు, "కవిత్వం రాయడానికి భావోద్వేగ స్థితి అంత అనుకూలమైన స్థితి కాదు. విదేశ ప్రయాణం నుంచి తిరిగి వచ్చినట్లు ఒకడు భావోద్వేగం నుంచి తిరిగి వస్తాడు. కవిత ఆ ప్రయాణానికి ఇవ్వబడిన ఒక అద్భుత సాహిత్య రూపం."

విన్న రాగం కంటే వినని రాగం మరింత మధురం అనే ఒక మనోజ్ఞ సూక్తి జ్ఞాపకం వస్తోంది. కవితా తత్త్వాన్నంతా పిండి ఒక్క బిందువుగా ఇచ్చిన మాట ఇది. కవిత తన జన్మస్థలంలో అవధుల్లేని మాధుర్యం. దాన్ని బహిః ప్రపంచానికి అందజేద్దామన్న సంకల్పం కలిగినప్పటినుంచీ ప్రమాదభరితమైన కవితా యాత్ర ప్రారంభిస్తుంది. కవి యొక్క అంతరాంతర కుహర తీరాల్లో ఎక్కడో ఘర్ఘుర ధ్వని చేస్తూ పడి ఉంటుంది కవిత. దాన్ని వాఙ్మయ రూపంలో బయటకు తీసుకొచ్చే ప్రయత్నం అభివ్యక్తి. ఈ అభివ్యక్తి యొక్క బలాత్కార హస్తానికి ఆ దూర తీర నివాసి కవిత అంత సులువుగా లొంగదు. ఎదురుతిరుగుతుంది, అభివ్యక్తి ఒడిసి పట్టుకుంటుంది. శబ్దాల్ని మార్చి మార్చి ప్రయోగిస్తుంది అభివ్యక్తి. చివరకు కవి యొక్క శబ్దాల చుట్టలోకి ఎలాగో ప్రవేశిస్తుంది ఒక మహా సర్పంలా కవిత! ఎంత గొప్ప కవిత అయినా కావొచ్చు, కానీ క్రూరమైన అభివ్యక్తి బలాత్కార చిహ్నాలుమాత్రం దాని శరీరంమీద ఉంటాయి.

భాష అభివ్యక్తికి అనివార్యమైతే శబ్దాలు కవిత్వానికి పునాదిగత నిర్మాణ వస్తువులవుతాయి. అప్పుడు కవిత్వంలో అభివ్యక్తి ఒక బ్రహ్మాండమైన చిక్కు సమస్య అవుతుంది. భాష అనే యుద్ధరంగంలో కవి ఏకాకిగా నిరాయుధుడై బ్రహ్మాండమైన శబ్ద సైన్యాలతో చారిత్రాత్మక యుద్ధాలు చేస్తాడు. పాత ఆయుధాలు పాత కాలపు యుద్ధాలు చేయడానికి పనికొస్తాయి. కాని నిజమైన కవి

సమస్యలు కొత్తవి. వర్తమాన జీవన పాత్రలో నుంచి పుట్టుకొచ్చేవి. కనుక కవి తన యుద్ధ వ్యూహాన్ని తన శస్త్రాల్ని తానే సృష్టించుకోవాలి. తన ఆయుధాగారాల్ని తానే నిర్మించుకోవాలి. ఈ వ్యూహ రచనా విన్యాసక్రమంలో శబ్దాల్ని తన ఉద్దేశానికి అనుకూలంగా ఒకచోటి నుంచి మరోచోటికి నెట్టుతూ ఉంటాడు. రొట్టె పిండిలా పిసుకుతూ ఉంటాడు. రకరకాల భంగిమల్లో రూపం ఇస్తూ ఉంటాడు. ఈ శబ్ద వ్యూహ రచనా ప్రక్రియ కళాత్మక స్థాయికి లేస్తుంది. కానీ ఎంత కళ అయినప్పటికీ అది కవితను వ్యక్తం చేద్దామన్న ఆతురతే, అంతతః అది అభివ్యక్తి సమస్యే. అభివ్యక్తిలో కుట్ర చిక్కుబడుతుంది; అందులోనూ కవిత్వమయితే భయానక ప్రమాదాలు సిద్ధమవుతాయి.

కానీ కవిత్వం మాత్రం భాష కాదు అనే మహా సత్యం అర్థం చేసుకోండి; భాషాస్థాయిని పట్టుకుని వేలాడేది అధమ కవిత్వం లోకంలో అసలు కవిత్వంతో పరిచయం లేని కొన్ని తెగల ప్రజలున్నారు వాళ్ళ చరిత్ర కాటువేసిన దురదృష్టవంతులు. వాళ్ళు ఇలియట్ చెప్పినట్టు కొన్ని భాషా సౌందర్యాల భ్రాంతుల్ని కవిత్వమనుకుంటారు మంజుల మనోహర, కోమల, సుమధుర ఇత్యాది ప్రాబంధిక భాషా శబ్దాల్ని, కొన్ని పునరావృత్తమైన సంస్కృత సమాసాల్ని, కొన్ని నలిపిపారేసిన ఛందోబంధ విన్యాసాల్ని కాలానుగత పూజ్యభావ అంధత్వం చేత తిరస్కరించే ధైర్యం కోల్పోయి అదే కవిత్వంగా భావిస్తూ వాడుతుంటారు. ఈ చక్రవ్యూహంలోనుండి బయటపడని తెలుగు కవులు ఆధునిక కవులనే పేరుతో చలామణీ అవుతున్నా ఆధునికతా స్పృహలేని వాళ్ళు అనుకోవాలి.

భారతీయ కావ్య శాస్త్రంలో సుప్రతిష్ఠితమైన ధ్వని, చమత్కారాది సిద్ధాంతాన్ని సుమారు వెయ్యేళ్ళు తెలుగు కావ్యాలకు వర్తింప జేయాలన్న సంకల్పం కలగకపోవడమే తెలుగు సాహిత్యంలో ఒక విచిత్రమైన చరిత్రాత్మక సన్నివేశం కావ్య శాస్త్ర సిద్ధాంతాన్ని వర్తింపజేయాలన్న సంకల్పం గనక ఆనాడు తెలుగులో ఏ దశలోనైనా తలయెత్తిఉంటే, తెలుగు కావ్యరచనా విధానం ఛందోబద్ధ శబ్ద సౌందర్య మాత్రంగా ఉండిపోక ప్రపంచంలో అన్య ప్రాంతాల్లో లాగే ఉక్తి చమత్కార ప్రధాన విధానంగా మారిపోయి ఉండేది బహుశా నన్నయ కలమెత్తే నాటికి దేశంలో ధ్వని, వక్రోక్తి ఇత్యాది సిద్ధాంతాల ప్రాభవం తగ్గిపోయి, శబ్ద ప్రధానమైన ఓజోగుణ దీప్తి రచన ప్రచారంలోకి వచ్చి ఉంటుంది.

నన్నయభట్టు ఏ పంప అనే కన్నడ కవి ప్రభావానికి లొంగి తన ఆంధ్ర మహా భారతం రాశాడో ఆ పంప కవే ఆనాటి ఓజోగుణ ప్రధాన సంస్కృత వాఙ్మయ ప్రభావగ్రస్తుడైనవాడు. నన్నయ పరంపర వెయ్యేళ్ళు నడిచిన తెలుగుదేశంలో ఎన్నో తథాకథిత ఆధునిక ధోరణులు వచ్చినా ఆ కవుల్లో మూలగతంగా కావ్య స్పృహ లేకపోవడంచేత భాష మారినా వస్తువుమారినా నన్నయ వాసన మాత్రం పిదలేదు. ఆధునిక పాశ్చాత్యదేశాల్లో వచ్చిన రూపంలో ఇటీవలి కాలం వరకూ రాలేదు.

విప్లవము, హింసాత్మక, సామాజిక చైతన్యం అనే విషయాలమీద మీరు వ్యక్తంచేసిన అభిప్రాయాలతో నేను ఏకీభవించలేను. అయితే నేను ఏకీభ వించే అభిప్రాయాలు మీవి చాలా ఉన్నాయి. ఆంతరిక లోకాన్వేషణ గురించి చేసే మానవుడి సహజ నైతిక ఉత్కంఠ ఏదైతే ఉందో దానిమీద మన ఉభయు లకు అవగాహన సంబంధాలు ఉండడానికి అవకాశం ఉంది. మీరు ఆంతరిక లోకాలకోసం పొందే తపన నన్ను ఆకర్షించింది. కానీ నేను ఎక్కడ రెండో మార్గంలోకి చీలిపోతానంటే - ఒక వ్యక్తి తన సామాజిక పరిసరాలమీద అంధత్వం వహించడం అనైతికం అంటాను. వ్యక్తి సామాజిక సంఘర్షణలో పాల్గొనడం అతని నైతిక బాధ్యత అని భావిస్తాను. మనిషి భూగోళంమీద చేసే ప్రయాణంలో వ్యక్తికీ సమాజానికీ మధ్య సమన్వయం సాధించడమే పరమార్థం. కొంతకాలం ఈ సమన్వయం ఏదో అలౌకిక తాంత్రిక క్రియాపలాపం, తర్వాత మతం, తర్వాత కేవల తాత్త్విక జిజ్ఞాస, అంతిమంగా మనకాలంలో రాజకీయాలు. అందుచేత రాజకీయాలు దురాన్వయంగా అయినప్పటికీ పునాదిగతంగా మానవ లక్ష్యానికి సన్నిహిత సంబంధం ఉన్నవే. (నేను దూషించేవి ప్రజాద్రోహ రాజకీయాల్ని, అజ్ఞానాయుధాలు సాగిస్తున్న అధికార రోగపీడిత రాజకీయాల్ని.)

వ్యక్తికీ సమాజానికీ మధ్య ఉండవలసిన న్యాయ సంగత సమన్వయం సాధించడానికి కృషిచేసిన మహాపురుషులుగానే నేను శంకరుడ్ని, సోక్రటీసును, జీసస్‌ని, లెనిన్‌ని అర్థం చేసుకుంటాను. ఈ మహాపురుషులు వ్యక్తి సమాజద్వయ సమన్వయ ప్రక్రియలో నుంచి పుట్టినవారే. వాళ్ళు చరిత్ర శిశువులు. మోక్షం అందరికీ లభించాలి అనే పరమార్థం చోదకశక్తిగా లేకపోయినట్లయితే శంక రుడు భారతదేశమంతా పర్యటన చేసి బోధించవలసిన అవసరం ఉండేది కాదు. (మహాభారతంలో ధర్మరాజు తనతో సహయాత్రిగా వస్తున్న కుక్కను కూడా తనతోపాటు స్వర్గంలోకి రానీకపోతే తాను స్వర్గంలోకే ప్రవేశించనన్నాడు.)

## పరిణామ సిద్ధాంతం

అవును నాకు అర్థమయింది. మీకు ఇంకా కొంత విశదీకరణ అవసరం. డైలెక్టిక్స్ అనే భావమే హెగెల్‌లో నుంచి మార్క్స్‌లోకి వచ్చింది. డైలెక్టిక్స్ అంటే వాచ్యార్థం తర్కవాదకళ. అయితే ప్రయోగంలో ఆ మాటకు విశేషార్థచ్ఛాయలు వచ్చాయి. మార్క్స్‌లోకి హెగెల్‌లో నుంచి వచ్చిన డయలెక్టిక్స్‌ను గురించి చెపుతూ, తన ఫిలాసాఫికల్ నోట్‌బుక్స్‌లో లెనిన్ అంటాడు-"తత్త్వతః వస్తువుల్లో వున్న వైరుధ్యాన్ని గురించి చేసే పరిశీలనాత్మక అధ్యయనాన్ని డయలెక్టిక్స్ అనాలి." సృష్టి క్రమంలో సర్వత్రా వున్న పరస్పర విరుద్ధ స్వభావాలను గూర్చి - వైరుధ్యాల విలీనీకరణ గూర్చి కూడా లెనిన్ ఈ సందర్భంలో ప్రసక్తం చేశాడు. అదే హెగెల్ ప్రతిపాదించిన థీసెస్ - ఏంటిథీసెస్ - సింథెసిస్. "మిడ్ వైఫ్ టు ది డెలివరీ ఆఫ్ ఫ్యూచర్" అనే హెగెల్ యొక్క అభివ్యక్తి కూడా మార్క్స్‌లోకి దిగింది ఏంగిల్స్ కూడా తన ఆంటీ డహ్రింగ్‌లో దాని ప్రసక్తి తీసుకురావడం మనం చూస్తాము.

హెగెల్ ప్రకారం గతితర్కం (డయలెక్టికల్ మువ్‌మెంట్) ఏమిటంటే, ప్రపంచంలో ప్రతి భావము - ప్రతి వస్తువు - ప్రతి ఆలోచనా - ప్రతి పరిస్థితి అనివార్యంగా దాని విరుద్ధ భావానికీ విరుద్ధ వస్తువులూ విరుద్ధ ఆలోచనకూ విరుద్ధ పరిస్థితికీ దారితీస్తుంది. ఆ తరువాత ఆ విరుద్ధ ద్రవ్యంతో ఐక్యమై మరొక ఉత్కృష్ట క్లిష్ట ద్రవ్యంగా రూపొందుతుంది. ఈ సిద్ధాంతం హెగెల్‌లో సామాజిక విధానానికి కూడా వర్తిస్తుంది. దీన్నే మార్క్స్ తన గతితార్కిక భౌతిక వాదానికి (డయలెక్టికల్ మెటీరియలిజం) తీసుకున్నాడు. దాన్ని సామాజిక విధానానికి వర్తింపజేస్తూ - సమాజంలో వున్న అంతర్గత సహజ వైరుధ్యాల మూలంగానే సమాజం సామ్యవాద సమాజంగా పరిణామం పొందుతుంది - అనే సిద్ధాంతాన్ని మార్క్స్ ప్రతిపాదించాడు. పరిణామం గుణంగా మారడం, వైరుధ్యానికి వైరుధ్యం, వైరుధ్యాల విలీనీకరణ అనే మూడు సూత్రాలు మార్క్స్ హెగెల్ పరిణామ సిద్ధాంతం నుంచి తెచ్చుకున్నవే.

"మార్క్స్ క్యాపిటలిజంలో నుంచి సోషలిజం వచ్చి తీరుతుందని సిద్ధాంతీకరించడానికి హెగెల్ పరిమాణ సిద్ధాంతాన్ని తీసుకోలేదు. కానీ సామాజిక ధోరణుల్ని ఒక అనుభవాత్మక పరిశీలనకు గురిచేస్తే అలాంటి పరిణామాలు సుసంభవం అని ఆపరిశీలన చూపిస్తుంది అని మాత్రమే మార్క్స్ కనుగొన్నాడు"

అని ఏంగిల్స్ తన ఆంటీ డ్యూహ్రింగ్‌లో చెప్పాడు దీన్ని బట్టి స్పష్టమయ్యే ముఖ్య విషయం ఏమిటంటే . చరిత్ర ఈ సూత్రాల ప్రకారం నడుస్తుందని తాను ప్రతిపాదించిన సైంటిఫిక్ సోషలిజం మీద విశ్వాసమూ, గౌరవమూ కుదర్చ డానికే మార్క్స్ మానవ సమాజ బహిర్గతమైన సృష్టికంతటికీకూడ డైలెక్టిక్స్ అన్వయించి డయలెక్టికల్ మెటీరియలిజం అనే సిద్ధాంతాన్ని తయారుచేశాడు.

* * *

కవిసేన శకం 1970 లో ప్రారంభమయింది. అనేక యువ గొంతులు శ్రుతి కలిపాయి. తెలుగుదేశమంతటా అనేక హృదయాలు స్పందించాయి....లు గారూ! అనేక ఉత్తరాలొచ్చాయి కవిసేన ఆదర్శాలేమిటి అని. చూస్తున్నారా - తెలుగుదేశంలో కవిత్వం మారిపోతోంది. కవిసేన మిత్రులంతా కవిసేన దృక్ప థంతో కవిత్వాశయాలతో కవిత్వం అంటే ఏమిటో సమగ్ర అవగాహనతో నూతన కవిత్వ నిర్మాణాలు నెలకొల్పుతున్నారు. నరసారావుపేట అనేకసార్లు వెళ్ళాను. అనంతపూరు అనేకసార్లు వెళ్ళాను. హైదరాబాదులో యువమిత్రుల్ని పదే పదే కలుస్తున్నాను. కొన్నాళ్ళు ప్రతి ఆదివారం పబ్లిక్ గార్డెన్స్‌లో చెట్ల క్రింద కలిసేవాళ్ళం. నాగార్జునసాగర్లో ఉమారాజేశ్వరరావు వగైరా మిత్రులం సమావేశం జరిపాము.

మన మిత్రులంతా కవిత్వంలో నూతన వసంతం ఆవిష్కరిస్తున్నారు. కొన్నాళ్ళ క్రితం రాజకీయ నినాదాలు తప్ప మరొకటి రాయడానికి భయపడుతూ వచ్చిన యువలోకం ఇవాళ నిర్భయంగా వాళ్ళ అనుభూతులకు స్వేచ్ఛా రూపం ఇస్తున్నారు రాజకీయ కవుల్ని, దొంగ విమర్శకుల్నీ చూసి ఇవాళ ఎవరూ బెదరడం లేదు. నా స్వప్నం నెరవేరినట్లే! కొత్తదనం దేశంలో ఊపిరి పీల్చ డమే నా స్వప్నం. నవతరాన్ని కొత్త పంథాలో ఆలోచింపజేయడమే నా ధ్యేయం. యువకుల్నీ, సాహిత్యాన్నీ, సాహిత్య విమర్శనీ రాజకీయ బానిసత్వం నుంచీ స్వార్థపరుల పంజా నుంచీ విడుదల చెయ్యడమే ఏకైక లక్ష్యం.

కవిసేన 1970 ల వరకూ సాగిన తెలుగు కవిత్వ అరాచకాన్ని నిర్భ యంగా ఆవిష్కరిస్తూ, కవిత్వ లక్షణం వివరిస్తూ, ఆధునిక కావ్యశాస్త్ర రూపమైన కవిసేన మేనిఫెస్టోను ప్రకటించింది. తర్వాత కవిసేన కవుల కవితా సంక లనం "కొమ్మలు చీల్చుకుని వస్తున్న పూలు'' తీసుకొచ్చింది. మేనిఫెస్టో ఒకవైపు లక్షణ గ్రంథమైతే కవితా సంకలనం లక్ష్య గ్రంథం. ఈవిధంగా కవిసేన తెలుగు ప్రజలకు కవిత్వాన్ని సుపరిచితం చెయ్యడానికి చేసినంత కృషి

తెలుగు సాహిత్య చరిత్రలో మరే ఉద్యమమూ చెయ్యలేదు. అసలు సాహిత్య పరంగా తెలుగుదేశంలో భావకవిత్వ ఉద్యమం తర్వాత పుట్టిన ఉద్యమం కవిసేనే. మిగిలినవేవీ సాహిత్య ఉద్యమాలు కావు, ఉద్యమాలు కూడా కావు. వ్యక్తిగత ముఠాలు లేక వ్యక్తి ఆధిపత్య పోషక ముఠాలు. ఒక అభ్యుదయ కవితా ఉద్యమమే ఉద్యమ రూపంలో వచ్చింది. కానీ రాజకీయపు పాళ్ళు ఎక్కువై సాహిత్యపు పాళ్ళు నామకార్థం కావడంవల్ల ఆ ఉద్యమం సాహిత్య అరాజకాన్ని తీసుకొచ్చింది. సృజనాత్మక సాహిత్యంలో కానీ, విమర్శనా సాహిత్యంలో గానీ బాధ్యతాయుతమైన శాస్త్రీయ మార్గ రూపకమైన జ్ఞాన సామగ్రిని సృష్టించలేదు. ఆ పని తన మేనిఫెస్టో ద్వారా కవిసేనే చేసింది. అయితే వస్తుపరంగా సాహిత్యంలో అభ్యుదయ ఉద్యమం తెచ్చిన మార్పు చరిత్రాత్మకం అనే చెప్పాలి. శ్రీశ్రీ, నారాయణబాబుల అమూల్య ప్రదానం అవిస్మరణీయం.

కవిసేన దశాబ్దమైన 70 ల అంతంలో సాహిత్య సమీక్ష చేస్తే తెలుగు సాహిత్య చిత్రంలో కొన్ని అద్భుత మార్పులు కనిపిస్తాయి. తెలుగు కవిత్వం చిరకాలంగా అజ్ఞానం చేత ఆశ్రయించిన వాచ్యార్థ మార్గాన్ని విడిచిపెట్టి లక్షణార్థ మార్గాన్ని తొలిసారి బారిఎత్తున సహజ లక్షణంగా అవలంబించింది. (తత్పూర్వం ఉన్న భావ కవిత్వ యుగంలో రాయప్రోలు ఆదులు లక్షణ మార్గాన్ని అవలంబించారు కానీ మళ్ళీ 1934 నుంచీ వచ్చిన అభ్యుదయ మార్గం వాచ్యార్థ మార్గాన్ని పునఃప్రతిష్ఠ చేసింది ) రెండవ మార్పు - యువకవులందరూ లక్షణ మార్గాన్ని సహజంగా అంగీకరిస్తే తత్పూర్వం ఊదలు ఊనిన భారీ కుర్చీలమీద కూర్చొని ఉన్న కవి నామధారులు నూత్న మార్పు తెచ్చిన బలాత్కార వాతావరణం చేత ఇక ఈ కేవలం ఎండుగడ్డిలాంటి వచనప్రాయ కవితలు రాస్తే లాభం లేదనీ, ప్రాసక్రీడల ట్రిక్కులు చలామణీ కావనీ గ్రహించి కొత్త కృషి ప్రారంభించారు. కవిసేన ధోరణిలో రాయడం ప్రారంభించారు. కొందరు మధ్యమ కవులు 1975 కు పూర్వం వాళ్ళు రాస్తున్న ధోరణి గబుక్కున త్యజించి నూతన ధోరణి అవలంబించారు. 1975 ను విభాగరేఖగా పెట్టి చూస్తే ఇలాంటి కవుల కవిత్వం పూర్వం ఒకవిధంగా తర్వాత కవిసేన విధంగా ఉండడం స్పష్టంగా కనిపిస్తుంది. ఇక ప్రాస క్రీడాపరులు పడ్డ బాధలు ఇంకా పడుతున్న బాధలు వర్ణనాతీతం. మూడవ మార్పు విమర్శలో ప్రమాణాల్ని ఉల్లే

ఖించడం కోసం పాశ్చాత్య ప్రమాణ గ్రంథాల్ని ఆశ్రయించడం ఒక్కసారిగా అపారంగా పెరిగిపోయింది. ముఖ్యంగా మార్క్సిస్టు సాహిత్య దృక్పథాన్ని సప్రమాణంగా అంతవరకూ ఎక్కడా రాయని, ఉల్లేఖించని పెద్దలు, పిన్నలు కవిసేన మేనిఫెస్టో తర్వాత తత్పూర్వం ఎక్కడా ఉదహరింపబడని పాశ్చాత్య మార్క్సిస్టు సాహిత్య విమర్శ గ్రంథాల్నీ, ఆ గ్రంథకర్తల్నీ ఉల్లేఖించడం ప్రారంభించారు.

ఈ మార్పుల్ని వివరించడం అన్యుల్ని పరిహసించడానికి గానీ, విమర్శించ డానికి గానీ మాత్రం కాదని మీరు నన్ను అర్థం చేసుకోవాలి. కవిసేన కాగితం మీదే ఉందనే బుద్ధిపూర్వక విమర్శకులు ఈ మార్పుల్ని గుర్తిస్తారని మాత్రమే చెబుతున్నాను. ఏ ఉద్యమమూ సంఘాలుగా, మీటింగులుగా, జెండాలుగా మారదు. అది సాహిత్యంలో ఒక అభిరుచి యొక్క సముల్బణం, ఒక నూత్న దృక్పథం యొక్క సర్వత్రవ్యాప్తి. ఆ మార్గం అందరి కవిత్వాల్లో కవిత్వ విమర్శకుల్లో ఉందా లేదా చూచుకోవాలి. దీనికి సంఘం ఉందా, టిక్కెట్లున్నాయా, సభ్యులున్నారా, ఎన్ని మీటింగులు పెట్టారు - ఇలాంటి వ్యవహారం ఉద్యమానికి లక్షణం కాదు. ఈ విలువైన మర్మాలు గ్రహించి నిష్పాక్షికులైన, రాగద్వేష రహితులైన సాహిత్య మార్గాసక్తులైన సాహిత్య విమర్శకులు 1970 ల్లో సుమారు పది పదిహేనేండ్ల పాటు వీచిన సాహిత్య ప్రభావాన్ని కావ్య సంకలనాల్లో, కవితల్లో, విమర్శ గ్రంథాల్లో గమనించి సాహిత్య విమర్శలో రికార్డు చేయడం వాళ్ళ నైతిక బాధ్యత. పార్టీలు జెండాలు ఇవాళుంటాయి, రేపు పోతాయి. తుచ్ఛ లాలసలకు లొంగి సాహిత్య విమర్శకులు శాశ్వత సాహిత్యవాహినిలో కల్మషం కలపడం మహాపాపం అని గుర్తించాలి. (ఈ ఉత్తరం 1976 నాటిది)

అప్పుడే ఒక అద్భుత సంఘటనకు గురై తట్టుకోలేక వీధిలోకి వచ్చాను. గడ్డాలు, రుద్రాక్షమాలలు, షేర్వాణీలు, టోపీలు ధరించి తీవ్రంగా చర్చించు కుంటున్నవాళ్ళు కనిపించారు. నేను వాళ్ళ దగ్గరకువెళ్ళి మీరు దేవుడ్ని చూస్తారా అని అడిగాను. వాళ్ళు నన్ను ఆశ్చర్యంతో చూచారు. మీరు వెంటనే రావాలి తరుణం మించిపోతోంది అనేసరికి ఏమనుకున్నారో ఆ గుంపంతా నా వెంబడి వచ్చారు.

నేను మా ఆవరణంలో ఉన్న చెట్ల గుంపువైపు వాళ్ళను తీసుకువెళ్ళాను. చెట్లకింద రాలిన వందలాది పూలమందల్ని ఏప్రిల్ మాసపు గాలి తోలుతుష్టో

తోంది. ఆ వందలాది పూలు నేంమీద దొర్లుకుంటూ గాలి చెప్పినట్లు పరుగులెత్తుతున్నాయి. గాలి నృత్యంచేస్తే పూలు నృత్యం చేస్తున్నాయి. ఆ రంగురంగుల పూలనృత్యం చూస్తూ మనుమేఁగుంపు అలాగే ఉండిపోయింది. ఇదేమిటి! ఇంత విస్మయావహ సౌందర్యం! ఈ ఆకర్షణ! మన కాళ్ళ తొక్కుతూ నడిచే ఈ నేం మీద!

# 31

ప్రాచీన కవిత్వంలో ఆత్మాశ్రయత్వం ఉందా అనే ప్రశ్న చాలా ఆసక్తి జనకం. ఆధునికయుగం కొంతకాలం ఆత్మాశ్రయత్వ సుడిగుండంలో ఇరుక్కుపోయినప్పటికీ, ఇబ్సెన్, ఆయన సమకాలీన నాటకకర్తల కృతుల ద్వారా మళ్ళి మంచి, చెడ్డ అనే ఆదిమ ప్రశ్నవైపే తిరిగి వచ్చింది. అంటే, ఆత్మాశ్రయంలో నుంచి సామాజికతవైపు ఊగింది సామాజికతలో వ్యక్తి నేరుగా కాకుండా దూరాన్వయంగా ఉన్నాడు. ఈ నవధోరణి ఇంగ్లాండులో రొమాంటిక్ కాలపు వర్డ్సువర్తు, కీట్సు; ఫ్రాన్సులో బోదిలేర్, రెంబో లాంటి కవుల, జిజ్ఞాసువుల ఆత్మాశ్రయ ధోరణిజోరును తగ్గించింది. ఇంగ్లండ్‌లో వచ్చిన రొమాంటిక్ ధోరణి ఫ్రెంచి సింబలిస్టు ధోరణి కంటే విభిన్నం. రొమాంటిక్ కవిత సింబలిజంలాగే లాగే ఆత్మాశ్రయం అయినప్పటికీ రొమాంటిక్ ధోరణిలో బహిర్ముఖత్వం ఉంది; సింబలిజంలో పూర్తిగా అంతర్ముఖత్వమే ఉంది. రొమాంటిక్ కవిత బహిర సృష్టిలో సచేతన సంపర్కం ఉంది; కానీ సింబలిజంలో కవి తన సంపూర్ణ అంతరిక్ష లోయల్లోకి నిమగ్నమైన సుప్తస్మృతి సంపదల్ని వేటాడుతాడు. దీని కోసం కొందరు సింబలిస్టులు నల్లమందు సేవించారు. షాఁకోక్తో అంటాడు, “ఒక్కసారి కవి మేలుకున్నాడంటే వాడు వట్టిచవట అంటే మేధావి అన్నమాట.. మేలుకుని ఉన్న కవి రాసే రాతలు చదవడం నిష్ప్రయోజనం.” ఇలాంటి భేదాలున్నప్పటికీ రొమాంటిక్ సింబలిస్టిక్ ధోరణుల్లో ఆత్మాశ్రయత సమాన లక్షణం గనక ఈ రెంటినీ ఆత్మాశ్రయ కవిత్వమనే అనాలి. ఇది ఫ్రాన్సులో, ఇంగ్లండులో వచ్చిన కవిత్వ ధోరణుల్ని గురించి చెప్పినమాట. సింబల్ అన్నంత మాత్రాన్నే దాని లక్షణం ఆత్మాశ్రయత అని అర్థం కాదు.

అసలు ఆసక్తికరమైన ప్రశ్న ఏమిటంటే-ప్రాచీన కవిత ఆత్మాశ్రయమా? స్పష్టంగా, ఆత్మాశ్రయం కాదు. ప్రాచీన కవిత్వం పరవస్తుగత ప్రక్రియ;

అందులోనూ లోకశ్రేయస్సు అనే భావం ప్రధానంగా దృష్టిలో ఉంచుకొని రాయబడిన కవిత. అంటే ఆనాటి రూపంలో సామాజిక స్పృహమీద లేచిన నిర్మాణం. రాముడిలో వాల్మీకి లేడు. ధర్మరాజులో వ్యాసుడు లేడు. దుష్యంతుడిలో కాళిదాసు లేడు, కావ్య కేంద్రమైన నాయకుడిలోనే కవి లేకపోతే కవి ఎక్కడ ఉన్నట్లు? చంద్రోదయాల్లో గిరితరువర్ణనాది అలంకారాల్లో ఉన్నాడు!

## ఆత్మకళ

భవభూతి కవిత్వాన్ని 'ఆత్మకళ' అన్నాడు. బహుశా ఈ అర్థంలో ప్రాచీన కవిత్వంలో కవి గిరితరు నిర్ఝరాది వర్ణనల వెనుక దాక్కొని ఉంటాడు; తన శిల్ప వైశిష్ట్యంలో అంతర్నిహితుడై ఉంటాడు, మంచి చెడ్డలను వేరుపరచే విచక్షణాత్మక జ్ఞానం వెనక ఉంటాడు. కవి హృదయాన్ని ప్రాచీన కావ్యపు లోతుల్లో నుంచి గ్రీష్మకాలపు నూతినీళ్ళలా చేదుకోవాలి.

ప్రాచీన కవి నిర్బంధంగా ధర్మ నిబద్ధత ఉన్నవాడు. ధర్మం అంటే తత్తత్కాల శిష్టలోకాచారం. దాన్ని భంగం చేసిన కవి కావ్యాన్ని ఒక దారుణ కృత్యంగా భావించేవాడు. అలా కవులు సాధారణంగా రాసేవాళ్ళేకాదు.

ఆధునిక కవిత్వం వాల్మీకి పూర్వవైదిక కవిత్వంలా ఆత్మాశ్రయతతోటే ప్రారంభమయింది. క్రమంగా 20 వ శతాబ్దపు దిగంత రేఖమీద మార్క్సిజం ఉదయించగానే బహిర్వస్తు గతమయింది. ఆత్మాశ్రయత నుంచి సామాజికత వైపు కదిలింది. సామాజిక చైతన్యమనే నూతన సాహిత్య సిద్ధాంతం ఆధునిక సామాజిక ధర్మాన్ని స్వీకరించింది - (ప్రాచీన కవిత్వం ప్రాచీన కాలధర్మాన్ని స్వీకరించినట్లు).

ముఖ్య విషయమేమిటంటే-మంచి కవిత్వం మంచి కవిత్వంగా రూపొందడానికి ఎప్పుడూ ప్రచ్ఛన్నంగాగానీ బహిరంగంగాగానీ ఒకపాటి ఆత్మాశ్రయత్వ కళను స్వీకరించింది. వస్తువు ఆత్మాశ్రయమైనా, పరాశ్రమమైనా దాన్ని సాహితీకరించే శిల్పకళ మాత్రం కవి యొక్క "ఆత్మకళే'' గదా! అందులో కవి మూడు మూర్తులా కనిపిస్తాడు గదా? వాల్ట్ విట్మన్ కవిత దేశంకోసం, ప్రజలకోసం పాడబడిన ఒక బృహద్గానం. అందులో ఎంత ఆత్మాశ్రయతఉంది! కావ్య

క్షేత్రంలో ఉన్న పరివాళ్ళ సత్యమెప్పుడూ అతివాదంలో ఉండదని తెలుసుకోవాలి "భిన్నతల సజీవ సంయోగమే సత్యము" అనే హెగెల్ అభిప్రాయం జ్ఞానార్జనా క్షేత్రంలో సమీచీనంగా పనిచేసే సూత్రం.

నిజమైనకవి సంపూర్ణ కవిగా వికసించాలంటే ఆత్మాశ్రయతనూ-పరాశ్రయతనూ రెంటినీ జీవనకళగా అభ్యసించాలి. "ఎట్ ఒన్ ఓ క్లాక్ ఇన్ ది మార్నింగ్" అనే పొయెంలో ఛార్లెస్ బోదలేర్ అంటాడు, "మనిషి ముఖం అనే హింసనుంచి చివరకు తప్పించుకున్నాను. ఇప్పటికి నేను హాయిగా అంధకారంలో స్నానం చేసి విశ్రాంతి పొందే ముక్తి దొరికింది నాకు." ఆ కవే "క్రౌడ్స్" అనే పొయెంలో ఇలా అంటాడు, 'జన సందోహంలో స్నానం చేసే సౌభాగ్యం అందరికీ లభించదు. జన సందోహాన్ని హాయిగా అనుభవించడం ఒక కళ. జనం, ఏకాంతం అనే రెండూ ఒకే చేతన. సఫల కవికి ఒకదాన్ని మరొకటిగా మార్చుకోడానికి వీలయ్యే సమానార్థక శబ్దాలూ సన్నివేశాలూ. ఎవడు తన ఏకాంతాన్ని జనంతో నింపుకోలేడో వాడు జనంలో ఏకాంతతని పొందలేడు కూడా.

ఈ శతాబ్దపు ఆరంభంలో హాన్స్లిక్ ఆశ్చర్యచకితం చేసే ఒక మాట చెప్పాడు: "ఆత్మాశ్రయం పరాశ్రయం యొక్క భంగ్యంతరమే, సమస్య అస్తిత్వము అనస్తిత్వమూ సమస్యకాదు. సమస్య - అస్తిత్వం యొక్క భంగిమను గురించే. వస్తువు ఆత్మ రెండు భంగిమల అస్తిత్వం; వ్యక్తిగత స్పందనలు భిన్నభిన్న అస్తిత్వ భంగిమలు కలిగించే ఫలితాలే; లేక వస్తువు యొక్క ప్రవర్తన మూలంగా జనించే వ్యక్తిగత స్పందనలే."

కార్ల్ మార్క్స్ తర్వాత వచ్చిన పాశ్చాత్యచింతన మార్క్స్‌లో ప్రవేశించాలి, ప్రపంచమంతా మారుతూ ఉంటే మార్క్స్ మారకుండా ఉండడం అసంభవం. లెనిన్ అంతటి వాడు అన్నాడు ''ఏ అర్థంలోనూ మార్క్సిస్టు సిద్ధాంతం సంపూర్ణమనీ నిర్వివాదవిషయమనీ మేము అనుకోము; తద్భిన్నంగా మేము ఏమనుకుంటామంటే జీవితం కంటే వెనకబడిపోకూడదనుకున్నట్లయితే సామ్యవాదులు ఏ శాస్త్రాన్ని పెంపొందింపజేయాలో ఆ శాస్త్రానికి మార్క్సిజం పునాది మాత్రమే.''

# 32

వేదాంతరసం సాహిత్యరసం కంటే ఎక్కువ అనీ, సాహిత్యరసం సంగీతరసం కంటే ఎక్కువ అనీ మన పెద్దల భ్రాంతి. కానీ ఆ పెద్దలే "సంగీత మపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయం" అన్నారు. ఒకటి ఎక్కువ ఒకటి తక్కువ అయితే సంగీత సాహిత్యాలు సరస్వతీదేవి స్తనద్వయం ఎలా అవుతాయి. రెండూ సంపూర్ణంగా సమానం అని చెప్పడానికే ఒకే స్త్రీ యొక్క స్తనద్వయం అని చెప్పడం. ''సంగీత జ్ఞానము భక్తివినా సన్మార్గము కలదే మనసా'' అన్నాడు మహానుభావుడు త్యాగరాజు. సంగీతం చేత నారద తుంబురులు బ్రహ్మపదం పొందారట. కనక రసానందాన్ని బ్రహ్మానంద సబ్రహ్మచారి అనడం కరెక్టు అని తోచదు. అసలు ఎవడి పనిలో వాడు ఎప్పుడు త్రికరణ శుద్ధితో నిమగ్నుడవుతాడో అప్పుడు వాడి పనిలోనే వాడికి మోక్షం ఉంది; ఆ పని ఏదైనా కానీ. భారతంలో ధర్మవ్యాధుడి కథ ఏమిటి? పచ్చి మాంసం అమ్ముకునేవాడు ధర్మవ్యాధుడు. వాడ్ని ఒక రుషి మోక్షోపాయం చెప్పమని అర్థిస్తాడు! ఈ ప్రాచీన కథల్లో ధర్మసూక్ష్మం ఇంత నాజూకుగా చెప్పబడుతుంది.

## భౌతిక బాధాపీడితులు

# 33

విత్తనంలో నుంచి బయటికి వచ్చిన మొక్క ఆకాశంవైపే పెరుగుతుంది. ఈ స్వభావం దానికి నిసర్గ లక్షణం. పెరిగే వైఖరిలో చెట్లు భిన్నభిన్న వర్గాలుగా ఉన్నాయి. యూకలిప్టస్, సర్వీ వగైరా చెట్లు నేరుగా ఆకాశం వైపు పోతాయి. (ఈత కొబ్బరి తాటి కూడా అంతే కానీ, ఇందులో మరో విశేషం ఉంది. వాటికి కొమ్మల్లేవు.) గుల్మొహర్ చెట్టులాంటివి ఐదారడుగులు ఎత్తుకు పెరిగిన తర్వాత వాటి శాఖలు అతి స్వల్పకోణంతో నేలవైపు తిరిగి ఆకాశం వైపు వెళ్ళుతాయి. కానీ చింత, వేప మామిడి మొదలైన చెట్లశాఖలు మరింత పెద్దకోణంతో పార్శ్వాలకు వ్యాపిస్తాయి, కానీ ఆకాశంవైపే పోయే ప్రయత్నం వాటిలో కొంత కనిపిస్తుంది. మర్రిచెట్టు లాంటివి భూమికి సమానాంతరంగా శాఖల్ని ప్రసరిస్తాయి. మర్రిచెట్టు శాఖలు వ్రేళ్ళలాంటి ఊడల్ని కూడా భూమిలోకి పంపిస్తాయి. అంటే, మర్రి విషయంలో ఒక ఎలెక్ట్రానిక్ సర్క్యూట్ పూర్తి అయిందన్నమాట.

భూమ్యాకర్షణ శక్తిని నిర్జించే శాఖలు కొన్ని చెట్లకు ఉంటే కొన్నిటికి భూమ్యాకర్షశక్తికి లొంగే శాఖలున్నాయి. ఈ రెండు జాతుల మధ్యగా భూమ్యాకర్షణకు లొంగీ లొంగకుండా ఆకాశం వైపు వెళ్ళడానికి ప్రయత్నించి సఫలమవుతూ నిష్ఫలమవుతూ ప్రయాణం చేసే శాఖలూ వాటి సఫల నిష్ఫల సూచక కోణాలు ఎన్నో ఉన్నాయి. ఇది చెట్ల నైసర్గిక శక్తిలో ఉన్న తారతమ్యాల్ని సూచిస్తుందనుకుంటాను ప్రతిచెట్టూ నిరంతరం భూమ్యాకర్షణశక్తితో పోరాడుతూ ఆకాశం వైపు ప్రయాణం సాగిస్తుంది. కానీ ఆశ్చర్యం, గింజలో నుంచి చెట్టు శిశువుగా ఉన్నప్పటి నుంచీ దాని ప్రయాణం ఆకాశం వైపే, పక్షుల ప్రయాణం ఆకాశం వైపే, ఎగిరే లేళ్ళ ప్రయాణం ఆకాశంవైపే, మనిషి ప్రయత్నం కూడా ఆకాశం వైపు వెళ్ళడానికే! భూమండలం మీది జీవకోట్లన్నీ ఆకాశమండలం చేరాలనే అంతరాంతరాల్లో స్వప్నిస్తాయి కాబోలు. ఇదంతా వృక్షాల గుంపుల్ని దిదృక్షాకువులైన నేత్రాలతో పరిశీలిస్తూ చూచిన ఆశ్చర్యం!

## భౌతిక బాధాపీడితులు

## 34

మీ ప్రశ్నలు నాకు ప్రియమైనవి కారణం. అవి మనల్ని ఈనాటి మనిషి ఎదుర్కొంటున్న వాస్తవ సమస్యల కూకటివ్రేళ్ళ దగ్గరికి తీసుకుపోతాయి. ముఖ్యంగా ఆఫ్రికా ఆసియాల్లో జీవించే మనిషి....

నేనెంతో జాగ్రత్త వహించి ఆలోచించిన హేతుయుక్త విషయం, మానవ బంధాలైన జీవన వాస్తవాల్ని పరిశీలిస్తూ తెలుసుకున్న విషయం ఏమిటంటే— యుగయుగాల నుంచీ క్షుత్పిపాసా పీడితులైన కోట్లాది దళితమానవులకు ట్రాన్సెడెంటల్ మెడిటేషన్ గానీ కృష్ణాకాన్షస్‌నెస్ కానీ ఔషధాలు కాలేవు. ఆకలి వ్యాధికి ఏకైక ఔషధం అన్నమే మీరు చెప్పిన ఆ రెండు ఔషధాలు కొన్ని తరగతుల వాళ్ళకు మాత్రమే పరిమితసీమ వరకు ఉపయోగిస్తాయి. కానీ, ఈ రెండు బ్రహ్మాండమైన ఖండాల్లో నివసించే మానవకోట్లకు మాత్రం కాదు. వాళ్లు ఆకలితో బాధపడుతున్నారు. నగ్న శరీరంతో బాధపడుతున్నారు. శీతోష్ణ పరిస్థితులకు నగ్నంగా బలి అవుతున్నారు, అడవుల్లో జంతువుల్లా. వాళ్ళకి తిండి, బట్ట, ఇల్లు ఇవ్వడానికి బదులు ట్రాన్సెడెంటల్ మెడిటేషన్ ఇవ్వబోవడం

ఎంత క్రూరకృత్యం? ఈ మిలియన్ల సమస్య అతి సరళం, దాని పరిష్కారం అతిక్లిష్టం. వాళ్ళ యుగయుగాల అమానవశోషణ తొలగించాలంటే ఈనాడున్న సమాజ ఆర్థిక నిర్మాణాన్ని ధ్వంసం చేసి పునర్వ్యవస్థీకరణ చెయ్యాలి. ఒక స్పష్టమైన భౌతిక బాధకు ట్రాన్సెండెంటల్ మెడిటేషన్ మందుగా ఇవ్వడం ఎంత దూర్తచేష్ట? ట్రాన్సెండెంటల్ మెడిటేషన్ ఏ రోగులమీద పనిచేసే మందో వాళ్ళకు తెలీదు కాబోలు! ఇదెలా ఉందంటే, "నాకు ఆకలి వేస్తోంది బాబో" అని ఒక అసహాయ మానవుడు మొరపెట్టుకుంటూ ఉంటే వాడికి ఎల్. ఎస్.డి. ఇవ్వడమో, మారిజువానా ఇవ్వడమో, లేక కల్లు సారాలు పోయడమో లాంటి బుద్ధిహీనకృత్యం. వాడికి రెండే ఔషధాలున్నాయి. ఒకటి అన్నం, రెండు బాంబు! అసలు ఎవడయినా ఆకలివేస్తే అన్నం తప్ప మరొకటి ఎందుకు తినాలి, ఎందుకు తాగాలి? ఒకడు ఆకలిని తృప్తిపరచుకోగలుగుతుంటే మరొకడు ఆకలి చంపుకోవలసిన అవసరం ఎందుకు వచ్చింది? మనిషికి బతికే హక్కుంది గదా? ఒక మనిషిని మరొక మనిషి చంపడమే నేరంకాక తనను తాను చంపుకోవడం కూడా నేరమే మన చట్టప్రకారం! ఇలా మనిషి బతకాలని విధించిన శాసనాలు బతకడానికి అవసరమైన తిండిని పెట్టే శాసనాల్ని ఎందుకు చేయలేదు? బతకడం మనిషి జన్మహక్కు. ఇది అన్ని దేశాల చట్టాలు అంగీకరించాయి. మనిషి జన్మహక్కును ప్రభుత్వాలు అమలు జరపకపోతే ప్రభుత్వాల జనకుడైన మనిషి ప్రభుత్వాల్ని బలాత్కారంగా తొలగించి శిక్షిస్తాడు. ఇది స్పష్టమైన ధర్మం, వాదోపవాదాలకు అతీతమైన ధర్మం.

నేను కేవలం మానసిక బాధలచేత పీడితులైన మనుష్యుల్ని గురించి మాట్లాడడం లేదు; కేవలం సంపూర్ణంగా భౌతిక బాధలచేత గ్రామాల్లో నోరు లేకుండా జీవిస్తున్న ఓటర్‌నామధేయుల్ని గురించి మాట్లాడుతున్నాను. వాళ్ళకు తపస్సు చేసుకోండి అని చెప్పడం మానవత్వానికే విరుద్ధం.

ట్రాన్సెండెంటల్ భాగ్యవంతుల మానసిక బాధలకు ఉపయోగించవచ్చు, సిరిసంపదలలో తులతూగుతున్న పాశ్చాత్య దేశాలకు ఉపయోగించవచ్చు. కానీ తూర్పు దేశాలకు ఆధ్యాత్మిక చింతకాదు-ఆర్థికచింత అవసరం. వాళ్ళ సుఖాన్ని ఆర్థిక తాళపుచెవే ఆవిష్కరిస్తుంది. ట్రాన్సెండెంటల్ మెడిటేషన్ గానీ, ఏదైనా ఒక తాంత్రిక విద్యాబోధ గానీ, ఏదైనా ఒక మత ప్రచారంలాంటిది గానీ

సామాజిక స్థాయిలో భారీ ఎత్తున చేసే ప్రయత్నంలో చాలా సామాజిక ప్రమాదాలున్నాయి. ఆ విధంగా అసంఖ్యాక ప్రజానీకాన్ని ఇలాంటి అపమార్గాలవైపు మళ్ళించడం, సమాజాన్ని నూతన చైతన్యాలవైపు పోనీకుండా సమాజ దృష్టిని వక్రీకరించడమే అవుతుంది.

# 35

మన వాగ్వివాదంలో ఒక్క విషయమే మిగిలి ఉన్నట్లు మీ ఉత్తరం తెలుపుతుంది జగన్నాథుడి "రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కావ్యమ్" అన్న మాట చాలా అపార్థానికి గురయింది. ఆయన అభిప్రాయాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే కేవలం శబ్దం కావ్యంకాదు. జగన్నాథుడి ప్రకారం ఏ శబ్దమైతే తాను ప్రతిపాదించే అర్థంచేత శ్రోతని అందులోనే రమిస్తూ ఉండేలా చేస్తుందో ఆ శబ్దమే కావ్యం. రమించడం అంటే ఒకదానిలో హాయి అనుభవిస్తూ క్రీడిస్తూ ఉండడం. అలా శ్రోతని రమింపజేసే అర్థాన్ని ఇచ్చే శబ్దం కావ్యం అన్నాడు జగన్నాథుడు తన రసగంగాధరంలో. ఇక్కడ తాత్పర్యమేమిటంటే- కవిత్వంలో శబ్దమూ ప్రధానం కాదు, అర్థమూ ప్రధానం కాదు. శబ్దార్థాలు కవి ప్రయోగ మహిమచేత కలిగించే ఒక ఆహ్లాదజనక భావనామయత ప్రధానం లేదా ఆహ్లాదభావనామయత కలిగించే కవి ప్రయోగ మహిమ ప్రధానం. కుంతకుడికీ, జగన్నాథుడికీ మధ్య ఒక భావఘర్షణ ఉన్నట్లు కనిపిస్తుంది. జగన్నాథుడు "శబ్దస్య ఏవ" అన్నాడు కుంతకుడు "శబ్దార్థయుగళం" అన్నాడు.

జగన్నాథుడు చమత్కారంలో ఉందన్నాడు కవిత్వం, కుంతకుడు వక్రోక్తిలో ఉందన్నాడు. ఈ రెండు వాస్తవమే. అసలు అలంకార ప్రస్థానం అంతా చూస్తే అలంకారంలేనిదే వక్రోక్తి లేదు, వక్రోక్తి లేనిదే ధ్వని లేదు. ధ్వని ఫలితమే చమత్కారం. కనుక ఎక్కడ చమత్కారముందో అక్కడ కవిత్వం ఉందని పోల్చుకోగలిగితే, చమత్కారమున్నచోట ధ్వని ఉందన్న మాటే, ధ్వని ఉన్నచోట వక్రోక్తి ఉందన్నమాటే. వక్రోక్తి ఉందంటే అలంకారముందన్న మాటే. అంతలో ఆ పూర్వద్రష్టలైన భామహ వామనాదులు చెప్పినట్లు "కావ్యం గ్రాహ్యమలంకారాత్" ప్లెఖనోవ్ అంటాడు, "లిటరేచర్ ఈజ్ ది ఆర్ట్ ఆఫ్ ఇమేజస్!"

# సాహిత్య కళ

## 36

కవిసేన విరిసిన కిరణం గుచ్చుకున్న బుల్‌బుల్ మీరు; తెలుగు కొమ్మల మీద కూర్చుని, తోటలో బాటలు మూర్ఛిల్లి వంకర టింకర్లయ్యేలా గొంతు విప్పుతున్న కిశోర గీతిక మీరు.

ప్రేమ మనిషి జీవితంలోకి వసంతంలా ప్రవేశిస్తుంది. ఇనప తీగెలల్లాంటి నరాల్ని వికసిత పుష్పహృదయాల్లో ఉండే కింజల్కాల్లా మారుస్తుంది. భావాలకు పరిమళం అద్దుతుంది. గుండెని వళ్ళుబట్టగా చేస్తుంది. లోకం లోకమంతా కళ్ళకు ఒక నూతనావతారంగా సాక్షాత్కరిస్తుంది.

చెట్లు చేతులూపుతూ పిలుస్తాయి నిన్ను చూచి; ఆకాశాలు మత్తెక్కి ఒళ్ళు విరుస్తూ ఆవులిస్తాయి. ఎగిరిపోతున్న పక్షులు దిగంతాల ఆవలి లోకాల్ని చిత్రిస్తాయి. ఉదయాస్తమానాలు రంగులద్దే వస్తుజాలంలో హృదయం స్నానం చేస్తుంది. మీగొంతు చెట్లకొమ్మలనిండా పూలజ్వాలలు అంటించాలని ఆక్రోశిస్తుంది.

లోకం లోకమే మారిపోతుంది. ఓహ్! ప్రేమ మనిషికి ఒక్కసారే ఇవ్వబడిన వరప్రసాదం. మూర్ఖుడే దాన్ని కోల్పోతాడు. జీవితానికి హరిద్వర్ణశూన్యత ని పులుముకుంటాడు.

ఏ రుతువు దేన్ని ప్రదానం చేస్తుందో ఆ పూలనీ ఆ ఫలాల్నీ మనిషి అనుభవించాలి. గుమ్మం దగ్గరకొచ్చి నిన్ను సంబోధించిన రుతువును తృణీకరిస్తే అది మళ్ళీ తిరిగిరాదు. జీవితాంతం అనుభవించవలసిన నష్టం అది. అరవై ఏళ్ళ వయస్సులో మనిషి తన పాతికేళ్ళ వయస్సులో గుమ్మంతొక్కిన చైత్రాన్ని చిత్రించలేడు; చిత్రించినా ఆ చిత్రంలో ఆనాటి ఉద్రిక్త రక్తమాంసాల తాజా ఒంపులూ సొంపులూ ఉండవు.

కవి వాస్తవానుభూతుల్ని దాచిపెట్టి తన అనుభూతులుకాని కృత్రిమ ఆలోచనలకి తన అక్షర శిశువుల్ని బలి చెయ్యకూడదు.

# 37

నీవూ మరొక అతను తప్ప మరెవ్వరూ లేని ఒక అడవిలో నీవు పోతున్నా వని ఊహించుకో. మీరు ఒకర్నొకరు ఎరగరు. మీరు కేవలం బాటసారులు. ఆ రెండో అతని జేబులో ఒక కోటి రూపాయల నోటు ఉంది. నీ వెలాగో అది పసిగట్టావు. నీవు అతనికంటే శారీరకంగా బలిష్ఠుడవి. నీవు అతనిమీద అక్కడ దాడిచేస్తే అతడు ఆత్మరక్షణ చేసుకోలేడు. ఈ కల్పిత సన్నివేశంలో నీవు అతడ్ని సులువుగా చంపి ఆ సొమ్ము తీసుకోవచ్చు. నిన్ను ఆపే శక్తి ఏదిలేదు ఆ సమయంలో.

అయితే ఒకడు అలా చేస్తాడా? మానవజాతి ఈ బిందువు మీద త్రాసులా తూగుతోంది. నీ స్థానంలో ఒక క్రూరమృగం ఉంటే ఆ మనిషిని వెంటనే చంపి పారేసేది. కానీ నువ్వు? నీవు చంపుదామా వద్దా చంపుదామా వద్దా అని ఆలోచనలో పడతావు. నీకూ అతడికీ మధ్య ఒక కార్యాకార్యరూప ఆలోచన అడ్డుగోడగా ఉంది. ఈ ఆలోచన, ఈ వెనకాడే మనస్తత్వము, మనిషిని అకస్మాత్తుగా ముందడుగు వెయ్యనీకుండా వెనక్కిలాగే శక్తి - ఈ శక్తిముందు అణుబాంబు కూడా అల్పప్రాణి. మనిషి లోపలనే ఉండి మనిషి ఆలోచనల మీద మనిషి కార్యాల మీద ఇంత అధికారం చలాయించే ఈ శక్తితో సమానమయిన శక్తి బహిర్జగత్తులో మరొకటి లేదు. ఇది మనిషిలో ఉన్న ఇష్టాయిష్టరూప స్వేచ్ఛ. తుపాకులు, బాంబులు, బెదిరింపులు ఏవీ జయించలేవు. ధనకనకాదులు మద్యమహిళాదులు ఆ స్వేచ్ఛని కొంత ఊపగలవు కానీ, అవేవీ సాహిత్యకళతో సమానం కావు. సాహిత్యానికి మనిషిలో ఉన్న ఈ ఇష్టాయిష్టరూప స్వేచ్ఛతోనే పని - దాన్ని లొంగదీస్తుంది, దానికి తన అనురూపమైన రూపం ఇస్తుంది. ఈ సాహిత్య ప్రయత్నాలన్నిటికీ మనిషిలో ఉన్న ఆ అంతర్ద్రవ్యం హృదయపూర్వకంగా లొంగుతుంది. ఈ మార్మాన్నే అభినవగుప్తుడు ఇలా వర్ణించాడు, "కావ్యే హృదయ సంవాద వశాత్ తావత్ నిమగ్నా కారికా భవతి చిత్తవృత్తిః"

అయితే మనిషిలో ఉన్న ఈ అంతర్ద్రవ్యం, ఈ ఇష్టాయిష్టరూప స్వేచ్ఛ, ఈ కార్యాకార్యరూప ఆలోచన ఎలా పుట్టింది? మనిషికి పూర్వజాలైన క్రూరమృగాల్లో లేదే? ఇక్కడే అర్థం చేసుకోవాలి. అది ఒకనాడు అకస్మాత్తుగా ఆకాశం నుంచి ఊడిపడింది కాదు. యుగయుగాలుగా శబ్దజ్యోతి చేతపుచ్చుకుని ఒకడు మనిషిలో చెక్కిన శిల్పం అది. వివేకం ఒక శిల్పం. కరుణ, న్యాయం,

ధర్మం ఇలాంటి ఎన్నో సూక్ష్మ సాధనాలతో నెకె_న శిల్పం. మనిషిలో ఉన్న ఈ అంతఃశిల్పమే ఒకడు మరొకడి గొంతు కొయ్యకుండా చేస్తోంది, నోటి మాటకు విలువ కల్పిస్తోంది. వ్యక్తినుంచి అంతర్జాతీయ స్థాయి వరకూ వాగ్దానాలకూ, ఒడంబడికలకూ మనుషుల్ని బంధించే శక్తి ఇస్తోంది. ఇదే గౌరవం, మర్యాద, నీతి నియమం ఇత్యాది అనేక నైతిక బంధనాలనే వలను సృష్టిస్తోంది. దీనిచేతనే మనిషి తనకుతానే నైతిక శృంఖలాల్ని తయారు చేసుకుని తన కాళ్ళకి తానే తగిలించుకుంటాడు.

ఇప్పుడు చూడండి - ఈ కార్యాకార్యరూప ఆలోచన అనే నిరోధక శక్తి ఒకటి ఒకవైపు ఉంచి మరొకవైపు కవిత్వం ఉంది. మీరు దేనివైపు మొగ్గు చూపిస్తారు - ఏదో ఒకటి కోరుకో అన్నప్పుడు? ఒక కవితా ప్రతిభ ఉన్న కవి ఉన్నాడు కానీ, వాడిలో ఈ అంతర్ద్రవ్యం బొత్తిగా లేదు. మీకు వాడు నచ్చుతాడా? బహుశా నచ్చడు. కారణం, మనిషి మొదట నాగరక జీవిగా నిలవాలి. అందుచేత మన మొగ్గు కరుణ, నైతికత, సంస్కారం ఇత్యాది మానవీయ గుణాలవైపే. దొంగవెధవ ఒక కవి నాలుగు మంచి కవితా పంక్తులు రాసినా మన గౌరవాన్ని బంధించలేడు. అయితే సమాజంలో సాహిత్య పాత్ర ఏమిటి? ఎవడు దానిపాత్ర ఇది అని నిర్ణయించేవాడు? ఆ నిర్ణాయకుడి అధికారం అన్ని కాలాల్లో అన్ని మానవ సందర్భాల్లో ఆమోదింపబడుతుందా?

సమాజాన్ని మార్చే సాధనంగా ఉండాలి సాహిత్యం అంటాడొకడు. అయితే ఇతర సాధనాలు కూడా ఉన్నాయి గదా? రాజకీయ సాధనాలు తక్షణ ఫలితాన్ని ఇస్తాయి సాహిత్యం ఒక పనిముట్టుగా తక్కువ శక్తిశాలి అనిపిస్తుంది. కవిత్వాన్ని ఒక పనిముట్టుగా చూడడమే ఒక మొరటుతరహా భావం; అది ఒక అధమస్థాయి మనస్సుకే కలుగుతుంది. కవిత్వం రాజకీయాల్లా భౌతిక స్థాయిలో ఫలితాలు సాధించడానికి ఉపయోగించదు కవిత్వం సమాజంలో పునాదుల మీద కనిపించకుండా పనిచేస్తుంది. ప్రేమ, కరుణ, న్యాయం, ధర్మం, శాంతి, స్నేహం - ఇలాంటి భావాల్ని మనుషుల్లో ఉత్పాదన చేసి కఠినశిల లాంటి మనిషిని మృదులం చెయ్యడానికి కృషిచేస్తుంది. ఆ మృదులమైన రొట్టె పిండిని నొక్కి నొక్కి అంతరాత్మను ఉదయింపజేస్తుంది. అందులో నుంచే నాగరక శక్తులు లేస్తాయి. కవిత్వానికి దీర్ఘకాలీన ప్రభావమే ఉంది.

ప్రకాశికం కోసం కవిత్వం అనే రాజకీయ నినాదం ఎంతవరకు ఫలదాయకం అవగలదో చెప్పలేము. కవిత్వం లోకం కోసమే నిష్కర్షగా. కాని రాజకీయ నినాదంలో ఉన్న ఉద్దేశమే ఇప్పుడు ప్రశ్న. పార్టీ ప్రచారకులు మోటు రాజకీయ కవులు రాసిన కవిత్వాలు సాధారణంగా నేలబారు వచనంగా ఉండడం చూస్తున్నాము. కవిత్వపు వాసన ఏకోశానా ఉండదు ఆధునిక తెలుగు కవిత్వంలో నిన్నటివరకు ఇదొక పెద్ద సమస్య. కవిసేన చేసిన అకవిత్వ వ్యతిరేక ప్రచారం మూలంగానే పరిస్థితి ఈనాడు చాలావరకు మారింది. కుందుర్తి ఒక పీఠికలో అన్నాడు. ఇంతవరకూ ఏది రాయాలి అనే విషయం మీద కేంద్రీకరించాము; ఇక ఎలా వ్రాయాలి అనే విషయం మీద శ్రద్ధ వహించాలి, అని....

# 38

కొన్ని దశాబ్దాల క్రితం పాశ్చాత్య దేశాలు పిసికి పారేసిన పిప్పి అయిన 'సామాజిక చైతన్యం' అనే సుడిగుండంలో పడి తెలుగు కవిత్వం ఇంకా గిల గిల కొట్టుకుంటోంది. ఈ సందర్భంలో ఇద్దరు సాహిత్య ప్రముఖుల వక్తవ్యాలు మీ దృష్టికి రావడం లాభదాయకమని భావిస్తున్నాను. అలాన్‌బోల్డ్ సామ్యవాద కవిత్వం మీద ప్రశంసనీయమైన కృషి చేశాడు అయన అంటాడు, "రాజకీయంగా ఉదాసీనుడైన కళాకారుడి కంటే గొప్ప కళాసృజన ఒక సామ్యవాది చేస్తాడని నేననుకోను.'' రెండవవాడు టి.యస్ ఇలియట్ ఇలా అన్నాడు, "రాజకీయ సాంగత్యం కవిత్వానికి తక్షణ గుర్తింపు తీసుకురాగలదు కాని అది రేపు కూడా చదవబడితే అది రాజకీయ సాంగత్యం కారణం చేత మాత్రం కాదు. కారణం, రాజకీయ సామగ్రి కూడా మానవీకరింపబడి సాహిత్యంగా మార్చ బడకపోతే అది మరచిపోవడానికే యోగ్యమవుతుంది.''

మన దేశంలో నేడు కవిత్వమూ సాహిత్యమూ ప్రధానంగా పాశ్చాత్య వాయువులు మోసుకొచ్చిన పరిమళమే గనుక, మన సాహిత్య విమర్శ కూడా ఆధునిక పాశ్చాత్య విమర్శనాధోరణులతో సమాన స్థాయి అందుకోవాలి అక్కడ వాళ్ళు వాడి పారేసిన ధోరణుల్ని కొన్ని దశాబ్దాల తర్వాత ఇక్కడ ధరించుకుని మన సాహిత్యాన్ని సతాయించడం సమంజసం కాదు.

భారతదేశంలో హిందీ సాహిత్యం ఈ విషయంలో అన్యభాషా సాహిత్యాల కంటే చాలా పురోగమనం సాధించింది. హిందీ సాహిత్య విమర్శ అత్యాధునికం. హిందీలో విమర్శ పరిభాష చాలా ప్రౌఢస్థాయి అందుకుంది ఆధునిక అభివ్యక్తులు ఆధునిక భావనాధోరణులు అన్యభాషా పఠితలకు ఆశ్చర్యం కలిగిస్తాయి దుర దృష్టవశాత్తున తెలుగులో విమర్శ ఒకవైపు ఆధునికతా రహితం, ఒకవైపు మోటు రాజకీయాల చదరంగం, మరోవైపు వ్యక్తిగత అశిక్షిత అశాస్త్రీయ అభిప్రాయాల ముద్ద. తెలుగువిమర్శ ఆధునిక ప్రపంచంలో, కాలంతోపాటు నడవలేదు. మంచి కవితను చెడ్డకవితను పోల్చుకునే విచక్షణాత్మక జ్ఞానం తెలుగువిమర్శలో పుట్టలేదు. దీనికి పాశ్చాత్య వాఙ్మయ అధ్యయనలోపం ఒక ముఖ్య కారణం. శాస్త్రీయ చేతన లేకపోవడం చేత రాగద్వేషాల బలానికి లొంగి పోయి విమర్శరాయడం రెండో కారణం అందుచేత తెలుగులో సాహిత్యవిమర్శ ఒక శాస్త్రసమ్మత విజ్ఞాన శాఖగా రూపొందలేదు తెలుగు సాహిత్యవిమర్శ మీద అందుచేతనే పాఠకలోకానికి ఇంకా విశ్వాసం కుదరలేదు.

''నా దేశం నా ప్రజలు''కు నేను రాసిన భూమికలో ఉదహరించిన రసూల్ గేంజటోవ్ మాటల్ని దయచేసి ఒక్కసారి చూడండి.

## వర్గచైతన్య తత్వం

## 39

రాంబాగ్ కాంతుల్లో నుంచి ఛాయల్లో నుంచి ఇవాళ నా వ్యధిత స్మృతిలో నిలిచి ఉండేది, కాంతి మండలం లాంటి మీ సుస్మిత ముఖమే. అదే ఇప్పటికీ ఇంకా నా ఆశల్ని కాంతిమయం చేస్తోంది.

ఎంత ఉత్సాహ ఉద్వేగంతో నేను అక్కడికి వచ్చానో? మన మిత్రులు ఎవరైనా నా మానసిక స్థితిని అర్థం చేసుకున్నారో లేదో? దేశపు దూర దూర ప్రాంతాల్లో సహయాత్రికుల కోసం అన్వేషిస్తూ చేసిన ప్రయాణం అది. అందరం కలిసి దేశ ప్రజల అజ్ఞాన భారాన్ని ఎత్తి అవతల పారేద్దామనీ జడత్వంలో నించి చైతన్యంలోకి తీసుకుపోదామనీ స్వాతంత్ర్యానంతర కాలంలో విజృంభించిన రాజకీయాధికార వేటగాళ్ళ ఉచ్చుల్లోనుంచి ప్రజల్ని విడిపిద్దామనీ స్వప్నించారు భారతీయ జిజ్ఞాసువు ఈ కృషి ప్రారంభించకపోతే, వర్తమాన సన్నివేశానికి

స్పందించకపోతే, దేశం పూర్తిగా ఆ అవకాశాన్ని కోల్పోతుంది. ఈ చైతన్యాన్ని రగుల్కొల్పడమే ఈనాడు ముఖ్యంగా కవి రచయిత అయిన వాడి కర్తవ్యం. ఈ చేతన దేశంలో అరణ్యంలో అగ్నిలా వ్యాపించాలి

ఈ తాత్వికతమానికి పునాదులు వేయడమే నా ప్రయాణానికి ప్రధాన లక్ష్యం. లక్ష్యం సంతృప్తికరంగా నెరవేరకుండానే తిరిగి రావడంచేత ఆశాభంగం నా గుండె మీద ఒక కొండలా కూర్చుంది ఈనాడు. మళ్ళీ ఒకసారి అక్కడికి వస్తే నాకు మనశ్శాంతి లభిస్తుందేమో!

మనం చర్చించుకున్న కొద్ది కాలంలో మనం అనేక విషయాల్లో ఏకీభవించాం. మన ప్రజల ఆశల ఆశయాల విషయంలో మన అవగాహన ఏకరీతిగా ఉండడం సంతోషదాయకం అయింది

నేను మాత్రం అక్కడికి సముద్రంలో తరంగంలా మాటిమాటికి వస్తాను. మీరు మాత్రం నా సహస్వాప్నికులుగా ఆ ప్రాంతంలో మన మిత్రుల సహకారంతో మన బీజాలు చల్లాలి

# 40

కవిత్వపు వాస్తవ ఆత్మ అయిన ధ్వని లేక చమత్కారం అభివ్యక్తిలో బహిర్గతంగా కనుపించే సూక్ష్మ అనిర్వచనీయ మెలికె లేక ఒక ఐంద్రజాలిక ద్రవ్యం. ఈ మెలికెగానీ ఆ ఐంద్రజాలిక ద్రవ్యంగానీ భాషలో ఉండేదికాదు; భాషలో ఉన్నట్లు కనిపిస్తుంది. కాని భావం యొక్క పుట్టుకలోనే ఉంటుంది ఆ సూక్ష్మ ద్రవ్యం. ఆ విచిత్ర భావజన్మ ఆ మెలికె ఉన్న అభివ్యక్తితో కూడా పుడుతుంది. అభివ్యక్తి శబ్దవిన్యాస విశేషం! అలా మెలికలు తిరిగిన శబ్దవిన్యాస విశేషరూప అభివ్యక్తి బహుశా భావంలోనూ కాకుండా ఇంకా లోతుల్లో అంటే జీవితంలో కవి లోకాన్ని చూచే చూపులో ఉందనుకోవాలి. ఆ చూపే మెలిక తిరిగిన భావానికి జన్మదాత అవుతుంది. ఆ మెలిక తిరిగిన భావం వక్రభాషాభివ్యక్తి పొందుతుంది. 'నీవు మర్రి చెట్టు నీడనంతా ఒక గులాబీ నీడలోనే పొందుతావు', 'మేఘం స్వప్నాల సామాను మోసుకుపోయే నౌక' 'రాత్రి నగ్నంగా వెన్నెట్లో స్నానం చేస్తోంది' (ఆధునిక మహాభారతము) ఇలాంటి కావ్య

పంక్తుల్లో భాష పొందే వక్రత, జీవితంలో కవి లోకాన్ని చూచే చూపులోనుంచి పుడుతుంది అలాంటి చూపు సంభవించడానికి కవి ఏదో ఒక ఉద్వేజన అనుభవానికి గురి అయ్యాడు. ఇలా భాషాగత కవిత్వానికి కవిగత జీవితానికి లంకె ఉంది భాషాద్యోకత కవిత్వాన్నే వక్రోక్తి అన్నారు. వక్రోక్తి గర్భంలోనే ధ్వని ఉంది ధ్వని ఫలితమే చమత్కారం. ఇది ఒక విశ్వజనీన ప్రక్రియ- ఏదో ఒక దేశంలోనో ఒక కాలంలోనో ఏ ఒక్క కవిలోనో సంభవించేదికాదు. ఎక్కడయినా ఎప్పుడయినా ఇది ఇంతే.

దైనిక వ్యవహారంలో మనం సౌకర్యార్థం ఫ్రెంచి కవిత్వం, తెలుగు కవిత్వం, ఇంగ్లీషు కవిత్వం, ఉర్దూ కవిత్వం ఇత్యాది మాటలు ఉపయోగిస్తాం. అందులో దైనిక వ్యవహారాల పరిధులు దాటి ఏ సత్యమూ లేదు. అది కేవల 'వ్యవహారిక సత్యం' మాత్రమే విభిన్న దేశాల్లో విభిన్న భౌగోళిక విశేషాలచేత స్థానిక సాంస్కృతిక విచిత్రాలచేత ప్రాంతీయభాషా శాబ్దిక వ్యక్తిత్వంచేత కవిత్వం భిన్న భిన్న భౌతిక లక్షణాలతోను వస్త్రధారణతోను కనుపిస్తూ భిన్న భిన్న, కవిత్వాలున్నట్లు ఒక భ్రాంతి కలిగిస్తుంది. ఈ భేదాలు ఉపరితలంవరకే పరిమితం. అంతర్గత కావ్యాత్మ మాత్రం విశ్వజనీనం. దీనికి కీలక పరీక్ష ఏమిటంటే - ఇక్కడ పేర్కొన్న కవిత్వేతర లక్షణాల్లో ఏ ఒక్కటిగాని అన్నీ కలిసిగానీ కవిత్వమూ కావు, కవిత్వాన్ని పుట్టించనూ లేవు. విభిన్న దేశాల్లో విభిన్న కాలాల్లో తత్త్వచింతకుల వర్గాల్లో జరిగిన కావ్యతత్త్వ చింతన ఫలితంగా ఇవాళ మనకు తెలిసిన సత్యమేమిటంటే - దేశమూ, కాలమూ, భాషా సంస్కృతి ఇత్యాదులన్నిటినీ అధిగమించి కవిత్వం అనే ఒక స్వతంత్ర ద్రవ్యం ఉంది. 'రక్తరేఖ' 90 పేజీలో ఈ విషయం మీద విపుల చర్చ ఉంది.

# 41

మన దేశంలో ప్రతి యువకుడు, ముఖ్యంగా కవి, వీలైనంత 'మార్క్సు సిద్ధాంత విజ్ఞానం' గడించుకోవాలి. వర్గచైతన్యం ద్వారా ఏ మోక్షం మనకు లభించాలో ఆ వర్గచైతన్య తత్త్వాన్ని మార్క్సు సిద్ధాంతం ఒక్కటే ప్రతిపాదిస్తుంది. ఈ జ్ఞానం లోపిస్తే ఏ యుగంలో అతడు శ్వాస పీలుస్తున్నాడో ఆ యుగచేతన తీవ్ర అసంపూర్ణతకు గురి అవుతుంది. మనిషి యుగీన జిజ్ఞాసా పరిణామంలో ఏ బిందువు చేరాలో, మార్క్సు సిద్ధాంత జ్ఞానలోపం చేత, ఆ

బింబవ[illegible]కరేదు కవి గా[illegible] అయితే, మారిపోయిన జిజ్ఞాసా ఉపలబ్ధి మానవ జీవితా[illegible] ఉత్కృష్టతకి, తన సాధన సామగ్రిలో ఒక తీరని లోటు ఏర్పడుతుంది, మార్క్సిజం లేకపోతే [illegible] మార్క్సిజం ఈ శతాబ్దపు జ్ఞానాత్మకి స్వభావమని అతను తెలుసుకోవాలి. 'మార్క్సిజం ఒక్కటే ఈ యుగపు వాస్తవ సమస్యల్ని వ్యక్తం చేస్తుంది" అన్నాడు సుప్రసిద్ధ జ్ఞాని సార్త్రే 'ఎగ్జిస్టెన్షియలిజం అండ్ హ్యూమనిజం'లో.

# 42

ప్రస్తుతః కాళిదాసు శాకుంతలం వ్యాసుడి శకుంతలోపాఖ్యానానికి పితృపుత్ర సంబంధమున్న దృశ్య, నామం, సంభాషణలు, పాత్రలు, ప్రవర్తనలు సంస్కారం నాగరకతా విశేషం అన్నీ వ్యాస మూలంలోవే. వ్యాస శకుంతలోపాఖ్యానంలో కాళిదాసు నాటకంలో కంటే నాటకీయత ఎక్కువ. కాళిదాసు నాటకం వ్యాసమూలం కంటే ఎక్కువ ప్రశస్తి పొందింది. దానికి కారణం ఫలానా అని చెప్పలేం మనకు పరంపరాగతంగా వస్తున్న "కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా! తత్రాపి చతుర్థాంకః తత్ర శ్లోక చతుష్టయం" అనే శ్లోకం అవుతుంది విస్మృత సాహిత్య కుస్తీలైన ఈనాటి సాహిత్య విమర్శలు పూర్వకాలం లేవు. సూక్ష్మంగా మర్మస్ఫోరక చర్చ నిర్వహించే శ్లోకాలుండేవి. ఒకో శ్లోకం ఈనాటి ఒకో పుస్తకంతో సమానం! "అహోమే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ భజతాం" అనే శ్లోకం భవభూతి కాళిదాసుల కావ్యప్రతిభా తారతమ్యాన్ని ఎంత నాజూకుగా చెపుతుందో చెప్పలేను త్రాసులో ఒక వైపు కాళిదాసు వాక్కు మరోవైపు భవభూతి వాక్కు పెట్టి తూచుతూ ఉన్నప్పుడు కాళిదాసు వాక్కు త్రాసులో పైకి తేలిపోతూ ఉండగా సరస్వతి చూచి తన చెవిలో ఉన్న లీలాకల్హారాన్ని తీసి కాళిదాసు వాక్కుమీద దానితో మకరంద బిందువులు విడిచిందట. తర్వాత ఏమయిందీ చెప్పడు. భవభూతి వాక్కు అందువేత పైకి తేలిపోయిందా లేక కాళిదాసు భవభూతుల వాక్కులు సమాన భారం కలవి అయ్యాయా ఏదీ చెప్పడు. కానీ భవభూతి వాక్కు కాళిదాసు వాక్కు కంటే బరువైనది అని సూచిస్తున్నాడు; పైగా కాళిదాసుకు భవభూతి కంటే హెచ్చుగా సరస్వతీ అనుగ్రహం ఉందంటున్నాడు; ఆ కారణంగానే భవభూతి వాక్కులో లేని దివ్యమాధుర్యం కాళిదాసు వాక్కులో ఉందంటున్నాడు ఇదంతా వ్యంగ్య మర్యాదయా! ఒక్క చిన్న శ్లోకంలో ఎన్ని మర్మసముద్రాలు ఇరికించాడో ఆ శ్లోకకర్త ఆశ్చర్యం!

ఇలాగే "కావ్యేషు నాటకం రమ్యం" శ్లోకం శాకుంతలం గొప్పతనానికి కారణమేమిటో సూక్ష్మంగా చెప్పింది. కావ్యాల్లో నాటకం గొప్పది. నాటకాల్లో శాకుంతలం గొప్పది. శాకుంతలంలో చతుర్థాంకం గొప్పది. చతుర్థాంకంలో శ్లోకచతుష్టయం గొప్పది అన్నాడు శ్లోకకారుడు. అంటే శాకుంతలం గొప్పతనం "యాస్యత్యద్య శకుంతలేవి", "పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం" ఇత్యాది శ్లోకాల్లో ఉందని చెప్పడంచేత పితృ పుత్రికలైన శకుంతలా కణ్వుల వియోగ వేదన శాకుంతల నాటకానికి ప్రాణం పోసి ఝంకృతం చేయించే మర్మకళ అని చెప్పినట్లయింది. కనుక వాస్తవంగా శాకుంతలం శృంగార రస ప్రధానం కాదు. కరుణ రస ప్రధానం అనాలి. ఉత్తర రామ చరితంలో కూడా సీతారాముల ప్రేమ ఉందిగానీ సామాజికుడ్ని అంటే ప్రేక్షకుడ్ని అంతిమ స్పందనకు గురిచేసే స్వరం వియోగజనిత శోకమే. అదే కరుణరసము. "ఏకో రసః కరుణ ఏవ" అని అందుకే ఆ మహానుభావుడన్నాడు. ఈ ఉక్తి "తతః కరుణ వేదిత్వాత్" అన్న రామాయణోక్తి జన్యధ్వని. రామాయణ కథ అంతా సీతారాముల వియోగ దుఃఖమే గదా, దానికి సూచ్యార్థ సూచనయే గదా? "మానిషాద" శ్లోకపు క్రౌంచ వధ - విప్రలంభ శృంగారం ఎక్కడ వస్తుందో అక్కడంతా విప్రలంభ శృంగార సముత్పన్న భేదమే లేక కరుణయే కావ్యశ్రోతను అంతతః ప్రభావితుడ్ని చేస్తుంది; కన్నీటితో తడిపి అతని గుండెని శాశితం చేస్తుంది. కనక మేఘ సందేశాదులు కూడా ఈ అవగాహన బంధంలోకి ఒదిగిపోయేవే.

## ఆధునిక కవితాచిత్రం

# 43

మీ విమర్శ గ్రంథం అందింది. మీరు వర్తమాన భాషవాడి ఉంటే బాగుండేది. ఈ అభిప్రాయాలు రాయడంలో పెద్ద చిక్కు ఉంది. మైత్రికి కూడా భంగం కలుగుతోంది! అయినా నిజం చెప్పమంటారా?

పేజీలన్నీ చదివాను కానీ కొత్త విషయం ఏమీలేదు. చర్వితచర్వణమే తప్పులతో సహితంగా, అవే పాతబడి చిరిగిపోయిన జాబితాలు అర్హకవుల అకవుల భారం మోస్తూ, వాళ్ళ అయోగ్య శిరస్సుల మీద ఆధునిక కవితా ప్రదానం అనే కిరీటం పెడుతూ తయారుచేసిన ఆ జాబితాలే! కవిత్వాన్ని అసమ

గ్రంగా అర్థం చేసుకోకపోవడం వల్లనే ఈ జాడ్యాలు పుడతాయి. ఈ శతాబ్దపు పాశ్చాత్య సృజనాత్మక రచనలను కొత్త వెలుగులో సింబలిజం, సర్రియలిజం, దాదాయిజం, ఎగ్జిస్టెన్షియలిజం అనే ఐరోపీయ ఆధునిక బౌద్ధిక ఉద్యమాల అవగాహనకు తోడ్పడేది ఈ పుస్తకం సూచిస్తోంది అవి కేవలం సాహిత్య ఉద్యమాలు కావు; పందొమ్మిది ఇరవయ్యో శతాబ్దాల యూరోపియన్ సమాజంలో రాజకీయ ఆర్థిక వ్యవస్థలు ఉత్పన్నం చేసిన సంవేదనాత్మక, బౌద్ధిక ఒత్తిళ్ళను ఆ ఉద్యమాలు ప్రతిఫలిస్తాయి.

మీ పుస్తకం మూడు నాలుగు దశాబ్దాల నాటి కవుల ముసలి దుర్గంధాన్ని మోస్తోందేగానీ తాజా వర్తమాన తెలుగు కవితా పరిమళాల్ని అందివ్వదు. ముప్పయ్ నలభయ్ ఏళ్ళనాటి ఒక పుస్తకం ఈనాటికీ అద్వితీయంగా అసమానంగా ఉండటం విమర్శకుడి విమర్శనా జ్ఞానానికిగానీ తెలుగు కవిత్వానికిగానీ ప్రతిష్ఠాకరం కాదు అంటే తెలుగుజాతి నలభయ్యేళ్ళు అలాగే కాళ్ళు విరిగి పడిపోయి ఉందా? ఇంతకాలం ప్రతిభాహీనంగా ఈ జాతి ఎలా ఉంది? అనే ప్రశ్నలు ఉదయిస్తాయి పైగా, తెలుగు కవితారంగపు వర్తమాన స్థితిని న్యాయ సమ్మతంగా మూల్యాంకనం చేసినట్లుగానీ లేక వాస్తవ పరిస్థితుల్ని చూసే దిదృక్ష విమర్శకుడికి ఉన్నట్లుగానీ ఈ పుస్తకం చూపించదు.

సాహిత్యంలో నా మిత్రుడుగా మీకు నేనిచ్చే సలహా ఏమిటంటే. విమర్శకుడికి కావలసిన సాధన సామగ్రి సంపాదించుకోండి మీ అశిక్షిత మనస్సుకు తోచింది రాసి దాన్ని విమర్శ అనడం న్యాయం కాదు న్యాయంతో నాకేమి సంబంధం. నా ఇష్టాయిష్టాలు తృప్తిపడితే చాలు అంటే అది వేరు. సుశిక్షిత విమర్శకుడుగా మీరు రూపొందడానికి సలహాగా చెపుతున్నాను 19, 20 శతాబ్దాల పాశ్చాత్య కవుల్ని, విమర్శకుల్ని చదవండి. కొందరు హిందీ, ఉర్దూ కవుల్ని చదవండి ముఖ్యంగా పాశ్చాత్య సాహిత్య విమర్శమీద ప్రత్యేక శ్రద్ధ వహించండి; ఒక కవితను ఎలా ఆస్వాదించాలి, ఆ అనుభవాన్ని ఎలా వ్యక్తం చేయాలి అనే వాస్తవ విమర్శనా ప్రక్రియను నేర్చుకోవాలంటే మీరు పాశ్చాత్య విమర్శ చదవక తప్పదు ఆధునిక కవిత్వానికి సాహిత్య విమర్శ రాయాలంటే వేరే మార్గం లేదు 18 19 శతాబ్దాల ఇంగ్లీషు సాహిత్య విమర్శ చదవడం కూడా తగు మాత్రపు పరిమితుల్లో అవసరమే. ముఖ్యంగా ఇలియట్, వర్జీనియా

టర్ఫ్ ఇత్యాదుల్ని. ఏవిధంగానైనా వాల్మీకి, వ్యాసుల్ని చదవడం భారతీయ విమర్శకుడి అవసరం 1970 నుంచి వచ్చిన కొత్త తెలుగు కవిత్వం, కవిత్వంలో కళాత్మక ఆధునికతలోని అర్థం చేసుకోడానికి అత్యవసరం. మీ ఆలోచనా సీమల్ని మీరు బుద్ధిపూర్వకంగా విస్తరించుకోవాలి. మీ దర్శనక్షేత్రం ఎంత విస్తారమయితే అంత కావ్యక్షీరాన్ని మీ అవగాహనా పాత్రికల్లోకి పితుక్కోగలుగుతారు. అప్పుడే మీరు ఆధునిక తెలుగు కవితాచిత్రాన్ని సాధించగలుగుతారు. అచ్చులో కనిపిద్దామన్న తొందర, ఆతురత విడిచిపెట్టండి. గుణహీన రచనలు ముద్రితం కావడం చేత అపకీర్తి వస్తుందేగాని గొప్పతనం రాదు. శ్రద్ధాపూర్వక అధ్యయనమూ, శారీకృషీ. వర్తమాన రాగద్వేష కాలుష్యాలు లేని కావ్యప్రీతి (వ్యక్తి ప్రీతి కాదు) తప్ప మీరు ప్రభావశాలి విమర్శకుడుగా రూపొందడంలో మరేదీ మీకు సహాయం చేయలేదు

ఆధునిక కాలంలో వచ్చిన ముతక కవుల్ని విసర్జించండి; వాళ్ళు కేవలం సామాజిక రాజకీయ పరిస్థితుల సంతానం. వాళ్ళకు చారిత్రిక ప్రాముఖ్యం ఉందే గాని ఆనందించి నేర్చుకోడానికి కావలసిన సాహిత్య విలువలేవీ లేవు. సాలీనా సాహిత్య విమర్శ రాసే అతి జాగ్రత్త పరులు, సర్వప్రముఖ జనసంతోష ప్రదానైక పరాయణులు, ధూర్తులు అయిన పంచాంగ విధాన విమర్శకుల్ని పుల్లతో గూడా ముట్టుకోకండి.

## నినాదగ్రస్త కవులు

## 44

నేటి సామాజిక చైతన్య నినాదగ్రస్త కవులు 12వ శతాబ్దపు వీరశైవ కవుల వంటివారు. ఈ రెండు తెగల కవిత్వం చేతగాక వాళ్ళు ప్రకటించుకునే మతం సహాయంతో బ్రతకడానికి ప్రయత్నిస్తారు కనుక వాళ్ళు కావ్యక్షేత్రంలో దురాక్రమణదారులు, సాహిత్యదేశంలో విదేశీ సరుకులు అమ్ముకోవడానికి వచ్చిన పరాయి దేశస్థులు. వీరశైవ కవుల్లో అధిక సంఖ్యాక పేజీలు లింగమహిమ, రుద్రాక్ష మహిమ, విభూతి మహిమ వగైరా మహిమల వర్ణనల్తో నింపబడ్డాయే గాని కవిత్వ గంధం ఏ కోశానా లేదు. ఆ గ్రంథాలు ఆ తెగకు చెందిన మూఢ భక్తుల అంధ విశ్వాసాన్ని రెచ్చగొట్టగలవే గానీ కావ్యాతపులైన పాఠకుల

సాహిత్య తత్త్వపు తీర్పు లేక. ఈ ఆధునిక [illegible] రెండూ కవులనే ప్రాథమిక పాత్రను విస్మరించారు. తాము [illegible] అన్నదాకాను అన్వేషణ [illegible] రెండు [illegible] కావ్యకర్తను కావ్యసౌందర్యాలను అవతల పెడితే [illegible] వాళ్ళ [illegible] కావ్యాలు దీర్ఘ సూచిస్తాయి తెలుగు సాహిత్యంలో ఎర్రాప్రెగడ [illegible] కవులు 11 వ శతాబ్దం పూర్వం లేరు, 13వ శతాబ్దంలోనూ తదనంతర శతాబ్దాల్లోనూ లేరు. అంటే వాళ్ళ ఆయుస్సు ఒక్క శతాబ్దమే. వాళ్ళ [illegible] ప్రతిబింబాలు అంతకాలం కూడా ఉండవని వాళ్ళ కృతులు చెప్తున్నాయి. కారణాలు మూడు. ఒకటి కవిత్వం లేకపోవడం; రెండు త్రికరణశుద్ధి లేకపోవడం, మూడు ఒక కవికి కావలసిన వ్యుత్పన్నత లేకపోవడం. ఇక్కడ చెప్పిన రెండూ మూడూ గుణాలు ఆధునిక తెగకే వర్తిస్తాయి.

* * *

# 45

మన దేశీ మార్క్సిస్టులు ఒకటి గుర్తుంచుకోవడం అవసరం: ముఖ్యంగా సాహిత్య దురాగ్రహపరులు. మార్క్సిజం ఉండ ఉండగా [illegible]. మార్క్సిజం అమలు జరిగిన దేశాల్లో అలా జరగలేదు. అక్కడ ఆ సిద్ధాంతాన్ని మూలసూత్రంగా తీసుకున్నారు. కానీ కార్యాచరణంలో అవసరమైన మార్పులు చేశారు. అతి ముఖ్యమైన ఉదాహరణ చైనా. వస్తాసంతులు ప్రతిభాన్వితులు అయిన చింతకులు మహాపురుషులు అయిన నేతల చేతుల్లో మార్క్సిజం ఎలా మార్పులు చెందిందో కొన్ని ఉదాహరణలిస్తాను. హెగెల్ ప్రాథమిక సూత్రాలు తీసుకుని మావ్ సేతుంగ్ తన స్వీయ ఆలోచనని అవగాహనని ఇలా ప్రతిపాదిస్తున్నాడు, "విశ్లేషణ, విలీనీకరణ అనే రెండిటికీ సంబంధించిన సామగ్రిని నేనూ పరిశీలించాను. వైరుధ్యాల ఐక్యానికి సంబంధించిన నియమాన్ని గురించి సామగ్రి సేకరించడం మంచిదే. దాన్ని గురించి బూర్జువా వర్గం ఏమి చెప్పింది, మార్క్స్ ఏంగిల్స్ ఏమి చెప్పారు, లెనిన్ స్టాలిన్లు ఏమి చెప్పారు, రివిజనిస్టులు ఏమి చెప్పారు- ఇదంతా సేకరించడం మంచిది. యాంగ్ సియేన్ చెన్ దాన్ని గురించి మాట్లాడాడు, పాతకాలంలో హెగెల్ కూడా మాట్లాడాడు. అలాంటి వాళ్ళు పూర్వకాలం ఉండేవాళ్ళు. ఇప్పుడు అంతకంటే ఘోరం సింథసిస్ అంటే ఏమిటి? కోమింటాంగ్ పార్టీ, కమ్యూనిస్టు పార్టీ ఈ రెండు వైరుధ్యాలూ చైనాలో ఎలా విలీనీకరణ పొందాయో మీరందరూ చూశారు. వాళ్ళ సైన్యాలు వచ్చాయి.

మనం పీడిని మింగేశాం; ముక్క ముక్కగా నమిలితిన్నాం. సింథసిస్ అంటే ప్రశాంతంగా కలిసి ఉన్న రెండు వైరుధ్యాల విలీనం కావడం కాదు. ఒకటి మరొకదాన్ని తినడం. పెద్ద చేప చిన్న చేపను. పుస్తకాల్లో ఎప్పుడు ఇలా చెప్పరు నేను దేశీ వేదాంతిని; మీరు విదేశీ వేదాంతులు. ఏంగిల్సు మూడు ద్రవ్యాల్ని గురించి మాట్లాడాడు. అందులో రెండింటిని నేను నమ్మను. వైరుధ్యాల ఐక్యం అనే సూత్రమే నిజంగా అతి ముఖ్యమైనది; గుణం పరిమాణంలోకి పరిమాణం గుణంలోకి పరివర్తన చెందడం వైరుధ్యాలు ఐక్యమవడమే. గుణము, పరిమాణము, ఖండనయొక్క ఖండన. ఇవి అసలు లేనేలేవు. విలీనీకరణ పద్ధతి ఏమిటి? ఒకటి మరొకదాన్ని విధ్వంసం చేస్తుంది. అందులో నుంచి కొన్ని కొత్తవి ఉత్పన్నమవుతాయి. అభివృద్ధి పొందుతాయి. విధ్వంసం అయిపోతాయి. ఇతరులచేత అవి విధ్వస్తం కాకపోతే వాటి చేతులో అవే విధ్వస్తమవుతాయి. ఇది ప్రకృతిధర్మం. మనుషులకంటే అరణ్యాలు ఎక్కువ కాలం బ్రతుకుతాయి. కానీ అవి కూడా కొన్నివేల సంవత్సరాలే జీవిస్తాయి. డయలక్టిక్స్ ప్రాణం ఇప్పట్నుంచిగా వైరుధ్యాలవైపు ఉండడంలోనే ఉంది. స్వేచ్ఛ అంటే అవసరాన్ని అర్థం చేసుకోవడం, అవసరాన్ని మార్చుకోవడం. నీవు అర్థం చేసుకున్నంత మాత్రంచేత సరిపోతుందా? ఒక సూత్రాన్ని కనుగొన్నప్పుడు దాన్ని వర్తింపజెయ్యాలి. నీవు ప్రపంచాన్ని మళ్ళీ పునస్సృష్టి చెయ్యాలి, భూమిని విచ్ఛేదం చెయ్యాలి. బిల్డింగులు లేవదియ్యాలి. గనులు త్రవ్వాలి, పరిశ్రమలు నిర్మించాలి....

అవసరాన్ని అర్థం చేసుకోవడంతో అంతా పూర్తయినట్లుకాదు. మనం పరిస్థితుల్ని కూడా తదనుగుణంగా మార్చాలి. (టాక్స్ ఆన్ క్వశ్చెన్ ఆఫ్ ఫిలాసఫీ 18 ఆగస్టు 1964 - "మావోసేతుంగ్ అన్ రిహర్స్‌డ్") ఇక్కడ మావోసేతుంగ్ ఎలా ఏంగిల్స్‌యొక్క "మూడు ద్రవ్యాల" విషయంతో ఏకీభవించడంలేదో గుర్తించడం ప్రాముఖ్యం. వైరుధ్యాల విలీనీకరణ విషయంలో కూడా ఏకీభవించకపోవడం మరొక గుర్తించవలసిన ముఖ్య విషయం. ఇక్కడ తన భావం చెప్పడంలో మావోసేతుంగ్ ఎంత తీవ్రమైన భాష వాడుతాడో జ్ఞాపకం ఉంచుకోవాలి. పెద్దల అభిప్రాయాలను గురించి భేదాభిప్రాయం వెలిబుచ్చేటప్పుడు ముందు వెనుకాడడం అనే సాంప్రదాయిక మర్యాద పాటించడం బొత్తిగా నిర్లక్ష్యం చేస్తాడు. క్యాపిటలిస్టు సమాజం అనివా

ర్యంగా సోషలిస్టు సమాజంగా మారుతుంది అనే ఒకో ముఖ్యమైన విషయంతో మావో ఏకీభవించడు. ఈ మార్క్సిస్టు సూత్రంలో ఒక ఆత్మనిష్ఠ వైరుధ్యం ఉందంటాడు. 'సామ్యవాద సమాజం అనివార్యంగా వస్తుందనేది గ్యారంటీ. నిశ్చయమైతే ఆ విషయం తెలుసుకుని ఊరుకుంటే సరిపోతుంది గదా?' అని ప్రశ్నిస్తాడు 'ఒక సూత్రాన్ని కనిపెట్టిన తర్వాత దాన్ని అమలుజరపాలని నూతనంగా ప్రపంచాన్ని మళ్ళీ సృష్టించాలి. సూత్రాన్ని అర్థం చేసుకుని ఊరుకుంటే సరిపోతుందా?' అంటాడు.

సింథెసిస్ (ఏకీకరణ)కు మావో ఇచ్చే వ్యాఖ్యానం, తన దేశపు బౌద్ధిక నేపథ్యంలో తాను ఏ జిజ్ఞాసా సంపదకు వారసుడో ఆ సంపద ఇచ్చే కాంతి పుంజంలో మార్క్సిజం తనకు ఎలా అర్థమయిందో ఆ మాట చెప్పడమే. 'ఒకటి మరొకదాన్ని విధ్వంసం చేస్తుంది' ఇత్యాది మావో వాక్యాలు భారతీయ చింతనలో ఒక అంగం అయిన మావో బౌద్ధిక వారసత్వం నుంచి రాలిన బిందువులే. మరణం ఒక నైసర్గిక నియమం అనే సూత్రం గీత ప్రతిపాదించే సూత్రాల్లో అతి ముఖ్యమైనది. "జాతస్యహి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్య చ తస్మాత్ అపరిహార్యేర్థే నత్వం శోచితు మర్హసి" - పదార్థం ఎప్పుడూ పరిణామం చెందుతూ ఉంటుందనీ - శాశ్వతంగా ఏదో ఒక రూపానికే బద్ధమై ఉండదనీ సమంజస తాత్పర్యం. జ్ఞానం యొక్క నిరర్థకత, కార్యం యొక్క అగ్రస్థానం మావో చేత అంతగా ఉద్ఘోషింపబడడం, ఆయన దేశంయొక్క సనాతన చింతన ఆయన గుండెల్లో చేస్తున్న ప్రతిధ్వనే. ఫలితంమీద లంపటత్వం వహించకుండా కర్తవ్యాన్ని నిర్వహించాలి అనే పారుపతిక సంస్కార ఫలితమే మావో జ్ఞానానికంటె కార్యానికి ఇచ్చే అగ్రస్థానానికి అర్థం సామ్యవాద సమాజ రూపపర్యవసానం అనివార్యమనే సూత్రానికి సారాంశమే కర్తవ్య ప్రాధాన్యమను కోవాలి. అంటే గతితార్కిక గమనంలో ఒక సంఘటన అనివార్యం గనుక, గమనశక్తులు కూడా, చారిత్రిక శక్తులతో తమని ఏకీకృతం చేసుకుంటూ తమ కృత్యాన్ని నిర్వహిస్తాయి. "కర్మణ్యేవ అధికారస్తే మాఫలేషు కదాచన మాకర్మ ఫలహేతుర్భూః మాతే సంగోస్త్వకర్మ''- ఇక్కడ, "నీవు చేసే కర్మకు ఫలం నీ ఆశ కారాదు. నీకు మాత్రం ఆ కర్మతో సాంగత్యం పనికిరాదు'' అనే చివరి రెండు పంక్తులు ముఖ్యం. మావో ఇలాగే అకర్మ విరోధి.

చైనా తాత్విక చైతన్య జిజ్ఞాసాత్మక సమన్వయ రూపం మావో అలాంటి సమన్వయ శాస్త్రీయ సంపదకు వారసుడు ఒక భావానికి వెంటనే వేళ్ళు రావడం విశ్లేషణ నేలలోనే సంభవిస్తుంది. కానీ బలిష్ఠమైన స్వకీయ లక్షణాలు పెంచుకున్న భూమిలో ఒక భావానికి వేళ్ళు రావాలంటే అది ఆ లక్షణాలతో ముందు సమన్వయం చేసుకోవాలి. అప్పుడే ఆ భావం పూలు పండ్లు ఇస్తుంది. ఈ అర్థంలోనే చైనా మార్క్సిజాన్ని అవసరమైన సవరణ చేసి వాడుకుంది. అలాగయితే మరి పండిపోయిన భారతీయ భూమిలోకి దాని ప్రాచీన లక్షణాన్ని జయించుకుంటూ ఒక భావపు వేళ్ళు చొచ్చుకుపోవాలంటే ఎంత దుస్సాధ్యమో మన దేశపు జిజ్ఞాసువులు ఊహించాలి మార్క్సిజం ఈ దేశంలో అత్యధిక జిజ్ఞాసాక్రాంతం కానిదీ పఠనాసుగ్రస్తం కానిదీ వేళ్ళూనలేదు.

ఏ భావం కూడా అన్యభూముల్లోకి అక్కడి భౌగోళిక చారిత్రిక స్థితిగతులకు అనుకూలంగా కృషి చేసుకోకుండా ప్రవేశించలేదు. మన దేశం ఈనాడు ఒక మావోలాంటి ఒక లెనిన్‌లాంటి తాత్త్వికద్రష్ట అయిన నేత కోసం ఆకాంక్షిస్తోంది పూర్వకాలం మన దేశానికి గీతాకర్త అలాంటివాడు గీతను ఒక దివ్యవాణి అనుకొనేవాడు బౌద్ధికకుబ్జు!

# 46

ఆనాడు మీ ఉన్నత విశ్వవిద్యాలయ కుడ్యాల మధ్య నా గొంతు ఏమి గొణిగిందో నాకు జ్ఞాపకం లేదుగానీ ఇవాళ నా గోడలమీద మీ స్మృతిచిత్రాలు రంగు రంగుల రేఖలతో హసిస్తూ వేలాడుతున్నాయి జ్ఞాన మండలం అలంకరించిన మీ ముఖం నా అంతరంగ కుడ్యాలకు వెలుతురిస్తోంది.

నా గొంతు అన్వేషిస్తూ పిలుస్తున్న గొంతు. మన దేశపు రూపురేఖల్ని తడుముకుంటూ ఆధునిక రాజకీయ రాక్షసుడు ఛిన్నాభిన్నంచేసిన దేశపు ముక్కల్ని పోగు చేసుకుంటూ అన్వేషిస్తున్న గొంతు! నా సంఘర్షణ అంతా బౌద్ధిక వర్గ గొంతుని స్వేచ్ఛాయుక్తం చేసి గౌరవస్థానాని కెత్తి పునరుత్థాపన చేయడానికే, మానవీయ జీవనమూల్యాన్ని విధ్వంసం చేస్తున్న రాజకీయాధికార క్షుత్పీడిత వేటగాళ్ళని వాళ్ళ అయోగ్య ఉన్నతస్థానాల్నించి ఊడబీకడానికే.

అంతతః నా సుదూర ప్రయాణం నా సంఘర్షణతో సోదరత్వం వహించే మంత్రులకోసం, సమాన ఆశయాలూ ఆదర్శాలూ అనుబంధాలై ఒకనాడు ఈ అల్పాయత్నాలే బౌద్ధిక నిగ్రహాలతో ఒక సాహిత్య చైతన్య తరంగాన్ని లేవదీస్తుందనే ఆశ నెరవేర్చుకోవడం కోసం. అధికారకుట్ర వాసిత రాజకీయాల్లో ప్రజలు శృంఖలా బద్ధులైపోకుండా వర్గ చైతన్యం నాలుగు దిక్కులకూ తీసుకుపోవడం కోసం, భారతీయ జిజ్ఞాసువు తన జడత్వంలో నుంచి బయటపడి నిర్భయంగా గొంతెత్తవలసిన రోజు వచ్చింది దేశం పిలుస్తోంది; ప్రాణాలక్కూడా తెగించి ప్రజల కోసం పోరాడవలసిన రోజు వచ్చింది

## 47

కవి కొన్ని ప్రాథమిక విషయాల్ని బుద్ధిపూర్వకంగా అలవాటు చేసుకుని తన సంస్కారంలోకి ఇంకిపోయేటట్లు చేసుకోవాలి. అందులో ఒకటి- మానవ జాతి చరిత్రను గురించి ప్రగాఢ స్పృహ. రెండు- భూగోళ జ్ఞానమూ శూన్యంలో దాని పరిసరాల చిత్రం. మూడు - మానవీయ విలువలకు నిబద్ధత. నాలుగు- ప్రపంచపు అన్ని ప్రజల అలవాట్లు, ఆచారాలు, విశ్వాసాలు వాటిమీద ప్రేమ పూర్వక సానుభూతి. ఆ ప్రజల జీవితాన్ని శాసించే శీతోష్ణ పరిస్థితులు, వర్ణ విన్యాసాలు, దేశకాలాల చేతన, చర్మచక్షువుల హద్దులకు అతీతంగా ఉన్న దాని కోసం తహతహ, తడుముకుంటూనైనా ముందుకు పోవాలన్న తీక్ష్ణ తపన-

# సాహిత్య ధర్మం

## 48

భాషల్ని, ప్రాంతాల్ని అధిగమించి ఈ దేశంలో ఉన్న సమస్త సాహిత్యాన్ని సమస్త జిజ్ఞాసని ఒకదానితో ఒకటి పోల్చి మూల్యాంకన చేయడమే యుగధర్మమనీ సాహిత్య ధర్మమనీ జ్ఞానాత్మక ధర్మమనీ నా నిశ్చిత అభిప్రాయం. ఇది భారతదేశపు విశ్వవిద్యాలయాల్లో జరగాలి, భారతదేశపు అన్ని సాహిత్య విమర్శక్షేత్రాల్లోనూ జరగాలి. ధూర్తపాత్ర నిర్వహిస్తున్న బహుమతుల సంస్థలు ఈ పని చెయ్యవు వాళ్ళ వ్యక్తిగత దుర్నీతి కారణంగా, స్థానిక భాషా కమిటీలు వేసి స్థానిక కుళ్ళును అఖిల భారత స్థాయికి ఎత్తుతాయే గానీ ఆ సంస్థలకు దేశంతోగానీ, సాహిత్యంతోగానీ ఏ సంబంధమూ లేదు. అఖిల

భారత స్థాయిలో అన్ని సాహిత్యాల మూల్యాంకన జరిగితేనే భారతదేశ జాతీయ సమైక్యత బలపడుతుంది. ఇలాంటి మూల్యాంకనని సాధించడం కోసం పాశ్చాత్య దేశాల్లో ఎలా అత్యంత భారీ ఎత్తున ఒక భాషలోనుంచి మరో భాషలోకి సాహిత్య అనువాదం జరుగుతూ ఉందో అలాగే మన దేశంలోకూడా అన్ని భాషల సాహిత్యాలు హిందీ భాషలోకి అనువాదం కావాలి. ఒక అనువాద సంప్రదాయం ఉద్యమంలా దేశవ్యాప్తంగా ప్రారంభం కావాలి. అప్పుడే భారతదేశం ప్రపంచ పరివారంతో ఒకటిగా చేరగలదు. ఇప్పుడున్న అరాజక స్థితిలో అది వీలుకాదు.

ఈనాడు అనువాదం అతిక్లిష్టమైన కార్యమని, మూలభాషల్లో ఉన్న సౌందర్య విశేషాలు నాజూకు జాతీయాలు అనువాదంలోకి రాలేవనీ అందుచేత అనువాదంచేత మూలానికి నష్టం కలగడం అనివార్యమనీ అనడం ఒక అలవాటయి పోయింది. ఇది గతానుగతికంగా వస్తున్న అజ్ఞానం. దీన్ని నిర్దాక్షిణ్యంగా అంతం చెయ్యాలి. నా వ్యక్తిగత అనుభవంలో అనువాదం చేత మూలానికి ఏ నష్టమూ కలగదని తెలుసుకున్నాను. కవిత్వం వరకు విషయం సుస్పష్టం. కవిత్వం అలంకార బింబ ప్రతీకలే అయితే ఒక భాషలో నుంచి వాటిని మరో భాషలోకి తీసుకుపోవడమే అనువాదం. ఈ పని అత్యంత సుగమం. ఇక అనువాదంలో మన మనుకునే భాషా పరమైన సమస్యలూ, వాటిలో మనం చూపే మాధుర్యాలూ మనలో పారంపరికంగా గతానుగతికంగా వస్తున్న భ్రాంతులు మాత్రమే అవి నష్టమైనా కవిత్వానికి నష్టం లేదు కానీ మూలంలో ఉన్న భాషా విశేషాల్ని కూడా తీసుకురావడం కృషిబద్ధుడైన జాగరూకుడైన కావ్యాభువైన అనువాదకుడికి అసాధ్యం కాదని నా కావ్యాల అనువాద కృషిలో నేను గ్రహించిన సత్యం. మూలభాషలో ఉన్న కోమల స్వరాలు నాజూకు ప్రతిధ్వనులు బుద్ధిబలంతో వెతకాలే గానీ అవి అనువాద భాషలో కూడా ఉంటాయి. కారణం, సాధారణంగా మానవ సన్నివేశాలన్నీ ఏ దేశంలోనైనా ఏ ప్రజల్లోనైనా సమానంగానే ఉంటాయి ఆ సన్నివేశాల్లో ఉత్పన్నమయ్యే సందేశాత్మక అభివ్యక్తులు కూడా సమానంగానే ఉంటాయి. ఆ అభివ్యక్తుల భంగిమ భిన్నంగా కనిపించవచ్చు. ఆ భిన్నతే అనువాదకుడ్ని అలాంటి అభివ్యక్తి అనువాద భాషలో లేదనే భ్రాంతికి గురిచేయవచ్చు. కానీ జాగ్రత్తగా భాషా ప్రవర్తన, భాషా శీలం గ్రహించ గలిగిన మర్మజ్ఞులకు సమానాంతర అభివ్యక్తులు అన్ని భాషల్లోనూ

దొరుకుతాయి. ఆ సర్వజ్ఞత యొక్క అపేక్షకతే అనువాదాన్ని అనువాద కళగా మారుస్తోంది.

దూర్తవాదాల మూలంగా అనువాదాన్ని ఆధునిక ప్రపంచం విడనాడ కూడదు భూగోళం మీద ఉన్న యావన్మానవ జాతి యొక్క ఏకత్వదింతనకి సమీకరించే అఖండ సాధనమైన అనువాదాన్ని కోల్పోతే మానవజాతి పురోగమనం సంపూర్ణంగా కుంఠితమై పోతుంది.

భయానక భాషాకుడ్యాలను భేదించి మనిషి మనిషిని కలుసుకుందామన్న కోరిక ఈనాడు ఒక ఆధునిక మహాస్వప్నం అయింది. మనిషి ఈ భూగోళం మీద ఉదయించిన నాటినుంచీ ఈ కలలు కంటూనే ఉన్నాడు. ఆ కల అభివ్యక్తే మనకు బైబిల్లో కనిపించే మానివులు కట్టిన టవర్ ఆఫ్ బేబెల్. అప్పుడు దేవుడు భాషల్ని సృష్టించి మనుషుల్ని విడదీసి ఆ ప్రయత్నాన్ని భగ్నం చేశాడు. మళ్ళీ ఈనాడు మనిషి అనువాదం ద్వారా ఆధునిక కాలంలో ఒక నూతన టవర్ ఆఫ్ బేబెల్ నిర్మించాలి. భగవంతుడి కోరికను భగ్నం చెయ్యాలి.

అసలు కవిత్వానికి అగ్నిపరీక్ష అనువాదమే. వాస్తవంగా అది కవిత్వమే అయితే అది అనువాదంలోకి సులభంగా ప్రవహిస్తుంది. ప్రపంచంలో అగ్రగణ్య కవులందరూ అనువాదాల చేతనే మానవజాతి సంపదగా శాశ్వత స్థాయి పొందారు. ఏమంటారు?

## తెలుగు లక్షణం

## 51

"నొప్పింపక తానొవ్వక తప్పించు తిరుగువాడు ధన్యుడు సుమతీ" అని తెలుగు నాడి పట్టి తెలుసుకొని తెలుగు లక్షణం నిర్వచించిన మహానుభావుడు సుమతి శతక కర్త బహుశా 12 వ శతాబ్దంలో రాశాడు తన శతకం! అప్పటికే ఈ లక్షణం తెలుగు జాతీయ లక్షణంగా ప్రతిష్ఠ పొందిందన్నమాట ఇదే ఈనాటికీ తెలుగు జాతీయ జీవనంలో, రాజకీయాల్లో, సాహిత్యంలో సర్వేసర్వత్ర కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఇది చాలా అనాగరిక లక్షణం అని వేరే చెప్ప నక్కరలేదు. అధైర్యం మోహానికి దారి తీస్తుంది. అధైర్యం నాగరికతలో ఒక

భాగం కాలేవు కనక తెలుగుజాతి ఈ లక్షణాన్ని ప్రయత్నపూర్వకంగా తొలగించుకోవాలి లేకపోతే తెలుగుజాతి అనాగరిక జాతిగానే ఉండిపోతుంది. భారతదేశపు అన్ని భాషల ప్రజలతో పోలిస్తే తెలుగుజాతి నిజంగా నాగరికత దృష్టిలో చాలా వెనకబడి ఉంది. తిండీ, బట్ట చేత నాగరికత కొలవబడదు. మానవ స్వభావ లక్షణాలచేతనే కొలవబడుతుంది. ఆ కోణంనుంచి చూస్తే భయం, అధైర్యం ఆటవిక లక్షణాలు. అడవిలోనే అయితే భయం హింసకు దారి తీస్తుంది. కానీ నగరంలో ఉంటూ అంటే సమాజ జీవనంచేస్తూ, ఒకర్ని ఒకరు నమ్మకపోవడం, తన సొంతాన్నే కాపాడుకుంటూ తన సొంతంకోసం ఇతరుల్ని హింసకు రూపాంతరమైన వంచన అవలంబిస్తూ బ్రతికే లక్షణం ఆటవిక జంతు లక్షణం. స్వార్థం బలవత్తరంగా ఉన్న రోగానికి బహిర్లక్షణాలే కీర్తికాంక్ష, అసూయ, భయము, వంచన, దూర్తప్రవర్తన, చాకచక్యం వగైరాలు, నిస్వార్థ నిర్మల జీవన లక్షణాలు నిర్భయం, నీతి, స్నేహం, సహజభాషణ ఇత్యాదులు. ఈ దారిలో వెళ్ళితే తెలుగు జీవనం భరించడానికి యోగ్యం అవుతుంది

## 52

మార్క్సిస్టు తర్కాన్ని త్యజించి దాని సామాజిక ఆర్థిక పథకాన్ని మాత్రమే స్వీకరించడం అనే సూత్రం మీకు ఆశ్చర్యంగా ఉండవచ్చు. అదే మీ ఉత్తరంలో కనిపిస్తోంది. ఆ సూత్రానికి తార్కిక గౌరవం ఇస్తారా లేదా అనే మాట అటుంచి అసలు నేను ఇచ్చిన పరిష్కారానికి ఒక సహజమైన అవశ్యకత ఉంది అనే విషయాన్ని గ్రహిస్తే చాలు కారణం, ఒక బ్రహ్మాండమైన మానవీయ సమస్యని ఆలస్యం జరుగనీయకుండా పరిష్కరించాలి అదే అన్నిటికంటే ముఖ్యం. ఏ కారణాలచేతనైనా ఒక సమస్య తలఎత్తుతుంది గాని దాని పరిష్కారాన్ని ఒక వాదోపవాద పంకిలంలో ఇరికించి అది తేలేవరకూ ఇది తేలదు అనే మూర్ఖత్వం కంటే వాదోపవాదాల్ని నిర్దాక్షిణ్యంగా శిరచ్ఛేదం చేసి నేరుగా పరిష్కారాన్ని అమలుజరపడమే కర్తవ్యం. ఆ పరిష్కారఆచరణకు కార్యక్రమాలు రూపొందిరిచుకొని వాటిని త్వరత్వరగా నిర్వహిస్తూ పోవడమే సవ్యమైన మార్గం మనం ఇందులో అవలంబించవలసిన దృక్పథం ఏమిటంటే - మనకు పరిష్కారం మీద ఆతురత ఉండాలి. సమస్య మనల్ని బాధిస్తూ ఉండగా పరిష్కారం, వాదోపవాదాలు అనే రెంటిలో దేనికి ప్రాధాన్యం ఇవ్వాలి అనే విచక్షణాత్మక దృష్టి కావాలి.

ఈ సృష్టిని దేవుడు పుట్టించాడా లేక అదే పుట్టిందా. ఎలా పుట్టింది అనే ప్రశ్నలకు ఏదో ఒకే సమాధానం ఉండాలి అవే బలిష్టమైన సాక్ష్య సామగ్రి ఏ జ్ఞాన శాఖ కూడా మనకు ఇంతవరకూ ఇవ్వలేకపోయింది. కారణం. ప్రతి సిద్ధాంతము ఏదో కొంత కాలమే రంగాన్ని ఆక్రమించుకుని పరిపాలించి అనంతరం వచ్చే సిద్ధాంతం చేత పరాజితం అయి తోసివేయబడుతూ వచ్చింది. ఇదొక యాతాయాత సిద్ధాంత పరంపరావలయం మాత్రమే. ఇందులో ప్రతి సిద్ధాంతము ఒక గొప్ప ద్రష్ట అయిన జ్ఞాని చేతనే ప్రతిపాదింపబడింది. ఏ సిద్ధాంతకర్తా మరొకరికి తీసిపోయేవాడుకాదు. విశ్వనిర్మాణానికి సంబంధించిన విషయం ఉదాహరణకు తీసుకుంటే టాలెమీ సిద్ధాంతాన్ని కోపెర్నికస్ సిద్ధాంతం తోసివేసింది. ఆ తర్వాత కోపెర్నికస్ సిద్ధాంతాన్ని న్యూటన్ సిద్ధాంతం తోసివేసింది. న్యూటన్ సిద్ధాంతాన్ని ఐన్‌స్టీన్ సిద్ధాంతం తోసివేసింది. దానిమీద కూడా కొన్ని నూతన సిద్ధాంతాలు ఇటీవల దెబ్బకొట్టాయి కాని గుర్తించవలసిన దేమిటంటే - ఇందులో ప్రతి సిద్ధాంతమూ శాస్త్రీయంగానే ఉంటుంది. తర్కయుక్తంగా ఉంటుంది. సుస్పష్టమైన సాక్ష్య సామగ్రితో వాటిని రుజువు చేయవచ్చు. అవి స్పష్టమైన ఫలితాన్ని కూడా చూపిస్తాయి. కానీ ప్రతి సిద్ధాంతమూ తదనంతర సిద్ధాంతంచేత దోషభూయిష్ఠం అనికూడా ఋజువు చేయబడింది. అందుచేత నా అభిప్రాయం, ఏ సిద్ధాంతాన్ని ఆ విషయంమీద అంతిమవాక్యంగా తీసుకోకపోవడమే బౌద్ధిక క్షేత్రంలో ఉండవలసిన సంస్కృతి. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ."

విశ్వసృష్టి మనిషి తర్కానికి ప్రతిబింబంగా పుట్టిందనుకోవడం ఎంత అవివేకమో పరమేశ్వరుడి సృష్టికి ప్రతిబింబంగా పుట్టింది అనుకోవడం కూడా అంత అవివేకమే అనుకోవాలి అందుచేత మనం ఎదుర్కొంటున్న ఒక చారిత్రిక సందర్భానికి దాని అవసరాలనుబట్టి మన కార్యాచరణ రూపొందించుకోడమే అత్యంత సమంజసమైన విధానమని మనం గ్రహించాలి. ఈనాడు మన అవసరం భయంకరమైన ప్రజాపీడన మానవ అన్యాయం మానవ అసమానత అనే ఘోరాల్ని మానవ సమాజంలో ఆలస్యం చేయకుండా అంతం చేయడమే ఈ పరిస్థితి ఎలా పుట్టింది అనే తర్కం కాలాహరణకే దోహదం చేస్తుంది. ప్రఖ్యాత

విప్లవ కవి మాయాకోవ్‌స్కీ – అంటాడూ. "మేము ఏ పక్షం అవలంబించాలి, ఏ పక్షాన పోరాటం జరపాలి అనేది తెలుసుకోడానికి పుస్తకాలు చదవనక్కర్లేదు. మా నిర్ణయాల కోసం హెగెల్ ప్రతిపాదించిన గతితార్కిక సిద్ధాంతాన్ని ఆశ్రయించనక్కరలేదు" (ఎట్ ది టాప్ అఫ్ మై వాయిస్). మనం సమాజం ఎక్కడుందో అక్కడ్నుంచి దాన్ని నూతనరూపంవైపు కదిలించాలి. మానవజీవనంలో ఉన్న ఘోర అసమానతల్ని తొలగించడానికి మార్క్సిజంలో ఒక సామాజిక ఆర్థిక పథకం రూపంలో ఒక ఔషధం తయారుగా ఉంది. ఆ ఔషధం పుచ్చుకోవడంలో కాలయాపన జరుగుతోంది. మార్క్సిజంలో ఉన్న తర్కాన్ని విసర్జించి దాని సామాజిక ఆర్థిక పథకాన్ని మనం స్వీకరించినప్పుడు మార్క్సిస్టు ఆగ్రహించవలసిన అవసరం లేదు. అతడింకా గొడవ చేస్తున్నాడంటే అది కేవలం తన వాదోపవాద కండూతి తీర్చుకునే గొప్ప అవకాశం కాస్తా జారిపోయిందే అనే ఏడ్పు మాత్రమే.

ప్రస్తుత సమాజపు అష్టావక్ర రూపం, తత్ఫలితంగా సంభవించిన అపార మానవ బాధ, మనం ఈనాడు ఎదుర్కొంటున్న ఒక స్పష్టమైన సమస్యగా మాత్రమే భావింపబడాలి. అలా భావించి దాన్ని తొలగించడానికి ఒక కార్యక్రమం తక్షణం స్వీకరింపబడాలి. తర్కంకాదు. ఇదీ ఈనాటి ఇండియాకు కావలసిన మార్క్సిజం.

## సామాజిక చైతన్యం

## 53

'నా దేశం నా ప్రజలు' (ఇప్పుడు ఆధునిక మహా భారతము) అనుభూతి ప్రధాన కవిత – సామాజిక చైతన్య కవిత కాదు. అందులో వచ్చే సామాజిక చైతన్యోద్రేకాలు ప్రధాన అనుభూతి ప్రవాహంలో ఒదగవు' అని ఒక తెలుగు విమర్శకుడు. ఇక్కడ ఈ విమర్శకుడి అవగాహన ప్రకారం 'సామాజిక చైతన్యం వేరు, అనుభూతి వేరు' అని స్పష్టం . అంటే సామాజిక చైతన్యం అని వచన కవులు, విమర్శకులు అరిచే అరుపు అనుభూతికాదు. కనుక ఈ విమర్శ ప్రకారం సామాజిక చైతన్య కవులందరూ తమ అనుభూతి కాని అవాస్తవిక రచనలు

చేస్తున్నారనాలి. ఎందుకంటే, వాళ్ళు చెప్పే సామాజిక చైతన్యం వాళ్ళు అనుభవించినదీ కాదు, లేక వాళ్ళ సహానుభూతికి లొంగిందీ కాదు, కనీసం ఎరిగి కానీ చెప్పుతున్న మాట కాదన్న మాట. అది కక్షై పిశాచ ప్రలాపం. అసలు 'అనుభూతి కవిత్వం' అనే మాట తెలుగు సాహిత్యంలో ఒక అజ్ఞాన మూలక విషక్రిమి. దీనికి భారీ ఎత్తున డి డి టి ప్రయోగం జరగాలి. కారణం - అది సాహిత్య విమర్శలో అనవసరమైన ఒక గందరగోళం ఉత్పన్నం చేస్తోంది. కవిత్వమంతా ఏ రకమైన కవిత్వం గానీ, ఏ దేశంలో పుట్టిన కవిత్వం గానీ, ఏ కాలంలో పుట్టిన కవిత్వం గానీ ఓ అనుభూతి నుంచే పుడుతుంది. (సహానుభూతి కూడా అనుభూతే.) కేవలం ఊహనుంచి పుట్టదు. ఇది సార్వదేశిక సార్వకాలీన సాహిత్య శాస్త్ర వివేచనా ఫలితమైన సిద్ధాంతం. (చూ - కవిసేన మేనిఫెస్టో.) మరొక చిత్రం! కవి ఉద్రేకంలో వ్యక్తిగతంగా స్తిమితం కోల్పోయి తత్కారణంగా కళాపరిధులు అతిక్రమించి కవితా స్పృహ చ్యుతమైన సందర్భాల్లో వచన ప్రాయమైన పంక్తులు ఎక్కువగా దొర్లిన 'గొల్లా'లో సామాజిక చైతన్యాన్ని తన అనుభూతిలో ఒదిగేటట్లు కవి చేయగలిగాడని మరొక అద్భుత విమర్శ. అంటే కళాపరిధుల్ని అతిక్రమించడం తెలుగు విమర్శకులకు నచ్చినంతగా, కళా పరిధులకు ఒదిగి ఉండడం నచ్చదనుకోవాలి. దీన్నే ఉద్దేశిస్తూ ఏంగెల్స్ కళలో ఒదిగి వస్తువు గోప్యంగా ఉండాలన్నాడు. "ద మోర్ ది ఒపీనియన్స్ ఆఫ్ ది ఆథర్ రిమెయిన్ హిడెన్, ద బెటర్ ఫర్ ద వర్క్ ఆఫ్ ఆర్ట్" (లెటర్ టు మార్గరెట్ హార్క్నెస్-మార్క్సిస్ట్స్ ఆన్ లిటరేచర్ ఏన్ ఎంథోలజీ) అంటే కవిత్వంలో చెప్పబడే వస్తువు వ్యంగ్యంగా అలంకారాల మాటున ప్రచ్ఛన్నంగా ఉండాలి. ఆకుల మాటున ఉండిపోయే కోకిలలా. అయితే, అలా ఉన్నదాన్ని మన తెలుగు విమర్శకుడు అనుభూతి కవిత్వం అంటాడు. పైగా, అనుభూతి కవిత్వం అంటే తెలుగు విమర్శలో ఒక బూతు! ఎక్కడ కవిత్వం కనబడితే అక్కడ అనుభూతి కవిత్వం అని దాన్ని తిడతాడు. ఎక్కడ కవిత్వం ఉండదో అక్కడ దాన్ని సామాజిక చైతన్య కవిత్వమనీ, విప్లవ కవిత్వమనీ ప్రశంసిస్తాడు! అంటే వాడు కవిత్వానికి మాత్రమే విరోధి; అవికత్వ ప్రేమి! తెలుగు విమర్శకుడు తన అశిక్షిత, అవగాహనరహిత ప్రతిపాదనల చేత తెలుగు సాహిత్యంలో విమర్శని శాస్త్రీయజ్ఞానంగా రూపొందనీయడం లేదు. ఈ కారణంగా సాహిత్యంలో ఒక అరాజకపరిస్థితి ఏర్పడింది. సృజనాత్మక రచనలు దోషభూయిష్ఠమైన మూల్యాంకన చేత నష్టానికి గురి అవుతున్నాయి.

# 54

కార్యకారణ జ్ఞానపు పరిహద్దుల అవతలకూడా కొన్ని శక్తులు ఉంటాయా అని మీరు సందేహిస్తారు. కార్యకారణ జ్ఞానం (అంటే రీజనింగ్) మనిషి పుట్టిన తర్వాత జీవన సంపర్కం చేత క్రమంగా పొందేజ్ఞానం. కానీ మనిషిలోనే జన్మ జాతంగా ఉన్న ఒక జాంతవ జ్ఞానం ఉంది. దాన్ని ఇన్‌స్టింక్ట్ అంటారు. ఇన్‌స్టింక్టుని 'వాసన' అనే మాటకు సమానంగా తీసుకోవచ్చు. అది కార్యకారణ జ్ఞానంలా గుణించుకుని పొందే జ్ఞానం కాక చప్పున స్ఫురించే జ్ఞానం. అది సద్యఃస్ఫూర్తి జ్ఞానం మరొకటి ఇంట్యూషన్. ఇది కూడా కార్యకారణజ్ఞానం అనే ప్రయత్న ప్రక్రియా రహితమైన స్ఫురణాత్మక జ్ఞానం. బహుశా ఇది వాసనాజ్ఞానానికీ, కార్యకారణ జ్ఞానానికీ మధ్యగతంగా ఉంటుంది. వస్తువులను చూచిన తర్వాతనే ఈ జ్ఞానం యొక్క శీఘ్ర స్ఫురణ కలుగుతుంది. కనుక ఇక్కడ మనముందు మూడు రకాల జ్ఞానాలు ఉన్నాయి ఒకటి కార్యకారణ జ్ఞానం (దీన్నే న్యాయదర్శనంలో అనుమాన జ్ఞానం అంటారు); రెండు వాసనా జ్ఞానం; మూడు స్ఫురణాత్మక జ్ఞానం. ఈ అర్థాలను ఈ శబ్దాలను సమీచీనంగా గుర్తించి వాటిని ఆధునిక విజ్ఞానం దృష్ట్యా నిర్దుష్టంగా నిర్ణయించే ప్రయత్నం తెలుగులో ఇంతవరకూ జరిగినట్లు లేదు ఇక్కడ ఒకటి చెప్పడానికి ప్రయత్నిస్తున్నాను.కార్యకారణ జ్ఞానం మన అనుభవంలో మనం ఇంద్రియాల సహాయంతో 'అనుమాన' ప్రక్రియ ద్వారా గడించే జ్ఞానం. దీన్నే సైన్సులో ఆధారంగా తీసుకుంటారు. ఇన్‌స్టింక్ట్‌నీ ఇంట్యూషన్‌ని తీసుకోరు. కార్యకారణ జ్ఞానమే రుజువును నిలిపేది. సైన్సుకు రుజువు కావాలి.

వాసన, స్ఫురణాత్మక జ్ఞానాలు కార్యకారణజ్ఞానపు హద్దుల అవతల ఉన్నట్లే అనుకోవాలి. వాటిమీద జరిపే శోధన మనల్ని మానవ మనస్సముద్ర లోతుల్లోకి తీసుకుపోతాయి. కార్యకారణజ్ఞానం అనేది మనిషి తన వ్యక్తిగత అనుభవంలో ఆర్జించుకునే ప్రజ్ఞ. వాసన, స్ఫురణాత్మకత జ్ఞానాలు అంటే ఇన్‌స్టింక్ట్, ఇంట్యూషన్‌లు అనుభవంలో గడించుకునేవి కావు; రక్తగతంగా సంక్రమించే ప్రజ్ఞలు. అవి నైసర్గిక ప్రజ్ఞలు. మానవజాతి సామూహిక చేతన రక్తపరంగా తరతరాలకు సంక్రమితం చేయబడి, ఆ చేతన స్మృతి రూపంలో మనిషిలో సుప్తావస్థలో ఉంటుంది. కొన్ని తరుణాల్లో కొన్ని శబ్ద

గంధ దృశ్యాదుల సంపర్కంచేత బహిర్గతంగా విస్ఫురితమై వ్యక్తమవుతుంది. ఈ జ్ఞానం సాధారణంగా వ్యక్తిగత కార్యకారణ జ్ఞానం కంటే నిర్దుష్టంగా ఉంటుంది.

నైసర్గికజ్ఞానాన్ని తృణీకరిస్తూ కార్యకారణ జ్ఞానాన్ని గొప్పదిగా భావించే వాళ్ళు సజీవ జిజ్ఞాసను గురించి, సజీవ అనుభూతిని గురించి తక్కువ అవగాహన ఉన్నవాళ్ళనుకోవాలి. మనకు తెలిసిన లోకాల హద్దుల కావల తెలీని లోకాలెన్నో ఉన్నాయి. వాటిని కార్యకారణజ్ఞాన సాధనంతో తెలుసుకోలేము. ఆ అదృశ్య లోకాల జ్ఞానం మానవాంతర్గత సుప్తచైతన్య జాగృతి చేతనే సాధ్యమవుతుందని అనుభవమున్నవాళ్ళు చెప్తారు. దేవీ భాగవతం ఇలా అంటుంది: ''సాత్త్వికం తత్ర వేదాంతం మీమాంసా రాజసం తథా! తామసం న్యాయశాస్త్రం చ హేతువాదాభి యంత్రితం'' (వేదాంతశాస్త్రము సాత్త్వికము, మీమాంసా శాస్త్రము రాజసికము, న్యాయశాస్త్రం హేతువాదబద్ధం గనుక తామసికము) అందే కార్యకారణ జ్ఞానసీమల అవతల ఏమీలేదు కారణం, దాన్ని రుజువు చేయడానికి తార్కికమైన ఆధారాలేమీ లేవు గనుక; ఈ కారణానికి ... భౌతికవాదాన్ని ప్రతిపాదిస్తుంది న్యాయశాస్త్రం కనుక అది అంధకార శాస్త్రం అంటుంది దేవీభాగవతం.

కార్యకారణ జ్ఞానాతీతమైన మానసిక ప్రజ్ఞల్ని ఉత్థాపన చేసి పర్యవసానంగా సాధించిన అలౌకిక జ్ఞానంతో ఎందరో మహాత్ములు లోకోపకారం చేశారని వింటున్నాం. పురాణ వాఙ్మయం, గీతికలు, బింబాలు లాంటి విస్తార కళాత్మక భాండాగారాన్ని సృష్టించి మా ఋషి సృజనాత్మక లోకాన్ని అత్యంత సుసంపన్నం చేశారు. అయితే ఆ ఇంద్రియాతీత అన్వేషణాశీలమైన బహావర్త, కామరూపి, మాయాశ్చల సమ్మోహక ప్రాచీన జగత్తు కాలక్రమంలో శిథిలమైపోయింది. ఆ శిథిలాల్లో నుంచి ఆధునిక మానవుడు మళ్ళీ కార్యకారణ జ్ఞానము, హేతువాద పూర్వక పరిశోధన పునరుద్ధరించాడు. మానవుడు కాలచక్రబద్ధుడు. ఒక యుగాన్ని సృష్టిస్తాడు. దాన్ని సృష్టించడంలో సంపూర్ణ అనురక్తితో నిమగ్నుడవుతాడు. అలిసిపోతాడు. సృజనక్రియా తృప్తి పొందకముందే అతడూ అతడి యుగమూ పోతారు. తర్వాత తరం వస్తుంది. పాత సృష్టి దానికి పసందు కాదు. తన యుగాన్ని తానే సృష్టించుకుంటుంది. ఇలా ఈ సృష్టి పరిణామం ఈ చరిత్ర అంతా శాశ్వతమండలాకార పరిణామం.

# 55

## అస్తిత్వ వాదం

ప్రపంచంలో ఉన్న తత్త్వశాస్త్ర శాఖలన్నిటినీ విశాల సమీక్షణచేస్తే అవన్నీ ఏదో ఒక దశలో ఏదో ఒక రూపంలో మానవుడు తన జ్ఞానార్జనకు ఆధారపడే ఇంద్రియాల్నీ మనస్సునే సందేహించినట్లు కనిపిస్తుంది. అవి జ్ఞానార్జనకు నిర్దుష్టమైన సాధనాలు కావనే శంక లేస్తుంది. ఈ శాస్త్రాలు ఆ విధంగా సందేహించి, వాటితో సాధించిన జ్ఞానాన్ని కూడా, తత్ఫలితంగా సందేహించాయి. జ్ఞాన సాధనాలుగా ఇంద్రియాల్నీ, మనస్సునీ ఇలా సందేహించడం పర్యవసానంగా అట్టి సాధనాలచేత సాధింపబడిన జ్ఞానం కూడా దోషభూయిష్ఠ కావచ్చు అనడం కొంతవరకు సమంజసంగానే ఉన్నట్లు తోస్తుంది. ఈ శాస్త్రాలు అంతటితో ఆగి ఉంటే బాగుండేది. కానీ ఇంకా ముందుకుపోయి ఆ సందేహంతో తమతమ సిద్ధాంత సౌధాలు కూడా నిర్మించాయి.

అస్తిత్వవాదం ఈ శాస్త్రాల మొదటి మెట్టునే ప్రశ్నిస్తుంది; అంటే జ్ఞానార్జనకు ఆధారమైన ఇంద్రియాల అసమర్థత మనస్సు అసమర్థత అనే విషయాన్ని, అలాగే ఈ జ్ఞాన సాధనాల ద్వారా ఆర్జితమైన జ్ఞానం కూడా దోషయుక్తమే అనే విషయాన్ని కూడా ప్రశ్నిస్తుంది. ఇంద్రియాలిచ్చే సాక్ష్యాన్ని శంకించవద్దంటుంది అస్తిత్వవాదం (అంటే ఎగ్జిస్టెన్షియలిజం) ఉన్నది ఉన్నట్లు మనం జీవితాన్ని అంటే జీవితపు ఉనికిని అంగీకరించాలి. జీవితం జీవింపబడాలి. జీవితం అస్తిత్వం; జీవితం, దాని వెనుక అదృశ్యంగా ఉన్న ఏవో తాత్త్విక సారాంశాలు కాదు.

నీవు బహిః ప్రపంచాన్ని గురించి దాన్ని తెలుసుకుందామని చింతన చేసేటప్పుడు నిన్ను వస్తువునుంచి భిన్నంగా భావించి ఆలోచించడం సవ్యమైన మార్గంకాదు. (వస్తువు అంటే నీ యెదట ఉన్న బహిః ప్రపంచం.) కారణం ఏమిటంటే, బహిః ప్రపంచమనే సృష్టిలో నీవు కూడా ఒక విభిన్న భాగమే! నీవూ సృష్టి ఒకే సమాన పదార్థంలోనుంచి పుట్టిన రెండు వస్తువులు. కనుక నీ పరిశోధనలో నీ కన్ను ఇచ్చే సాక్ష్యాన్ని నీవు తిరస్కరించడం హేతుయుక్తం కాదు. తదితర ఇంద్రియాల్ని నీ విశ్వాసానికి యోగ్యం కావనుకోవడం కూడా

అలాగే సహేతుకం కాదు. కారణం, ఆ ఇంద్రియాలన్నీ జీవసృష్టిలో జీవ ద్వారాలే; సృష్టి అంతా ఏ సూత్రాలననుసరించి ఉత్పన్నమయిందో ఆ సూత్రాల ననుసరించే ఈ ఇంద్రియాలు కూడా ఉత్పన్నమయ్యాయి అందుచేత గుర్తించ వలసిన ముఖ్య విషయం ఏమిటంటే - సత్యం అని మనం అన్వేషించేది మన జీవన అస్తిత్వంలో ఉన్న ఒక భాగమే; మనం తర్కంతో సాధించవలసిన ఒక బహిర్గత తత్త్వం కాదు.

ఈ దృష్టి కోణంలో వస్తువుని చూచినపుడు, నీకూ వస్తువుకూ సమాన సృష్టి సూత్రాలే వర్తిస్తున్నాయి గనుక నీకూ వస్తువుకూ మధ్య ఉన్న సంబం ధాల్లో అన్యోన్య అవగాహనకు చెందిన ఒక సంకేతానికి ఉభయుల మధ్య ఉండి తీరాలి; వాటి అస్తిత్వ పరిధుల్లో అవి రెండూ పరస్పరం అర్థం చేసుకుంటాయని అనుకోవడమే సశాస్త్రీయం మానవ విజ్ఞానం ఇలాంటి సందర్భంలో సాపేక్షక సత్యంగా భావించడానికి సాధ్యమైనప్పటికీ, అలాంటి సాపేక్షకత నీవూ వస్తువూ అనే రెంటినీ దాటి ఒక మూడవది ఉన్నపుడే అలాంటి మూడవది నీవూ వస్తువూ అనే రెంటిలోకి అంతర్భవిస్తుంది గనుక, మూడవది ఈ సందర్భంలో కేవలం ఊహామాత్ర వస్తువే అవుతుంది. ఎందుకంటే, మానవీయ అస్తిత్వంలో సృష్టి, నీవూ సృష్టి అని రెండుగానే విభాజితం అవుతుంది; ప్రతి మూడోవాడూ లేక మూడో వస్తువూ వస్తువు అనే రెండోవానిలో అంతర్భవిస్తుంది. అందుచేత మనం ఆర్జించే జ్ఞానాన్ని మనం నిరపేక్షక జ్ఞానమనే అనుకోవాలి; నీవూ వస్తువూ అనే రెంటికీ అతీతంగా మూడవది ఏదీ లేదనుకోవాలి, ఉన్నా అది సృష్టికి అవతల ఉండాలి. అలా సృష్టికి అవతల ఉన్న ఊహా వస్తువుకు మన జ్ఞానాన్ని [illegible]ంచే సామర్థ్యం ఉండదు. ఒకవేళ మనం ఈ ఊహా వస్తువును పెట్టుకుని దాని కోణం నుంచి వస్తు శోధనచేసి ఒక జ్ఞానకోశాన్ని నిర్మించినా ఆ జ్ఞానాన్ని మనం రుజువు చేసే వీలుండదు కనుక ఇలాంటి తర్కోపార్జిత కల్పనామయ జ్ఞానం మనకు నిరర్థకవ్యాయామం ఫలితంగా తేలేదేమిటంటే జీవితం నుంచి విడదీయ బడిన తత్త్వశాస్త్రం కంటే మనకు నేరుగా జీవిత అస్తిత్వాన్ని ఒప్పుకునే తత్త్వ శాస్త్రమే అర్థవంతము శ్రేయోదాయకం.

ఆధునిక మానవుని హేతువాదపు దుర్బలత్వాన్ని అర్థం చేసుకోవాలి. అప్పుడే అస్తిత్వ సమస్యలకు పరిష్కారమేదో అర్థమవుతుంది. అన్ని విధాల

తత్త్వశాస్త్రాల్లోనూ ఆ శాస్త్రం జీవితాన్ని విశ్లేషించి, వ్యాఖ్యానించి జీవితాన్ని గురించి తనదైన ఒక జీవిత చిత్రాన్ని ఇస్తుంది. అంటే, ఎన్ని శాస్త్రాలో అన్ని చిత్రాలు! ఒక తత్త్వశాస్త్రం ఇచ్చిన జీవన చిత్రాన్ని మరో తత్త్వశాస్త్రం అంగీకరించదు. అత్యాధునికంగా భూగోళం మీద అడుగు పెట్టిన మనిషి ఎప్పటి నుంచో పేరుగి ఉన్న ఈ తార్కిక జ్ఞానపర్వతాన్ని ఎదుర్కోవాలి ఈ తర్క ప్రేరిత తత్త్వశాస్త్రాలన్నీ కలిసీ మనిషిని చివరకు జీవితం అర్థశూన్యమనే (absurd) ఒక విస్మయావహ సిద్ధాంతంవైపు తీసుకుపోతాయి. అంతతః మానవ జీవితం ఎలా మనకు అనిపిస్తోందో, కనిపిస్తోందో. అదేగానీ, ఈ శాస్త్రాల హేతువాదం తన చిత్రవిచిత్ర తర్కాపేక్షలతో తీసుకొచ్చి మన ముందు నిలబెట్టినది కాదు అనే వాస్తవానికి మనం మన మనస్సును అభిముఖం చేసుకోవాలి. చింతన జీవితాన్ని అనుసరించాలిగానీ, జీవితం చింతనని అనుసరించగూడదు అని మానవుడు ఒక నిశ్చితాభిప్రాయానికి రావాలి.

అస్తిత్వవాదం జిజ్ఞాసాక్షేత్రానికి కొత్తదికాదు. దాన్ని ప్రపంచంలో ఉన్న అన్ని తర్కచోదిత తత్త్వశాస్త్రాల్లాంటి ఒక శాస్త్రం అనడానికి వీల్లేదు. అవాస్తవిక పద్ధతులచేత, ఓపికను పరీక్షించే వాదోపవాదాల చేత విసుగెత్తిపోయి హేతువాద విధాన నియంతృత్వం మీద చరిత్రలో మనిషి యుగయుగానా చేసే విప్లవానికి సంకేతమే అస్తిత్వవాదం.

ఆధునిక యుగంలో, అన్నిటినీ రుజువు చేస్తానని తొడకొట్టి సవాల్ చేసే హేతువాద విధాన భంగిమ, మనిషిని కుపితుణ్ని చేసింది. ఎందుచేతనంటే, అది కొత్త సిద్ధాంతం చేతుల్లో నిర్దాక్షిణ్యంగా వధింపబడుతూ ఉండడం మనిషి ప్రతియుగానా చూస్తూనే ఉన్నాడు. ఇలాంటి తిరుగుబాట్లు లోకాన కొత్త కాదు; బౌద్ధము, జైనము, లోకాయతము- ఇలా ఎన్నో జీవన అస్తిత్వాన్ని బలాత్కరించాయి. కానీ మళ్ళీ జీవితం ఎప్పుడూ తత్త్వశాస్త్రం నుంచి జీవితం వైపు, అదృశ్య సత్యం నుంచి అస్తిత్వం వైపు, వివాదం నుంచి కార్యం వైపు వెళ్ళుతూ వచ్చింది. జ్ఞానము, అనుభవము అనే యుగళం ఒకదాని వెంట ఒకటి తరుము కుంటూ పోతూ చేసే శాశ్వత చక్రాకార ప్రయాణంలో మిళితమైపోతూ వచ్చింది.

# 56

మనం వీడ్కోలు చెప్పుకుని చాలా రోజులైనప్పటికీ, స్మృతులింకా నేత్రాల్లో సాలెగూళ్ళలా చలిస్తున్నాయి. మీ నగరంలో ఉన్న ఆ స్వల్ప కాల వ్యవధిలో మిమ్మల్ని గురించి నేను చూచిన స్వప్నాలు పూర్తిగా తృప్తి పొందలేదు. దీర్ఘ ఉదయాలు దీర్ఘ సాయంకాలాలు మీతో సన్నిహితంగా కూర్చుని హృదయాల్ని పుస్తకాల్లా విప్పి అన్యోన్య అవగాహనని ఆనందోత్సవం చేసుకుందామనుకున్నాను. మన దేశం మన ప్రజలు, మన రచయితలు, రాజకీయ దారుణాలు. ఇలా ఎన్నో చర్చించుకుందామనుకున్నాను

చివరకు ఢిల్లీ వెళ్ళడానికి విమానం ఎక్కేటప్పుడు ఎంత నిరుత్సాహం నన్ను ఆవహించిందో చెప్పలేను స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో ప్రజల్లో ఉన్న చైతన్య తుఫాను మళ్ళీ రావాలనీ, కానీ ఈసారి ఆర్థిక స్వాతంత్ర్య పోరాటం కోసం ప్రజల్ని సన్నద్ధుల్ని చేయ్యాలనీ మనం నడుపుకుంటున్న దీర్ఘవ్యవహారం, నా దూరదూర ప్రయాణాలు అన్నీ పేకమేడల్లా కూలిపోతున్నట్లు అనిపిస్తుంటే విమానం ఎక్కడ కూలిపోతుందో అని భయమేసేది. మీకు నా వ్యధ అర్థం అవుతూనే ఉందనుకుంటా ఇంకెవర్ని కలవాలి? ఎవరితో చేతులు కలపాలి? ఏం చెయ్యాలి? ఈ ప్రశ్నలు నా మనస్సుని జ్వాలలై కాలుస్తున్నాయి.

# 57

## కాల ప్రభావం

కవిత్వానికి భాష స్థూల శరీరం, అలంకారబింబ ప్రతీకలు దాని సూక్ష్మ శరీరం ధ్వని లేక దాని ఫలితమైన చమత్కారము కవిత్వ ఆత్మ. అవగాహన కోసం ఇలాంటి ఒక విశ్లేషణ మనం చేసి ఉపయోగించవచ్చును. ఆధునిక కవిత స్థూల శరీరంలో వర్తమాన భాష ఉంటుంది. 'అవిభాజ్యం' లేకపోతే ఆనాటి తరానికి అది సన్నిహితం కాదు. పై పొరలైన స్థూల సూక్ష్మ శరీరాల చేతనే కవిత తన సమకాలీన తరానికి సన్నిహితం అవుతుంది. తన తరానికి ఒక కవిత సన్నిహితం కావడం జలదోహద కారణం. ఎందుకంటే, దాని మూలభూతమైన గుణం కాంతా సమ్మితత్వం అంటే ఆకర్షణచేత శ్రోతని ఒప్పించడం. కనుకనే ఒక తరం సమకాలీన కవితచేత పొందే అంతటి లాభం లేక తృప్తి ప్రాచీన కవిత చేత పొందలేదు ఈనాటి విజ్ఞానం ఈనాటి టెక్నాలజీ ఈనాటి ఫిలాసఫీ, ఈనాటి జాగ్రఫీ, ఈనాటి చరిత్రలాంటి వర్తమాన జ్ఞానశాఖ లన్నీ కలిస్తేనే

కవికి ఈనాటి ఆధునికతా స్పృహ లభిస్తుంది. పూర్వంకంటే ఈనాటి మనిషిమీద ప్రజ్ఞాభారం చాలా ఎక్కువ ఆధునికత అనేమాట వాస్తవంగా కవి పెరుగుదల సూచిస్తుంది. ప్రాచీనతలోవున్న నేటి కవి వర్తమాన లోకాన్ని ఆకలించుకో లేదన్నమాట. కనుక ఆ భాగం అతనిలోకి రాలేదు. కనుక అతడు జ్ఞానాత్మకం గానూ, కవితకు అనివార్య ముడి పదార్థమైన ఆధునికతా స్పృహాపరంగానూ వెనుకబడి ఉన్నాడు. అతడు తాను జీవిస్తున్న లోకానికి చెప్పడానికి సమర్థత గడించుకోలేదు.

ఆధునిక మానవుడి సమస్యలు ప్రాచీన మానవుడి సమస్యలు కావు. ఇవి వాళ్ళ చైతన్యాన్నిబట్టి మారుతాయి. ప్రాచీన మానవుడికి వ్యక్తిగత హక్కుల రూపమైన స్పృహ లేదు. వాడు రాజును ఒప్పుకున్నాడు. గ్రామ పెద్దకు బానిసత్వం ఒప్పుకున్నాడు. స్త్రీ కూడా భర్తతో సమానత కోరలేదు. ఆస్తి సమాజపరం కావాలన్న భావమే లేదు. కనుక ప్రాచీన మానవచైతన్యం వర్తమాన చైతన్యంతో పోలిస్తే చాలా సంకుచితం. అందుచేత వాళ్ళ సమస్యలు కూడా చాలా తక్కువే. చైతన్యం పెరిగేకొద్దీ హక్కుల స్పృహ పెరుగుతుంది. హక్కుల స్పృహతోపాటు సామాజిక సమస్యలు పెరుగుతాయి.

## 58

మిత్రమా! సాహిత్యం ఇవాళ నాకు చాలా సంకుచిత కార్యక్షేత్రం అనిపిస్తోంది క్రియాత్మకత కలపాలి నా సానుభూతులు నా సంవేదనలు చాలా భాగం గుండెని ఖాళీగానే ఉంచుతున్నాయి. ఆత్మవంచన చేసుకుంటున్నానేమో అనే భయం కలుగుతోంది నేను అంధకారంలో తడుముకుంటున్నాను

మీ పుస్తకం చదవడం ప్రారంభించాను. మీ పాండిత్య భరితమైన విశ్లేషణతో, తొలి వాక్యాల్లోనే కాలపు రహస్యమయతలోకి దూసుకుపోయే మీ తీక్షణ మేధాకిరణం కనిపించింది సామాన్య చక్షువు దాని దర్శనం కోల్పోతుంది.

దీన్ని నేను ఎలా చూస్తానో ఒక్క మాట చెప్పాలి. కాలాతీత మానవీయ దృష్టిని ప్రతిఫలించడంలో విఫలమై, తన శాశ్వత మూల్యం కోల్పోవడం కవిత కాదు. అలా కనిపించడం ఉపరితల దృశ్యం. కానీ, సచేతన చక్షువుకు ఈ

దృశ్యం పరిస్థితుల బలిపశువయిన మానవ మనస్సు మీద కాలం చేస్తున్న లీలా విలాసంగా కనిపిస్తుంది. గతి తార్కిక భౌతిక వాదం మానవ మనస్సును కేవలం పరిసరాల శిశువుగా చిత్రిస్తున్నప్పటికీ, మానవ మనస్సు అంత దయనీయ స్థితిలో లేదనే నాకున్న కారణాలు చెప్తున్నాయి మనిషి భూగోళం మీద అడుగు పెట్టిన నాటి నుంచీ సృష్టి పరిణామంలో మనిషి పరిసరాల్ని కానింది మార్చి మార్చసంత వరకూ తన సృష్టిగా చేసుకున్నాడు. మనిషి సృష్టికర్త అనేది ఒక మహాసత్యం. మనిషి పరిసరాలతో సంధి చేసుకోవడం కూడా ఉంది అంతేగానీ, మనిషి ఆయుధ సన్యాసం చేసి పరిసరాల జైల్లో ఖైదీగా పడున్న పరాజితుడు కాడు.

ఇంతవరకు ఒక శ్రేయస్కర లక్ష్యంకోసం క్రమబద్ధం చేసి వ్యవస్థీకరింప బడని మానవ సమాజంలో భారీ ఎత్తున జరిగే మానవీయ క్రియాకలాపాల రాశీభూత ప్రభావానికి అభివ్యక్తి ఏదయినా ఉంటే దాని పేరే కాలం. ఈ అర్థంలో కాలం మానవుడిమీద అధిపత్యం వహిస్తుంది. చరిత్రలో మానవ పాత్ర ఉన్నప్పటికీ, చరిత్ర కాలశాసనాల్ని శిరసావహిస్తూ దొర్లుకుంటూ పోతుంది బలహీన మానవ పాత్రని నలగ దొక్కుతూ దొర్లిపోతుంది. అందుచేత చరిత్రలో మానవ చింతన కాల ప్రభావం చేత కుంఠితమవుతూనే వచ్చింది. మనిషి తన సంకల్ప బలంతో సమాజాన్ని పునర్నిర్మాణం చేసేవరకూ ఈ కాల ప్రభావం ఇలాగే ఉంటుంది. ఈ విశ్లేషణలో కాలం అంటే అవ్యవస్థిత మానవ సమాజంలో వ్యక్తుల క్రియాకలాపాల అరాజకత్వపు ప్రభావ స్వరూపమే. ఆ ప్రవాహం కింద పడి వ్యక్తి నలిగి చస్తాడు. పడినుండి పోరు చేసుకోకపోతే దాన్ని ఎదుర్కో లేదు అదే సమస్య.

ఈ అసహాయ సామాజిక పరిస్థితిలో నుంచే ఛాన్స్, మనిషి చేతిలో లేని ఆకస్మిక సంఘటన (ఏక్సిడెంట్), అదృష్టం, విధి ఇత్యాది పరస్పర బంధువులైన శక్తులు ఉత్పన్నమవుతాయి ఇవన్నీ అవ్యవస్థిత మానవ సమాజ ఉత్పన్న రాక్షసీ శక్తుల్ని వ్యక్తి మనిషి ఎదుర్కోలేకపోతున్న చిహ్నాలే. సమాజ న్యాయ సంగతమైన పునర్నిర్మాణం పొందితే విధి, అదృష్టం ఇత్యాది మానవ ధర్మ శత్రువులు అంతర్ధానమైపోతాయి. కనుక ఆధునిక యుగ సమస్యలు మానవుడు తన సమాజాన్ని పునర్నించుకోడానికి సంబంధించిన సమస్యలే.

ప్రాచీన ప్రపంచంలో భారతదేశంలో సమాజ వ్యవస్థీకరణ ప్రయత్నం జరిగింది. కానీ అది త్వరలో విఫలమయింది. దానిలో గుణశక్తి లేక కాదు. కానీ

గుణదోషాలు మళ్ళీ తాంత్రికపు పరిణామ గ్రస్త మూలాలే! మానవుడి అంతరాత్మ గొంతు వికాసమే ఈ భూలోకం మీద శాశ్వత ఆరోహణ రేఖలా జరగలేదు అదొక నిమ్నోన్నత ప్రమాణమే అది నిరంతర తమఃకాంతుల పోరాటము, జయాపజయావళి మనిషి సాధించిన చెడ్డగానీ, మంచిగానీ ఎంతోకాలం ఉండదు; అదిగానీ ఇదిగానీ కొంతకాలం ఉండి తర్వాత పోవలసిందే. మంచిని మనిషి మాటిమాటికీ తరతరాన యుద్ధంచేసి సాధించవలసిన విజయమని మనం అర్థం చేసుకుంటే, మనం ఈనాడు తెలుగుదేశంలో చూస్తున్న ఇంత కుహనా ఆక్రోశానికి గురికామేమో అనిపిస్తుంది.

మనిషి సమాజాన్ని న్యాయసంగత నిర్మాణంగా పునర్వ్యవస్థీకరించనంత వరకు కాలానికి బలివశుడే! అలాంటి సామాజిక అవ్యవస్థిత తత్త్వాన్ని గురించే వాల్మీకి "కాలోహి దురతిక్రమః" అనీ, "ప్రాప్తకాల ముపాస్యతాం" అనీ అన్నాడు.

# 59

మనిషి వృక్షాల శీతల సంబంధాలు తన జీవితంలో ఒక్క రోజులో పొందలేడు. పెద్దవై కొడుకుల్లా ఛాయ ఇవ్వాలంటే కొన్నేళ్ళు పడుతుంది, కొంత వయస్సు మనది ఖర్చవుతుంది. వాటిని పెంచుకోడానికి ఇల్లే లేని దురదృష్టవంతుడికి ఆ అదృష్టం ఎక్కడిది?

# 60

కాలమే నాగరకతా దుస్తుల్ని కత్తిరిస్తుంది ఇళ్ళూ, ఊళ్ళూ రోడ్లే జాట్లూ పద్యాలూ పొలాలూ అన్నీ దాని మూలంలోకే ఒదగడానికి తమ అవయవాల్ని ఖండించుకుంటాయి. కాలాన్ని ధిక్కరించలేవు ఎప్పుడో కూలిపోయిన ఎవడో రాజు సామ్రాజ్యం కోసం కంటే ఇప్పుడు రాలిన ఆకుకోసం ఏడుస్తుంది నా ఆత్మ. జీవన బాధల సమర్దం తగ్గి ఎప్పుడు శాంతి లభిస్తుందా అని ఆక్రోశించాను మోకాళ్ళమీద నిల్చుని ఆకాశంవైపు చేతులు జోడించి ఇప్పుడు జీవితంలో అన్ని సంఘటనల చప్పుళ్ళూ సద్దుమణిగి నిశ్శబ్దం వాలుతున్న సమయంలో ఏవో అలోక రథచక్రాల చప్పుడు వినిపిస్తోంది. పురోహితుల్లా బుల్బుళ్ళు వచ్చి ఋతువును చెప్పి పోతున్నాయి కానీ అంతర్గత ఋతువు ఆగిపోయినట్లనిపిస్తోంది!

(సమాప్తం)

# శేషేంద్ర శరసంధానం

శర్మగారితో తెలుగు కవిత కొత్త లోకాలు చూసింది. ఆయన సారించిన బింబ దృష్టికి కొత్త పాలపుంత కనబడింది. శేషేంద్రశర్మగారిది మామూలు కలం కాదు. అదొక చిత్రమైన కత్తి. ఆయన దానిని పద్యంలో పుటం పెట్టి, వచనంలో పదును చేసి, వ్యంగ్య ద్రావకంలో శుద్ధిచేసి, స్వప్నలోకాల పగడాలు అద్ది కవితా సరస్వతికి కానుకగా ఇచ్చారు. ఉషస్సు కురిసే రక్తిమలో స్నానం చేసిన మానవుని నేపథ్యం చిత్రించినా, కటకటాల కావల దళితజన ఘోషను కేవలం ఆకాశం కనబడని మబ్బుల ద్రవ్యరాశి క్రింద నిలబడి ఆశాపతాకాలను ఎగురవేసినా, ఆ చిత్రణలో లోహపు చెక్కిళ్ళ నునుపు, పువ్వుల మెత్తదనాన్ని దాచే చురకత్తైన రేఖ కనబడతాయి

రాండ్ పుస్తకం చదివినా, బట్లర్ నవల చదివినా, రామాయణం చదివినా డైరీలో వివరణలు రాసుకుంటూ పోవడమే ఆయన పని. సంస్కృత, హిందీ, తెలుగు, ఆంగ్ల గ్రంథాలు అధ్యయనం చేయడమే ఆయన వృత్తి. వేదాంత పంచదశి, అణుభౌతిక శాస్త్రం రెండూ ఆయనను పట్టి చదవించేవే. వేదాంత గ్రంథమనీ, విజ్ఞాన గ్రంథమనీ ఆయనకు భేదాలు లేవు అంటారు శేషేంద్రశర్మగారు అందుకే హేతుబద్ధ సమాజంలో సుదీర్ఘ కవితా సేతువులు నిర్మించగలిగారు. నిష్కర్షగా అభిప్రాయాలు వెల్లడించడానికీని తనకున్నంత విపుల కవితా చైతన్యం మరొకరికి లేదన్న ఆత్మవిశ్వాసంతో నవ్వడానికి ఈ నిరంతర సాహిత్య యాత్రే కారణం.

చిలికిన తమ్ముల చిత్రగాథగా ఋతుఘోషలాంటి కావ్యానికి, శేషజ్యోత్స్న, మండే సూర్యుడు గొరిల్లా, నీరై పారిపోయింది లాంటి కవితా సంపుటాలకి ఈ చదువుకి తగ్గ అనుభూతి సాంద్రతే ఆధారశిల.

"నా దేశం నా ప్రజలు" లాంటి ఆధునిక మహాకావ్యం దేశంలోనే మరొకరు రాయలేదని చెప్పుకొన్నారు. "మబ్బుల్లో దర్బారు' లాంటి వ్యంగ్య నాటిక, 'విహ్వల' వంటి మంచి కథలు రచించారు.

"భూధవుడైనా సరియే
వేధించును పగటివేళ విడువక ఈగల్
మాధవుడైనా సరియే
బాధించును రాత్రివేళ భామలు దోమల్"

అని చాటువులు చెప్పారు.

మూడు దశాబ్దాలుగా రచనలు చేస్తున్న శేషేంద్ర శర్మగారు ఇరవై సంవత్సరాలుగా ఎవరూ త్రోసిరాజనలేని కవితాసృష్టితో బాటు సమకాలీన కవులపైన విమర్శకులపైన బలమైన ఆరోపణలు చేస్తున్నారు. ఈ మధ్య విజయవాడలో కలసినప్పుడు, ఈ పత్రిక కోసం ప్రత్యేకంగా సమాధానాలిచ్చారు.

* * *

ప్ర : వందలాది సంవత్సరాలుగా కవితాశిల్ప చాతుర్యాన్ని అనేక రతాలుగా చూపిన అనేక భవనాలున్నాయి మీరు భవంతి కట్టారు. మీ భవనం ఎన్నాళ్ళు నిలుస్తుందని అంచనా?

జ : ఎవరూ అంచనా వేయలేరు. మీరు వేయలేరు, నేనూ వేయలేను.

ప్ర : మీరు నిర్మిస్తున్న నిర్మాణం చాలకాలం వుండడానికి వస్తువునిబట్టి శిల్పాన్నిబట్టి అంతర్గతమైన శక్తితో కూడివున్నదని మీ రనుకోవచ్చు గదా?

జ : నే ననుకొంటున్నానని నామీద నీ బాధ్యతా పెట్టకండి ఒక కావ్యం ఎంతకాలం నిలబడుతుందని చెప్పడానికి మనం కేవలం కవిత్వ శిల్పంలో వున్న శక్తినిబట్టి అందాజాగా చెప్తాం. అంతే సాధారణ సాహిత్య సూత్రాలను దృష్టిలో పెట్టుకుని, 'ఇందులో చాలమంచి కవిత్వం వుంది. కవిత్వానికి ఆకర్షణ శక్తి ఉంటుంది. కనుక ఇది చాలకాలం ప్రజలను ఆకర్షించగలుగుతుంది. తద్వారా అంత కాలం నిలుస్తుం'దని ఊహిస్తాం కాని, ఈ ఆకర్షణ శక్తి ఏ ప్రజలమీద పని చేయాలో ఆ ప్రజల మనస్తత్వాలు వాళ్ళు ప్రయాణంచేసే సామాజిక ఆర్థిక పరిస్థితులూ ఇవన్నీ కూడా వాళ్ళ దృక్పథాన్ని నిర్ణయిస్తాయి. చాల గొప్ప కావ్యాలు, అంటే ఎంతో కాలం నిలువగలవు అనుకున్న కావ్యాలు కూడా చాలా స్వల్పకాలంలో అంతర్ధానమయిపోయినవి వున్నాయి. అయితే, మళ్ళీ కొన్నేళ్ళ తర్వాత అవి ప్రత్యక్షమవటం జరిగింది. ఎట్లాగంటే, శ్రీరంగం నారాయణబాబు కవిత్వం వంటిది బహుశా తెలుగులో ఎవరూ రాయలేదు మొట్టమొదట ఫ్రెంచి

సాహిత్య ప్రభావం తెలుగు మీదికి రావడం నారాయణబాబు గారి ద్వారానే. మరి అలాంటి మహాకవి పుస్తకం '72లో అచ్చయింది. ఆయన రాసినది 1955 లో! ఆయన కాలిగోటికి కూడా పోలడానికి వీలుకాని కవులు లక్షోపలక్షల పుస్తకాలు అచ్చువేసుకున్నారు అంటే ఒక్కొక్కసారి సమాజం ఇలాంటి అవకాశాన్ని కల్పిస్తుంది కొందరికి- రాజకీయ, సామాజిక, ఆర్థిక కారణాలచేత. అప్పుడు కవికాదు ఎవరైనా సరే నిస్సహాయుడయిపోతాడు నిజంగా పాపం, నారాయణ బాబుగారి పరిస్థితి సరిగా అలాగే జరిగింది.

## ప్రతీకలు, రూపాలు

ప్ర : కవి సృష్టించిన కొన్ని ప్రతీకలు, తద్వారా నిలబడిన కొన్ని అమూర్త రూపాలు కవిత్వం చదివే అలవాటున్న పాఠకులకు అవగతమవుతున్నాయా?

జ : ఈ ప్రతీకలనేవి చిత్రమైన వ్యవహారం. దీనిని గురించి ఆధునిక తెలుగు సాహిత్యం 30లో లేదా 20లో ప్రవేశించినదనుకొంటే అప్పటినుండి ఇప్పటివరకు - నేను పత్రికల్లో అడపాదడపా అక - డక్కడ సాహిత్యం గురించి రాస్తూ కనబడుతున్న పుస్తకాలను, వీటినిబట్టి నా అభిప్రాయాన్ని ఏర్పరచుకొని మాట్లాడుతున్నాను. ప్రతీకల్ని గురించి వుండవలసినంత విజ్ఞానం మన సాహిత్య పరులలో లేదని నాకు అనిపిస్తోంది.

ప్రశ్న : ఈ సింబలిజం మనదగ్గర మొగ్గయినా తొడిగినదా?

జ : మొగ్గ తొడిగినది ఒక్క శ్రీరంగం నారాయణ బాబుగారిలోనే. ప్రతీకలతో కవిత్వం రాసిన మొదటి కవీ చివరి కవీ తెలుగు సాహిత్యంలో ఆయనే.

ప్రశ్న : చివరికవి అని అంటున్నారు - అపురూపమయ జగత్తునో విశ్లేషణనో ప్రతీకలద్వారా శక్తిమంతం చేసిన కవులు ఆయన తరువాత లేనేలేరా?

జ : లేరని నా అభిప్రాయం ఉన్నామనుకోవడం ప్రతీకలగురించి సమగ్ర అవగాహన వుందని ఒక భ్రమను పొందడం.

## కవిత్వానికి ఇన్ని పేర్లు ఎందుకు?

ప్ర : ఆధునిక కవులు కొందరు తమ కవిత్వంలో క్లిష్టతను సంకీర్ణమైన వ్యక్తిగత భావాలను వ్యక్తంచేస్తూ మాత్రమే పోతున్నారని వాదుకు గురి అవుతున్నారు?

జ : ఇది నన్ను నేను డిఫెండ్ చేసుకోవడం అవుతుంది. నేను ఇంత వరకూ నా కవిత్వాన్ని డిఫెండు చేసుకోలేదు. ఎందుచేతనంటే - కవిత్వం ఎప్పుడూ చెప్పబడుతుందంతే నా కవిత్వంలో ఏదో లోపం ఉందని మీరంటున్నారు. అది తప్పు అది లోపం కాదు. అది సుగుణం. ఇలాగ అది సుగుణం అని చెప్పడమనే ఈ విధమైన వ్యావహారికంలోకి దిగడానికి నేనెప్పుడూ ఇష్టపడను.

ప్ర : మీరని కాదు, చాలా శతాబ్దాలుగా ఇతర కవులలో కూడా?

జ : కవిత్వంలో కవిత్వాభివ్యక్తే వుంటుంది కాని, అభిప్రాయాలంటూ పొడిపొడి మాటలుండే అవకాశం వుండదు ఎక్కడ పొడిపొడి మాటలుంటాయో అది కవిత్వంకాదు. కవిత్వమంటే బింబాత్మకభాష, ప్రతీకాత్మక భావప్రతీకలు, బింబాలు, అలంకారాలు- ఇవి వున్నంతవరకే అది కవిత్వం. వ్యక్తిగతమైన అభిప్రాయాలు కవిత్వ అభివ్యక్తి పొందటమనేది ఆక్షేపణకరమైన విషయం మాత్రం కాదు ఎప్పుడూ కవిత్వం వ్యక్తిగతమైన ప్రక్రియ మాత్రమే. కనుక మీ కవిత్వంలో మీరు వ్యక్తిగతమైన అభిప్రాయాలు చెప్పారని అనుకుంటారు అన్న మాట సాహిత్యేతరమైన మాట.

## మనిషికి డిఫెన్స్

ప్ర : మరి మనిషికి నా కవిత్వం డిఫెన్స్ అన్నారు మీరు?

జ : నేను వ్యక్తిగతంగా జీవితంలో పొందిన అనుభవాలు, బాధలు, కష్టాలు, సుఖాలు- ఇలా సమ్మిశ్రితమైన అనుభూతులు. నేననుభవించిన ఈ మిశ్రమాన్ని నాతోటి మానవులందరూ అనుభవిస్తున్నవే. ఇది కొత్తది కాదు. విశిష్టమైనది కాదు. కాని, నేను అనుభవించే పద్ధతి కించిత్ భిన్నంగా ఉండవచ్చునేమో! ఇలా నేను అనుభవించడంచేత నాతో బ్రతుకుతున్న కోట్లాది మానవుల కష్టాలనీ సుఖాలనీ అవగాహన చేసుకోగలుగుతున్నాను. అందుచేత నా ఊహకు

పడునెక్కుతోంది. దూరంగా ఎక్కడో వున్నవారి బాధలని కూడా నేననుభవిం చుతూ వుంటాను. అందుచేత వైయక్తికంగా అంతకంతకూ, అంతకంతకూ వయస్సు పెరిగేకొలదీ, అనుభూతుల ప్రాబల్యం మూలంగా, డెన్సిటీ మూలంగా మరింత సెన్సిటివ్ అయిపోతూ వచ్చాననన్నమాట! చిన్న చిన్న బాధలు నన్ను పెద్ద బాధలుగా బాధించేవి. వీటిని దృష్టిలో పెట్టుకునే అభివ్యక్తి వస్తున్నది. అందుకని అన్నాను భయానికి, ఉద్రిక్తతలకి సంబంధించినది సాహిత్యం.

ప్ర : కవి ఏ జెండానైనా ఎగురవేస్తే సుకృతవంతుడుకాదని మీరొక కవి పుస్తకానికి పీఠికలో వ్రాశారు. ప్రపంచ కవులలో చాలమంది జెండా ఎగురవేసి సుకృతవంతులయ్యారు కదా?

జ: మైయకోవిస్కీ స్టాలిన్ మాటలకు సరేనని మరణించాడు. రాజకీయ పతాకం పట్టి కవిత్వం రాసి పేరు పొందిన కవులు చాల తక్కువమంది.

## కవిత్వానికి పేర్లు

ప్ర : భావకవిత్వం, ఆధునిక కవిత్వం అనే రెండు మైలురాళ్ళను ఒప్పు కుంటే మీరు వున్న స్థానం ఏమిటి? కాదు, నేను కవిని మాత్రమే అంటే ప్రశ్నే లేదు.

జ: కవిత్వానికి ఇలా వర్గీకృతనామధేయాలు చేయడం అసాహిత్యప్రక్రియ. ఇటువంటివాటిని నేను చాల నీచంగా చూసే కవిని. ఎందుచేతనంటే, తెలుగు సాహిత్యంలో సాహిత్యంకంటే అజ్ఞానం ప్రబలంగా వుంది. ఎక్కడ కవిత్వ ముందో అక్కడ ఈ పేర్లు కనబడుతూ వుంటాయి. వామపక్షంవాడు ఎక్కడ కవిత్వముంటే అక్కడ ఇది భావకవిత్వం అంటాడు. భావకవిత్వం అంటే వాడి ఉద్దేశం అదొక బ్రహ్మాండమైన వ్యాధి. వెంటనే వాడికి మందు ఇవ్వకపోతే వాడు చచ్చిపోతాడని వాడి అభిప్రాయం. రొమాంటిక్ పొయిట్రీ అంటే ఏమిటో వాడికి తెలియదు. భావకవిత్వం అంటే ఏమిటో వాడికి తెలియదు. వాడి కెవడో చెప్పాడు- ఇదొక భయంకరమైన వస్తువని. వాడు దానిని వెంటనే మింగివేశాడు. మరొక చిత్రమైన వ్యవహారం తెలుగుదేశంలో కనిపిస్తున్నది. ఎక్కడ పొయె టిక్‌గా మీ కొకలైను కనుపిస్తుందో వెంటనే ఇది భావకవిత్వం అంటారు. సాధా

రణ వాక్యాన్ని, పత్రికల్లో కనపడే వాక్యాన్ని, పోడి వాక్యాన్ని విప్లవవాక్యం అంటారు. ఇలాగ విప్లవమన్నా, భావకవిత్వమన్నా ఏమీతెలియనివాళ్ళు, తెలుసుకుందామని ప్రయత్నించనివాళ్ళ పెత్తనం తెలుగు సాహిత్యంలో వుంది.

ప్ర : మౌలికమైన ఆలోచనలు తెలుగు సాహిత్యంలో చోటు చేసుకోవడం లేదని మీరు ఇరవై సంవత్సరాలకు ముందు అన్నారు. సబబేనంటారా? ఇప్పటికి?

జ : సబబేనని నా విశ్వాసం కూడా. సహేతుకమైన విశ్వాసం కూడా.

ప్ర : తెలుగుదేశంలో సమకాలీన రాజకీయ వాతావరణం కారణంగా ఛందస్సు కవిత్వంనుండి తొలగిపోవనారంభించినదని మీరు ఇదివరలో రాశారు. 1920-40 ప్రాంతాలలో స్వాతంత్ర్యోద్యమ భావవ్యాప్తి జరిగింది. కానీ, రాజకీయంగా తీవ్రవాదుల ప్రాబల్యం లేదు కదా?

జ : నేను ఆ ప్రకటన చేసినప్పుడు నా దృష్టిలోవున్న కాలం, సందర్భం వేరు. వచన కవిత్వమంటూ వచ్చినది కేవలం రాజకీయ వాతావరణపు వత్తిడి మూలంగా వచ్చినదే కాని అది సాహిత్య శిల్పంలో వున్న వత్తిడుల మూలంగా వచ్చినది కాదు అని వేరుచేసి చెప్పడానికి అన్నాను. ఫ్రాన్సులో షెటోబ్రియాను అంద్రేబ్రెతన్ లాంటివారు వచనంలో కవిత్వం రాశారు. చార్ల్సు బోదలెయెర్ వచన పద్యాలు రాశారు వారు వచన కవితలు రాయడానికి అందే మీటర్‌ను విడిచిపెట్టడానికి రసగ్రహణలో వత్తిడులు (ఈస్తటిక్ కంపల్షన్స్) కారణం. కాని, ఇక్కడి పరిస్థితి వేరు. అంతవరకూ ఇక్కడ మత్తేభం, ఉత్పలమాల - ఇలాంటి వాటిలో కవిత్వం వచ్చింది. పాత కవిత్వ రూపం ఇదే అయితే కొత్తది కూడా పాత కవిత్వరూపంలో వుంటే ఎట్లా? కనుక కవిత్వమంటే ఏమిటో తెలియనివాళ్ళు పైకి కనిపించేదే కవిత్వ మనుకొని మీటర్స్ కొట్టివేస్తే కవిత్వం అని భ్రమలో పడ్డారు. ఏదో వదులుగావున్న మీటరు తీసుకోవడం, దాంట్లో రాయటం. శ్రీశ్రీ అలా రాశారు. మిగతా కొందరు కూడా రాశారు. ఆ తరువాత అదికూడా వదిలిపెట్టి వచనం రాశారు- ఇలా రాస్తే ఇది కవిత్వమవుతుందీ అని. కవిత్వం అవటం వేరే కారణాలవల్ల అవుతుంది. వృత్తాలను, ఛందస్సును కనుక మనం ఖండిస్తే కొంత కవిత్వం పుడుతుంది. వచనంలా రాస్తే కవిత్వం అని ఒక స్థూలమైన భ్రమకు లొంగివాళ్ళు అలా ఛందస్సును విడిచిపెట్టారే కాని, ఈ విధంగా రాయకపోతే ఇంకో విధంగా దీన్ని వ్యక్తం చేయలేము అన్న అంతర్గత రససంబంధమైన వత్తిడుల మూలంగా చేసినది కాదు.

ప్ర : మన ఆధునిక కవిత్వం నడిచిన తీరు యింకా ఎంత లోప భూయిష్ఠంగా వుంది?

జ : ప్రధానమైన లోపం కవిత్వం లేకపోవడమే. కవిత్వమంటే ఏమిటో అవగాహన లేకపోవడం.

## కుహనా కవులు

ప్ర : కుహనా కవుల కుహనా పండితుల బాధ ఎక్కువయిన దన్నారు. మంచి సాహిత్యం రావడానికి వీరెలా ఆటంకం కల్పిస్తారు? ఎక్కడయినా వీళ్ళుంటూనే వుంటారు, వుండనివ్వండి.

జ : ప్రజలను తప్పుదారి పట్టించడానికి వీరు ప్రయత్నిస్తారు. అలా వీరు పైచేయి పొందుతారు. నిజమై కవిని పట్టుకొని- వీడు కవిగాడు, నేనురా కవిని అంటాడు. లోకానికీ, సమాజానికీ చేస్తున్న ద్రోహం ఇది. సమీక్షకులు, వైజ్ఞానిక వర్గాలు, విమర్శకులు- వీళ్ళని వోకంట కనిపెడుతూ ఉండాలి.

ప్ర : వీరశైవ కవులకు రెండువందల సంవత్సరాలలో కాలం చెల్లిందని చెప్తూ కవిత్వం లోపించడం వల్ల ఆధునికులకు అవసరమైన నిజాయితీ, విద్య లేకపోవడం వలన, మన సమకాలీన కవులకు వీరశైవ కవులకు పట్టినగతే పడ్తుందని మీరు ఆరోపించారు. ఇప్పటికీ మీ అభిప్రాయం అదేనా?

జ : మరింత అనుమానిస్తున్నాను. అందుకు కారణాలు ఉన్నాయి. గత 30 సంవత్సరాలుగా మన కవులకున్నది అవిద్య. కవిగా అస్తిత్వం సంపాదించు కొనడానికి అవసరమైన మానసిక, భావ, మేధాపరమైన వ్యక్తిత్వం, రూపం లేదు. నిజాయితీ లేకపోవడమంటే అది. కటువుగా చెప్పాలంటే కవిగా పుష్పించి వికసించడానికి అవసరమైన భావనే పద్యంలో శృతి చేసుకున్న మనస్సుతో జీవితం గడపడం లేదు. అందరు కవులనీ ఒక్క విసురుతో అంటున్నానని కాదు, ఒకరిద్దరు తప్ప. వాళ్ళలోనూ ప్రతిభకంటే నిజాయితీ వుంది. వీరశైవుల లోను ఇంకో రకం నిజాయితీ వుంది కాని, కవిత్వం లేదు. అది ప్రధానమైన లోటు. కవిత్వంలేని కవి తిప్పడానికి మెయిన్ స్ప్రింగ్‌లేని గడియారం లాంటి వాడు. అందుకే వీరశైవ కవులు రాలిపోయారు.

# రామాయణ రహస్యం

ప్ర : మీరు రామాయణ రహస్యాలు చెప్తూ విమర్శ గ్రంథం రాయడానికి కారణం ఏమైనా వుందా?

జ : ఎన్నోసార్లు వాల్మీకి రామాయణం చదివాను. నాకు కవిత్వం మీద ఆకర్షణ కలిగినప్పుడల్లా వాల్మీకిని చదువుతాను. నామీద ఆయన ఆకర్షణ చెప్ప లేని ఆకర్షణ. అందులో నాకు అనేక విషయాలు కనిపిస్తూ వచ్చాయి. నోట్సుగా రాస్తూ వచ్చాను. తరువాత పుస్తకరూపంగా వచ్చింది. ఇలియట్ దాంతే గురించి చెప్తూ, దాంతే అనే ఇరుసు మీదనే యావత్తు పాశ్చాత్య సాహిత్య చక్రం తిరుగుతున్నదన్నాడు. అలాగే నేను వాల్మీకి అనే ఇరుసు మీదనే యావత్తు భార తీయ సాహిత్యం తిరుగుతూ వుంటుందంటాను.

ప్ర : మీరు మంచి కవితా ఫలాలను పండించారు. ఈ పనసపండును ఆ అరటి పండ్లతో కలపండి అని చెప్పవచ్చు కదా?

జ : నేను అలా అనను కవి ఎప్పుడూ వాడికి కనిపించే సాధారణ విమర్శకుల స్థాయిలో వుండడు. నిజమైన కవి. విమర్శకుడు ఎంతసేపూ ఏదో గాడికొట్టి అందులో కవిని ఇరికిద్దామని చూస్తుంటాడు. అలా వుండడు కవి. కవి అనుభూతి ఎంత విస్తృతమైతే అతని చైతన్యం ఎంత బృహత్తరమైతే, అంత గొప్ప కవి అతను. ఒక విప్లవ కవిగానే వుంటే చాలా గొప్ప అనే విశ్వాసం తెలివితక్కువయిన, దురభిమానంతో కూడిన ఆలోచన చదువుకొనని వారిలో వుంటుందని నా అభిప్రాయం. కేవలం విప్లవానికే అభివ్యక్తి ఇవ్వడం అసహజం. అస్వభావికం. కవి అనేవాడు మానవజీవిత సమగ్రతను ప్రతిబింబింప చేస్తాడు.

(ఆంధ్రప్రభ దినపత్రిక, 29-8-83)

# మాలపల్లి తెలుగు విప్లవ సాహిత్యంలో వచ్చిన ప్రథమ మహాకావ్యం

తెలుగులో విప్లవ కవిత్వపు ఉప్పెన తొలుత ఈ శతాబ్దపు ఏ ఇరవయ్ ముప్ఫయ్యిలో ఉద్భవించిందో ఆ దశాబ్దాల్లో తెలుగు ప్రజల సామాజిక సాహిత్య జీవన మిశ్రమాన్ని జ్ఞాపకం చేసుకోవడం ఈ రోజు విస్మయావహంగా వుంటుంది. వాల్మీకి, వ్యాసులు ప్రాచీన సాహిత్యానికి ఎలాగో అలా గురజాడ, ఉన్నవలు విప్లవ సాహిత్యానికి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి తెలుగు విప్లవ సాహిత్యంలో వచ్చిన ప్రథమ మహాకావ్యం. శ్రామికలోక ఐకమత్యానికి కార్ల్ మార్క్స్ ఆధునిక విప్లవ సిద్ధాంతానికి ప్రాణాంకురమైన కాన్సెప్ట్ ఆఫ్ ది సర్ప్లస్ వాల్యు ఆఫ్ లేబర్‌కు కళాత్మక మహోత్సవం జరుపుతూ 1922 లో వచ్చిన నవల మాలపల్లి! రష్యాలో 1917 లో జరిగిన అక్టోబరు విప్లవం అనే చరిత్రాత్మక సంఘటకు తెలుగులో 1922 లో వినిపించిన తొలి ప్రతిధ్వని మాలపల్లి!

"కూలికి విలువ కలదని మీరు గుట్టు తెలుసుకోండి, కూలికి తగినా విలువ పుచ్చుకుని కూలికి మరి పోండి.... పనివాళ్ళందరు ఏకము అయితే ప్రపంచమే మీది! శ్రేణులు గట్టి సమ్మెకట్టితే చెల్లును మీ మాట" (మాలపల్లి) అనే మాలపల్లిలో పాటవంక్తులు అక్టోబరు విప్లవం జరిగిన అయిదేళ్ళకే దాస్ క్యాపిటల్ని కమ్యూనిస్టు మ్యానిఫెస్టోని తెలుగు ప్రజల గుండెల్లో నిండేలా గర్జించాయి. విప్లవ సాహిత్యంలో మాలపల్లి మహాకావ్యశిఖర స్థానాన్ని దృక్కేంద్రం చేయని విమర్శకుడు తెలుగు సాహిత్యంలో విప్లవ యుగస్వరూపాన్ని అస్తవ్యస్తం చేసినవాడవుతాడు.

సాహిత్యపు పునాదులే మారిపోయి ఒక నూతన సృజనాత్మక రచనా శిల్పం చేస్తున్న మహోదయంలో సాహిత్య ప్రక్రియా భేదాలు ఎంత కనిష్టమయి పోతాయంటే ద్రష్టృత్వమున్న విమర్శకుడు వాటిని నిర్లక్ష్యం చేసి ఆ యుగపు

విశ్వరూపాన్ని దర్శించి నమస్కరిస్తాడు. ఆ విశ్వరూపాన్ని ఆత్మీకరించుకుని అంచనా వేస్తాడు. కొండంత ఎత్తుతో మాలపల్లి మన సాహిత్యంలో నుల్చొని వుండినా మహాప్రస్థానం మీదనే జిహ్వల మూకలు తమ ప్రశంసా వర్షాలన్నింటిని కురిపించడం సాహిత్య స్పృహ వున్న దృశ్యాన్ని చూపించదు. విప్లవ చేతనలో కళాత్మక గుణంలో మాలపల్లి మహాప్రస్థానం కంటె ఎన్నో మణుగులు బరువైన రచన. మాలపల్లి, మహాప్రస్థానము రెండు విభిన్న సాహిత్య ప్రక్రియలకు చెందిన వనే తృణప్రాయమైన కారణంచేత మహాప్రస్థానాన్ని తెలుగుసాహిత్య ప్రపంచ శిఖరంమీద పెట్టడం అవాస్తవిక, కృత్రిమ, అజ్ఞాన ప్రేరిత కార్యమవుతుంది. కాదంబరిని మహాకావ్యంగా కొలిచే భారతీయ లాక్షణిక మానదండాలు మాలపల్లిని కూడా అదేవిధంగా కొలుస్తాయి.

1934 లో ఆంధ్రదేశంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ జన్మించడం, 1935 లో శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు కార్యదర్శిగా కాకినాడలో అది సమావేశం అవడం, 1939 లో కమ్యూనిస్టు పార్టీగా పేరు మార్చుకోవడం - ఇవన్నీ ఆనాటి బ్రిటిష ప్రభుత్వ భయానక దమనకాండ మూలంగా, రహస్యంగా జరప బడుతూ వుండడం అనే విలువైన సత్యాన్ని మన సాహిత్య, అంచనాల్లోకి తీసుకోకపోతే విమర్శకు అవాస్తవికతా దోషం పడుతుంది. తెలుగు విప్లవకారులు విశాఖపట్నం జిల్లా ఆముదాలవలస చిట్టివలస జనపనార మిల్లుల్లో పనిచేసే కార్మికుల్ని గోదావరి మండలం పంచదార మిల్లుల్లో పనిచేస్తున్న కార్మికుల్ని అన్య జిల్లాల్లో వ్యవసాయ క్షేత్రంలో పనిచేసే కర్షకుల్ని సంఘటితం చేస్తూ శ్రామిక చైతన్యం ఉదయింపజేస్తూ తొలి పాఠాలు నేర్చుకుంటున్న బాల్య కాలం అది.

అలాంటి విప్లవ కార్యక్రమాల్లో నిమగ్నులై పల్లెల్లో పట్నాల్లో శ్రామికుల సమ్మెల కోసం, వూరేగింపుల కోసం రాయబడ్డాయి. పెండ్యాల లోకనాథం, బాలాంత్రపు నళినీకాంతారావు, తుమ్మల వెంకట్రామయ్య చౌదరి, పాలకొండ వీరభద్రయ్య ప్రభృతుల నిప్పులుమిసే పాటలు—

''కూలీలందరు యేకమైతే కూటికి తరుగేమిరా....
సమ్మెలోనే సొగసు వున్నది సూటిగా యోచించరా
సమ్మెచేస్తే కూలీ ఎక్కువ చక్కగా మనకొచ్చురా'' (పెండ్యాల)

"ఆకలిమంటచే మలమలమాడే అనాధులందరు లేవండోయ్" (బాలాంత్రపు)

"ఎగరాలి ఎగరాలి మన ఎఱ్ఱజెండా" (తుమ్మల)

ఆ పాటలన్నీ తర్వాత 1935 లో ప్రభ అనే సంచికలో ముద్రిత మయ్యాయి. ఇక్కడ ఒక్కమాట - జయభేరి, అవతారం, మహాప్రస్థానం అనే శ్రీశ్రీ గేయాల తారీఖు 1934 గా చెప్పబడడం పై పరిస్థితుల దృష్ట్యా నిర్దుష్టంగా కనిపించదు. దీనిమీద మరింత పరిశోధన కావాలనిపిస్తుంది. కాని, శ్రీశ్రీ విప్లవ గేయాలు ఆనాటి విప్లవ పరిస్థితుల్ని ప్రతిబింబిస్తాయి.

పెండ్యాల, తుమ్మల, బాలాంత్రపు, పోలకొండ శ్రామిక ఉద్యమాల్లో కలిసిపోయి పాటలు రాస్తే, నారాయణబాబు, శ్రీశ్రీ ప్రభృతులు విశ్వవిద్యాలయాల్లో పట్నవాస రంగస్థలాలో నుల్చొని తమ విప్లవ రచనలు చేశారు. కానీ ఈ యావత్తు భిన్నభిన్న శక్తుల పోరాటాలు కలిసి 1943 లో అభ్యుదయ రచయితల సంఘం జన్మించడానికి కారణం అయ్యాయి. అయితే విప్లవ సాహిత్య మూలస్తంభాలైన రచనలు అప్పటికే వచ్చేశాయి. ఈ మహా విప్లవ రచనా యుగానికి అభ్యుదయ రచయితల సంఘం అని నామకరణం చెయ్యడం తుఫానుని తుప్పర అన్నట్లుగా వుంది. బహుశా ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వ భీతిచే రహస్య ఉద్యమంగా వుండవలసిన కారణంగా, అనువైన విప్లవేతరుల్ని కూడా కలుపుకుని ఒక సంఘటిత సంఘమై అందరికీ సమ్మతమైన పేరుపెట్టుకున్నారు. కానీ ఆ ఉద్యమ మూలశక్తి పచ్చి విప్లవమే. ఆ రచనల పదార్థం కూడా విప్లవమే. కనుక ఈనాడు సాహిత్య పునర్మూల్యాంకన చేసే సందర్భంలో అభ్యుదయ అనే పదం తొలగించి ఆనాటినుంచీ ఈనాటివరకూ ధారాప్రవాహంగా వస్తూ ఉన్న వర్తమాన విప్లవ తెలుగు కవిత్వానికి, తద్ యుగానికి విప్లవ పదం వర్తింప జేయబడాలి.

విప్లవ కవిత్వంలో ప్రథమ తరం గడిచిపోయింది. రెండోతరంవాళ్ళకు ఈ సంఘటనలు తెలీవు. ఈ మెలికెలు తెలీవు. సాహిత్యం ఎప్పుడూ తరతరానికి నిరంతరంగా మూల్యాంకన చేయబడుతూ వుండాలి. టి. ఎస్. ఎలియట్ అంటాడు: "From time to time, every hundred years or so, it is desirable that some critic shall appear to review the past

of our literature and set the poets and the poems in a new order. This task is not one of revolution but of readjusment", (P. 108, Faber & Faber Edition, 1933, "The use of poetry and the use of criticism".)

ఈ పని ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లో ఒక క్రమ పద్ధతిలో చెయ్య బడాలి. రాగద్వేషాల కందకాలైన రాజకీయ రచయితల బారికి అప్పగించబడ కూడదు. కనుక 1922 నుంచీ తెలుగు సాహిత్యంలో రెండు శాఖలున్నాయి. ఒకటి 1922 తో ప్రారంభించే విప్లవ శాఖ. రెండు 1942 తో ప్రారంభించే భావకవిత్వ శాఖ. విప్లవ కావ్యశాఖే తెలుగులో మొదట ప్రారంభం కావడం ఒక విచిత్ర సత్యం!

ఒకవైపు 1934 లో కమ్యూనిస్టు పార్టీ పిండోత్పత్తి, మరోవైపు 1922 విప్లవ సాహిత్యజన్మ అనే చరిత్ర కాంతిలో పరిశీలిస్తే అభినవ కవిత్వం అనే పేరులో నుంచి అభినవ అనే పదం తీసేసి ఎట్లా భావకవిత్వం అని మార్చారో అట్లాగే అభ్యుదయ కవిత్వం అనే పేరులో నుంచి అభ్యుదయం తీసేసి విప్లవ కవిత్వం అని సవరించాలి. కనుక అప్పట్నించీ ఇప్పటివరకూ తెలుగు కవిత్వంలో వచ్చిన అభ్యుదయ కవిత్వం విప్లవకవిత్వంగా సాహిత్య విమర్శలో నామధేయం మార్చబడాలి. ఇదంతా ఆద్యంతమూ విప్లవ కవిత్వయుగమే)

('వజ్రాయుధపాణి' నుంచి : ఆంధ్రప్రభ దినపత్రిక, 18-11-84

## అనుబంధం - I

# శేషేంద్రతో ముఖాముఖి

### (1985 ఏప్రిల్‌లో శేషేంద్రతో నేను జరిపిన ఇంటర్వ్యూల్లోని ముఖ్యాంశాలు)

ప్ర : 1950లో సొరాబు ప్రకటించేనాటికి ఆ తరువాత 'ఋతుఘోష' కాలంనాటికి అభ్యుదయ కవిత్వోద్యమం, వచన కవిత్వోద్యమం విస్తృతస్థాయిలో ఉన్నప్పటికి పద్య కవిత్వాన్ని వ్రాస్తూ, ప్రాచీన సాహిత్య విమర్శకు అంకిత మయి ఉంటూ 1968-69 ప్రాంతాలలో ఒక్కసారి వచన కవిత్వాన్ని ప్రారం భించటానికి చారిత్రకమయిన, వ్యక్తిగతమయిన కారణాలేమయినా ఉన్నాయా?

జ : 'సొరాబు' మధ్యూఆర్నాల్డు అంగ్ల కృతికి అనువాదం. సృజనాత్మక కవిని విలువ కట్టేటప్పుడు అతని సృష్టి మాత్రమే దృష్టిలోకి తీసుకోవాలి. అతని విమర్శనాపూర్వక రచనలైన విమర్శ గ్రంథాలు, డైరీలు, నోటుబుక్కులు ఇత్యాది సామగ్రి కూడా ఈ సందర్భంలో స్వీకరించడం ప్రస్తుతం కాదు. కాని అనువాదం దేని అనువాదమైనాసరే కవి మూల్యాంకనపరిధికి అవతలే ఉంటుంది.

'ఋతుఘోష'లో సంకలితమైన కవితలు రాసే రోజుల్లో (అంటే 1955-56 ప్రాంతాలు) తత్పూర్వం కూడా ఇంచుమించు బాల్య, యవ్వన, మధ్యావస్థ నుంచి నా జీవన దృక్పథం, నేను అభిమానించే జీవన విలువలు ఆనాడు విజృంభిస్తున్న కమ్యూనిస్టు ఉద్యమంతో మిశ్రితం అయి ఉండేవి. ఆ ఉద్యమ మిత్రులతో సంపర్కం కూడా గాఢంగానే ఉండేది. కాని, నేను స్వభావత అధ్యయనశీలిని, జిజ్ఞాసువును కావటంచేత కమ్యూనిస్టు ఉద్యమానికి చెందిన సాహిత్య వ్యవహారాలు నిర్వహించే వ్యక్తులతో స్నేహార్ద్ర సంబంధాలు రూపొందడం సాధ్యం కాలేదు ఆనాటి అ.ర.సం. రచయితల్లో అధ్యయనము శిక్షణ, తత్ఫలితంగా లభించే సాహిత్య మర్మజ్ఞత ఇంచుమించు మృగ్యమేనని చెప్పవచ్చు. పూర్వ భారతీయ కావ్యశాస్త్ర కర్తల్ని, అన్య ప్రాచీన కవుల్ని ఈ

వర్గంవారు తరచు నిందిస్తూ వ్యాఖ్యానాలు చేయడం, బహిరంగ ఉపన్యాసాలు చెయ్యడం నాకు నచ్చేదికాదు. ఒకసారి బహుశ 1957 లో విజయనగరంలో ఒక పెద్ద బహిరంగ సభలో ఆరుద్ర పూర్వకావ్యాలు అలంకార శాస్త్రాలూ బూజుపట్టిన పుస్తకాలని, అవి అభ్యుదయ నిరోధక సామగ్రి అని, వాటిని తగల బెట్టాలని గంభీర ఉపన్యాసం చెప్పినప్పుడు ఆ వేదికమీదే ఉన్న నేను అతణ్ణి నిర్దాక్షిణ్యంగా ఖండించడం, సభలో వేలాదిమంది నా ఖండనను హర్షిస్తూ కర తాళధ్వనులు చేయడం జరిగింది.

కనుక మొదటినుంచి నాలో రెండు పరస్పర భిన్న ధోరణులు నడుస్తూ వచ్చాయి. ఒకటి జీవన విషయాత్మక మూలాల్లో మార్క్సిజాన్ని హృదయాత్మకంగా స్వీకరించడం, రెండోది అధ్యయన శీలము, జిజ్ఞాసాపరత అనే రెండు లక్షణాల మూలంగా విద్యాశ్రమ రహితులు, అల్పజ్ఞతా దుర్విదగ్ధులు, అజ్ఞానప్రేరిత సాహసోపేతులు అయిన ఆనాటి నా సమకాలీన రచయితలమీద ప్రయత్నించినా ఆదరణ కుదరలేదు.

ఆ తర్వాత నేను ఆ రోజుల్లో తెలుగు సాహిత్యమే కాకుండా ప్రధానతః సంస్కృత సాహిత్యం, వైదిక వాఙ్మయము, ఈనాడు ఆధునిక ప్రపంచం అని మనం అనే ఒక నూతన జగత్తుకు మూలస్తంభాలైన పాశ్చాత్య విజ్ఞాన గ్రంథాలు పాశ్చాత్య సాహిత్యగ్రంథాలు వాటికి సంబంధించిన ఉద్యమాలు విరివిగా చదివే వాణ్ణి. బహుశా ఆ రోజుల్లో నన్నెరిగిన వాళ్ళు నన్ను ఎలాంటిచోట చూచినప్పు డయినా చేతిలో ఒక పుస్తకంతోసహానే చూచి ఉంటారు. ఈ విస్తృత అధ్యయన ఫలితం నా పూర్వ రచనల్లో సర్వత్ర స్పష్టంగా కనిపిస్తుంది. 'నరుడు నక్షత్రాలు' 'విశ్వవివేచన', 'ఊహలు', 'రక్తరేఖ'- ఈ గ్రంథాలు ఆనాటి నా సంస్కార చైతన్యాన్ని గుర్తించడానికి చదువ వలసినవి.

'రక్తరేఖ' 1974 లో ప్రింట్‌అయినా ఆ నోట్స్ ఆనాటివే. అలాంటివి ఇంకా చాలా గుట్టలు పడున్నాయి. ఇది ముఖ్యంగా గుర్తించవలసిన విషయం. ఈ చేతనని కొన్ని సృజనాత్మక కృతుల్లో కూడ చూడవచ్చు 1952 - 54 ప్రాంతాలనించీ చేసిన కొన్ని పద్యకృతులు 'చంపూవినోదిని', 'పశులు' 'ఋతుఘోష' ఆనాటి నా విప్లవ చేతనని స్పష్టం చేస్తాయి. ముఖ్యంగా నా తిరుగు

బాటు మనస్తత్వం చంపూవినోదిని విదితం చేస్తే, పక్షులు నా విప్లవ మనస్తత్వాన్ని అక్షరాక్షర స్పష్టతతో ఆవిష్కరిస్తుంది. 'ఋతుఘోష' విప్లవ చైతన్యాన్ని సమగ్ర స్వరూపంతో ప్రతిబింబితం చేసే పూర్ణకృతి.

వర్తమాన సాహిత్య అగ్రగల్భులకు ఎదురయ్యే చిక్కు ఏమిటంటే విప్లవచైతన్యం ఛందస్సులో చెప్పవచ్చా! చెపితే అది విప్లవ కవిత అవుతుందా? ఇలాంటి ప్రశ్న అత్యంత స్పష్టంగా అజ్ఞాన ఫలితమని కావ్యమర్మజ్ఞులకు తెలుస్తుంది. వస్తువు కావ్యస్రష్ట చైతన్యాన్ని సూచిస్తుంది. దాని అభివ్యక్తి కోసం ఏ మార్గం ఎన్నుకోవాలి అన్న అవ్యవస్థ నేను కవిత్వం కోసం కలమెత్తిన రోజుల్లో వీరతాండవం చేస్తోంది. శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు కూడా వాళ్ళ విప్లవ చైతన్యాన్ని ఈనాటి వచన కవిత్వంలో చెప్పలేదు. స్పష్టమైన ఛందస్సులోనే చెప్పారు. శ్రీశ్రీయే భుజంగ ప్రయాత వృత్తాన్ని మహాప్రస్థానంలో వాడానని చెప్పాడు. ఛందస్సులమీద అధికారం ఉండడం ఒక గొప్ప విషయంగా శ్రీశ్రీ పరిగణిస్తాడు కనుకనే, 'తూర్పుగాలి' అనే కవితా సంకలనానికి ఉపోద్ఘాతం రాస్తూ 'ఛందస్సుల మీద పఠాభికున్నంత అధికారం శిష్ట్లాకు గాని నారాయణబాబుకు గాని లేనేలేదు.' అంటే దీని అర్థం ఛందస్సుల్లో వ్రాయడం చాలా గొప్ప విషయమని శ్రీశ్రీ అభిప్రాయం. శ్రీశ్రీకి అలాంటి అభిప్రాయం ఉండడం ఆనాటికి సమంజసమే. కారణం శ్రీశ్రీ విప్లవాత్మక మార్గంవైపు అడుగుపెట్టిన రోజుల్లో అతనిమీద పనిచేస్తున్న చోదకశక్తులు ప్రధానంగా రష్యన్ కవులు అలెగ్జాండర్ బ్లాక్, మయకోవస్కీ ప్రభృతులు. శ్రీశ్రీ మీద ఫ్రెంచి సర్రియలిస్టుల ప్రభావం కేవలం నామకార్థం. శ్రీశ్రీ సర్రియలిస్టు పద్యాల్లో సర్రియలిజం లేదు. సర్రియలిజం తెలిసినవాళ్ళు, ఫ్రాన్స్ మొదలైన యూరోపియన్ దేశాల్లో ఆనాడు పుట్టిన సర్రియలిస్టు కవిత్వం చదివినవాళ్ళు ఈ విషయాన్ని గుర్తించగలరు. అన్యులు ఏది చెబితే దాన్ని ఆలోచనారహితంగా మింగేసేవాళ్ళు.

ఆధునిక యూరప్‌లో వచ్చిన నవీన సాహిత్య ఉద్యమ కర్తలందరూ ఛందస్సులోనే వ్రాశారు. సింబలిస్టు మార్గ పితామహుడు చార్లెస్ బోదిలేర్ మహాకవి ఆనాటి ఫ్రెంచి కవితను విప్లవీకరించి నూత్న కావ్యజగత్తును సృష్టించిన విశ్వవిఖ్యాత కావ్యం 'లెప్లేర్ దెమాల్' ఛందోబద్ధ కావ్యమే. తదితర ప్రధాన సింబలిస్టు కవులందరూ రేంబో, మల్లార్మే, పాల్‌వేలరీ ప్రభృతులు ఛందస్సు

ల్లోనే వ్రాశారు. అంతకంటే ముఖ్య విషయం రష్యన్ అక్టోబర్ విప్లవ పూర్వం మాట అటుంచి విప్లవానంతర కవులందరూ ఈనాటికి కూడా ఛందస్సుల్లోనే వ్రాశారు విశేషించి శ్రీశ్రీకి ముఖ్యుడైన మయకోవిస్కీ ఛందస్సులో వ్రాయడమే కాక 'పద్యం రాయడమెట్లా?' అని ఒక సిద్ధాంత వ్యాసం కూడా రాశాడు. 1930 నాటికి ఈ మొత్తం పాశ్చాత్య వాతావరణ ప్రభావం శ్రీశ్రీ మీద ఉంది కనుకనే శ్రీశ్రీ ఛందస్సుల్ని గొప్పవిగా భావించడం; వాటిని తన కవిత్వ రచనలో అవలంబించడం. ఈ ప్రకరణమంతా తెలుసుకున్న తర్వాత కేవలం నా మీద విరోధం ఉన్నవాళ్ళు, అసూయ వహించిన వాళ్ళు మాత్రమే నా పద్య కవిత్వాన్ని అభ్యుదయ కవిత్వంగా అంగీకరించడానికి నిరాకరిస్తారు.

ప్రాచీన సాహిత్య విమర్శకు అంకితం అయి ఉండడంలో ఉన్న మర్మ మేమిటో ఇక చెబుతాను. నా సమకాలీన వర్తమాన కవుల మీద వాళ్ళు అవ్యుత్పన్నులవడంచేత రచయితలుగా నాకు ఆదరం లేదు అని ముందే చెప్పాను. దానికి కారణాలు కూడా విపులంగా అక్కడే ఇచ్చాను. అందులో కొందరితో నాకు సాధారణ స్నేహితం కూడా ఉండేది. కాని, వాళ్ళ కవిత్వాన్ని మెచ్చుకోవడం నాకు సాధ్యమయ్యేటట్టు కాదు. అంటే నా సాహిత్య చేతన నా బౌద్ధిక పరిణామం. నా మిత్రులు సమకాలీన రచయితలు. ఈ రెండింటి మధ్య పెద్ద అఖాతం ఉంది. కనుక వాళ్ళ గురించి వాళ్ళ కవిత్వాన్ని గురించి నేను విమర్శ వ్రాయడమన్నది తలెత్తనే లేదు.

కనుక నేను రాసిన విమర్శ కేవలం సంస్కృత సాహిత్యం, తెలుగు ప్రాచీన కవులు, ఆధునిక విజ్ఞానము అనే విషయాలకు మాత్రమే పరిమితమై పోయింది. నేను విస్తృతంగా నిరంతరం చేస్తూ వచ్చిన సాహిత్యాధ్యయన క్రమంలో పేరుకున్న నోట్సు తీసుకున్న రూపమే ఈ విమర్శ గ్రంథాలు.

అయితే ఈనాడు నేను నన్నయాది పూర్వ కవులకు విరోధినని కొందరు చేస్తున్న దుష్ప్రచారం కేవలం అవిచార మూలకం. నన్నయాదులు మన వాఙ్మ యానికి పునాదులు వేసినవాళ్ళు మాత్రమేకాక ఆనాడు అవ్యవస్థ దశలో ఉన్న తెలుగు నాగరకతకు తమ మహాభారతానువాదం చేత ఒక సుస్థిరరూపం ఇచ్చి తెలుగు ప్రజల స్వభావాన్ని శిల్పించినవారు అని చెప్పాలి. తద్విధంగా వారు

గణనీయులేగాక స్తవనీయులు కూడా. అయితే, నేను చేసిన విమర్శ ఆ అనువాద గ్రంథాల కర్తలా? అని మాత్రమే విశ్లేషించడం. ఈ సందర్భానికి కావలసినంత విజ్ఞాన సేకరణ చేసుకోవడం అవసరం. దానికి ముఖ్యంగా కోరాడ రామ కృష్ణయ్యగారి ఆంధ్ర మహాభారత కవితా విమర్శనము, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారి కుమారసంభవ విమర్శనము, పలనాటి వీరచరిత్రకు అక్కిరాజు ఉమాకాంత పండితులు వ్రాసిన సుదీర్ఘ పీఠిక, నా నరుడు నక్షత్రాలు, ఊహలు అనే సంపుటాల్లో ఉన్న తత్సంబంధి వ్యాసాలు బాగా ఉపకరిస్తాయి.

ప్రాచీన తెలుగు కావ్యాల్లో కవిత్వం తక్కువని అవి వాచ్యార్థ ప్రధాన గ్రంథాలని నేను ఈనాడు కవిసేన మేనిఫెస్టోలో అంటున్నానని కొందరి భ్రమ. వాస్తవానికి ఈమాట నేను ఊహాలో....అనే సంకలనంలో, నరుడు నక్షత్రాలు అనే సంకలనంలో స్పష్టంగా చెప్పాను. ఇది ఆనాటి నుంచి నేను చేస్తున్న నిరంతర అధ్యయన ఫలితరూపమైన ఉపలబ్ధజ్ఞాన ప్రేరితమే. ఈ విషయాన్ని సోదాహర ణంగా, సోపపత్తికంగా 'సాహిత్యకౌముది'లో రెండవ కవిత్రయం అనే వ్యాసంలో విశదీకరించాను.

నేను వెనుక వర్ణించిన నా పూర్వరచయితల జీవన శైలీ వైఖరులనుబట్టి అర్థం చేసుకోవలసింది ఏమిటంటే- ఆనాటి నా జీవితంలో అధ్యయనం ఎక్కువ, రచన తక్కువ. ఫలితంగా రచనచేత పరిణామంగా ఉత్పన్నమయ్యే సాహిత్య రంగమునబడే లోభప్రలోభద్వేషవైషమ్యాల అల్లికఅయిన వలలో నేను చిక్కుకో లేదు. ఆ రంగాన్నంతా కలిపి చాలా తృణీకారభావంతో చూచేవాణ్ణి. రంగంగా దానితో నాకు ఏ విధమైన సంబంధాలూ ఉండేవి కావు. కనుక ఆనాటి జీవన సంక్షిప్తచిత్రం పుస్తకాలు చదవడం, జీవితంలో మునుగుతూతేలుతూ ఆ కెరటాల ఈత 'ఎంజాయ్' చెయ్యటం. ఈ ఊపులో 1965 ప్రాంతాలకు వచ్చేసరికి ఒక కవితామయ సుడిగుండంలో పడ్డాను. ఉరుదూ కవిమిత్రులు, ఆర్ద్ర సాయం కాలాలు, అర్ధరాత్రి నక్షత్రాలు - ఈ లోకంలోనుంచి ఒక అపూర్వ సృజనాత్మక చైతన్య విస్ఫోట ఆవిర్భవింపించింది. రోజూ సాయంకాలానికి గడపటానికి కలిసే ఉరుదూ కవిమిత్రులతో గొంతు అన్నివిధాలా కలపవలసిన సన్నివేశం ఒకటి ప్రసవించింది. కనుక సాయంకాలమయ్యే లోపుగా ఒక తాజా కవితతో తయారుగా ఉండేవాణ్ణి మిత్రుల్ని కలుసుకోడానికి. ఇది నా నూతన అధ్యాయ ప్రారంభం.

కవితలు ఇలాంటి జీవనప్రక్రియలోపడి పుంఖానుపుంఖాలుగా ఉద్భవిం చాయి. కాని, దానితోపాటు క్రమంగా నాకు తెలియకుండానే సాహిత్య సంసార జంబాల పటలంలోకి క్రమంగా ఈడ్చుకొని పోబడడం కూడా జరిగింది. ఈ రోజు నా కవిత్వాన్ని ఎంతమంది 'ఎంజాయ్' చేస్తున్నారో అంతమంది నన్ను ద్వేషించే శత్రువులు కూడా ఉద్భవించారు. పూర్వం సాహిత్య నేరాల్లో నేను అమాయకుణ్ణి. ఈరోజు కూడా అమాయకుణ్ణే కాని నన్ను బలాత్కారంగా కొందరు సాహిత్యనేరస్థుణ్ణి చేశారు.

ప్ర : పద్య శిల్పంలో గొప్ప నైపుణ్యాన్ని చూపించిన మీరు కవితా వాహికగా వచనాన్ని ఎందుకు స్వీకరించారు?

జ : ఛందస్సులలో కవిత వ్రాసే రోజులనాటికంటె ఛందస్సును విడిచి పెట్టిననాటికి నా భావోద్వేగధాటి, నా జీవనగమన వేగము అత్యంత తీవ్రత పొందాయి. ఈ వేగాన్ని అందుకునే ప్రయత్నపు పరుగులో నేను ఛందస్సుల బరువు మోయలేక జారవిడిచాను ఛందస్సులు నా నూతన కావ్యాల్లో ఉన్న అభివ్యక్తికి అంతరాయమని నేననుకోలేదు, అనుకొనను కూడా. కాని ఆనాటి పరిస్థితుల్లో నేను చెప్పవలసిన కవిత వచన పంక్తిలో సులువుగా చెప్పబడి క్రియ లఘువుగా ముగిసేది. ఈ వ్యవహారం నా వేగానికి చాలా సుగమత్వాన్ని ఇచ్చింది. అందుచేత త్వరత్వరగా చెప్పడం పుంఖాను పుంఖాలుగా ప్రచు రించడం పది పదిహేనేళ్ళపాటు అవిచ్ఛిన్నంగా సాగింది.

కానీ కవితకు ఛందస్సు దీర్ఘాయుస్సు నిస్తుంది; పొడి వచనం ఇవ్వలేదు. కాదంబరి వంటి మహాకావ్యాలే కాలగతిలో అడుగున పడిపోతున్నాయి కవితకు ఛందస్సు, సంగీతం కుడి ఎడమ భుజాలవంటివి. ఈ మూడూ కలిసినప్పుడే కవిత లోకంమీద సమగ్ర విజయం సాధిస్తుంది కాని, ఒట్టి పొడి వచనపు ఎండు గడ్డికి అలవాటుపడ్డ తెలుగుజాతికి కవితాస్పృహోత్పాదనకోసం ఛందోరాగతాళా లను విసర్జించి కేవలం వచనంలోనే కవిత్వం చెప్పడమనే అభ్యాసం రెండు మూడు తరాలవరకు అవసరమని నా విశ్వాసం. ఎందుకంటే, ఛందస్సంగీతాలు కవిత్వశూన్యతను కప్పిపెట్టి కవులకుగానీ, కావ్యశ్రోతలకుగానీ ఆ న్యూనతను తోచనీయకుండా చేస్తాయి. గత వెయ్యి సంవత్సరాలుగా ఇటువంటి అనుభవానికి

గురికావడంచేతనే తెలుగుజాతి కవిత్వస్పృహ కోల్పోయింది. కనుక ఇప్పుడు వచన కవిత్వం చేస్తున్న ఉపకారం ఏమిటంటే - ఛందస్సువేసే ముసుగు తొలగిపోవడంచేత చప్పున ఇది వచనమా లేక కవిత్వమా అని తెలుసుకునే అవకాశం కలుగుతోంది. కవిత్వం నేర్చుకునేవాళ్ళు మొదట కవిత్వం వచనంలో వ్రాయడం అభ్యాసం చేయాలి. ఎందుచేతనంటే, వాడు మొదట భావాల్లో సౌందర్యం చమత్కారం చూపించడానికి కృషి చెయ్యాలి. ప్రధానంగా కవిత్వం దానిచేతనే ఆకర్షణీయం అవుతుంది. భాషది రెండవస్థానం ఈ వృత్తకవితలో ఉన్న దేంజరేమిటంటే - రచనలో ఉన్న శూన్యత ప్రారంభకుడికి చప్తే అర్థం కాదు. అసలు తెలుగుదేశం భావశూన్యమైన వృత్తరచనా వ్యామోహంలోపడి పది శతాబ్దాలు గిలగిల కొట్టుకుంది, ఇంకా కొట్టుకుంటూ ఉంది. పూర్వం భావచమత్కారం లేకపోయినా ఏదో భాషా చమత్కారం అన్నా ఉండేది. ఈ రోజు అదీ లేదు. తెలుగు కవిత్వం శతాబ్దాలనించీ వస్తున్న భావసౌందర్యశూన్యమైన కేవల వృత్త విన్యాసాలుగా మాత్రమే ఉండకూడదనుకుంటే కవిత్వం రాసేవాళ్ళు, కవిత్వం చదివేవాళ్ళు రచనలో చమత్కారం ఎక్కడ ఉంది? విశిష్టత ఎక్కడ ఉంది అని వెతకాలి. కనుక కవితాభ్యాసకుడు తన పాఠాలు వచన కవితతోనే ప్రారంభం చెయ్యాలి.

ప్ర : 'నాదేశం - నా ప్రజలు' లోని దేశం, ప్రజలు భారతదేశ ప్రజలకు పరిమితమా?

జ : నా దేశం నా ప్రజలులో సంబోధింపబడిన ప్రజలుగాని, దేశంగానీ సహజంగానే భారతదేశానికి సీమితం కాదు, తత్త్వతః సత్యం ఏమిటంటే - ఏ కవి అయినా తనకు సోకి తన భావోద్రేకతను రెచ్చగొట్టే పరిసరాల్ని ఉద్దేశించే సంబోధిస్తాడు. ఈ పరిధికి దూరమైన కాలదూరాలు అతని ఇంద్రియ సంబంధానికి అంటే అనుభూతికి బాహిరమైనవి. ఏది అనుభూతి బంధంలో ప్రవేశిస్తుందో అదే కవి భావోద్రేకతకు హేతువవుతుంది. కాని ప్రకృతి, మానవుడు, సమాజము సాధారణంగా సమాన పరిస్థితుల్లో ఉంటాయి గనుక అంతకంటే ముఖ్యమైంది మానవ స్వభావం. మానవ చరిత్ర స్వల్ప వ్యత్యాసాలున్నప్పటికీ విశాలంగా చూస్తే ఒకేవిధంగా నడిచాయి గనుక, నడుస్తాయి గనుక మానవుడు తననుగురించి ఉత్కటంగా పొందే అనుభవము లేక ఆలోచన ఎప్పుడూ సమస్త మానవజాతికీ అన్వయిస్తుంది. అందుచేతనే త్రికరణశుద్ధిగా కవి పొందిన ఉత్కట అనుభూతి

సమస్త జాతికీ అన్వయించి భాషను ప్రాంతాన్ని మతాన్ని స్థానిక సంస్కృతిని కాలదూరాలను అధిగమించి మరోమనిషిని చేరుతుంది. అతనిలో ఆర్ద్రమైన సానుభూతి ప్రకంపనల్ని రేపుతుంది. కనుకనే కవులు కావ్యాలు ఈ ఒక్క త్రికరణ శుద్ధి, అనుభూతి ఉత్కృటత్వమూ అనే రెంటిచేత సర్వమానవాళికి సన్నిహితు లవుతారు. కనుక నా దేశం-నా ప్రజలులో సంబోధింపబడిన వస్తువు సర్వమానవ జాతి. ఈ కావ్యంలో పునః పునః వచ్చే అహంకార స్వరూప ఉత్తమ పురుషైకవచనము ఒక వైపున వ్యక్తి అయితే రెండవ వైపున సమస్త జగత్తు. ఈ మధ్య జరుగుతున్న సంవాదభాషే నా దేశం నా ప్రజలు.

ప్ర : ఎనిమిది సర్గలుగా విభజింపబడిన 'నా దేశం - నా ప్రజలు'లో అనుస్యూతమైన అంతస్సూత్రమేమైనా ఉందా? విభజనలో ప్రణాళిక ఏదైనా ఉందా?

జ : ఎనిమిది సర్గల విభజనకు స్థూలంగా ఒక ప్రణాళిక ఉన్నట్లే. వర్తమాన మానవీయ సమస్యల తత్త్వ గ్రహణానికి మొదటి మూడు సర్గలు ఒక తాత్త్వికి భూమిక. ''ఓహో ప్రతి యుగమూ ఒక వెర్రి ఆకాంక్ష కోసం ఆకలితో అరుస్తూ ఉంటుంది....'' ఈ కవితా స్వరూప యుగతత్త్వ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం ఈ కావ్యానికి పూర్వరంగం. తరువాత రెండు సర్గలు వైశ్విక తత్త్వ సందర్భంలో కవిలోని వ్యక్తిని వ్యాఖ్యానిస్తాయి. అతడి సమస్యలు, ఆవేదనలు, ఆందోళనలు - ఈ బరువులు మోస్తూ అతడు ప్రజల్ని చేరే ప్రయాణం చేసే గర్జన చెప్పే సంబోధనా సూక్తులు ఇత్యాది యాత్రను ఆరవ సర్గనుంచి ఎనిమిదవ సర్గవరకు ఉన్న సర్గలు సంకేతిస్తాయి. 'లేస్తోంది ఉషఃకాంతుల్లోనించి ఒక హస్తం' అని సూర్యుడనే ఒక దివ్య వస్తు నిర్దేశంతో ప్రారంభించిన ఈ కావ్యం విప్లవ జ్వాలకు మూలస్థానం మానవ ప్రేమ అని సూచించే 'ప్రేమ అగాధ లోతుల్లో మానవ పదవీ గౌరవాన్ని పొందాను' అనే భరత వాక్యంతో ముగుస్తుంది. కావ్య నిర్మాణ కౌశలానికి సంబంధించిన విషయాలు పాఠకుడు అన్వేషిస్తూ చేసే యాత్రే కావ్యాస్వాదన. అట్టివి కవిచేత చెప్పించకూడదు. కవి చేత చెప్పబడినట్లైతే పాఠకుడు కావ్య తీర్థయాత్ర చేయడం అనేది సంభవించదు. అది కావ్యాస్వాదనా సంప్రదాయానికి విరుద్ధం.

ప్ర : కథా సూత్రం ఏ విధంగానూ లేకపోతే అస్పష్టత పెరుగుతూ ఉంటుందంటారు. మీ అభిప్రాయమేమిటి?

జ : కథ ఆధారంగా కావ్యాలు వ్రాయడం ప్రాచీన ప్రపంచంలో అతి ప్రసిద్ధ విధానం. ప్రాచీన సమాజంలో కవుల దృక్పథం సంపూర్ణంగా సామాజిక ప్రయోజనం చేతనే కబళించబడింది. కనుక బహుళ ప్రజానీక రంజన ఏకైక లక్ష్యంగా కావ్యరచన సాగిన యావత్తు పూర్వకాలంలోనూ కథకు ఉన్న అద్వితీయ జనతా సమ్మోహకశక్తి పంజా నుంచి ఏ కవీ బయటపడే అవకాశమే సంభవించ లేదు. ఆదికవి వాల్మీకి నుంచీ మానసికతలో అవగాహనశక్తిలో బహుతారతమ్యా లున్న విభిన్న సామాజిక వర్గాలందరికీ రచన అనురంజకం కావాలనే లక్ష్యంచేత కథ, కవిత్వము మిశ్రితం చేయబడడమేకాక ఈ రెంటికీ ఛందస్సు, తాళము, రాగము కూడా అనులిప్తం చేయబడ్డాయి. కారణం? కవిత్వం అందుకోలేనివాడు కథలో లీనమవుతాడు కథలో లీనమవడం క్లిష్టమైన సందర్భాల్లో రాగతాళాల చేత బద్ధుడవుతాడు. అందుచేత కథా కవిత్వ రాగతాళాది సాధనాలచేత ఈ నవీన వాయువుల్లో నూతన ప్రక్రియగా ఉద్భవించిందే కావ్యక్షేత్రంలో కథాహీన ఇతిహాసం. దీనికి అక్కడ చాలా ఉదాహరణలున్నాయి. సెయింట్ జాన్ పెర్స్ వ్రాసిన 'అనాబెసిస్', క్రోనిక్ వంటి ఫ్రెంచి కృతులు, టి.యస్. ఇలియట్ వ్రాసిన వేస్ట్‌లాండ్ ఇత్యాదుల్ని అక్కడ ఇక్కడ ఈనాడు బాహాటంగా నిర్వి వాదంగా ఎపిక్‌లనే అంటున్నారు. ఈ పరిస్థితుల్లో నా దేశం - నా ప్రజలును ఎపిక్ అనడంలో ఏ బాధ కలుగుతుందో ఊహించడం అసాధ్యం. కాని సాధారణంగా ఒక పొయెమ్‌గాని ఏదో ఒక కవిత్వ రచనను గాని ఎపిక్ అన్నప్పుడు పాశ్చాత్య దేశాల్లో ఆ రచనలో ఉదాత్త మానవ సందర్భజనిత సంవేదన ఒకటి ఉన్నత శిఖరాల ఎత్తున భావీకృతమైన విశాలరేఖల్లో చిత్రితమైన ఒక విశ్వరూప స్పృహకు దోహదం చేస్తుంది. ఈ సన్నివేశం ఉన్న కృతిని ఎపిక్ అనడం పాశ్చాత్య ఆధునిక సంప్రదాయంలో సహజం అయింది. అయితే, ఎపిక్ ఇతిహాసమా? మహాకావ్యమా? లేక ఈ మూడూ ఒకటేనా? ఇది మాత్రం పరిశోధించాలి.

ప్ర : నా దేశం నా ప్రజలు ఏకబిగిన రచింపబడిందా? లేక విడివిడిగా వ్రాసిన ఖండికలను సంపుటీకరించారా?

జ : ఇది ఏకబిగిన పది రోజులలో వ్రాయబడిన రచన. నా పైఅధికారి నన్నవమానించి నామీద నేనిచ్చినఫైలు విసరివేసినప్పుడు నాలో బద్దలైన అగ్ని పర్వతం నించి ప్రవహించిన లావా. ఆప్పుడే సెలవుపెట్టి నీలగిరి వెళ్ళుతూ ఉండగా దారిపొడుగునా ప్రవహించింది. వెళ్ళేముందు సెక్రటేరియట్‌ను చూచి 'ఈ బిల్డింగ్‌ను ఒక్క గుద్దుతో బద్దలు చేస్తాను' అనీ, కొంచెం ముందుకుపోయిన తర్వాత పూలుపూస్తున్న పెద్దచెట్లు కనిపిస్తే 'పూలెందుకు పూస్తాయి బుల్లెట్లెందుకు పూయవు' అనీ అరచిన కేక, ఎరోప్లేన్‌లో కూర్చున్న తర్వాత అది నన్ను లేవ దీసుకుని ఆకాశంలోకి పోతుంటే 'హైదరాబాదును వెనుక విడిచిపెట్టి గాలిలో వెళ్ళి పోవడం ఎంత విశ్రాంతి నా ఆత్మ ఊపిరితిత్తులకు' అనీ, 'పోతున్నాను నా జ్ఞాప కాలను మోసుకుని.... వెతుక్కుంటూ' అనీ నీలగిరి దారుల్లో వృక్ష సమూహాల్లో పోతున్నప్పుడు 'ఇక్కడి కొండల్లో తిరుల్లేవు, తేదీల్లేవు.... కాలం కాళ్ళు విరిగి కూలబడిపోయింది' 'అందుకే నేను కాలాన్ని.... సంహరించాను.'

దారిలో బెంగుళూరులో హోటల్ అశోకాలో నాలుగో సర్గ ఇత్యాది పంక్తులు వచ్చాయి. అయిదవ సర్గ మైసూర్ కృష్ణరాజసాగర్ హోటల్లో ఉన్నప్పుడు వచ్చాయి. ఆరు, ఏడు, ఎనిమిది సర్గలు నీలగిరి చేరిన తర్వాత పూర్తి చేశాను.

ఆరో సర్గలో 'మీరు నన్ను పిలిచారు కాని పిలవకపోయినా మిమ్మల్ని వెతుక్కుంటూ నేనే వచ్చేవాణ్ని' అంటూ వ్రాసిన పంక్తులు నరసరావుపేటలో, అనంతపూర్‌లో ఆ రోజుల్లో చెలరేగుతున్న కవిత్వ వాయువులకు ప్రతినిధులైన యువ మిత్రులు నరసరావుపేటలో సమావేశ మేర్పాటు చేస్తున్నాం రండి అని ఉత్తరం వ్రాస్తే జవాబు వ్రాసిన పంక్తులు. అవి వాళ్ళ సంచికలో అప్పుడు ప్రకటించారు.

ఈ కావ్యం ఒక పెద్ద విస్ఫోటలాగా క్షణిక కాలంలో ఉత్పన్నమైనప్పటికీ ఈ విస్ఫోటకు వెనుక ఉన్న ఊర్జకు నా బాల్యంనుంచీ నా యవ్వనంనుంచీ నేటి వరకు నేను పొందిన ఆవేదనలు, అవమానాలు, అవజ్ఞలు, ఆశాభంగాలు- వీటి అన్నిటికీ మూలకారణమైన సామాజిక వర్గ తారతమ్యాలు రెచ్చగొట్టే ఒక స్ప్రహారూపక ద్వేషమూ, అసూయ నిరంతరం తుఫానులా విజృంభిస్తూ నాలో అభివృద్ధి పొందుతూ రావడమే కారణం కనుకనే ఈ రచన వెనుక ఒక జీవన పర్యంత సంఘర్షణ ఉంది. పెరుగుతూ వచ్చిన అగ్ని వాయుగోళం ఉంది.

నా పైఆఫీసరు ఆనాడు నామీద ఫైలు విసరి అవమానించడం తత్కాలానికి అగ్గి పుల్ల గీచి అంతర్గత గోళాన్ని అంటించడం మాత్రమే. కావ్యం బయటికి రావడం క్షణాల్లోనే జరిగింది.

ప్ర : 'నా దేశం నా ప్రజలు'లో 'నేను' దేనికి ప్రతీకగా భావించవచ్చు?

జ : 'నా దేశం నా ప్రజలు'లో 'నేను' అనే ప్రయోగం కవ్యుపస్థిత వ్యక్తి గత అహంకారార్థ ప్రతిపాదకం కాదు ... ఈ సంగతి కావ్యతత్త్వకోవిదులైన వారికి గోచరిస్తుంది. 'నేను' సర్వమానవ బాధా బోధకమైన ఒక బృహత్ చైతన్య చిహ్నము. ఒక వైశ్విక ప్రతీక.

తనమీద బహిర్జగత్తు యొక్క అనుభూతిని ఆరోపించుకొనగలుగు శక్తిని సత్త్వమని మనదేశపు కావ్యవేత్తలు పేర్కొన్నారు. ఈ సత్త్వగుణసాధనచేతనే ఒక సమగ్ర కవి అనే చిన్న మూసలోకి సమస్త జగత్తు అనే విశాల వస్తువు ద్రవించి ప్రవహిస్తుంది. జగత్తు ద్రవించి ప్రవహించడం కవిలోనేగానీ తత్పూర్వా వస్థలో కేవల రక్తమాంసాకృతి ఉన్న మనిషిలోకి గాదు. వాల్మీకి చెప్పిన 'కరుణవేదిత్వాత్' మనిషి స్థాయి భావములై రసములై పరిపరివిధములుగా ప్రవ హిస్తున్న తరుణంలోనే కవి అవుతాడు; వ్యావహారికస్థితిలో మనిషిగా ఉంటాడు. అలా అయిన దశలోనే బహిర్జగత్తు అతడ్ని ఆవహిస్తుంది- ఉపాసకుడ్ని ఉపాస్య దైవతము ఆవహించినట్లు. ఆ దశలో జగత్తు అంతా వ్యక్తిని ఆవహించిన వైశ్విక చైతన్యానికి నేను అని పేరు.

దాన్నే శారదా తనయుడు తన భావ ప్రకాశంలో 'పరస్య సుఖదుఃఖాదౌ' అనుభవేస చేతసః తద్భావ భావనం యేన భవేత్తదను కూలతః తత్సత్త్వః' అన్నాడు. మరోచోట 'అహంగారస్య వృత్తిః యానోఽభిమానా ప్రకీర్తితః సోఽభిమానాత్మికావృత్తిః తత్తదింద్రియ గోచరా బాహ్యార్థాలంబనవతీ శంగా రాది రసాత్మతాంయాతి' అని వివరించాడు. తద్భావభావనసాధకమైన సత్త్వమే అహంకార వృత్తి. అదే అభిమానము. నేను అని స్ఫృహలేనివాళ్ళయిన కోటాను కోట్ల మానవులు సామాన్య జీవనశృంఖలాబద్ధులై నిష్క్రియులుగా నిష్క్రమి స్తారు లోకం నుంచి. కాని నేను అన్న ఆత్మ చైతన్యమున్న కతిపయ మానవులు ఎక్కడా వెనుకంజవేయక ముందుకుపోయి అన్ని వస్తువుల్లో అన్ని విషయాల్లో అన్ని సమస్యల్లో ఇరుక్కొని తదంతర్నిమగ్నులైపోతారు. తమనితాము కోల్పో తారు.

అర్థాత్ - నేను అనే శబ్దముచేత సంకేతింపబడుతున్నది 'కరుణ వేదిత్వము' లక్షణంగాగల సత్త్వగుణార్థ ప్రతిపాదకమైన చైతన్యము. సాధనచేత కవి తనకూ, జగత్తుకూ మధ్య సాధించిన అభిన్నతకు నేను ఒక శబ్దమాత్ర సంకేతము. కవి తపస్సిద్ధిగా పొందిన తాదాత్మ్య చైతన్యమే 'నేను.'

నా దేశం-నా ప్రజలలో 'నేను కళ్ళుతెరిచి ఆవులిస్తూ లేస్తా' అన్న పంక్తి నుంచి 'రగిలే ఎర్రకోరికే ఒక జెండాగా' అనే అంతిమ పంక్తిదాకా మొదటి రచనా ఖండికలో 'నేను' అనే తాదాత్మ్య చైతన్యప్రతీకకు అంకురారోపణ జరిగింది. తర్వాత వచ్చే అన్ని సర్గల్లో విస్తరించుకుంటూ పోయిన దాని పరిణామ క్రియ స్వరూపమే నా దేశం-నా ప్రజలు కావ్యకృతి.

ప్ర : మీ కవితల్లో సాయుధ పోరాటాన్ని సూచించారుగదా, మీతో భావ సామ్యం ఉన్నవారితో కలిసి ఆశయసాధనకు అంకితం కావచ్చు గదా?

జ : ముమ్మాటికీ ఇది నిజమే. కవి శబ్దానికీ,ఆయుధానికీ మధ్య ఆకర్షణా రూపకలాలసతో ఊగిసలాడుతూంటాడు. ఏ భావోద్వేగప్రభంజనం కవిని శబ్దం వైపు తోసుకుపోతుందో ఆ ప్రభంజనం చేతనే అతడు ఆయుధం వైపుకు తోసుకు పోబడుతాడు. శబ్దం వల్ల ఏమీకాలేదన్న ఆక్రోశంతో ఆయుధం పుచ్చుకుంటాడు. సూక్ష్మమేమిటంటే- మానవ సమాజంలో ఎప్పుడూ చర్య శబ్దమూలకమే. కనుక చైతన్య ప్రేరిత కార్యజాలాని కంతటికీ కవి కేంద్రమవుతాడు. కనుక శబ్దానికి చర్యకూ మధ్య ఊగిసలాడుతున్న కవిమీద దేశకాల జన్య తారతమ్యాల ప్రభావం వైయక్తికంగా ఆక్రమణ జరుపుతుంది. కాని, ఈ యావత్తు సందర్భంలో నుంచి దర్శింపబడవలసినది మూలతః కవిలో ఉన్న చేతన. అదే సర్వోత్కృష్ట ప్రధాన అంశం.

నేను వి.ర.సం, అ ర.సం, రచయితలతో ఎందుకు కలవకూడదు అన్న ప్రశ్న అడుగుతున్నారు. సిద్ధాంతపరంగా కవి రాజకీయ పార్టీల్లోగాని లేక వాటి అనుబంధ సంస్థల్లోగాని చేరడానికి నేను వ్యతిరేకిని. ఈ విషయాన్ని కవిసేన మేనిఫెస్టో వివరించింది.

వి.ర.సం , అ.ర.సం అనే సంస్థలతో కూడా వ్యక్తిగత వ్యతిరేకత ఏమీ లేదు; కేవలం సాహిత్య విషయాల్లో ఏర్పడుతున్న విభిన్నత మాత్రమే. వారి

రాజకీయ సిద్ధాంతంతో, భావజాలంతో నేనూ నా మిత్రులు సంపూర్ణంగా అంగీక రిస్తాము. అ ర సం., వి ర సం. తో ఉన్న సాహిత్య భిన్నతని వాటి జనక పార్టీలతో వైరుధ్యంగా తప్పుడు వాఖ్యానం చెయ్యగూడదు. ఆ పార్టీలపట్ల గౌరవమేగాని ఏ విధమైన అన్యభావమూ లేదు.

ప్ర : మార్క్సిజాన్ని కొన్ని మార్పులతో స్వీకరించాలన్న భావాన్ని మీరు మీ గ్రంథాల్లో అక్కడక్కడ వ్యక్తం చేశారుగదా, ఆ మార్పుల స్వరూపం ఎలా ఉండాలనుకుంటున్నారు?

జ : మార్క్స్ తొలుత ప్రతిపాదించిన సామాజిక ఆర్థిక సిద్ధాంతం రష్యా విప్లవం నాటికి మార్పు పొందింది. ఆ తర్వాత చైనా విప్లవంతో మరింత మార్పుపొందింది. ఈ రెండు దేశాల్లోకానీ, ప్రస్తుతం ఉన్న తూర్పు ఐరోపియా సోషలిస్టు దేశాల్లోగాని అగ్రగణ్య పార్టీగా ఉన్న ఫ్రాన్స్, ఇటలీల్లో గాని ఆదిమ మార్క్స్ సిద్ధాంతం గత వంద ఏళ్ళ దేశ కాలజన్యపరిణామ చరిత్రను పురస్క రించుకొని ఎన్నో మార్పులు చెందింది. విశేషతః చైనాలో మావో-సే-తుంగ్ కమ్యూనిజాన్ని చైనీకరించాలి అనే గట్టి నినాదం స్వీకరించాడు. అలాగే మన దేశ చరిత్రకు మన సంస్కృతికి మన ప్రజల పరిస్థితులకు అనుగుణంగా మనం కూడా మార్క్సిజాన్ని సవరించాలి. ఈ సవరణ ఎలా ఉండాలో సూచిస్తూ "In Defence of people and poetry" అనే లేఖా సంకలనంలో కొన్ని లేఖలు ఉన్నాయి. ఇవి కవిసేన మేనిఫెస్టోలో సూచింపబడ్డాయి. ఆ లేఖలు చదివితే విపులంగా అర్థమవుతుంది.

డైలెక్టికల్ మెటేరియలిజమ్, సైంటిఫిక్ సోషలిజమ్ అనే రెండు పాదాల మీద మార్క్సిజమ్ నిలబడుతుంది. మొదటిది మెటీరియలిజమ్ అనే జడ పరి ణామ సిద్ధాంతం. రెండవది మానవ సమాజం ఫ్యూడలిజం, కేపిటలిజం, కమ్యూ నిజం అనే దశల్లోకి అంచెలవారీగా పరిణమిస్తూ చేరుతుంది అని భావం. మన దేశానికి అనుగుణంగా సూచించిన మార్పు ఏమిటంటే- కమ్యూనిస్టు సమాజ స్థాపన కోసం ఏ చర్యాబద్ధ కార్యక్రమానైతే చేపట్టాలో దాన్నిమాత్రం స్వీకరించి మెటీరియలిజమ్‌ని నిర్బంధ అంశం చెయ్యకుండా వ్యక్తి ఇష్టాధీనంగా విడిచెయ్యాలి. అంటే కమ్యూనిస్టు సమాజ స్థాపనకు కావలసిన చర్యాబద్ధ కార్యక్రమమే నిర్బంధము.

ప్ర. మీకు బాగా సంతృప్తి కలిగించిన రచన ఏది?

జ. జనకుడికి తన బిడ్డలందరి మీదా మమకారం సమానంగా ఉంటుంది. కాని, కవి విమర్శకుడై తన కృతులను తాను మూల్యాంకన చేయడం క్లిష్ట కార్యం. కనుక దేశంలో లభించిన ఖ్యాతినిబట్టి నా అన్ని కావ్యాల్లో నా దేశం నా ప్రజలు సర్వోత్కృష్ట కావ్యం అనుకోవచ్చు. పాకిస్తాన్‌లో ఈ కృతి చేత ప్రభావితులై కవిత్వరచన చేస్తున్న ఒక యువక వర్గం ఉందని ఇటీవలే హైద్రాబాద్ వచ్చిన కవయిత్రి ఫహమీదారియాజ్ చెప్పింది. సుప్రసిద్ధ హిందీకవి సురేష్ ఉపాధ్యాయ్ అతను వెళ్ళిన ముషాయిరాల్లో ఈ ఇతిహాసం, ఈ ఇతిహాసకర్త పేర్లను చెప్పి ''ఆకలి ఉందని నీకు తెలుసా....'' ఇత్యాది పంక్తుల్ని అనుసరిస్తూ వ్రాసిన ఒక కవితను వినిపిస్తూ ఉంటాడు.

మండేసూర్యుడు, ప్రేమలేఖలు, గొర్రిల్లా కూడా నా దేశం నా ప్రజలుతో పాటు హిందీ ఉర్దూల్లోకి అనూదితమైనప్పటికీ భారతదేశపు దూరప్రాంతాల్లో ఇటు ఉర్దూలోగాని అటు హిందీలోగాని 'మేరీ ధర్తీ మేరే లోగ్' అనే భాషాంతర నామంగా నా దేశం నా ప్రజలే బహుళ విఖ్యాతి ఆర్జించుకుంది.

ప్రః మీరు సాహిత్య జీవితంలో సాధించాలనుకున్న లక్ష్యాలేమైనా ఉన్నాయా?

జ. 1970 ల్లో సాహిత్యంలోకి ప్రవేశించేసరికి నా భావాలు లక్ష్యాలు కూడా స్ఫటికాల్లా స్పష్టరూపాలు ధరించాయి. నా ఏకైక లక్ష్యం నా శబ్దం యొక్క అయస్కాంత శక్తితో పాఠకుని హృదయాన్ని ఆకర్షించి అతడి మనస్సు మార్చడమే. నాకు సాహిత్యంతో మరేవిధమైన లాలస లేదు.

* * *

# శేషేంద్ర జీవిత రేఖ

**(1987 అక్టోబర్‌లో నేనడిగిన కొన్ని ప్రశ్నలకు శేషేంద్ర ఇచ్చిన సమాధానాలను ఈ క్రింద పొందుపరుస్తున్నాను )**

నా నామకరణవేళ బంధుమిత్రులందరూ ఉండగా హోమం అయిన తర్వాత మా నాన్నగారు బంగారపు ఉంగరంతో బియ్యం మీద శేషభట్టు అని రాసి పేరు విన కుతూహలపడుతున్న అందరికీ వినిపించాడట. ఈ శిశువు రాక కోసం ఎదురు తెన్నులు చూస్తున్న నా పినతల్లి ఒక్కసారిగా బావగారి మీద విరగబడ్డది. ఇంత ముతక పేరు పెట్టారు ఎందుకు? మీరు కవి అయిఉండి కూడా మీకు అందమైన పేరు స్ఫురించలేదా? అని, ఈ పేరు వెంటనే తుడిచేసి వేరే పేరు రాయాలని పట్టుబట్టిందట. అప్పుడు మా నాన్నగారు ఒక్క నిమిషం ఆలోచించి రాసినపేరు చెరిపేసి మరొక పేరు మళ్ళీరాసి శేషేంద్రశర్మ అని అందరికీ వినిపించాడట. దానితో నా పినతల్లి (వెంకటసుబ్బమ్మ) ఆనంద భరితురాలైందట. (ఆయన పేరుచేత కూడ ఎందరో ఆకర్షింపబడినట్లు తెలుస్తున్నది. ప్రఖ్యాత కవి, విమర్శకులు సోమసుందర్‌గారు తమ కుమారులలో ఒకరికి విజయ శేషేంద్ర శాతకర్ణి అని నామకరణం చేసినారు. తేజోమూర్తుల శేషేంద్రశర్మ అనే పేరు ఇటీవల ఆంధ్రజ్యోతి వారపత్రికలో కనిపించింది. కవి, విమర్శకుడు వై. రామకృష్ణారావుగారు తమ కుమారునికి శేషేంద్ర అని పేరుపెట్టారట. శేషేంద్ర కవితాభిమాని వి.యస్.ఆర్. అవధానిగారు (నరసారావుపేట) కొత్తగా కట్టుకున్న తమ ఇంటికి 'శ్యేషజ్యోత్స్న' అని పేరు పెట్టారట - పరిశోధకుడు.)

మా నాన్నగారు చదువుకున్న సంస్కృత పుస్తకాలే నాకు గురువుగారైన శ్రీ నేతి కృష్ణశాస్త్రిగారు సంస్కృత పాఠం చెప్పారు. (10 సం॥ వయస్సునుంచి సుమారు 18 సం॥ వయస్సు వరకు.) లిఙ్గమంజరి, శబ్దమంజరి, సుచన్త

మంజరి, శబ్ద రత్నావళి, స్టూడెంట్ బై ఆప్టే, రఘువంశం, కుమార సంభవం, మేఘసందేశం, శాకుంతలం, కిరాతార్జునీయం, హితోపదేశం, కౌంతభాగం భర్తృహరి మొదలైనవి. అప్పుడు గురువుగారు బోధించిన పుస్తకాలు ఇంకా వున్నాయి నా దగ్గర. తర్వాతకాలంలో శ్రీ వావిలాల వేంకటేశ్వరశాస్త్రి గారివద్ద తర్కాలంకారాలు అధ్యయనం చేశాను ఆయన దగ్గరే ఉపనిషద్భాష్యాలు, వేదాంత పంచదశి చెప్పించుకున్నాను.

మాది వ్యవసాయ కుటుంబం. పొలం దున్ని, పంట పండించి, ఆ ధాన్యంతో తిండి బట్ట ఇంటి దైనందిన వ్యవహారం నడుపుకుంటూ చేసే జీవనం. నేను గ్రామ పాఠశాలలో చదువుతున్న రోజుల్లో తెల్లవారుజామున లేచి పాలేరుతో కలిసి, పొలాలకు తోలే ఎరువు బండ్లమీద పోతుండేవాడ్ని. మా నాన్న దగ్గరుండి వ్యవసాయం చేయించేవారు. వరినాట్లు, వరికోతలు, నూర్పిళ్ళ కాలంలో మా నాన్నకు నేనే స్వయంగా భోజనం పొలంలోకి తీసుకువెళ్ళేవాడ్ని. అక్కడ మా చేలో ఉన్న బావిలో నీళ్ళు పనివాళ్ళు తోడియిస్తే అక్కడ స్నానంచేసి రెండు తాటిచెట్ల నీడలో ఇద్దరం భోజనం చేసేవాళ్ళం. ముంజకాయల కాలం వచ్చినప్పుడు నేను మరీ పొడుగుకాని చెట్లను ఎక్కి ముంజకాయలు కోసేవాడ్ని. మా నాన్న వద్దని కేకలేస్తున్నా సరే ఎక్కేవాడ్ని. ఎడ్లబండ్లు తోలడం, తాటి చెట్లు ఎక్కడం, ఊరి చెరువులో ఈత కొట్టడం ఆ రోజుల్లో ఒక సరదా. మా ఊరు సముద్రానికి మూడు మైళ్ళదూరం. సముద్రపు ఇసుక ఇంచుమించు మా ఊరివరకు వ్యాపించి ఉన్నట్లే అనుకోవాలి. (మధ్య మధ్య పంటచేలు ఉన్నప్పటికీ.)

బాల్యంలో మా మేనత్త ప్రాపకంలో పెరిగాను. పసివాడుగా ఉన్నప్పుడు (మా తాత తాటాకులదిన్నె అగ్రహారానికి చెందినవాడు. దర్శి తాలూకాలో ఉంది. అది అప్పుడు నెల్లూరు జిల్లా, ఇప్పుడు ప్రకాశం జిల్లా) తోటపల్లి గూడూరులో ఐదు ఎకరాల మాగాణి మా తాతకు ఆ ఊరి ఈశ్వరస్వామి దేవాలయంలో వేదపఠనం చెయ్యడానికిగాను మాన్యంగా ఇస్తే ఆ కుటుంబం తోటపల్లి గూడూరు గ్రామం చేరింది. బహుశా 1950 ప్రాంతాల్లో మా నాన్న మాకు అగ్రహారంలో ఉన్న వాటాను అమ్మివేసినట్లు జ్ఞాపకం.

మా అమ్మ తమ్ముడు ప్రాత దశరథరామమూర్తి. రెండో తమ్ముడు భావణ్ణ రామమూర్తి. మొదటి తమ్ముడికి నా పెద్ద చెల్లెలు అనసూయమ్మని,

రెండో తమ్ముడికి నా రెండో చెల్లెలు దేవసేనను ఇచ్చి పెండ్లిచేశారు. పేడూరులో ఉంటున్నారు. నా తమ్ముడు రాజశేఖరం గూడూరులో వ్యవసాయం చేస్తున్నాడు. అతనికి ఇద్దరు కుమారులు.

B.A. తర్వాత M.B.B.S. కోసం మా నాన్నవాళ్ళు ప్రయత్నం చేశారు. ఇంటర్మీడియట్‌లో నా గ్రూప్ లాజిక్, ఫిజిక్స్, కెమిస్ట్రి అవటంవల్ల మెడికల్ సీటు దొరకలేదు. అంచేత B A. కెమిస్ట్రి, ఫిజిక్స్ సబ్సిడయరీగా తీసుకున్నాను. అలా చేస్తే M.B B.S. లో సీటు దొరుకుతుందని చెప్పారు. నెల్లూరులో అప్పటికి B A. లేదు.

B.A కోసం గుంటూరు వెళ్ళేవరకు నా జీవితమంతా కేవలం మా పల్లెటూరి చుట్టూ పరిభ్రమించింది. అంటే 17 ఏళ్ళు ఒక వాతావరణం, ఒక సంప్రదాయం, ఒక సంస్కృతి, ఒక ప్రగాఢ దేశీయత - ఇలాంటి జీవనాంశాల ముద్రలు రక్తకణాలమీద పడే వయస్సు ఏదైతే ఉందో ఆ భాగమంతా పల్లెటూరి బడిలోనే గడిచిపోయింది. ఈ పల్లెటూరి ప్రభావమే నా దేశం నా ప్రజలు, మండే సూర్యుడు, గొర్రిల్లాల్లో ప్రధానంగా కనిపిస్తుంది. ఆ రోజుల్లో రెండు ప్రవాహాలుగా నా జీవితం ప్రవహించింది. అప్పటినుంచీ నా జీవితమంతా ద్విధాభూతంగా రూపొందింది. (లగ్నం కూడా మిధునలగ్నం, మఖ తృతీయ చరణం.) అంటే వ్యక్తిత్వంలోనే రెండు పరస్పర వైరుధ్యాల సంఘర్షణ నిరంతరం సాగుతూ ఉంటుంది. ఫలితంగా శాంతి కోల్పోయి, ఒక శాశ్వత అశాంతికి ఈ జాతకుడు గురి అయ్యాడు.

7, 8 సం॥ వయస్సులో వీధిబడిలో చదువుకునేవాడ్ని. అప్పుడు కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు పల్లెటూళ్ళలో పనిచేసేవాళ్ళు. అందులో ప్రధానంగా జి. పద్మనాభయ్య తరచుగా మా ఊరు వచ్చేవాడు. నా వయస్సు పిల్లల్ని పోగుచేసి ఊరిబయట చెరువుగట్టున వేపచెట్టుక్రింద కమ్యూనిస్టు సిద్ధాంతాల బోధ చేసేవాడు. సాధారణంగా లెనిన్, స్టాలిన్, రష్యా విప్లవం, మానవ సమానత, ఆర్థిక సమానత, మతం నల్లమందు ఇత్యాది విషయాలు తరచు చెబుతూ ఉండేవాడు. అయితే, ఈ దూర విషయాల్ని సన్నిహిత సమన్వయం కోసం కాబోలు మా ఊళ్ళో ఉన్న పెద్ద భూస్వాముల్ని విమర్శించడం, హరిజన వాడ ఇత్యాది ఒకటి రెండు ఊరిబయట ఉన్న ఊరికి చెందిన కూలివాడల ప్రజల స్థితిగతుల్ని గురించి కూడ చెప్పేవాడు. కూలీగా ఇచ్చే ధాన్యం పిచ్చిముంతలతో

ఇస్తున్నారని, పనికి తగినంత కూలి ఇవ్వడం లేదని, అది అన్యాయమని చెప్పే వాడు. కొన్ని పాటలు నేర్పించి, సాయంకాలం పూట చీకటిపడుతున్నప్పుడు ఈ పిల్లలందర్నీ హరిజనవాడలోకి తీసుకెళ్ళి ఆ పాటలు పాడించేవాడు. వాడలో ఉన్న శ్రామిక జనంతో ఏవో చాలా మాట్లాడేవాడు.

ఆ రోజుల్లో కమూనిస్టులంటే మా ఊళ్ళో చాలా చెడ్డగా భావించేవారు. వాళ్ళతో పెద్దవాళ్ళు ఎవరూ కలిసేవారు కాదు. మా వయస్సు పిల్లలు కలిస్తే తల్లిదండ్రులు కొట్టేవాళ్ళు కనుక పద్మనాభయ్య కార్యక్రమాలు ఎప్పుడూ సాయంకాలం నుంచే ప్రారంభమయ్యేవి. ఆయన నెల్లూరు నుంచి వచ్చే చివరి బస్సులో ఐదున్నర ప్రాంతంలో ఊరిబయట దిగేవాడు. ఊరిబయట చెరువు పక్కన ఉన్న భరేశ్వరస్వామి దేవాలయంలోకి వెళ్ళి, ధ్వజస్తంభం అరుగుమీద కూర్చుని ఉండేవాడు. చీకటిపడుతున్న వేళకు పిల్లలందరు చేరేవారు. పూజారి కొడుకు చావలి రామచంద్రరావు అప్పటికే హైస్కూల్‌లో చదువుతున్నాడు. పద్మనాభయ్యకు సన్నిహిత శిష్యుడు. కమ్యూనిజంలో ఎక్కువ అవగాహన గడించాడు. పిల్లలకు బోధన చెయ్యడంలో బాగా ఆలస్యమై పొద్దుపోయినట్లయితే పద్మనాభయ్య ఒక్కొకసారి రామచంద్రరావు ఇంట్లోనే భోజనంచేసి అక్కడే పడుకొని తెల్లవారి నెల్లూరు వెళ్ళిపోయేవాడు. ఆయన మా ఊళ్ళో కొన్ని వ్యవసాయ కూలీల సమ్మెలు కూడా చేయించాడు.

ఈ పాఠాలు చెప్పేటప్పుడు పుచ్చలపల్లి సుందరయ్యగారి నాయకత్వాన్ని గురించి, ఆయన అలగానిపాడులో స్థాపించిన వ్యవసాయ కూలీల సంఘాన్ని గురించి వివరంగా చెప్పేవాడు. అప్పట్లో నాకు లెనిన్ తర్వాత పుచ్చలపల్లి సుందరయ్యగారే ప్రపంచ నాయకుడని ఒక భావం ఉండేది. ఒక్కొక్కసారి పుచ్చలపల్లి సుందరయ్యగారికి, గాంధీకి చాలా పోలికలు ఉన్నట్లు నాకనిపించేది.

పద్మనాభయ్య శిష్యుల్లో చాలమంది పిల్లలు సమ్మెస్థలానికి పోవడానికి భయపడి బడిలో ఉండిపోయేవాళ్ళు. ఒకసారి నేను వెళితే మా నాన్నని కొందరు పెద్దరైతులు విమర్శించినందువల్ల నేను బడి నుంచి ఇంటికి రాగానే తన్నాడు. ఆ పద్మనాభయ్యను కలవకూడదని శాసించాడు. పద్మనాభయ్య మా మేన మామ ప్రాత దశరథ రామమూర్తికి హైస్కూల్‌లో క్లాసుమేటు. సన్నిహిత స్నేహం ఉండేది. మా నాన్న కొడితే మా మామతో చెప్పేవాడ్ని. ఆయన పద్మనాభయ్య చెడ్డవాడుకాదు. మంచివాడే కాని ఊళ్ళో వాతావరణం బాగాలేదు

కనుక మీ నాన్న చెప్పినట్లు చెయ్యడం మంచిదని చెప్పేవాడు. తర్వాత నేను హైస్కూలు చదువుకు వెళ్ళినపుడు పద్మనాభయ్య రోజూ నా గదికి వచ్చి కాలక్షేపం చేస్తూ కమ్యూనిస్టు సాహిత్యం అందజేస్తూ ఉండేవాడు. మేముభయులం ఎక్కువ స్నేహంగా తిరిగేవాళ్ళం. కాని, తర్వాత తర్వాత రోజుల్లో స్టూడెంట్ ఫెడరేషన్ చాలా శక్తిశాలి ఉద్యమంగా ఉండేది. ఆ ఉద్యమానికి సంబంధించిన ఇద్దరు ఇంటర్మీడియట్ విద్యార్థులు త్రిపురారిభట్ల రాఘవయ్య, అమంచర్ల గంగాధరరావుల ప్రభావం నా మీద బాగాపడింది. వాళ్ళు ఉపన్యాసం చేసిన అనేక సభలకు నేను వెళ్ళేవాణ్ని. రాఘవయ్య ఉపన్యాసం ఇంగ్లీషులో ఝంఝామారుతంలా ఉండేది. గంగాధరరావు ఉపన్యాసం ఇంగ్లీషులోనే అలలు అలలుగా సముద్రం ఇసుకను కోస్తున్నట్లు మనస్సును కోసుకుంటూ లోపలికి పోయేది. పి. సి. జోషి (సి.పి.ఐ. కార్యదర్శి) ఆయన Peopes Age పత్రిక బొంబే నుంచి నడిపేవాడు. ఆ పత్రికల్ని విద్యార్థుల్లో పంచేవాళ్ళం. ఇలాంటి కార్యకలాపాలతో నా లేత వయస్సు మీద కమ్యూనిస్టు సిద్ధాంత ప్రభావం గాఢ ముద్రవేసింది. అది మా గ్రామంలో ఉన్న భూస్వామి వర్గం శ్రామికవర్గం మధ్య భేదం ఈ అర్థరూపంలో నాలో ఒక శాశ్వతవర్గ చైతన్యంగా స్థిరపడిపోయింది. ఫలితంగా ఆనాటి నుంచి ఈనాటివరకు ధనికులమీద, అధికారవంతులమీద ప్రధానంగా అసూయపర్యవసానంగా ద్వేషం సహజభావాలుగా ఎప్పుడూ నాలో ఉంటాయి. ఇతర ప్రజలుకూడా ఎందుకు ధనికుల్ని చూసి అసూయపడరు, ఎందుకు ఆశ్చర్యపడరనే ఆశ్చర్యం, ఆక్రోశం కలుగుతూ ఉంటాయి. వీటి ప్రభావమే తర్వాత ప్రారంభమైన నా సాహిత్య సృజనకాలంలో ప్రధాన నాదంగా పనిచేసింది.

బి.ఎ. చదువుతున్న రోజుల్లో సీతేపల్లి వెంకటేశ్వరశర్మ అని ఒక మిత్రుడుండేవాడు. ఆయనకు విశ్వనాథవారు బంధువు. వెంకటేశ్వరశర్మ ప్రబంధాల్లో ప్రౌఢజ్ఞానమున్నవాడు. సృజనకళాశీలి. పద్యాలు, గేయాలు, కథలు ఆ రోజుల్లో రాసేవాడు. నేను ప్రతి శనివారం, ఆదివారాలు; సెలవులు, పండుగలలో బెజవాడలో వెంకటేశ్వరశర్మగారింట్లో గడిపేవాణ్ని. తద్వారా ఆ రోజుల్లో విశ్వనాథ ప్రభావం నాలోకి ప్రవేశించింది. ఆ ప్రభావం కేవలం సాహిత్య విలువలకు మాత్రమే పరిమితం అని చెప్పాలి. కారణం? ఆ రోజుల్లో కూడా నేను కమ్యూనిస్టు సిద్ధాంతాల ప్రభావానికి లొంగిఉన్నవాణ్ణి. ఆనాడు వస్తున్న కమ్యూనిస్టు సాహిత్యాన్ని చదివేవాణ్ణి. కాని, సాహిత్యం విషయం వచ్చేసరికి ఆనాటి లెఫ్టిస్టు

సాహిత్య రచయితలు కేవలం అవ్యుత్పన్నులు కావడంచేత వాళ్ళమీద గౌరవం కుదిరేదికాదు. అదే కొన్నాళ్ళకు పెరిగి ఒక స్పష్టమైన రూపం ధరించింది. రాజకీయ సిద్ధాంతపరంగా కమ్యూనిస్టుగాను, సాహిత్యపరంగా ఏకాకిగానూ ఈ రోజు నేను ఉండడానికి వెనుక ఉన్న కారణాలు ఇవి.

విశ్వనాథగారిని ఋతుఘోషకు పీఠిక రాయమన్నప్పుడు రాస్తానన్నారు. నెలరోజుల తర్వాత కలిస్తే 'ఇంకా రాయలేదు. ఇందులో ఈ పేదలు, గుడిసెలు, ఇలాంటి ఈ కమ్యూనిస్టు గొడవ ఎందుకు? అలాంటి వాక్యాలన్నీ తీసేసి, ఫేర్‌చేసి మళ్ళీ ఆ పుస్తకం ఇవ్వండి' అన్నారు. నాకు విపరీతమైన కోపం వచ్చింది. నేనే మార్పులు చెయ్యను. మీరు పీఠికరాస్తే రాయండి, లేకపోతే లేదు అని వచ్చేశాను. తర్వాత ఒక వారం రోజులకు పీఠిక రాసి పంపించారు. మళ్ళీ మా పరస్పర ప్రేమానుబంధం తథాతథంగా కొనసాగింది.

మా తాతగారు శివయ్యగారు శివభక్తి తత్పరుడు. పార్థివలింగ పూజా తత్పరుడు. తంత్రశాస్త్ర పారంగతుడు ఆయన కరక్కాయ సిరాతో పాతకాలపు కాగితాలమీద రాసి పెట్టుకున్న తంత్రశాస్త్ర గ్రంథాలు ఉన్నాయి. కొన్ని కొందరికి ఇచ్చేశాను. ఇలా ఇచ్చివేయబడిన పుస్తకాల్లో ఒకటి ఒక అజ్ఞాత యోగి శ్రీ సూక్తానికి స్వర్ణవిద్య అని వ్యాఖ్యానం చేసిన వ్రాతప్రతి ఒకటి. ఉమా సంహిత, కపింజలసంహిత, పరాశరసంహిత అనే మూడు సంహితలు ఆయన చేతితో రాసినవి ఉన్నాయి. లక్ష్మీతంత్రం మరొకటి. గ్రథితాది ప్రయోగాలు, బీజాక్షర నిఘంటువు, వరాహకూర్మ, రామ, హనుమదాది మంత్రాలు, మంత్ర ప్రయోగాలు వాటి తీర్థక్షేత్రాదులు రాసిన గ్రంథం ఉంది. ''శ్రీ చక్రోపాసన"కు సంబంధించిన విధి విధానాలు రాసిన గ్రంథం మరొకటి.

నాకు తంత్రశాస్త్ర జ్ఞానం పితృపైతామహంగా సంక్రమించినదే. పైగా అది గ్రాంథికజ్ఞానం మాత్రమే. దేవీ దేవతల ఉపాసనలు చెయ్యాలా? అక్కర లేదా? అంటే నా దగ్గర ఖచ్చితమైన సమాధానమేదీ లేదు. ఎందుకంటే, వాటిని గురించి చెప్పడానికి కావల్సిన అనుభవంగాని, సాధనంగాని, జిజ్ఞాసగాని నాదగ్గర లేదు. అందుచేత ఈ విషయాల్లో ఏదో ఒకటి తేల్చి నిష్కర్షగా చెప్పడం సహేతుకమార్గం కాదని నా అభిప్రాయం. కాని లౌడ్‌స్పీకర్ల ద్వారా, బాజా భజంత్రీల ద్వారా వీధుల్లో ప్రవహిస్తున్న భయంకర శబ్ద సమూహరూపమైన మతానికి మాత్రం నేను బద్ధవిరోధిని. దీన్ని ప్రోత్సహిస్తున్నవాళ్ళు మాత్రం మానవ శత్రువులుగా భావిస్తాను. ఒక దేశపు గ్రామాల్లో పట్టణాల్లో మనుషుల గొంతులు వినిపించాలేగాని అన్య శబ్దాలేవీ వినిపించే హక్కు లేదు.

నేనే ఉపాసనా చేయలేదు. సంధ్యావందనం చేయడం నేను ఎరిగి ఎప్పుడూ విడనాడలేదు. సంధ్యోపాసనం నేను మతంగా భావించను. అలా ఎవరైనా భావిస్తే నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలను కూడా మతంగా భావించాలి. నా ఆకలిని కూడా మతంగా భావించాలి. నా అనేక దేహధర్మాల్ని మతంగా భావించాలి. మనిషి స్వసుఖం కోసం ఎన్నో చేస్తాడు. ఆ సుఖానికి విరుద్ధం అయిన వాటిని విసర్జిస్తాడు. ఈ దృష్టిలో సంధ్యోపాసనం విసర్జించలేను. దీనికి, మార్క్సిస్టు జీవనానికి వైరుధ్యం ఉందని అనుకోను. మనిషికి ఒక నిగూఢ ఆంతరిక జీవనం ఉంటుంది. ఆ జీవనతృప్తి కొరకు వ్యక్తి ఆచరించే వ్యక్తిగత చర్యలు తదితర విషయాలకు సంబంధించవు.

నేను కొత్తగా హైదరాబాదు వచ్చినప్పుడు కొందరు సాహిత్య మారీచుల వలలో పడ్డాను. అప్పుడు చేసిన అవివేక కృత్యాల్లో భువనవిజయం ఒకటి. అందులో కరుడుకట్టిన ఛాదస్తం, సాహిత్యాన్ని లాభదాయక వ్యాపారంగా తలచే నయవంచన, అభ్యుదయ విరోధ లక్షణాలు ఏకీభవించి మనుష్యరూపం పొందితే ఎలా ఉంటుందో అలాంటి వ్యక్తుల సాంగత్యంతో కాలం గడిపే దౌర్భాగ్యం పట్టింది ఆ రోజుల్లో. అందులో నుంచి విముక్తుడనైన తర్వాత పశ్చాత్తాప పడ్డాను. కాని ఒకటి చెప్పాలి. అందులో నేను మనసారా గౌరవించి స్నేహితులుగా భావించేవారు ఒకరిద్దరున్నారు. వారిలో డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు, ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు మొదలైనవారు.

**20-10-1927** శేషేంద్ర జననం :

తండ్రి శ్రీ గుంటూరు సుబ్రహ్మణ్యంగారు, తల్లి అమ్మాయమ్మగారు. శేషేంద్రకు తమ్ముడు రాజశేఖరం, చెల్లెళ్ళు అనసూయమ్మ, దేవసేన.

**1939-44**: నెల్లూరులో వెంకటగిరిరాజా హైస్కూల్‌లో, కాలేజీలో విద్యాభ్యాసం.

**1945-47** : గుంటూరు ఎ.సి. కాలేజిలో బి.ఎ.

**1948-49** : మద్రాసు లా కాలేజిలో ఎఫ్.ఎల్. (ఒక సం॥), బి.ఎల్. (రెండు సం॥).

**1945** : వివాహం (శ్రీమతి జానకి).

**1950** : ప్రథమ పుత్రిక వసుంధర జననం.

**1951** : ద్వితీయ పుత్రిక రేవతి జననం.

1956 : ప్రథమ పుత్రుడు వనమాలి జననం.

1958 : ద్వితీయ పుత్రుడు సాత్యకి జననం.

1949-55 : డిప్యూటి పంచాయతీ ఆఫీసర్‌గా కందుకూరు, పొదిలి, దర్శి, పిఠాపురం, సామర్లకోట, తుని మొ॥ ప్రాంతాలలో ఉద్యోగం.

1956-65 : కమీషనర్‌గా తిరుపతి, ప్రొద్దుటూరు, కడప, బొబ్బిలి, గూడూరు, పెద్దాపురం, ఒంగోలు, చిత్తూరు, కాకినాడ, రాజమండ్రి, విజయవాడ, కర్నూలులలో ఉద్యోగం.

1965-85 : హైద్రాబాదు మున్సిపల్ కార్పొరేషన్‌లో అసిస్టెంటు కమీషనర్‌గా, డిప్యూటి కమీషనర్‌గా, సెక్రటరీగా ఉద్యోగం.

1975 లో ఎమర్జెన్సీ చట్టంక్రింద కంపల్సరీ రిటైర్‌మెంట్.

1978 లో తిరిగి ఉద్యోగంలో ప్రవేశం.

1985 లో మే నుండి అక్టోబర్ వరకు మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ ఆఫీస్‌లో చీఫ్ వాల్యుయేషన్ ఆఫీసర్‌గా ఉద్యోగం, అక్టోబర్‌లో రిటైర్‌మెంటు.

1969 : మారిషస్, మడగాస్కర్, తూర్పు ఆఫ్రికా దేశాల పర్యటన.

1970 : ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, గ్రీసు దేశాల పర్యటన.

1977 : శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా నియామకం.

1977 : నా దేశం-నా ప్రజలు ఉర్దూ అనువాదానికి ఉర్దూ అకాడమీవారి బహుమతి ప్రదానం.

1981 : మఖ్దూం మెమోరియల్ అవార్డు మరియు నా దేశం-నా ప్రజలు హిందీ అనువాదానికి 'హిందీ ప్రతిష్ఠాన్' బహుమతి.

1985 జూన్ : 'కవి ఔర్ కవితా' శీర్షికన ఢిల్లీ దూరదర్శన్‌నుండి శేషేంద్ర కవితాపఠనం.

1987 జూన్ 24-28 : గ్రీసు దేశంలోని Delphi నగరంలో జరిగిన International meeting on Ancient Greek drama అనే సదస్సులో Comparative Aspets on Anciant Greek and Indian Literature అనే విషయంపై ఉపన్యాసం.

("శేషేంద్ర కావ్యానుశీలనం", పెన్నా శివరామకృష్ణ పరిశోధనా వ్యాసం నుంచి అక్టోబర్ 1993 )

# కమ్యూనిజాన్ని తిట్ల సుడిగుండంగా మార్చారు

రాత్రి నిద్రకొమ్మకు వ్రేలాడుతున్నప్పుడు శేషేంద్ర ఒంటరిగా స్వప్నంలోకి నడుస్తాడు. ఆశల్ని, ఊహల్ని పోగుచేసి ప్రతీకల్లో వేసుకుని మెలకువలోకి తిరిగొస్తాడు. బద్ధకంగా ఒళ్ళు విరుస్తున్న ప్రపంచంలో కవిత్వం అనే ఇంద్రజాలంగా విరబూస్తాడు. తన అక్షరం కొడవలి ప్రథమ చంద్రరేఖలా ఈ శతాబ్దంమీద ఉదయించాలని తపనపడతాడు.

పెదవుల తీరాలు చేరడానికి ఒక స్వరం ఎన్ని గుండెల తుఫానులు దాటాలో శేషేంద్ర అక్షరాలు పరిశోధిస్తాయి. గ్రామానికి సంగ్రామానికి మధ్య ఎన్ని తుపాకుల దూరమో శేషేంద్ర కవిత్వం అంచనా వేస్తుంది. మహళ్ళలోనే కాదు-గుండెల నెగళ్ళలో కూడా తోటలుంటాయని, కవిత్వం లాంటి ఆ తోటలో ఒక నెమలి నిమిలీలా నర్తిస్తుందని శేషేంద్ర సాహిత్యం ఘోషిస్తుంది.

శేషేంద్ర అచ్చమైన కవి. ఎన్నో దుమారాలు లేపిన వివాదాస్పద కవి. శబ్దాలకు రెక్కలిచ్చి నిశ్శబ్దాల్లోకి ఎగరేసిన కవి. 'కవిత్వం ఎర్రగుర్రంలా పరుగెత్తుకు వస్తోంది, రక్తంతో మునిగిన బాణంలా, వీరుడు విడిచిన ప్రాణంలా. దానికి నా అంతరంగిక నీలి సముద్రం అంకితం' అంటాడాయన. 'ఉదయం' ప్రతినిధిగా త్రిపురనేని శ్రీనివాస్ ఇటీవల శేషేంద్రతో జరిపిన ఇంటర్వ్యూ :

* * *

భౌతిక జీవితానికి సంబంధించి మార్క్సిజం ఆమోదిస్తున్నానంటారు. మార్క్సిజం అంటే ఆలోచన అక్కరలేని ఆచరణ అని భాష్యం చెప్తున్నారు. ఎప్పటి పరిస్థితినిబట్టి అప్పటికి స్పందించటం మార్క్సిజం అంటున్నారు. మార్క్సిజంతో ఏ కొంచెం పరిచయం ఉన్న వాళ్ళయినా ఇది మార్క్సిజం కాదని గుర్తిస్తారు ఉన్నత స్థాయి వివేచన, ఆచరణల ఐక్యత మార్క్సిజానికి ప్రాతిపదిక. మీరు చెబుతున్నది వక్రీకరణ కాదా?

శేషేంద్ర : కాదు. ఉన్నతస్థాయి వివేచన కావాలి; కాని కీలకస్థానం ఆచరణదే భారతదేశంలో మార్క్సిజం వివేచన దగ్గరే ఆగిపోయింది; ఆచరణ

దగ్గర ఛిన్నాభిన్నమైపోయింది. ఈ దేశంలో నలభై, యాభై ఏళ్ళ తర్వాత కమ్యూనిజం ఎంత ఉంది? ఎవరు దీనికి బాధ్యులు? కమ్యూనిజాన్ని ఇప్పుడు నీవు మార్క్సిస్టు కాదంటే నీవు కాదు అనే తిట్ల సుడిగుండంగా మార్చారు. ఒకడు మార్క్సిస్టు కాకపోతే వాడ్ని మార్క్సిస్టుగా మార్చడానికి నీవు ఏ కృషి చేశావు? దేశమంతా మార్క్సిస్టు దృక్పథంతో సాంద్రతరం కావలసిన అవసరం ఉందా లేదా విప్లవం రావాలంటే?

ప్రతివాడిలో విప్లవ చైతన్యం వ్యాప్తం చెయ్యడానికి బదులు విప్లవ చేతన ఉన్నవాడ్ని కూడా బుద్ధిపూర్వకంగా ఖండిస్తున్నారు. ఇది స్పష్టంగా విప్లవ ద్రోహం. మార్క్సిజాన్ని మొనాపొలీ చేసుకుని ఒక మతంగా మార్చారు. అలా కాకుండా అది కార్యాచరణ సాధన మాత్రంగా ఉండాలని నా అభిప్రాయం నిజంగా కూడా అది అంతే. లెనిన్ ఈ సందర్భంలోనే అన్న వాక్యాలు గుర్తించాలి-"That in no sense as something complete and unassailable; but on the contrary we are convinced that this theory is only the corner-stone of that science which socialists must advance in all directions if they are not to fall behind."

ఒక గ్రామంలోనో, చిన్న ఊళ్ళోనో పుట్టి అక్కడే పెరిగి ఆ జీవితం తప్ప వేరే జీవితం తెలియక, వేరే భాషలతో పరిచయం లేక, ప్రపంచ సాహిత్యం చదవక కవిత్వం రాసేవాళ్ళు గొప్ప కవులు కారనీ, పలుభాషల సాహిత్యంతో పరిచయం ఉండి, పుస్తకజ్ఞానం పుష్కలంగా ఉండి చాలా ఊళ్ళు చూసి జీవితాన్ని అనుభవించినవాళ్ళే మంచి కవిత్వం గ యగలరనీ అన్నారు. (Letters of Seshendra) అంటే డబ్బులు బాగా ఉంటే తప్ప మంచి కవి కావడానికి వీలులేదా?

శేషేంద్ర : ఒక పల్లెటూళ్ళో ఉన్నవాడు మహాకవి కాలేడా అని అధిక్షేపణ చేసినట్లుంది ప్రశ్న నిజమే - కాలేడు. జానపద సాహిత్యంలో హృదయాన్ని ఎంతో చుంబించే కవిత్వం మనకు దొరుకుతుంది. కాని దేశ సంచారం చేత బహుజన సంపర్క సిద్ధికలిగి, ఉత్తమ కావ్యకర్తలైన కవుల్ని అధ్యయనం చేసి సంస్కారస్థాయి పెంచుకుని కవిత్వం రాసే వాడి కవిత్వంలో ఉన్న జ్ఞానదాయిక 'శక్తి', భావవికాస లక్షణమూ జానపద కవిత్వంలో లభ్యం కాదు.

కబీరు ఎన్నో జ్ఞానదాయక దోహాలను చెప్పడానికి ఉన్న కారణాల్లో అయన చేసిన విస్తారదేశ పర్యటన ఒక ముఖ్యమైనది అనడంలో ఏ సందేహమూ లేదు. తొట్లోవేసిన చెట్టు మన నడుం వరకు పెరిగితే స్వేచ్ఛగా విశాల ధరిత్రి మీద వేసిన వృక్షం లక్షలాది ప్రజల చూపులు చేరే ఎత్తుకు పెరుగుతుంది. డబ్బు బాగా ఉండడం చేతనే కబీరు దేశ పర్యటన చేయగలగలేదు.

రైతాంగ ఉద్యమాలలో ఎంతోమంది కవులు పుట్టుకొస్తున్నారు. వాళ్ళకు తమ గ్రామం, పరిసరగ్రామాలు తప్ప వేరే ప్రపంచంతో ప్రత్యక్ష పరిచయం లేదు. తమ భాష (అందులోనూ తమ ప్రాంతపు నుడికారం) తప్ప వేరే భాష తెలీదు. గిరిజన ఉద్యమాలలో పుట్టిన కవులకైతే గిరిజన భాష తప్ప 'నాగరిక' భాషలేవీ ఎరుగరు. వీళ్ళంతా కవులు కారా?

శేషేంద్ర : వాళ్ళంతా కవులే, కానీ మయకోవ్‌స్కీ, అలెగ్జాండర్ బ్లాక్, మెండల్ ష్టామ్, అన్నా అఖ్మటోవా, యానిసెన్ లేక మన శ్రీశ్రీలాంటి కవులు కారు.

మారుతున్న సమాజంతోపాటు పదాలకు అర్థాలు కూడా మారుతుంటాయి కదా! మరి మీరు 'వ్యక్తి' అనడానికి బదులు 'ఆత్మ' అని, అధ్యయనాన్ని తపస్సు అని, వర్తమాన సామాజిక వ్యవస్థను విధి అని, ఆర్థిక విముక్తిని మోక్షం అని రాయడానికి కారణం ఏమిటి? దానివల్ల ఆధునికత అర్థంగాక సంప్రదాయ అర్థం స్ఫురించడం లేదా?

శేషేంద్ర : మీరన్నట్లు వాస్తవంగా మారుతున్న సమాజంలో పదాలకు అర్థాలు కూడా మారుతుంటాయి. వ్యక్తి సమాజపు లోతు అయితే, ఆత్మ వ్యక్తి లోతు; అలాగే అధ్యయనపు లోతు తపస్సు - వర్తమాన సామాజిక వ్యవస్థను నేను 'విధి' అనే పదానికి అర్థంగా గానీ పర్యాయపదంగా గానీ వాడలేదు. డిజార్గనైజ్డ్‌గా ఉన్న వర్తమాన సామాజిక వ్యవస్థ చాలా గజిబిజిగా ఉందనీ, ఆ చిక్కుపడ్డ దారం లాంటి సమాజంలో కార్యకారణం సంబంధాలు వెదకడం అసాధ్యమనీ, కనుక ఒకటి ఒకడికి ఎందుకు సంభవించింది అని అడిగితే కారణం చెప్పలేని పూర్వకాలం విధి అనే సులభమైన సమాధానం కనిపెట్టారనీ నా భావం. అలాంటి అనిర్వచనీయ విధి సోషలిస్టు సమాజం వస్తే తనంతట తానే అదృశ్యమై

పోతుందనీ నా తాత్పర్యం. ఎందుకంటే, అప్పుడు ఆ సువ్యవస్థిత దశలో సమాజం సుస్పష్టంగా ఉంటుందనీ అందుచేత కార్యకారణసంబంధాలు స్పష్టంగా కనిపిస్తాయనీ, ఇప్పుడు మార్క్సులాంటి మేధావులకే విశ్లేషణా పూర్వక పరిశోధన చేతనే కనిపిస్తాయనీ, అలాంటి విశ్లేషణాపూర్వక పరిశోధనా ఫలితాలు కూడా వివాదగ్రస్తం అవుతుంటాయనీ నా అభిప్రాయం. ఇది శబ్దార్థాల గొడవ కాదు. ఆర్థిక విముక్తి మోక్షం అనడం కూడా అదే ధోరణి. మోక్షం అంటే లిబరేషన్ విముక్తి ముక్తి మోక్షం అనే శబ్దాలు సమానార్థకాలు. మోక్షం తత్వశాస్త్ర పరిభాషలో ఉన్నప్పటికీ, అది సామాన్యభాషలో ఉపయోగింపబడడం తత్వ శాస్త్రమూలంగా ఆగిపోలేదు మోక్షానికి అదునిక శబ్దం లేదు. ఉంటే మోక్షం వాదే వాడ్నికాదు. నూటికి తొంభై వంతులు మన దేశంలో ప్రజలు ఇరవయ్యో శతాబ్దం వాళ్ళు కాదు. మన అర్బన్ భాష గ్రామాల్లో పనిచేయదు. వాళ్ళకింకా భారత, రామాయణాల భాష, భావజాలమూ, సన్నిహిత బంధువులు. మన రచయితలు వాళ్ళలో వాళ్ళు స్పర్థలతో పోట్లాడుకోవడంకంటే గ్రామీణ ప్రాంతాల్లో అదునికత రావడానికి కృషి చెయ్యడం వర్తమాన అవశ్యకత.

మిమ్మల్ని మీరు అదునిక కవి అని భావిస్తూ కూడా మీరు రాసిన 'అదునిక మహాభారతం' పుస్తకంలో ఒక్కో అధ్యాయాన్ని పర్వాలుగాను, అంతా అయ్యాక 'ఇది వింశతిత శేషేంద్రనామ సంవత్సర' అని ముగించడం ఎందుకు? అది ప్రాచీన కవుల లక్షణం కాదా?

శేషేంద్ర : మహా విప్లవకవి అయిన శ్రీశ్రీ కావ్య సంకలనానికి మహా ప్రస్థానం అని పేరు పెట్టారు. మహాప్రస్థానం మహాభారతంలో ఉన్న పద్దెనిమిది పర్వాల్లో ఒక పర్వానికి పేరు. దానికేమంటారు? అయితే ఇక్కడ అదునిక మహా భారతం అంటే Modern Great India అని అర్థం - అని అవతారికలో వివరింపబడి ఉండడం చూడవలసిన బాధ్యత పాఠకుడికి ఉంది. పైగా, మనం కొందరం అనుకుంటున్నట్లు మన ప్రజలు అదునికులు కారు భారతదేశం గ్రామాల్లోకి వెళితే ప్రత్యక్షమవుతోంది పదహారో శతాబ్దం. మన దేశంలోకి ఇరవయ్యో శతాబ్దం ఇంకా రాలేదు. మన దేశం ఫ్యూడల్ యుగంలోనే ఉంది. ఇప్పుడిప్పుడు తలెత్తుతున్న క్యాపిటల్ కూడా గ్రామాల కుండల్లో నుంచి పిడతల్లో నుంచి, భోషాణాల్లో నుంచి సమీప పట్నాలవరకే ప్రయాణం చేస్తోంది. హోటళ్లుగా, సినిమాలుగా, సబ్బులుగా వగైరాలుగానే మారుతోంది. పాశ్చాత్య దేశాల క్యాపి

టల్‌కూ, మన దేశవాళీ క్యాపిటల్‌కూ కొలోన్‌కూ, గోంగూరకూ ఉన్నంత తేడా ఉంది. ఈ కుల మతాల పీడితులు ఎంతో దూరం వెళ్ళలేరు. ఒక స్నేహితుడు అన్నాడు - మా పల్లెల్లో పద్యాల కవిత్వం చదువుతారేగాని మీ వచన కవిత్వం అంటే ఇష్టంలేదు అని! మన ప్రజల్లో ఇంకా దేవాలయాలు, మోక్షము, విధి, భారతము, రామాయణము, పాపము, పుణ్యము, కర్మ - ఇవన్నీ యథాతథంగా ఉన్నాయి. దీనికి మన ఎన్నికలకంటే ప్రబలమైన సాక్ష్యం మరొకటి లేదు. ఈ దేవాలయాల లిస్టును నమ్మేవాళ్ళవైపే ఓట్లు ప్రవహిస్తున్నాయిగానీ, నూతన ప్రపంచం నిర్మిద్దామని కలలుకంటూ జీవితాలు ఖతం చేసుకున్నవాళ్ళవైపు ఒక్క ఓటుబొట్టు కూడా రాలడంలేదు. అందుచేతనే అంటాను, వర్గచైతన్యం కోసం మహోద్యమం ప్రారంభం కావాలి అని.

కవులు ప్రజలకన్నా గొప్పవారంటున్నారు. అంతిమంగా ప్రజలే గొప్పవారవుతారుగాని కాస్త చదువుకుని, రాయగలిగినంత మాత్రాన కవులు గొప్పవారెలా అవుతారు?

శేషేంద్ర : వివేచన, అంతర్వితర్కము, జ్ఞానము-ఇలాంటి విశేష ఆంతరిక చర్యలు అందరు మనుషుల్లోనూ ఉండేవి కావు. కొందరే వాటిని అభ్యసిస్తారు. దాని ఫలితంగా ఒక సంస్కార విశేషం గడిస్తారు. అందరికి ఇది సాధ్యం కాదు కవి ఆ విశేషగుణ సంపన్నుడు గనుక అన్యమానవులకు ఒక మాట చెప్పే యోగ్యత గడించుకున్న వాడవుతాడు. ఆ విధంగా కవి గొప్పవాడనే కాని, ఒక ఆఫీసరులా, ఒక మంత్రిలా, ఒక ధనికుడిలా గొప్పవాడనికాదు. వాస్తవానికి కవి కేవలం సాధారణ మానవుడే. ఎంత సాధారణ మానవుడయితే అంత ఉత్తమ కవి అవుతాడు సాధారణ మానవుడుగా జీవించడంచేతనే ఒక కవి తన కవిత్వాన్ని సాధిస్తాడు. సాధారణ మానవుడవడంచేత యావత్తు మానవ జీవన అనుభవాలకూ కష్టసుఖాలకూ తనని గురి చేసుకుంటాడు. కవిత్వ సృజనకు కావలసిన పక్వదశ పొందుతాడు. అదే అతని కవితకు బీజం. ప్రజలు కవులకన్నా తెలివిగలవారనడం వాస్తవం కాదు. అది ఒక అజ్ఞాన ప్రచార ప్రేరిత ఉత్సాహము; సతర్కిత సత్యం కాదు.

సమకాలీన తెలుగు సాహిత్య విమర్శ గురించి ఏమనుకుంటున్నారు?

శేషేంద్ర : సాహిత్యరంగంలో విమర్శ కోర్టులో జడ్జిలాంటిది. రుజావు కావలసినంతవరకు ముద్దాయిని పెద్దమనిషిగా భావించడమే న్యాయవ్యవస్థ అవలంబించే సూత్రం అంటే, ఇక్కడ నైతికత కీలకస్థానంలో ఉంది. చాలామంది తెలుగు విమర్శకుల్లో న్యాయస్పృహ లేదు. రాజకీయ, సామాజిక పరిస్థితుల కారణంగా రూపొందిన పలుకుబడిగల వర్గాల్ని పోటీపడి మెప్పించడమే తమ నీతిగా అవలంబించినవాళ్ళు తెలుగులో ఎక్కువమంది విమర్శకులు. కారణం? ఆ వర్గాల్ని అనుసరిస్తే లాభదాయకమనీ, ఎదిరిస్తే నష్టదాయకమనీ వాళ్ళ అభిప్రాయమని స్పష్టమవుతోంది. రెండవది, పెద్ద లోపం ఎక్కువమంది విమర్శకులకు వాస్తవంగా కవితాస్పృహ లేదు. అసలు హృదయపూర్వకంగా సాహిత్యంలో మునిగితేలుతూ తన్మయత్వం పొందే సాధు విమర్శకులు మనకు లేరు; ఇది మన దురదృష్టం. ఎందుకంటే, మంచి విమర్శ లేకపోతే మంచి కవిత్వం అభివృద్ధి పొందదు.

ప్రతీకల మేడమీద మీరు సృష్టించిన కవిత్వంలో వాస్తవాన్ని ఊహ మింగేసిందనే విమర్శకు మీ జవాబు ?

శేషేంద్ర : కవిత్వ తత్వజ్ఞానం అసమగ్రం అవడంచేత ఇలాంటి అభిప్రాయం కలుగుతుంది. ఇతోధిక జ్ఞానార్జనచేత అది సమసిపోతుంది. ప్రతీకలు ఇష్టకష్టే ఇటుకరాళ్ళలాంటివి కాదు; కవిత్వం ఊహామాత్రమే కాదు. కవి జీవన సంగ్రామధాటిలో ఎగిరిపడే అగ్నికణాలు ప్రతీకలు. ప్రతీకలు అన్యథా పుట్టవు. కనుక ప్రతీకలు జీవన వాస్తవాల్లోంచే పుడతాయి. ఉదా : 'సూర్యుడు కిరణాల ఖండ్లు తోలుకుని వస్తున్నాడు' (నా దేశం - నా ప్రజలు), 'నేను జేబుల్లో కోకిలల్ని వేసుకుని రాలేదు, పిడికిళ్ళలో బాంబులు బిగించుకుని వచ్చాను (గొరిల్లా). ఇవి ప్రతీకలు వాస్తవాల్లోంచే పుట్టాయి ఇలా ఉదాహరణలు కోకొల్లలు ఉన్నాయి.

కొత్తగా కవిత్వం రాస్తున్నారా?

శేషేంద్ర : కొత్తగా కవిత్వం రాయలేకపోతున్నాను. తాజా అనుభూతుల్ని స్వీకరించే శక్తి నా శరీరం కోల్పోతుందేమో అనిపిస్తుంది. బహుశా చాలాకాలం పట్టవచ్చు నేను మళ్ళీ కవిత్వం రాయడానికి! *

(ఉదయం దినపత్రిక 16-12-89)

# కమ్యూనిజం నాలో స్పందించే ఏక్‌తారా

ఛందోబద్ధమైన పద్యంతో కాదు, పెదాలపై హాయిగా విహరించే పాటతో కవిత్వ రంగంలోకి ప్రవేశించారు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ. ఇప్పటికి ముప్ఫయిఏడేళ్ళ క్రితం 'విశాలాంధ్ర' దినపత్రికలో ఆయన తొలిపాట అచ్చయింది.

''ఈ ప్రపంచంలో ఎక్కడున్నా సరే
ధ్రువములకు మధ్యవలె దూరమైనా సరే
మన బాధలూ ఒక్కటే ఎల్లప్పుడూ
మన గాథలూ ఒక్కటే'' - దాని పల్లవి.

అప్పటి నుంచి ఆయన కొంతకాలం వరకు పాటనే తన భావ వ్యక్తీకరణ సాధనంగా వాడుకున్నారు. పాటతోనే మా ముఖాముఖి మొదలయింది....

ప్రశ్న : మొదట్లో పాట మాత్రమే రాయడానికి ప్రత్యేకమైన కారణాలేమైనా వున్నాయా?

శేషేంద్ర: మొదట పాటలే రాసేవాణ్ణి. కమ్యూనిస్టుపార్టీతో, స్థానిక ఉద్యమాలతో విద్యార్థిదశలోనే ప్రభావితుడ్నయాను ఏడెనిమిదేళ్ళ వయసులో వీధి బళ్ళో చదువుతున్న రోజుల్లో కూడా కమ్యూనిస్టు పార్టీ ప్రభావం ఏదో ఒక విధంగా నామీద వుంది. ప్రభావం అంటే సిద్ధాంతాలు చదవడం కాదు. ఒక స్థానిక నాయకుడు వుండేవాడు. అతను మమ్మల్ని హరిజనవాడకు తీసుకువెళ్ళి పాటలు పాడించేవాడు. సాయంత్రం ఏ చెట్టుకిందనో కూర్చోబెట్టి మార్క్సిస్టు పాఠాలు చెప్పేవాడు. ఆ భావజాలం, ఉత్పత్తి సాధనాలు సామాజికం చేయడం ఇలాంటి థియరీలు సంగ్రహంగా, అస్పష్టంగా తెలుసు. కాని, Implications బాలా గాఢంగా వుండి తెలిసేవికావు. స్థానిక నాయకులనే ఏదో అడిగేవాణ్ని. వాళ్ళే ఏదో చెప్పేవాళ్ళు

ప్ర: అంటే, మార్క్సిజం గురించి మొదటినుంచీ మీకు పరోక్ష పరిచయమే వుందా?

శే: ఇప్పుడు వున్నంత గాఢమైన అవగాహన అప్పుడు లేదు. స్థానిక నాయకులతో సంప్రదించడం, మాట్లాడడం, జనశక్తి విశాలాంధ్ర సంచికలు, గోర్కీ సాహిత్యం చదవడం - ఇలాంటివి వుండేవి. అప్పుడు చేతికి దొరికిన కమ్యూనిస్టు సాహిత్యం అంతా చదివాను. అంతవరకే గానీ సీరియస్‌గా థియరీ లోపలికి వెళ్ళి ఆనాడు చేసిన అధ్యయనం ఆనాడు లేదు. కాని మానసికంగా నేను అటువైపే ప్రభావితమయ్యేవాణ్ణి.

ప్ర: పార్టీలో విభేదాలు మీ మీద ఏమైనా ప్రభావం చూపాయా?

శే: కమ్యూనిస్టు పార్టీ '54 ఎన్నికల్లో ఓడిపోయిన తర్వాత అనేక సంవత్సరాలు క్రియాశూన్యంగా వుంది. పార్టీ కార్యక్రమాలు ముమ్మరంగా లేకపోవడంతో అంతా నిర్జీవంగా వున్నట్టు ఒక అభిప్రాయం లేదా వాతావరణం ఏర్పడింది. పార్టీ ఎన్నికల్లో ఓడిపోయినప్పుడు కవిత రాశాను. ఆ కవిత 'పశువులు' కావ్యంలో అచ్చయ్యింది:

"రామాప్పు వట్టిన, వట్టాత సెకండు అఖండమైనా
లోక బాంధవుడు అసలే లేకుండా పోతాడా?"

ఇది అప్పుడే విశాలాంధ్రలో వచ్చింది.

పార్టీ పార్లమెంటరీ విధానం స్వీకరించిన తర్వాత అప్పుడు బాగా మంది. అంటే పార్టీతో ఎక్కువ సంబంధం వున్నవాళ్లు పార్టీలో ఎక్కువ ఉత్తేజితులై జీవితమంతా దానితోనే Activise అయినవాళ్లు నిరాశలో పడ్డారు. ఆ వాతావరణం విశ్వప్రియ కవితలో చూపించాను.

అయితే మొత్తంగా పార్టీలో విభేదాలు నా మీద ఎలాంటి ప్రభావమూ చూపలేదు. సాధారణంగా వామపక్ష రాజకీయాల మీద ఆసక్తి వుంది. ఆ అడుగుల్లోనే అడుగువేస్తున్న మనస్తత్వం వుండేది.

'ఋతు ఘోష' చూడండి. అది లెఫ్టిస్ట్ పొయిట్రీ. అన్ని ఋతువుల్లో పేదల జీవితం ఎలా వుందో చూపించడం కోసం ఆ కావ్యం రాశాను. మనం చెప్పే విషయం దృశ్యాదృశ్యంగానే వుండాలి. బట్టబయలుగా వాచ్యంగా వుండ కూడదు. 'పశువులు' అనే సంకలనం నిండా లెఫ్టిస్టు పొయిట్రీ వుంది. దాన్ని కూడా సాహిత్యవిమర్శలోకి తీసుకోవాలి.

ప్ర: పద్యంలో లెఫ్టిస్ట్ భావాలు వ్యక్తం చేయడం సమంజసమేనా?

శే: ఛందస్సుకీ, లెఫ్టిస్ట్ భావాలకి 'క్లాష్' లేదు. మార్క్సిజం కవిత్వ వస్తువుగా తీసుకుని రష్యాలో ఎందరో ఛందస్సులో కవిత్వం చెప్పారు. యూరప్‌లో కూడా అంతే. మయకోవస్కీ, అలెగ్జాండర్ బ్లాక్ ప్రభృతులు అంతా మీటర్‌లోనే కవిత్వం చెప్పారు 1950 ప్రాంతంలో కుందుర్తి 'జయంతి' సంచికలో 'పీఠమానిని' అనే ప్రోగ్రెసివ్ కవిత వచ్చింది. అదీ ఛందోబద్ధమే. మీటర్‌కీ మార్క్సిస్టు వస్తువుకీ వైరుధ్యాలు లేవు. ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని ఛందస్సులో రాశాను. ఆ తర్వాత ఛందస్సులో రాయడం మానేశాను.

## ఛందస్సు నుంచి 'చమత్కారిక' దాకా

గజల్‌రూప ప్రభావం ప్రబలంగా వున్న ఉర్దూ సాహిత్య సంస్కృతి నుంచి వచ్చినవాణ్ణి కనుక నేను కవిత్వంలో పాఠకుణ్ణి కాదు - శ్రోతని దృష్టిలో వుంచుకుంటాను. ఛందస్సులో రాసిన కవిత్వాన్ని చదివినప్పుడు శ్రోతకు నేను చప్పున చెప్పదల్చుకున్న విషయం అందకుండా పోవడం గమనించాను. నేనేదో గబగబా చెప్పుకుపోయేవాణ్ణి. శ్రోతమీద దాని ప్రభావం పడేది కాదు. నాకు కవిత్వం చెప్పాలంటే శ్రోత మొహం కనిపించాలి. అతని మొహంలో ఉత్సాహం, సంతోషం వంటి రియాక్షన్స్ నేను చూడాలి. ఆ రియాక్షన్‌తో ఉత్సాహ ప్రేరితుణ్ణి అయి కవిత్వం చదవాలి. ఇది నా విధానం. పద్యం దగ్గిర ఇది విఫలమైంది. కవిత్వరూపంగా సాధించిన చమత్కారాన్ని శ్రోతమీద వేసి వాణ్ణి చకితుడ్ని చేయడమెలా అన్న ఆలోచన కలిగింది. అసలు ఈ పద్యాల భాష ఈ రోజు శ్రోతకు పనికిరాదని తెలుసుకున్నాను. అది శ్రోతకూ, మనం చెబుతున్న విషయానికీ మధ్య పెద్ద గోడగా నిల్చింది అంటే, వాడు ఈ గోడ ఎక్కి దిగాలి ఆ ఇబ్బంది తొలగించడానికి నేను సాధారణ వ్యావహారిక భాష తీసుకున్నాను.

ప్ర : కొత్త 'డిక్షన్ (భాష)ని వెతుక్కుంటున్న సమయంలో మీ మీద ఏ ప్రభావాలు పనిజేశాయి?

శే : ప్రభావం పడడం అనే స్థితి నా దగ్గర తలెత్తలేదు. అప్పటికే నేను సాహిత్యంలో చాలా సాధన చేసిన పరిణత వ్యక్తిని. అనేక శాస్త్రాలు చదివాను. సంస్కృత సాహిత్యమంతా మథించాను. తర్వాత జెనెటిక్స్; న్యూక్లియర్

సైన్స్ వగైరా గ్రంథాలు ఏమేమో చదివాను. నేనే ఒక జ్ఞాన భాండారంగా మారాను.

కవిత్వం ఒక చమత్కారం. గడియారం అంటే ఏమిటి? దాని 'కీ' వుండాలి. అది టిక్కు టిక్కు మనాలి గడియారానికి 'కీ' ఎలాగో, మనిషికి గుండె లబ్ డబ్ అనడం ఎలా లక్షణమో, కవిత్వానికి చమత్కారం అలా లక్షణం ఈ చమత్కారం ఎప్పుడు లేదో అప్పుడు గుండె ఆడడం మనిషిలో లేనట్టే. అంటే- నిర్జీవ పదార్థమని. ఆ గడియారంతోనూ, ఈ మనిషి శరీరం తోనూ ఏమీ చేయలేం. చమత్కారంతోనే సాధన చేసుకుని ఏ ప్రయోజనమైనా సాధించుకోవాలి. ప్రయోజనం సాధించాలంటే జీవంతమైన కవిత్వం కావాలి. ఆ జీవంత కవిత్వంకోసం చమత్కారం కావాలి. చమత్కారంచేత శ్రోతని ఆకర్షించి వశీకృతుడ్ని చేసుకొన్నప్పుడే వాడిమీద మన ప్రయోజనం నెరవేరు తుంది. చమత్కారం అవసరాన్ని గుర్తిందాక పద్యభాషని విసర్జించాను. పద్యం విన్న శ్రోత చకితుడు కావాలన్న నా కోరిక 'చమత్కారిక'తో నెరవేరింది. ఇది నాకు నేను తెలుసుకోవాలి. ఇంకెవడో చెప్పాల్సిన అవసరం లేదు.

ప్ర : మీలో ఈ మార్పు జరుగుతున్న దశలో తాత్విక భూమిక ఏమైనా మారిందా?

శే : ఏ మార్పు రాలేదు. నా తాత్విక భూమిక ఎప్పుడూ ఒకటే. శాశ్వతంగా నాలో స్పందించే ఏక్‌తారా కమ్యూనిజం. మనుషులు అందరూ సమానులే. భూగోళం మనిషి సంపద. అందరూ సమానంగా అనుభవించాలి. ఎలా అనుభవించాలి, ఏమిటి అన్న ఆచరణకు కావలసిన పథకాలు మార్క్సిజం చూపిస్తుంది. మనిషిని ఈ దిశగా పునర్నిర్మించే సమాజం రావడం అనివార్యం అనే విషయంలో నేనెప్పుడూ ఒకే మార్గం.

ప్ర : కమిట్‌మెంట్ (నిబద్ధత) అవసరమా?

శే : కమిట్‌మెట్ అంటే సాధారణంగా కమ్యూనిస్టు పార్టీకి కమిట్మెంట్. చాలాచోట్ల నిబద్ధులైన రచయితలున్నారు, మనకూ వున్నారు. అయితే, ఒక విషయం - అక్టోబరు విప్లవం తర్వాత అనేక దేశాల్లో కమ్యూనిజం వచ్చింది; చాలా చరిత్ర సృష్టించింది. ఎన్నో అనుభవాలు గడించింది. ఇప్పుడు మనం ఏ సందర్భంలో వున్నామంటే - ఆ అనుభవాల కాంతిపుంజంలో మళ్ళీ కమ్యూనిజాన్ని సమీక్షించుకోవాలి.

ఒక రచయిత ఒక పార్టీకి నిబద్ధుడై వుండడం ఆక్షేపణకరమేమీ కాదు. పార్టీకి నిబద్ధులైన కవులు ఒక సమాజంగానో, సంఘంగానో ఏర్పడడంతోనూ

తప్పులేదు. అయితే, పార్టీకి నిబద్ధులైన కవులు ఎప్పుడూ పార్టీని అనుసరించి పోవాల్సి వుంటుంది. పార్టీ అనేక రాజకీయ పరిస్థితుల మూలంగా మారుతూ వుంటుంది వాళ్లల్లో వాళ్ళకు అంతర్గత భేదాభిప్రాయాలు వస్తూంటాయి. అయితే, వాటిని ప్రజాస్వామికంగా పరిష్కరించుకోవచ్చు. లేకపోతే, అనేక పార్టీలుగా విడబడిపోవచ్చు కూడా. అంటే, వాళ్ళతోపాటు ఈ రచయితలు కూడా విడబడి పోవడం అనివార్యమవుతోంది. అప్పుడు రచయిత స్థానం, బాధ్యత ఏమిటి? రచయితకు ప్రజలతో సంబంధం వుండాలా? పార్టీతో సంబంధం వుండాలా? అన్నది ప్రశ్న. పునాదిగతంగా ఒక రచయితకి ప్రజలతోనే సంబంధం వుండాలి. రచయిత డైరెక్టుగా ప్రజలకు నిబద్ధుడై వుండడమే ఉత్తమ పద్ధతి.

## శ్రీశ్రీ ప్రభావం ఏనాడో పోయింది

ప్ర : ఆధునిక కవిత్వం మీద శ్రీశ్రీ ప్రభావం వుందా?

శే : శ్రీశ్రీ ప్రభావం ఏనాడో పోయింది. ప్రభావం అంటే కవిత్వరీత్యా. శ్రీశ్రీలా రాసిన కవులు శ్రీశ్రీ తర్వాత రాలేదు. ఆరుద్ర, సోమసుందర్, కుందుర్తి, తిలక్ ప్రభృతుల కవిత్వంలో శ్రీశ్రీ పోలికలు ఎక్కడా లేవు. కనుక కవిత్వరీత్యా శ్రీశ్రీని అనుసరించినవాళ్లు లేరనే చెప్పాలి. అయితే, మొదటిసారి తెలుగు కవిత్వంలోకి వామపక్ష వస్తువు ప్రవేశపెట్టడం శ్రీశ్రీ ద్వారానే జరిగిన ఒక మహత్తర ఐతిహాసిక సంఘటన. ఈ విషయంలో ఆయన్ని ఇప్పటివరకు అందరూ అనుసరిస్తున్నారనే చెప్పాలి.

ప్ర : మీరు శ్రీశ్రీ రచనలతో ఎప్పుడైనా ప్రేరణ పొందారా?

శే: ఎప్పుడూ పొందలేదు. కారణం- ఆయనలో కవిత్వపు పాలు తక్కువ అని నేను అభిప్రాయపడ్డాను. కవిత్వరీత్యా ప్రభావితంచేసే ద్రవ్యం ఏదీ ఆయనలో నాకు దొరకలేదు.

ప్ర : తొలి రోజుల్లో మీకు నచ్చినవాళ్లు?

శే : శ్రీశ్రీ కూడా కవిత్వం రాస్తున్న తొలి రోజుల్లో నేను గౌరవించి తన్మయత్వంలో మునిగిన కవులు రాయప్రోలు, విశ్వనాథ, జాషువా, కృష్ణశాస్త్రి. ఆ రోజుల్లో శ్రీశ్రీ స్థానం కూడా సాహిత్యంలో ఈనాడున్నంతది కాదు.

ప్ర : అంటే, శ్రీశ్రీ స్థానంలో తేడా వచ్చిందని మీరనుకుంటున్నారా?

శే : ఆ కాలంలో శ్రీశ్రీ సామాజిక దృష్టి కేంద్రంలో లేదు. అయినప్పటికీ ఆయన తెలుగు కవిత్వానికి చేసిన గొప్ప ప్రదానం విలువ గుర్తించి నేను ఆయనకు తగిన గౌరవం ఇచ్చేవాణ్ణి.

ప్ర : ఒక కవిగా శ్రీశ్రీ భావవికాసం సహజంగా సాగిందా?

శే : సహజంగా సాగినట్టు కనిపించదు. ఆయన ఆ తర్వాత రాజకీయాల సుడిగుండంలో చిక్కుకుపోయి అవతారశక్తిశాల్లో ఇరుక్కుపోయిన వ్యక్తిగా కని పిస్తాడు.

## 1970 తర్వాత

ప్ర : 1970 తర్వాత విప్లవ కవిత్వం మీద శ్రీశ్రీ ప్రభావం వుందా?

శే : శ్రీశ్రీ ప్రభావం వుందన్నది అనాలోచితమైన మాట; పరిశీలనకు నిలవదు. విప్లవ కవులు ఆనాటి విప్లవ పరిస్థితులకు రియాక్ట్ అయి రాశారు. అది శ్రీశ్రీ ప్రభావం కాదు.

ప్ర : శ్రీశ్రీ అభివ్యక్తి ఆధునికమా?

శే : మూడు వంతులు కాదు, ఒక వంతు అవును. ఆయనది ఎక్కువగా క్లాసికల్ డిక్షన్. ఆయన నూతనంగా తెచ్చిన విప్లవం అనే కావ్యవస్తువు బలం చేత భాషలో కించిత్ మార్పు కనిపిస్తుంది.

ప్ర : 'ఇస్మాయిల్' కవిత్వం చూశారా?

శే : ఇస్మాయిల్ మంచి కవి. గొప్ప కవిత్వబలం ఆయనకుంది ఆయన మార్క్సిస్టు కానందువల్ల ఆయన్ని ఎప్పుడూ 'కండెమ్' చేయను. కవిగా ఆయన కవిత్వాన్ని 'ఎంజాయ్' చేస్తాను. ఎందుకంటే, ప్రతి కవి మార్క్సిస్టు అయితేనే అంగీకరించాలి, లేకపోతే దూషించాలి అనే నియమం మానవసభ్యతకు విరుద్ధం.

ప్ర : నగ్నమునిపై మీ ప్రభావం వుందా?

శే : చాలా మంది అంటూండగా నేనూ విన్నాను అంతే. కొన్ని పంక్తులు పోలినవి వున్నాయి. అట్లా వుండడం తప్పని నేననుకోను. ఒక ప్రభావశాలి కవిత్వం సాహిత్యక్షేత్రంలో అవతరించినప్పుడు దాని ప్రతిధ్వనులు అన్ని దిక్కులా వ్యాపించడం సహజమే. ఆ విధంగానే సాహిత్యం ముందుకు నడు స్తుంది.

ఇంటర్వ్యూ : అఫ్సర్ (ఆంధ్రజ్యోతి దినపత్రిక) 11.1.1988

# నక్సలిజం వైపే నా ప్రయాణం

కవి ఎవరికి జరిగే హింసను గాని, అన్యాయాన్ని గాని సమర్థించలేడు. కనుక కవి ప్రజల కోసం రాస్తాడు. ప్రజల గురించి రాస్తాడు. కనుక కవి అంటే ప్రజాకవి! ఇలాంటి సందర్భంలో కవి అన్న సింపుల్ పేరుతో తృప్తిపడనివాడు ప్రత్యేక లేబిల్ అభిమాని తన యావకొద్ది 'ప్రజాకవి' అనే ఒక బిళ్ళ మెడకు తగిలించుకుంటాడు.

తెలుగు సాహిత్యంలో అనుభూతి వాదం అన్న అంశంపై నేడు బాగా చర్చ కొనసాగుతోంది. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి?

అనుభూతివాదం అనే నినాదం తెలుగు సాహిత్యంలో బాగా సంచారం చేస్తోంది. దీనికి వాస్తవంగా శాస్త్రరీత్యా సాహిత్య నిర్మాణ వస్తువులో స్థానం లేదు. కారణం? కవిత్వం అంటే అనుభూతి నుంచే పుట్టాలి. అనుభూతి రెండు విధాలు ఒకటి స్వానుభూతి, రెండోది సానుభూతి. తన చెయ్యిని సరికినప్పుడు పడే బాధ స్వానుభూతి. మరొకడి చెయ్యి నరకబడుతున్నప్పుడు పడే బాధ సానుభూతి. ఈ రెండు మార్గాలనుండి కవిత్వం పుడుతుంది. ఎక్కడో ఒకచోట చెప్పాను- మన దేశపు రెండు ఇతిహాసాల్లో, వ్యాసుడి ఇతిహాసం అయిన మహా భారతం స్వానుభూతి నుండి పుట్టింది. (ఎందుకంటే, ఆయన మునిమనవళ్ళే చచ్చిపోయారు కాబట్టి.) వాల్మీకి ఇతిహాసం అయిన రామాయణం సానుభూతి లోంచి పుట్టింది. తన శరీరానికి సంబంధం లేదు. తన సంతానానికి సంబంధం లేదు. కాని, ఎక్కడో చెట్టుమీద వున్న పక్షిని ఎవరో చంపితే చూసిపొందిన బాధలోంచి పుట్టింది రామాయణం. ఇది సానుభూతి. ఏ అనుభూతిలోంచి పుట్టనిది కవిత్వమే కాదు అది ఒక కృత్రిమ పదార్థం.

మీ కవిత్వానికి ప్రేరణ ఏమిటి?

నేను చిన్నవాడిగా వున్నప్పుడు మా నాన్న నన్ను పట్నానికి తీసుకుని వెళ్ళాడు. ఆయన గ్రామ మునసబు. తాసిల్‌దార్ ఆఫీస్‌కి వెళ్ళి లెక్కలు అప్ప గించారు. చిన్నవాడిని కావటం వల్ల నాకా వివరాలు పెద్దగా తెలియవు. కాని,

తాసిల్‌దార్ అనకూడని మాటలతో తిట్టి అవమానించడం అప్పుడు నేను చూసిన దృశ్యం. అప్పుడు నేను ఏడ్చినా కాని నేను పెరిగి పెద్దవాడిని అయిన తరువాత అది అధికారులమీద, మదోన్మత్త స్వరూపులైన ధనికులమీద, పరిపాలక వర్గం మీద ద్వేషంగా మారింది. అదే ఇప్పటివరకు నన్ను నా సాహిత్యంలో వెంటాడుతూనే వుంది. నా సమస్త కవిత్వానికి అదే జీవనాడి చిన్నతనం నుండి కమ్యూనిస్టు కార్యక్రమాల్లో పాల్గొనేవాడిని. ఆ ప్రభావం కూడా నేటికీ నన్ను వెంటాడుతూ వుంది. అందుచేత మొదటిసారి అచ్చులో వచ్చినది పాట! అది ఆనాటి విశాలాంధ్రలో అచ్చు అయింది: ''ఈ ప్రపంచంలోన ఎక్కడున్నా సరే- ధ్రువములకు మధ్యవలె దూరమైనా సరే- మన బాధలు ఒక్కటే! ఎప్పుడూ మన గాధలు ఒక్కటే - మనుషులంతా ఒక్కటే, అందరి మనసులంతా ఒక్కటే!''

ఇటీవలి మీ సాహిత్యం గురించి....

''అరుస్తున్న ఆద్మీ'' అనే కావ్యం 1983 లో రాశాను. ఇవన్నీ చిన్న చిన్న కవితలు, మరుగుజ్జు కవితలు. ఎంత సంక్షిప్తంగా వుంటే అవి అంత విస్ఫోటనాత్మక శక్తి సంతరించుకుంటాయని నా అభిప్రాయం. ఈ అభిప్రాయం ఉర్దూ గజల్‌ని, హిందీ దోహాను, సంస్కృత అనుష్టుప్పులనూ చూచిన తరువాత నాకు కల్గింది. నాకు తొలుత 1970-74 వరకు కురచగా వున్న పద్యాలు రాయడమే అలవాటు. అవి చాలా శక్తివంతంగా వుండేవని నా అభిప్రాయం. జీవన ప్రవాహవేగంచేత 75 నుండి నా కవిత్వం దీర్ఘకృతం అయినప్పటికీ 1983 వచ్చేసరికి మళ్ళీ నా భావనాస్థితి కురచ కవిత్వంవైపే వెళ్ళింది. ఉదాహరణకు ''జీవించడంలోనే జీవితం అంతా ఖర్చుచేసి అలసిపోయాడు - అతడు వర్తమానంలోంచి చరిత్రలోకి వలసపోయాడు'' - ఈ విధమైన రూపాన్ని పొందింది నా కవిత. ఈ రూపానికి నేను చమత్కారిక అని నామకరణం చేశాను. ఈ చమత్కారికలు కొన్ని నెలలపాటు ఆంధ్రజ్యోతి వారపత్రికలో శేషేంద్ర జాలం పేరుతో ధారావాహికంగా వచ్చాయి.

ఈ కావ్యకృతి పేరు "అరుస్తున్న ఆద్మీ." నా సంపూర్ణ కావ్యంగా 1985 లో వెలుగులోకి వచ్చిన "ఆధునిక మహాభారతం''లో ఈ అరుస్తున్న ఆద్మీ "ఆద్మీపర్వం"గా రూపొందింది. చమత్కారిక నేను సృష్టించిన విన్యూత్న కావ్యాభివ్యక్తి ప్రక్రియ. ఇందులో సాధ్యమైనంత వరకు నాలుగు నుండి ఐదు

వరకు లేదా ఎనిమిది వరకు పంక్తులుంటాయి. సాధ్యమైనంతవరకు చివరి పంక్తిలో చివరి రెండు పంక్తుల్లో ఆ కవిత సారాంశం కశీఘాత కుశాఘాత రూపంలో (కొరడా దెబ్బ) వుంటుంది. అందుచేత చమత్కారికలు రాస్తేనే బాగుంటుందని నా అభిప్రాయం.

మీరు ఏ సిద్ధాంతానికి చెందుతారో తెలియని గందరగోళం తెలుగు సాహిత్యంలో నెలకొని వుందని కొందరి విమర్శ! కామెంట్ ప్లీజ్?

రాజకీయ సిద్ధాంతపరంగా నేను కమ్యూనిస్టుని. ఇది నా కవిత్వంలో ప్రతిబింబిస్తుంది. సాంస్కృతికపరంగా ప్రథమస్థానం భారతీయ సంస్కృతికి ఇస్తూ, ప్రపంచ సంస్కృతిని అంతా ఆధునిక మానవుడు తనలోకి తీసుకోవాలనే విశ్వాసం కల్గినవాడిని.

"రాజకీయాలు నమ్మకండని" ఎక్కడో ఒకచోట మీ చమత్కారికల్లో చదివినట్టు నాకు గుర్తువుంది. మళ్ళీ రాజకీయపరంగా కమ్యూనిస్టు నంటున్నారు. ఏమిటి ఈ గందరగోళం?

వర్తమాన భారతదేశపు - ప్రత్యేకించి తెలుగుదేశపు రాజకీయాలు కేవలం బందిపోటు దొంగల వ్యవహారం, కత్తిలేని మోసం ఈ రాజకీయం గురించి చెప్పిన మాటలే ''రాజకీయ వర్షం కురుస్తోంది- మీ విత్తనాలు చల్లకండి'' అన్న చమత్కారిక.

కమ్యూనిజం విఫలమైందన్న వాదనతో ఏకీభవిస్తారా?

లేదు. నేను ఏకీభవించను. తూర్పు ఐరోపా దేశాలలో కమ్యూనిజం విఫలమైందనటం న్యాయం కాదు. ఆ దేశంలో కార్యకర్తల నిర్వహణ దోషాలవల్ల అక్కడ సఫలం కాలేదు కాని, అది కమ్యూనిస్టు సిద్ధాంతంలో వున్న దోషం కాదు. మన స్థానిక సందర్భంలో నా మొగ్గు నక్సలిజంవైపే. ఇది ''ఆధునిక మహాభారతం'' చదివితే స్పష్టమవుతుంది.

నక్సలిజం మన సమాజానికి సరిపడుతుందా?

తప్పకుండా సరిపడుతుంది! అంటే, న్యాయం పొందడానికి సాధారణ మానవుడికి మార్గాలన్నీ బంద్ చేయబడి వున్నాయి. కనుక గత్యంతరం లేదు.

నక్సలిజంలో కూడా నేడు అనేక వర్గాలూ, గ్రూపులు ఏర్పడ్డాయి కదా! మీరు ఏ వర్గానికి, ఏ గ్రూపుకి చెందుతారు?

రణంగా కేవల దూషణ, కేవల ప్రశంస, లేక బుద్ధిపూర్వక ద్వంద్వార్థ చమత్కార వ్యూహంగానో వున్నాయి. ఈ శతాబ్దికి అగ్రగణ్యుడని భావింపబడిన విమర్శకుడు టి ఎస్. ఇలియెట్ సాహిత్య విమర్శ పాఠకుల సాహిత్య చైతన్యాన్ని పెంచడానికి, సాహిత్యాభిమాని దోషాలన్నీ సవరించడానికి ఉపయోగించే ప్రక్రియ అన్నారు. మన తెలుగు సాహిత్య విమర్శ దీనికి విరుద్ధంగా వుంటుందని ఆయన మరొకచోట అన్నారు. రచయితమీద వున్న రాగద్వేషాలన్నీ తీర్చుకోవడానికి వాడుకునే అవకాశం కాదు సాహితీ విమర్శ. మన తెలుగు విమర్శ దీనికి కూడా భిన్నంగా వుంటుంది. విమర్శ అంటే మనవాళ్ళ దృష్టిలో తిట్టడానికి దొరికిన గొప్ప అవకాశం అని భావన.

మీరు ఆ మధ్య ఆంధ్రజ్యోతి వారపత్రికలో రాసిన ''కామోత్సవ్'' నవల చాలా విమర్శలకు గురైంది కదా! దీనికి మీరిచ్చే సమాధానం?

వ్యతిరేకత మన సాహిత్యంలో రాజకీయ ముసుగుదారులనుంచే. వాళ్ళు ఇంత గొప్ప నైతిక ఋషీశ్వరులని, సంఘసంస్కర్తలని నాకిప్పుడే తెలిసింది. తెలుగుదేశం నిండా ఇంతమంది ఋషీశ్వరుల జనాభా ఉన్నప్పటికీ మన తెలుగు సమాజంలో ఇంత అవినీతి, మోసం, వ్యభిచారం, తాగుడు, జూదంలాంటి వ్యవహారాలు భారీయెత్తున ఎలా జరగల్గుతున్నాయన్నదే ఆశ్చర్యం!

''కామోత్సవ్'' రాయడంలో మీ ప్రథమ ఉద్దేశ్యం ఏమిటి?

అన్ని నీతులు, అన్ని చట్టాలు సాధారణ ప్రజలకేగాని ఉన్నత వర్గాలకి వర్తించవు. ఉన్నత వర్గాల్లోవున్న అస్తవ్యస్త సంబంధాలు, సాంఘిక, నైతికతనంమీద ఏ బాధ్యతా ఆ వర్గానికి లేకపోవడం, ఆ వర్గాలే దేశానికి పాలక వర్గంగా వుండటం - దీన్ని చిత్రించడం ఆ రచనలో ప్రధాన ఉద్దేశం. తత్సంబంధంగా వచ్చిన అనేక విషయాలు అందులో చర్చించబడ్డాయి. మన ఋషీశ్వర్లు ఘోషిస్తున్నట్లుగా ప్రమాదకర విషయాలు అందులో ఏమీలేవు. అందుకే ఋషీశ్వర్లు పెట్టిన కేసును కోర్టు కొట్టివేసింది.

తెలుగు కవిత్వానికి అంతర్జాతీయస్థాయి రాకపోవడానికి కారణం ఏమిటి?

ఒక కవిని ఆ కవిభాషలోనేకాక అన్యదేశభాషల్లోకూడా ఆ దేశంప్రజలు చదవడం అవసరం. చార్లెస్‌బోదెలెర్, షేక్స్పియర్, ఇబ్ సెన్, వాల్ట్‌విట్ మెన్

ప్రకృతుల సాహిత్యాన్ని ప్రపంచంలో అనేక దేశాల్లో ఆయా భాషల్లో చదువుతున్నట్లే భారతీయ కవులను అన్య దేశాలలో చదువుతున్నారా అన్నదే ఇక్కడ ప్రశ్న! ఆ పద్ధతిలో అన్యదేశాలలో చదవబడటం లేదు. అలా చదవబడాలంటే ఇక్కడి వాళ్ళ రచనల్లో ఆవేదన కూడా వుండాలి. నాదాంట్లో లేదా, నాదాంట్లో లేదా అని పోటీపడేవాళ్ళే మన దేశంలో ఎక్కువగా కనిపిస్తున్నారు కాని, నిజంగా చేవగనక వుంటే బయటి దేశాల్లో అక్కడి ప్రజలు చదువుతూ వుండే వాళ్ళు.

ఈ దశాబ్దంలో తెలుగు కవిత్వం ఎలా వుంది?

ఈ తరం యువకవులు రాస్తున్న కవిత్వం చాలా బాగుంది. తత్పూర్వం ఇట్లా ఎప్పుడూ లేదు.

ఆధునిక కవిత్రయంగా పేరుమోసిన విశ్వనాథ, శ్రీశ్రీ, కృష్ణశాస్త్రిలపై మీ అభిప్రాయం....

రాయప్రోలు సుబ్బారావు కవిత్వంలో నుండి ఆవిర్భవించిన వినూత్న సాహిత్య తార విశ్వనాథ. యావత్ భావకవిత్వ ప్రవాహానికి తన కవిత్వంతో ఆనకట్ట కట్టి మళ్ళీ ప్రబంధ కవిత్వంవైపు తెలుగు కవిత్వాన్ని మళ్ళించిన ప్రతిభాశాలి. ఆయన అనంత సాహిత్య సృష్టిలో నవలలు, నాటకాలు అతి విశిష్ట స్థానాన్ని ఆక్రమించాయి. ఆయన మూర్తీభవించిన భారతీయ సంస్కృతి. శ్రీశ్రీ తెలుగు కవిత్వంలోకి ప్రథమంగా విప్లవాన్ని కావ్యవస్తువుగా ప్రవేశపెట్టి చారిత్రక స్థానాన్ని గడించిన మహాకవి. కృష్ణశాస్త్రి ప్రబంధకవిత్వానికి భరత వాక్యం పలికి నవీన కవిత్వానికి తెలుగుగడ్డమీదకు తెచ్చిన మహాకవి!

కొత్తగా కవిత్వం రాస్తున్నవారికి మీరిచ్చే సందేశం!

మంచి కవిత్వంగా ప్రసిద్ధి పొందిన కవిత్వాన్ని మొదట చదవాలి. కవిత్వాన్ని గురించి ప్రసిద్ధులు చేసిన విమర్శలు, శాస్త్రవిషయాలు అవగాహన చేసుకోవాలి. జీవితంలో వున్న మలుపులు మెళుకువలు ఆటుపోటులు— అన్నిటిని ఆకళింపు చేసుకోవాలి అన్నిటికీమించి ఆ వ్యక్తి కుయుక్తిపరుడు కాకూడదు. ఇది ప్రధాన విశేషం. *

(కృష్ణాపత్రిక దినపత్రిక 26-8-91.)

# 'ఇక కవిత్వం వ్రాయను'

తెలుగు కవితా లోకంలో ఒక సంచలనానికి కారణం అయిన 'కవిసేన' పేరు ఇప్పుడు ఎక్కడా వినపించడం లేదు. కారణం ఏమిటి?

ప్రపంచంలో ఏ ఉద్యమమూ శాశ్వతం కాదు. ఏ ఉద్యమానికి అయినా ఆయుష్షు కొంతకాలమే. మీరే గమనించండి. భావకవిత్వ ఉద్యమం పోయింది. అభ్యుదయ కవిత్వం పోయింది. విప్లవ కవిత్వం పోయింది.

అసలు కవిసేన ప్రారంభించాలన్నది నా ఆలోచన కాదు. చాలామంది యువకవులు నా కవితల్ని పొగుడుతూ ఉత్తరాలు వ్రాసేవాళ్ళు. ఆ ఉత్తరాలతో పాటు తాము వ్రాసిన కవిత ఒకటి పంపేవాళ్ళు నా అభిప్రాయం కోసం. నా అభిప్రాయం వ్రాస్తూ ఆ కవితను మరో కవికి పంపేవాడిని, ఆయన అభిప్రాయం కూడా వ్రాసి కవిత వ్రాసిన వ్యక్తికి పంపమని. వీళ్ళెవరితోనూ నాకు వ్యక్తిగత పరిచయం లేదు. కానీ వీళ్ళు మనమంతా ఒకచోట సమావేశం కావాలని వత్తిడి చేసేవాళ్ళు. కవిసేన ఉద్యమం ప్రారంభించాలని కూడా వాళ్ళే నిర్ణయించారు. సమావేశం అయ్యాము. ఆ తరువాత 'ఇన్ని సంస్థలు వుండగా ప్రత్యేకంగా మీకు సంస్థ ఎందుకు? అని అడుగుతున్నారు. కాబట్టి మానిఫెస్టో వ్రాయ'మని అడిగారు.

అప్పుడు కవిసేన మానిఫెస్టో వ్రాశాను. కవిసేనలో ఉత్సాహంగా వున్న వాళ్ళ కవితలతో సంకలనం తెచ్చాం. పది, పదిహేనేళ్ళు గడిచింది. కవిసేన సభ్యుల సంఖ్య క్రమంగా తగ్గింది. ప్రపంచంలో ఏ సాహిత్య ఉద్యమమైనా సుమారు పాతికేళ్ళకు మించిలేదు. కవిసేన ఉద్యమమూ అంతే. ఇందుకు ఆశ్చర్యపడవలసింది, శోకించవలసిందీ ఏమీలేదు.

**మీ కవిత్వాన్ని (వస్తు రూపాలు రెండింటినీ) అనుకరిస్తూ చాలామంది కవిత్వం రాశారు. వాళ్ళ పేర్లు ఇప్పుడు ఎక్కడా వినిపించడంలేదు. మిమ్మల్ని అనుకరించడంనుంచి బయటపడలేకపోవడంవల్ల వాళ్ళు కవిత్వం వ్రాయడం మానేశారనుకోవచ్చా?**

వాళ్ళు తలా ఒక దారిన జీవితంలో స్థిరపడిపోయారు. జీవితంలో కరిగిపోయారు. కొందరు అదేపనిగా ఇందులోంచి లాగివేయబడ్డారు.

**మీ కవిత్వంలో కాల్పనిక భాష చాలా ఎక్కువగా వుంటుంది. ఉదాహరణకి - వసంతం, కోకిల, చెట్టు, తోట, పశువులు మొదలైనవి. వచన కవులంతా ప్రయత్నపూర్వకంగా ఈ భాషను వదిలేస్తున్న కాలంలో మీరు దీన్ని కవిత్వంలో అంత ఎక్కువగా ప్రవేశపెట్టడానికి కారణం ఏమిటి?**

ప్రత్యేక లక్ష్యం ఏమీలేదు. వాళ్ళు బుద్ధిపూర్వకంగా విసర్జించటం అనవసరపు ప్రయాస. చెట్లు, పశువులు - ఇవన్నీ కూడా మన కుటుంబం. ఏవైతేవాళ్ళు కవిత్వంలో పరిహరించారో వాటిని జీవితంలో పరిహరించమనండి - జీవనం దుర్భరం అవుతుంది. ఇవన్నీ వున్నప్పుడే సంపూర్ణ సమాజం అవుతుంది. వాటిని నేను సంప్రదాయ పద్ధతిలో వాడలేదు. నా అనుభవంలోంచి వాడాను. మనుషులే కాదు- నా చుట్టూ వున్న అన్నీ కూడా నా స్పృహలోకి వస్తాయి.

**మీ సమకాలీన కవిత్వానికి, మీ కవిత్వానికి రూపసంబంధమైన తేడా ఏమయినా వుందా?**

నా సమకాలికులకు కవిత్వపు వాస్తవ స్వరూప స్పృహ అంతగా వున్నట్లు నాకు తోచలేదు. కనుక ఈ కారణం వల్ల కవితను ఎక్కడ ఎలా ప్రారంభించాలో, ఎలా ముగించాలో తెలియలేదు. తెలియకపోబట్టే ఒక కవిత వ్రాస్తే చాలా పెద్దదిగా వుండేది. అందులో బాగుంది అనిపించే ఒక్క ముక్క కనిపించేది కాదు.

నాకు కావ్యస్పృహ సాంద్రత ఎక్కువగా వుండేది. ఎలా వచ్చిందంటే - నేను సంస్కృత కావ్యాలు ఎక్కువగా చదివాను. పాశ్చాత్య కావ్యాలు ఎక్కువగా చదివాను.

వాళ్ళకు సంస్కృత సాహిత్యంతోగాని, పాశ్చాత్య సాహిత్యంతోగాని, కనీసం ఉర్దూ సాహిత్యంతోగాని పరిచయం వుంటే అలా వ్రాయరు. నేను క్లుప్తంగా వ్రాయడం, చమత్కారంగా వ్రాయడం లక్ష్యంగా పెట్టుకున్నాను. చమత్కారం అంటే ఆశ్చర్యమాత్రం.

**మీరు వచన కవిత్వంతోపాటు పద్యాలు కూడా వ్రాశారు కదా! మీ అనుభవ వ్యక్తీకరణలో మీకు తృప్తినిచ్చేది, సులువు అనిపించేది పద్యమా- వచన కవితా?**

ఆ రోజుల్లో పద్యాలు వ్రాసేవాణ్ణి కవిసమ్మేళనాల్లో చదివేవాణ్ణి. పెద్ద వాళ్ళు పొగిడేవాళ్ళు. అయితే భాష అర్థంకానందువల్ల ఇవి శ్రోతల్ని కదిలించవు అనుకున్నాను. వెంటనే నా ధోరణి మార్చాను వచన కవిత్వం వ్రాయడం ప్రారంభించాను.

**ఈ మధ్యకాలంలో మళ్ళీ మొదలయిన పద్య కవిత్వం - వచన కవిత్వం చర్చ చూశారు కదా, మీరు దేనిని సమర్థిస్తారు?**

తెలుగు ప్రజల్లో 1930 నుంచీ కవిత్వ అభావం ఎక్కువగా వుంది. కవిత్వం అంటే ఏమిటి అని ప్రజల్లో భావన పుట్టడం అవసరం.

పద్యంలో వుండే లయ ఛందస్సులలో పడిపోయి, అందులో కవిత్వం వుందా లేదా అని వెంటనే గమనించలేరు అదే వచనంలో అయితే అది కవిత్వమా, కాదా అని వెంటనే తెలిసిపోతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి పౌరాణిక వేషం వేసుకుని వేదిక మీదకు వచ్చాడనుకోండి అతని నటనమీది కన్నా అతని ఆహార్యం మీద అందరి దృష్టి వుంటుంది. అదే పౌరాణిక పాత్రను మేకప్ లేకుండా మామూలు డ్రస్‌తో వేదికమీదకు వచ్చి నటించేటప్పుడు అందరి దృష్టి అతని నటనమీద వుంటుంది. చాలా చక్కగా నటించకపోతే రాణించలేడు. పద్యానికి, వచన కవిత్వానికి కూడా ఇంత తేడా వుంది.

లయ కవిత్వం ఆయుష్షను దీర్ఘీకరిస్తుందని నా అభిప్రాయం. వచనంలో వ్రాస్తే మంచిదా? పద్యం మంచిదా అంటే అది వ్రాసేవాళ్ళ ఇష్టం. ఏదైనా ఫరవాలేదు. వర్తమాన భాష వాడటంలోనే కవిత్వానికి సాఫల్యం.

కామోత్సవ్ నవల వ్రాసి చాలా అపకీర్తి తెచ్చుకున్నారు కదా! ఆ నవల వ్రాసినందుకు మీరు ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నారా?

లేదు. కొందరు దాన్ని ఊతగా తీసుకుని నన్ను నిందిస్తే దాన్ని నేను అపకీర్తి అనుకోను. నామీద వ్యక్తిగత ద్వేషం వున్నవాళ్ళు ఆ నవల విషయంలో గొడవ చేశారు. చేయించారు. సాహిత్య లోకంలో వున్న ఈర్ష్య దానికి కారణం.

ఈ నవలలో అశ్లీలం వున్నట్లయితే అంతకన్నా అశ్లీలంవున్న రచనలున్నాయి. చాలా ప్రసిద్ధులు వ్రాశారు. పత్రికల్లో నదుల్లాగా ప్రవహిస్తున్న బూతును ఎవరైనా పట్టించుకున్నారా?

అసలు ఈ నవలను ఏ ఉద్దేశంతో వ్రాశానో ఎంతమంది అర్థం చేసుకున్నారు?

మధ్యతరగతికి ప్రియమైన సాంస్కృతిక, నాగరిక విలువలు ఏవైతే వున్నాయో అవి ఉన్నత వర్గాలను బాధించవు మనం అపవిత్రం అనుకున్నవి వాళ్ళు ఏమీ అనుకోకుండా ఆచరిస్తారు. ఆ విలువలు మనకు చాలా ఘోరంగా, దారుణంగా అనిపిస్తాయి. వాళ్ళ ఎంజాయ్‌మెంట్ ప్లెషర్స్ అన్నీ శరీరానికి సంబంధించి వుంటాయి. అలాంటివాళ్ళను గురించి వ్యంగ్య ప్రధానంగా వ్రాసిన నవల ఇది. వీళ్ళు దేశానికి ప్రమాదకరమైన వ్యక్తులని కూడా వ్రాశాను.

మీ కవితా సంపుటి 'నా దేశం నా ప్రజలు'ని ఆధునిక ఇతిహాసం అన్నారు కదా? ఇతిహాసానికి వుండే విస్తృతి అందులో వుందా? కొంచెం వివరంగా చెప్పండి.

అంత విస్తృతి వుంది. అది కర్షక ఇతిహాసం. ఈ దేశంలో కర్షకుడే శ్రామికులకు ప్రతీక. ప్రతీకాత్మకంగా చెప్పడానికి కర్షకుణ్ణి తీసుకున్నాను.

కర్షకుడి ఇతిహాసం వ్రాసేటప్పుడు కథ వెతకడానికి వీలుకాదు. ఒకడు అతి ఘోర పరిస్థితుల్ని ఎదుర్కొని నిరంతరం పోరాడడం ఇతిహాసానికి ప్రధాన లక్షణం. చివరికి అవసాన దశ కూడా పొందుతాడు. జయించినట్లు జయించి

ఆ జయమూ, ఆ మృత్యువు ఒకేసారి వస్తాయి. అలాగే 'నా దేశం - నా ప్రజలు' కర్షకుడు కూడా. ప్రతి శ్రామికుడిలోని వీరత్వాన్ని రుజువుచేసే ఇతిహాసం ఇది.

జీవితంతో యుద్ధం చెయ్యడమనేది ప్రపంచంతో యుద్ధం చెయ్యడం కన్నా గొప్పది.

పెన్నా శివరామకృష్ణగారికి ఇచ్చిన ఇంటర్వ్యూలో 'అరసం, విరసం భావాజాలంతో సంపూర్ణంగా అంగీకరిస్తాను' అన్నారు మీరు. కానిఆ సంస్థలకు, మీకు మధ్య సఖ్యత వున్నట్టు ఎక్కడా కనిపించదు. కారణంచెబుతారా?

మీరు చెప్పింది నిజమే అయితే, నేను బాలకమ్యూనిస్టుని. అది రక్త నిష్ఠం. అక్కడ నుంచి అది అంటిపెట్టుకునే వుంది. కమ్యూనిస్టు పార్టీ ఎప్పుడు అసెంబ్లీలో ప్రవేశించిందో ఆ చర్యను వ్యతిరేకించిన వాళ్ళల్లో నేనూ ఒకణ్ణి. సిద్ధాంతపరంగా వీళ్ళందరికీ మార్క్సిజమే పునాదిరాయి. వాళ్ళు ఆచరించక పోవడంతోనే ఈ విభేదాలు వచ్చాయి. నా 'మండే సూర్యుడు'తో విప్లవభాష పుట్టింది అనిచాలామంది అన్నారు. నేను కూడా ఆ పార్టీలో చేరినట్టయితే నన్ను కూడా విప్లవకవి అనేవాళ్ళేమో!

మీ కవిసేన మానిఫెస్టోలో సాధారణ భాషకి కవిత్వ భాషకి మీరు వైరుధ్యం చూపించారు. కాని, ఇవాళ సాధారణ భాషలోనే మంచి కవిత్వం వ్రాస్తున్నారు. కవిత్వ భాషకి, సాధారణ భాషకి తేడా లేదనిపిస్తుంది ఇప్పుడు. మీ అభిప్రాయం ఏమిటి?

వర్తమాన భాషలోంచే కవిత్వ భాషను తీసుకోవాలి భాష అనేది అలంకార బింబ ప్రతీకల యొక్క వాహిక. కవిత్వ భాష అంటే అలంకార బింబ ప్రతీకాత్మకమైన భాష. 16వ శతాబ్దం భాష వాడితే ఎన్ని అలంకారాలున్నా ఏమున్నా మీకు, పాఠకుడికి మధ్య అవరోధం అవుతుంది, వర్తమాన వ్యవహారంలో వున్న భాష బురదలో వున్న ఒక దారం అనుకోండి. దాన్ని అలాగే వాడకుండా శుభ్రం చేసి వాడాలి. అకావ్య శబ్దాలను తీసివేయాలి. వాటిని శుభ్రపరచి వాటిమీద అలంకారం, బింబం పెట్టాలి.

ఆకర్షణీయమైన మాట పేరే కవిత్వం ఆకర్షణీయత ఎలా క్రియేట్ చేస్తున్నారు అనేది తర్వాతి అంశం. అది ఒక అలంకారం. ఈ అలంకారం మూలంగానే వాక్యం కవిత్వం అవుతుంది. మెటఫర్ సాధారణ భాషలో పడడం వల్ల అది కవిత్వం అవుతుంది.

దళిత కవిత్వం మీద మీ అభిప్రాయం ఏమిటి?

దళిత, మైనారిటీల ముసుగులో కులాల సంఘాలుగా విడిపోతున్నారు. సంఘటితం కావడానికి కృషిచేసేవాటిని ఇష్టపడతాముగానీ విడిపోవడానికి కాదు. ఈ వేర్పాటు వ్యవహారాలను నేను సమర్థించను. ఈ దళిత, మైనారిటీ వ్యవహారం కమ్యూనిస్ట్ మూవ్‌మెంట్‌కి చాలా ప్రమాదం ఒకే సంఘటిత ఉద్యమం మంచిది. వీటన్నిటినీ తీసుకెళ్ళి కమ్యూనిస్ట్ ఉద్యమంలో కలపాలి. తద్వారా వర్గద్వేషాన్ని లేపాలి. వర్గచైతన్యాన్ని కలిగించాలి. వర్గపోరాటాన్ని లేపాలి. తద్వారానే సమ సమాజం ఏర్పడుతుంది.

తెలుగులో వస్తున్న స్త్రీవాద కవిత్వం చదువుతున్నారా?

చదువుతున్నాను. బాగా వుంది. అలా రావాలనే నా అభిప్రాయం. వాళ్ళఫీలింగ్స్ వాళ్ళు వ్యక్తీకరిస్తున్నారు. అలాంటి కవిత్వం రావాల్సిన అవసరం వుంది.

మీ దృష్టిలో వస్తువు రూపాన్ని నిర్దేశిస్తుందా? రూపం వస్తువుని నిర్దేశిస్తుందా? లేక రెంటికీ గతితార్కిక సంబంధం వుంటుందా?

వస్తు రూపాలకు ఒక ప్రత్యేక అవినాభావసంబంధం వుంది. ఒక కవిత పుట్టడానికి మూలం ఒక ఉద్రేకం. ఉద్రేకంగర్భంలోంచి ఊడిపడ్డ శిశువే కవిత. దాన్ని వస్తువుగా, రూపంగా విడదీయడం కష్టం.

శరీరం, జీవం ఎలాగో ఇవీ అంతే. వీటికి అవినాభావ సంబంధం వుంది. ఈ కవిత్వానికి ఈ రూపం వుండాలని కవి నిర్ణయించడు తత్కాల ఉద్రేకం దాని రూపాన్ని నిర్ణయిస్తుంది.

ఆధునిక తెలుగు సాహిత్య విమర్శపైన మీ అభిప్రాయం ఏమిటి?

విమర్శకులు నిజాయితీపరులుగా లేకపోవడంవల్లనే తెలుగు సాహిత్యానికి నష్టం జరిగింది.

రాజకీయాలలో ఇప్పుడు ఏం జరుగుతుందో తెలుగు సాహిత్యంలోనూ అదే జరుగుతుంది.

చాలా రోజుల్నుంచి మీరు రచనలేవీ చేస్తున్నట్టు లేదు. కారణం ఏమిటి?

ఇతర గొడవల్లో పడిపోయాను. కవిత్వం వ్రాయడంతో విసిగిపోయాను. ఇక కవిత్వం వ్రాయను. వ్రాస్తే నవలే వ్రాయాలి.

కవిత్వం ఎప్పుడూ ఒక కొత్త అనుభవంలోంచి పుడుతుంది. పాత అనుభవం మిమ్మల్ని సంచలితుల్ని చెయ్యదు. సంచలితులు కాకుండా మంచి కవిత్వం రాదు. జీవితంలో కొంత వయసు గడిచాక మొనాటనీ వస్తుంది ఇక అప్పటినుంచి కవిత్వం వ్రాయడం కష్టం. వ్రాసినా మంచి కవిత్వం వ్రాయలేం.

మీ సాహిత్య కృషికి తగిన గుర్తింపు లభించిందని భావిస్తున్నారా?

తగిన గుర్తింపు లభించిందని నేను హృదయపూర్వకంగా భావిస్తున్నాను.

నాకు ఎందుకింత తృప్తిగా వున్నదంటే ఈ దేశపు నాలుగుమూలల నుంచి రోజూ పది, ఇరవై ఉత్తరాలు వస్తాయి. నా రచనలు చదివి తన్మయత్వంతో వ్రాస్తారు వీళ్ళు. నా రచనలు వాళ్ళ జీవన దృక్పథాన్ని మార్చిందని వ్రాస్తారు. వాళ్ళ పుస్తకాలు పంపుతారు.

నాకున్నంత పాఠక వర్గం మరే రచయితకూ లేదని నా నమ్మకం. పబ్లిషర్స్ కూడా అదే చెబుతారు.

నా సాహిత్య కృషికి గుర్తింపు స్పష్టంగా, విస్తారంగా వుందనడానికి ఈ ఉత్తరాలే నిదర్శనం.

కవి యాత్రకు పాఠకుడే గమ్యస్థానం. గమ్యస్థానం చేరినప్పుడు కవికి హృదయ సంతృప్తి కలుగుతుంది. కావ్యానికి సాఫల్యత లభిస్తుంది.

వాళ్ళ పుస్తకం ఎవరూ చదవనప్పుడు ఎన్ని అవార్డులు వచ్చి ఏం ప్రయోజనం?

అయినా ఏ అవార్డూ, ఏ గౌరవం మీ వళ్ళో వచ్చి వాలదు. మీరు వాళ్ళ చుట్టూ (రాజకీయ పురుషులు) ప్రదక్షిణలు చెయ్యాలి. వాళ్ళ అనుగ్రహం పొందిన వాళ్ళకి అన్నీ లభిస్తాయి. అవి చేసినవాడు కవి కాదు కవి అన్నవాడు ప్రభుత్వానికి శాశ్వత విమర్శకుడిగా వుండాలి. ప్రభుత్వం చేసే అన్యాయాల్ని ఖండించే వాడుగా వుండాలి.

*

(ఆంధ్రజ్యోతి దినపత్రిక, 7-2-94)

# MAN AND PAIN IN CREATION

Can we imagine that man will ever evolve into more novel types of life in the same sense as the evolution of fish into tortoise, an amphibian type H. G. Wells and others dreamt of man's increased powers and novel ways of life. But is there any possibility of man undergoing physical change as such and giving rise to new type of life.

To my mind this change seems unlikely: Students of Darwin's "theory of evolution" known that there is a phenomenon in life called "adaptive radiation"; that is, when a new type of life has originated, it tends to spread and become diversified in adaptation to a veriety of environmental conditions:

In the course of radiation, life is multiplied, substituted and also faced with extinction.

The last contingency is almost universal among all the 'detailed types', which are too specialized to adaptive to radiation.

In the light of this truth, we can forsee that evolution in the mammalian line which reached the stage of man may probably end with him. For, is not man too specialised to be amenable to adptive radiation? Are not the increased comforts of civilization rendering man's sensory and other organs inactive and superflous, reducing him to more and more of specialized type, and bringing him nearer to his end?

This takes us directly to the question of pain and its role in creation.

Let us suppose that one fine morning the feeling of pain vanished from creational then what follows? The school-master of course, suddenly finds himself in a ridiculous position before a class of heckling children, because his rod was robbed of its power; the Goddess on pin played a trick on the poor man unexpectedly. Then-doctors also, with all their countless little bottles and stinging needles will be relegated to the museums. All armies too might be sent home lock, stock and barrel.

## SURPRISES

Besides a number of such funny surprises in daily life, the role of pain in creation is a very interesting question which is indeed worth

studying in its fundamental aspects: Nobody need be taken aback, if pain is said to be the root cause of life. Elimination of pain from creation brings creation itself to standstill.

From the early pages of life's History, we find life continuously struggling to adjust itself to great geological cataclysms which exposed life to extreme pain and total extermination. But life desires to live at any cost.

The will or the intense desire to live is directly connected with the feeling of pain (mental or physical). It is this feeling of pain that drives life to adapt itself to environmental changes. Now suppose when the oceans are dried up, the waterly life never felt the pain of change in temperature, in pressure and a variety of such environmental conditions. Then there is no question of adaptation, no species and no development. I am not here to write and you are not there to read.

## THE SEED

The will of life and the feeling of pain are the two driving forces of evolution. The former corresponds to our Vedantic 'purusha' and the latter to 'prakrithi'. One is the seed of creation and the other is the cause of its growth.

So life will be faced with extinction when pain vnishes. While we are priding ourselves in contantly developing our civilizations, we are not aware that we are only digging our own graves at the same time unwittingly, for the aim of civilization is to produce comfort and reduce pain.

But, on the other hand our Vedantha deliberately preaches 'no pain-attitude' ('Adwandwa') and enjoins on man to be above nature's twins i.e. cold and heat, sorrow and joy etc., this, it says, will lead to 'Moksha' which means deliverance from the cycle of life.

Cycle of life and evolution of life are not two different ideas, as in fact they agree on many essential points like continuity of life, role of pain in life and so on, the only differences being that one is circular and the other horizontal.

The feeling of pain is thus the very life breath of creation and the philosophers of our ancient land realized this fundamental truth ages go.

**THE DECCAN CHRONICLE FRIDAY AUGUST 17 1969**

# IS LITERATURE A SCIENCE?

"Can literature be treated slightingly? My friend relegated literature to the position of a pass time and considered it with no more value. This was done by him in contrast to the great material sciences which alone are held by him in high esteem as products of intellect and objects worthy of man's pursuit.

I have to think that this mistake arises out of an erroneous attitude towards literature or failure to have come across correct and ideal forms of literature or not having sufficiently exercised his mind in the matter of proper appreciation of its purposes and functions.

Looked at from the correct perspective, literature has a high place in the general scheme of human knowledge. It can only be ranked with the great, sciences, because - All the various sciences explain so many species of living and non-living matter or so many stages of evolution as for instance, inorganic matter is explained by inorganic chemistry, plants explained by botany, Animals by biology and finally man by physiology and so on and so forth.

After creation reached the stage of man, a new chapter has opened and an unprecedented course take in the line of creation. That is, as seen never before in nature, man began to change the environment to suit his life unlike his preceding species which changed themselves to suit the changing environment and life. so after the augury of the new chapter, the latest species, namely man, undergoing physical change by any environmental change, and thereby perpetuate the line of evolution in such terms, was elated once for all. However it is difficult to say as to how long this history of man will continue, without evolution of a new and more advanced

species of life higher than man from the physical point of view. Nevertheless it is now possible to presage on the available data of historical, archeological and scientific material that man's evolution, or to be more correct, the furtherance of evolution of creation is not hereafter going to be towards the formation of new physical forms but it could be only towards the attainment of new intellectual and spiritual heights.

But what does this new stage of evolution consist of? In fact we are now witnessing, the ever expanding horizons of mind and its immense potentialities. In the wake of this development pursuit of human knowledge has finlly culminated in the endeavour to understand the inscrutable and mysterious behaviour and phenomenon of human mind. To unravel the tangled fabric of mental process, its reactions, its effects, its vagaries etc., and to delve deep into the dark recesses of its abysmal bowels and cull out its treasured secrets, has become the final and the most interesting enterprise of man. In the wake of this glorious enterprise arose the phantoms of psychology, occult sciences, yoga, philosophy, literature and ever so many activities of superb inexactitude.

Literature seeks to explain the emotional and the intellectual stage of the evolving man. For a more precise expression, I should say it endeavours to explain the latest stage of man's evolution or creation's evolution, for that matter. The extent of knowledge so far mankind acquired, of the internal and the external universes, only indictes the history of our mind and its evolution But literature particularly that form of it, dealing with the intricate fibres of human feelings and sentiments, explains to us, of what the mind has come to be, that is, its ways, its capacities and caprices.

The role has not been played by any science or any branch or form of human pursuit except literature.

My friend, of course rises the contention that psychology is exactly the department of knowledge which fulfils this purpose;

but I feel it is only as much as to say that organic chemistry reveals the secret of sugar's taste. The said science, at best, can only explain the composition and the texture of the chemical compound Sugar, but by no means it can pretend to explain its effect on human tongue, Similarly psychology can evolve certain principles and indicate by certain symbols, the broad outlines of the forces at work behind the mental processes, as for instance, the principles underlying its behaviour in the case of the 'Oedipus' complex. So this aspect of mind is best explained only by literature and never adequately by psychology because this part of human personality or being can never be clearly grappled by a system of knowledge which tends to postulate and reduce itself into mere symbols and principles which are called science. This aspect of our being is so vague, so deep, so inlaid in the darkest regions of mind that our very language fails very often to hold it in its grip. How then, can a narrow symbolical and inflexible system achieve the purpose? It needs a very comprehensive and flexible method to hold the entire range of this very illusive and ellusive subject in an extensive and grand sweep; and that is done by literature alone Psychology is not even its poor substitute because its purpose can be seen to be different by a subtle anatomy of the science. If psychology is the dynamics of mind, we can say literature is its science of properties of matter. That appers to be broadly speaking, their relationship to each other.

Yet another comparison may be given, If psychology is the grammer of mind literature is its prosedy. Finlly I would even go to the extent of saying, that the place of literature cannot be taken by any science-form to achieve the same purpose. The system, with which you have to understand this particular aspect of man's mind has got to be only an art-form. Thus literature may be said to be performing the role of science though not in its exact garb. So literature demands to be elevated to a revered and indispensible position in the grand gallery of human knowledge.

**THE DECCAN CHRONICALE MONDAY SEPTEMBER 8 1969**

# NARAYANA BABU - CRITIC'S DELIGHT

If we pass through the relevant recorded material like Ronanki's preface to Srirangam narayana babu and the latter's preface called "Pravara" and some pages of Sri Sri, we find Ronanki, Narayana babu and Sri Sri are the three known figures in Telugu literature of the thirties to have developed a living communication and awareness with the European literary thought strongly predominated by symbolism and surrealism. Symbolism and surrealism found their expression in Narayana Babu and Sri Sri. While symbolism was the domineering note in the poetry of Narayan babu, surrealism was domineering in Sri Sri. However, Sri Sri quickly drifted away from this intellectual millieu and came completely under the shade of progressive writer's orgnisation. While Narayana babu moulded his theme of revolution in undiluted artistic terms and stood devoted to values of poetry, Sri Sri hurriedly assigned a secondary place to poetic values and devoted himself entirely to political exploitation of the prevailing situation.

Incidentally, I must take this opportunity to insist that every student of modern Telugu literture should read "Rudhirajyoti" the celebrated verse of Srirangam Narayana Babu and I cam certainly assure the readers of immense aesthetic satisfaction in the unique poems of Narayana Babu as well as the most scintillating introduction of Dr. Ronanki appalaswamy. Another attractive feature of this volume is the preface of the poet in which he dwells on the highly sophisticated concepts of literature evolved in modern Europe, in such a way that to this day no Telugu critic or poet could reach anywhere near him on those subjects.

The quality of Chalam's preface to Sri Sri is not superior to that of Ronanki's to Narayana Babu. The rhetoric of Chalam's preface suits the rhetoric of Sri Sri's poetry, whereas the aesthetic mood of the contemplative style of Ronanki's preface hits the style and architecture of Narayana Babu's poetry. It may be noted however that

